శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణదేవరాయలచరిత్రము

శ్రీవిష్ణుభొట్ల సూర్యనారాయణ, బి. ఏ., బి. ఎల్.



చె న్న పు రి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వా రి చేఁ బ్ర క టి త ము.

# ఉపోద్ఘాతము

నేను మదరాసు క్రైస్తవకళాశాలయందుఁ జదువుకాలమున నాకళాశాలలోని ఆంధ్రభాషాభివర్ధనసమాజమున శ్రీకృష్ణదేవరాయలవారి చరిత్రముఁ గూర్చి యుపన్యసించుటకై చిన్న వ్యాసమును వ్రాసియుంటిని. అది జరిగి యిప్పటికి నలువది రెండు సంవత్సరములైనవి. నాటికి శ్రీకృష్ణదేవరాయలచరిత్రమును గూర్చి తెలిసినవిషయములు చాలకొద్ది, తత్సంబంధగ్రంథములును లేవు. అప్పటికి నిప్పటికి వారిచరిత్రాంశములను వర్ణించుముఖ్యగ్రంథ మాంగ్లభాషలో బళ్ళారిజిల్లాకలెక్టరుగ నుండిన రాబర్టు సూయిలుదొర "A Forgotten Empire" "విస్మృతసామ్రాజ్యము" అనుపేర రచించిన గ్రంథ మొకటియే, దానియందు రాయలచరిత్రలోని ముఖ్యఘట్టములన్నియు వర్ణితములు. రాయల సమకాలికులగు పోర్చుగీసుయాత్రికులు కొందఱు తమభాషలో వ్రాసియుంచిన విషయములన్నియు పైగ్రంథమున నాంగ్లీకరింపబడెను. ఇదిగాక శ్రీకృష్ణదేవరాయలు స్వయముగ రచించినకావ్యములందును, తదాస్థానకవులైన అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, మాదయ్యగారి మల్లన, ధూర్జటి మొదలుగాఁగల కవుల ప్రబంధములయందును కొన్ని చరిత్రాంశములు విపులీకరింపఁబడియున్నవి. ఈగ్రంథములయాధారమునే నేనప్పుడు నావ్యాసమును తయారుచేసియుంటిని. ఆయుప

న్యాసమును మామిత్రులు భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారు అచ్చొత్తించి ప్రచురపఱిచిరి.

ఇటీవల రెండుమూడుసంవత్సరములుగ మామిత్రులు శ్రీ భాషోద్ధారకులు ఈపుస్తకము పునర్ముద్రణము చేయఁదలఁచితి మనియు, పూర్వముద్రణవిషయముతో చారిత్రిక పరిశోధన ఫలితముగ వెలువడిన నూతనాంశములను గలిపి విపులముగ వ్రాయవలసిన దనియు నన్ను హెచ్చరించిరి. పూర్వము నే నన్న ననేకగ్రంథములు శ్రీ రాయలవారిచరిత్రను వివరించుటచే వానినన్నిటిని చదివి మరల గ్రంథమును కూర్చుట చేతకానిపని యని యూరకుంటిని గాని శ్రీ శాస్త్రులవారి ప్రోత్సాహమునను వారు పంపినగ్రంథజాలము సాయమునను నే ననేక నూతన విషయములను చేర్చి నాగ్రంథమును విపులీకరింపఁ గల్గితిని. ఈ ద్వితీయముద్రణభాగ్యమునకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారే కారకులు.

ఈపుస్తకమును రచించుటయందు నాకాధారములుగ నుండిన గ్రంథముల పట్టిని ఈక్రింద పేర్కొనుచు నాయా గ్రంథ కర్తల కిందుమూలమున నాకృతజ్ఞతను తెల్పుకొనుచు వందన శతము లర్పించుచున్నాఁడను. ఈగ్రంథమునఁ జేర్చియున్న శ్రీ కృష్ణదేవరాయల వారిచిత్రమును ఇందుఁ గూర్చుటకు అడిగి నదే తడవుగ ఫోటోకాపీ నొసఁగి యనుమతించిన గవర్న మెంటు ఎపిగ్రఫిస్టు శ్రీ యన్. లక్ష్మీనారాయణరావుగారికి కృతజ్ఞతా పూర్వకవందనము లర్పించుచున్నాను.

నాకు గ్రంథరచన మందనుభవ మెంతమాత్రమును లేదు. దీని నామూలాగ్రము చదివి, వలయుచోట్ల సవరణలు చేయు

టలో నాకు మిక్కిలి యుపకరించినవారు శ్రీ విద్వాన్ వేదము లక్ష్మీనారాయణశాస్త్రి, బి. ఓ. యల్ గారు. వారికి నేనెంతయు కృతజ్ఞుఁడను. ఈగ్రంథమందలి గుణదోషవిచారమును గుణగ్రహణపారీణులగు చదువరులకే వదలుచున్నాఁడను. నాదోషములు క్షమింతురుగాక యని వారిని ప్రార్థించుచున్నాను. ఈగ్రంథమునకు తృతీయముద్రణప్రాప్తి గలుగుచో నాటవఱకు బయల్పడు నూత్నచరిత్రాంశములనుసైతమందు పొందుపఱుప యత్నింతును.

| గుంటూరు | ఇట్లు విధేయుఁడు, |
| --- | --- |
| 1951-వ సం॥ జూన్ | విష్ణుభొట్ల సూర్యనారాయణ, బి.ఏ.బి.ఎల్. |

ఈగ్రంథరచనమున నాకు సహకరించిన గ్రంథముల సూచిక:

1. ఆముక్తమాల్యద.
2. మనుచరిత్రము
3. వరాహపురాణము
4. కృష్ణరాయవిజయము.
5. రాయవాచకము
6. వీరేశలింగముగారి కవులచరిత్ర.
7. గురుజాడ శ్రీరామమూర్తిగారి కవులచరిత్ర.
8. కావలి రామస్వామిగారి Lives of the Deccan Poets.
9. జైమినిభారతము
10. నిరంకుశోపాఖ్యానము
11. పారిజాతాపహరణము
12. డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు
    డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగార్ల రచనలు.

# ప్రథమముద్రణము

ఏసార్వభౌముని సత్పరిపాలనమున విజయనగరసామ్రాజ్యము మహోన్నత్యము వహించెనో, ఏచక్రవర్తి తనదిగ్విజయ యాత్రలవలన తనశౌర్యపరాక్రమములను జగత్ప్రసిద్ధముగఁజేసెనో, ఏసమ్రాట్టు ఆంధ్రభాష నాదరించి కవులను సన్మానించుటచే "నాంధ్రభోజుఁ"డని ప్రసిద్ధిగాంచెనో, ఏరాజు విష్ణుచిత్తీయమను నామాంతరముగల "ఆముక్తమాల్యద" యను ప్రబంధరచనచే సంస్కృతాంధ్రభాషలం గల తనయసాధారణ పాండిత్యమును వెలిపుచ్చెనో అట్టి శ్రీకృష్ణదేవరాయుల చరిత్ర మిక్కాలంబున జను లెఱుంగకుండుట యెంతయు శోచనీయంబుగ నున్నది. వారి పవిత్రచరిత్రము నిదివరలో కుమార ధూర్జటి 'కృష్ణరాయ విజయ'మను పేరను, ఆదిపూడి సోమనాథ రావుగారు 'కృష్ణరాయచరిత'మను పేరను పద్యాత్మకముగ వ్రాసి యున్నారు. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు "జీర్ణకర్ణాటక రాజ్య"మను పేరఁ గృష్ణదేవరాయల యొక్కయు వారిపూర్వుల యొక్కయు, వారి సంతతివారియొక్కయు చరిత్రమును గద్య రూపమున ప్రకటించి యాంధ్రులకు మహోపకారము చేసి యున్నారు. ఆంగ్లభాషయందును వీరిచరిత్రమునుగూర్చి కొన్నిగ్రంథములు ప్రకటితములై యున్నవి. కాని ప్రస్తుత కాలమువారికి పద్యకావ్యములయం దాదరము లేకుండుటచే నాపద్యకావ్యములు చదువునట్లు కాన్పించదు. విద్యార్థులును స్త్రీలును చదువుకొనుటకుఁ దగినట్లుగా వారిచరిత్రమును సంక్షేపముగ నిట వ్రాయ నుద్యమించితిని. ఇట్లు,

విష్ణుభొట్ల సూర్యనారాయణ.

# విషయసూచిక

శ్రీరస్తు

# శ్రీకృష్ణదేవరాయలచరిత్రము

## 1. విజయనగర నిర్మాణము

అవక్రపరాక్రముఁడై ఆరాతిజనభయంకరుఁడై మహారాజ్యతంత్రజ్ఞుఁ డగు శ్రీకృష్ణదేవరాయల సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణ మగు విజయనగరముయొక్క పుట్టుపూర్వోత్తరము లెయ్యవియో, నీహృద్యంబగుపురం బేపరిస్థితులయం దెవ్వరిచే నిర్మింపఁబడెనో తెలిసికొనుటకు కొంత ప్రయత్నింతుము.

దక్షిణహిందూస్థానమున క్రీ. శ. 1336-వ సంవత్సరము మిక్కిలి ప్రాముఖ్యత వహించెను. ఆసంవత్సర మీదేశచరిత్రమునం దొకముఖ్యమైన మార్పు కలిగెను. ఆమార్పువలన నీదేశచరిత్రయందలి నవయుగము ప్రారంభించె నని చెప్పుటకు వీలగుచున్నది.

ఆసంవత్సరమున కల్గినమార్పే విజయనగరరాజ్య ముఖ్యపట్టణమగు విజయనగరనిర్మాణమై యున్నది. ఈనగరనిర్మాణమునకు పూర్వ మీదక్షిణదేశమంతయు ప్రత్యేక ప్రత్యేక హిందూరాజ్యముల యాధిపత్యమున నుండెడివి. ఈరాజ్యము లెప్పుడెప్పుడు స్థాపింపఁబడినవో దృఢముగఁ జెప్పుటకు వీలు లేకున్నది. అప్పటికి దాదాపు పదునాలుగువందల సంవత్సరముల క్రిందనే నిర్మింపఁబడిన బుద్ధస్తూపములలో నీరాజ్య ప్రశంస

కావింప బడియున్నది. అట్లు ప్రశంసింపఁబడిన రాజ్యములలో మధురలోని పాండ్యరాజులు, తంజావూరులోని చోళరాజులు, మొదలయినవా రుండిరి. విజయనగరనిర్మాణముతో నీపూర్వ చరిత్ర యంతరించి దక్షిణహిందూదేశచరిత్రలో నొకక్రొత్త యుగము ప్రారంభమైనదనియే చెప్పనగును. క్రొత్తగ నిర్మింపఁ బడిన విజనగర రాజులు దక్షిణమున సింహళద్వీపమునుండి యుత్తరమున డక్కనుభూమివరకు నుండెడిదేశమునంతయు నాక్రమించి, విజయనగర సామ్రాజ్యమును స్థాపించి, రెండు వందలయేఁబదిసంవత్సరము లతివైభవముతో పరిపాలనచేసి, సామ్రాజ్యముయొక్క కీర్తిని ఖండాంతరములఁగూడ ప్రకాశింపఁ జేసిరి. ఆకాలమున నవఁగా పదునైదు పదునాఱవశతాబ్దముల యందు నింత పెద్దసామ్రాజ్యముగాని, యింతటి వైభవముగాని, యింతటి మహోత్కృష్టస్థితి గాని, యేయితర రాజ్యములు హిందూదేశమునందుఁగాని ఖండాంతరములఁగాని, లేదని విదేశ మునుండి యిచ్చటికి సంచారులుగవచ్చినవారు వారియుత్తర ములయందు వ్రాసియుండిరి. ఇంతటి ప్రఖ్యాతిచెందిన దేశ మేపరిస్థితులలో నిర్మింపఁబడినదో కొంత వివరింతుము.

## నాటిదేశస్థితి

క్రీ. శ. 1001-వ నాటికి హిందూదేశమునకు వాయవ్య మూలనుండి మహమ్మదీయులు గజినిమహమ్మదు నాధిపత్యమున ప్రవేశించి ప్రథమమున పంచనదులచే నావరింపఁబడిన పంజాబు దేశముమీఁదను ముల్తానునగరముపైనను దండెత్తి యాక్ర మించుకొనిరి. తరువాత వరుసగ ప్రతిసంవత్సరమును కొంతదేశ ముపైదండెత్త నారంభించి తిరిగి వచ్చుచుండిరి. ఇట్లే 1021-వసంవ

త్సరమున కళింగదేశమును 1023-న కర్ణాటదేశమును నిరా౦
కను దండెత్తిరిగాని నాయాంధ్రదేశముల నాక్రమించియుండ లేదు.
ఇదేరీతిగ నప్పుడప్పుడు వీలువెంబడిని సైన్యసమేతులై దండ
యాత్రలు సాగించుచు రెండువందల యేబదిసంవత్సరములం
గడచునప్పటికి మహమ్మదీయరాజులు ఢిల్లీనగరములో తమ రాజ
ధాని నేర్పఱచుకొని పెద్ద మహమ్మదీయసామ్రాజ్యము స్థాపించిరి.
అప్పటినుండియు యుద్ధము వెంబడి యుద్ధముం జేయుచు నుత్తర
హిందూస్థానము నంతను కలవరపరచివైచిరి. పదునాల్గవశతాబ్ద
ప్రారంభమునకు వారిదృష్టి దక్షిణహిందూస్థానము పైంబడెను.
1293-వ సంవత్సరమున ఢిల్లీసుల్తాను మేనల్లుండగు నల్లాయుద్దీను
ఖిల్జీ దేవగిరిని తనవశము చేసికొనెను. నాల్గుసంవత్సరముల తరు
వాత పశ్చిమమున నున్న గుజరాతు దేశముపై దండెత్తిరి. 1303-వ
సంవత్సరమున తెలింగానా (వరంగలు) దేశము నాక్రమింప
ప్రయత్నించిరి. 1309-వ నాటికి ఢిల్లీసుల్తానుయొక్క ప్రఖ్యాత
సేనాని మల్లికాఫరు దక్షిణదేశముపై దండెత్తి వరంగలు దేశ
మును ముట్టడించెను. అచటనుండి పడమటికిం జని హొయసల
రాజ్యములోని ద్వారసముద్రమును ముట్టడించి మలబారు
సముద్రతీరమువరకుం బోయి అచట మసీదు నొకదానిని కట్టించి
చాలద్రవ్యమును పోగుచేసికొని మల్లికాఫరు తిరిగి ఢిల్లీనగరము
చేరెను. 1312 లో తిరిగి దండయాత్ర మొదలుపెట్టెను.
1318 నాటికి ముబారక్ అనుసేనాని దేవగిరియందు
రాజ్యముచేయుచున్న హరిపాలదేవుని నతిక్రూరముగ సజీవుని
మంటలయందు కాల్చి యాతనితలను తననగరద్వారమున కట్టిం-
చెను. 1323-న వరంగలు ధ్వంసము గావింపఁబడెను.

పైఁజెప్పినరీతిని దండయాత్రలు జరిపి విజయనగరనిర్మాణ కాలమున నుత్తరహిందూస్థానమునంతను మహామ్మదీయులు తమ వశముగావించుకొనియుండిరి. వారియనుచరులు వీలువెంబడి దక్షిణదేశముపై నిష్టమువచ్చినట్లు దండెత్తి దానినివశముగావించు కొనుటకు ప్రయత్నములు సల్పుచుండిరి. కృష్ణానదికి దక్షిణ మున నున్న భూభాగమంతయు నప్పటికి హిందూరాజుల పరి పాలనలోనే యుండెను గాని యీనాటికి రాజ్యబల మదు గంటిపోవుచుండెను. దీనికితోడు 1325-వ సంవత్సరమున మహా మ్మదుబిన్‌టొగ్లాకు ఢిల్లీసింహాసన మధిష్ఠించెను. ఈతని కఠోరకృ త్యము, మితిలేనియాశ, రక్త, మతవిజృంభణమునుగూర్చి ఘోరతరములగు కథలు పెపాస వినబడుచువచ్చినది.

ఆనాఁడు మహామ్మదీయులరాపిడికి వెఱచి ప్రజ లొకరి నొకరు చూచి మాటలాడుటకే భయపడుచుండిరి. పురవ్యవహా రములన్నియు నున్నవున్నట్లు మహామ్మదీయసాంప్రదాయములకు లోనయ్యెను. జనులు వివిధములైన యుపద్రవములకు లోనైరి. పురదేవతలను మళయాళదేశమునకు తీసికొనిపోయి దాచి వైచిరి. శ్రీరంగమునందలి దేవతావిగ్రహములు నుత్సవవిగ్ర హములు ముసల్మానుల హస్తగతమాయెను. దేవాలయములందలి పూజలు నిల్పుచేయఁబడెను. దేవళపుగోపురములు దేవాలయ ప్రాకారములు ధ్వంసముచేయఁబడెను. మతము విధ్వంస మాయెను. పురజనులు స్వార్థపరులైరి; వారిలో వారికి స్పర్ధలు హెచ్చాయెను. ఐకమత్య మడుగంటి నశించెను. జనులు పిఱికి పందలైరి. ధైర్యోత్సాహములు నశించెను. ఎటు గాంచినను

హిందూ రాజ్యవినాశము మతవిధ్వంసనము నగరనాశనము పొడ గట్టుచుండెను.

ఆ కాలమున బొంబాయిచెన్నపురములమధ్య నున్న తుంగభద్రానదికి యుత్తరపుటొడ్డున బళ్లారికి సుమారు నలువది మైళ్లదూరమున కొండలమధ్య ప్రదేశమున నానెగుంది యను సంస్థాన మొకటి కలదు. ఈసంస్థానమునకు ప్రక్కనను న్న కొండలసహాయమువలన శత్రువుల కందుబాటులోనుండని కోట కొకదానిని స్థాపించుకొని ద్వారసముద్రమునందున్న హొయిసల బల్లాలరాజులకు సామంత రాజులయి నీయానెగుంది సంస్థానాధీశ్వరు లుండిరి. ఈసంస్థానమునకు దక్షిణమున తుంగభద్రానదిలోనికి పారుచుండెడి పంప యనునుపనది యున్నది. ఆనదియం దన్నికాలములయందు నీరు ప్రవహించుచుండును. ఈసంస్థానముయొక్క చరిత్ర మన కంతగ తెలియదు గాని యీసంస్థానమప్పటికి దాదాపు ఏడువందల యేబదిసంవత్సరముల కాలమున నుండియు నున్నట్లుమాత్రము చరిత్రలవలన తెలియుచున్నది.

1336-వ సంవత్సరమునకు కొద్దికాలము క్రిందనే ఢిల్లీ సుల్తానగు తుగ్లకు గుజరాతుదేశముపై దండెత్తి అచటనుండి దక్కనుదేశములోని పడమటికనుమల ప్రదేశమునకు దక్షిణ దిశనున్న బలఘాటును చేరెను. అచటనుండి ధార్వారువద్ద మల ప్రభ యను నదినిదాటి యచటికి సుమారు యేబదిమైళ్లదూరమున నున్న నీ యానెగుందికోటను ముట్టడించెను. ఇచ్చటి సంస్థానాధీశ్వరుడు తలవనితలంపుగ నాకస్మికముగ వచ్చిపడిన విరోధిసైన్యముతో పోరాడజాలక మానసంరక్షణార్థై తన పట్టణమునందలి స్త్రీలనందఱను జంపించి తానును యుద్ధమున

పరిణించెను. ఎట్టకేలకు శత్రువులు కోటనుపట్టుకొని అందు నిలిచియున్న సార్థరముఖ్యులను ఖైదీలుగతీసికొని ఒకనినిమాత్రము తమ ప్రతినిధిగ నుంచి మహమ్మదీయసైన్యమంతయు తిరిగి తమ దేశమునకు పయనమైపోయెను. కొలఁది కాలమున కీసంస్థానము నందలిజను లీప్రతినిధిపై తిరుగుబాటుచేయఁగ నాతఁ డచటికష్ట సుఖములను ఢిల్లిసుల్తానుకు తెలియఁబంపెను. అందుపై సుల్తాను సమగ్రముగ నాలోచించి తాను బందీలుగ తీసికొనివచ్చిన సంస్థానోద్యోగీయుల బిల్వనంపి వారిలో ముఖ్యులైన దేవరాయలను నామాంతరముకల్గిన హరిహరదేవరాయలను రాజుగ నేర్పఱచి వీఁనందరిని వారిస్వదేశమునకు పంపివైచిరి. హరిహరరాయలు తిరిగి వచ్చినపిదప నా నెగుఁదిసంస్థానమునకు రాజ్యాధికారిదై యచటిజనుల యభిప్రాయముల ననుసరించి రాజ్యము చేయుచుండెను.

హరిహరరాయలు ప్రతిదినమును నదినిదాటి దక్షిణామునసున్న అరణ్యప్రదేశములలో వేఁటకుపోవుచుండెను. మామూలుగ నొకరోజున వేఁటకై నాయరణ్యమునకుఁ బోవ నీటి కనతిదూరమున నొకకుందేలువచ్చి తన వేఁటకుక్కల నడ్డగించి వాటిని కఱచెను. వ్యాఘ్రములనైనను ఝంకారించి భయపెట్టుశక్తిగల తనకుక్కలు కుందేటిచే కఱవఁబడుటఁ జూచి మిక్కిలి భ్రమఁజెంది తత్ప్రదేశంబున నెద్దియో నద్భుతం బుండవోపు నని తలఁచి తిరిగి స్వస్థానమునకు బయలుదేరెను. ఇట్లు నది దగ్గరకుఁరాగా, నచట నొకమునీశ్వరుఁడు కనఁబడిరి. జరిగిన యుదంతమును రాయలా మునీశ్వరునికిఁజెప్ప నందుఁ లకు మునీశ్వరుండును భ్రమజెంది తన కాస్థలమును జూపు మని కోరెను.

అంత నా ప్రదేశమును గాంచి అది మిక్కిలి మహిమలుగలతావు గా నెంచి ఆదిక్కున నొకపట్టణము నిర్మించుమనియు నట్లు నిర్మింపఁబడిన పట్టణ మెన్నటికిని చలనము లేకుండుననియు చెప్పెను. అంత వాస్తుశాస్త్రజ్ఞుల పిలువనంపి శుభముహూర్తంబున శంఖుస్థాపనముగావించి రాయలు పట్టణమును నిర్మింపఁజేసెను. రాయలవారిని పురనిర్మాణముఁ జేయవలసినదిగ నాజ్ఞాపించిన మునీశ్వరుఁడు విద్యారణ్యులైనందున నీనగరమునకు విద్యారణ్యనగరమనియు విజయనగరమనియు పేరుపెట్టఁబడెను. ఇది 1336-వ సంవత్సరమున ప్రారంభింపఁబడినట్లు పోర్చుగీసు సంచారియగు "న్యూనిసు" వ్రాసియుండెను.

ఈవిషయమునే కుమారధూర్జటికవి తనకృష్ణరాయవిజయమునందును రాయవాచకమును నింకొకగద్యకావ్యమునందును కొద్దిమార్పులతో వ్రాసియుండిరి. ఈ రెండుగ్రంథములయందు వ్రాయఁబడిన యంశములలో మాత్ర మెట్టిమార్పును లేదు. విద్యారణ్యులవారు తపస్సు చేయఁగ శ్రీమహాలక్ష్మి ప్రసన్నయై సాక్షాత్కరించె ననియు నామె యీమునీశ్వ వరముకోరుమని యడుగఁగ

తే. ............నకఁడు
వేడ్కమీఱఁగ శాపేన వెలయునట్టి
పురముగావింపవలయుఁ దత్పురమునందు
జెలఁగి సంతతము నీవు నిలువఁదగును.

అని వరముఁ గోరెను. అంత లక్ష్మీదేవి యాస్థలమును చూపెను. విద్యారణ్యుఁ డా ప్రదేశము పూర్వము సుగ్రీవుఁడు తనతలదాఁచికొన్న మతంగపర్వతముగల ప్రదేశమనియు

నదియే కిష్కింధ యనియు తెలిసికొని యచటనే ప్రభవనామ సంవత్సర చైత్రశుద్ధపౌర్ణమి స్థిరవారము శుభయోగ శుభ కరణములు కూడిన శుభముహూర్తమునందు ముహూర్తము నిర్ణయించి కృష్ణపక్షము అమవాస్యనాఁటిరాత్రి నిశాసమ యమునందు శంఖుస్థాపన ముహూర్తము నేర్పాటుచేసెను. కాని యాలగ్నము తప్పినవెనుక శంఖుస్థాపన జరిగియుండె ననియు నందువలన నీరాజ్యము మూఁడునందలయిరువదియేండ్లు మాత్రమేయుండునవియు పైవారువ్రాసియుండిరి. మొత్తము మీఁద పోర్చుగీసుసంచారి యగు "న్యూనిసు" వ్రాసిన విషయ ములనుబట్టియు పైగ్రంథములయందు వ్రాయఁబడిన యంశ ములనుబట్టియు నీరాజ్యముదాదాపు క్రీ. శ. 1336-వ సంవత్సర ముననే నిర్మింపఁబడి యుండవచ్చు నని స్థిరపడుచున్నది. అప్పుడుకట్టఁబడిన విజయనగరమే కృష్ణదేవరాయసామ్రాజ్య మునకు ముఖ్యపట్టణముగనుండి దేశమునందు చరిత్రయందును ప్రఖ్యాతిగాంచెను. ఆనిర్మింపఁబడిన పట్టణముయొక్క సౌందర్య మును ధూర్జటి తనకృష్ణదేవరాయవిజయమునం దీవిధముగ వర్ణించెను.

సీ. కోటలౌ తెఱఁగంటి పాటలాధరశైల, నాటలౌ తపలంచ పకాసు మించ
మేడలౌ మిన్నేటి జాడలానిన యంచ,జోడులాదటఁ గాంచు సొబగొసఁగ
శాలలౌ నవరత్నజాలలాలితకాంతిలీలదాఁగినవింత మేలు జూడ
బాలలౌ మరునిబాబాలలాగున; బల్కు హేల లౌ గోనఁజాలు నితవు మీఱ
నవ్వుర నిర్మించె దనపేర నఖిలలోక, పాలకపురాధికప్రభాబంధురముగ
గరిమఁ దనరఁగవిద్యానగర మనంగ, మెఱయుపురరత్నమాధరామరవరుండు.

ఇవ్విధమున దైవప్రేరితమైన విజయనగరరాజ్యము స్వజాత్యభివృద్ధిపరుఁడయ్యు సర్వజాతిసార్వభౌముఁడును, స్వమత సాధనుఁడయ్యు సర్వమతసహిష్ణుఁడును, స్వభాషావ్యాపకుఁడయ్యు సర్వభాషాపోషకుఁడును, హైందవ సామ్రాజ్య రమాధురంధరుఁడు నగు శ్రీకృష్ణదేవరాయల కాలమున నీవిజయనగరసామ్రాజ్యము మిక్కిలి ప్రఖ్యాతిఁగాంచెను.

## 2. రాయలవంశము

రాయలవంశముయొక్క పూర్వోత్తరములను గూర్చి నిశ్చయించి వ్రాయుటకు గలయాధారము లెక్కువగా లేవు. రాయలవారు తాము వ్రాసిన ఆముక్తమాల్యద యను ప్రబంధమునందును, అలసాని పెద్దన వ్రాసిన మనుచరిత్రంబను ప్రబంధమునందును మఱియు వారి యాస్థానకవుల ప్రబంధముల యందును వ్రాయఁబడిన వంశావళియే గొప్ప ఆధారమై యున్నది. ఈప్రబంధములం దన్నిటియందును కులగౌరవమును బట్టి యేసూర్యునితో లేక చంద్రునితో యీవంశమును కల్పుటకు గ్రంథకర్తల యాచారమై యున్నది. వారి యాచారానుక్రమముగా వీరిమూలపురుషుఁడు పాలసముద్రమునందుఁ బుట్టి శివుని జటాజూట మలంకరించి మహోపకారియై గొప్ప యాభిజాత్యముకల్గి కాంతిమంతుఁడై లావణ్యసౌందర్యాది గుణములుగల్గి మిక్కిలి ప్రతాపవంతుఁడైన చంద్రుఁడనియు వీరి వంశము చంద్రవంశమనియు రాయలవారు తమప్రబంధమున వ్రాసికొనియున్నారు. ఇట్లే వీరివంశము మనుచరిత్రప్రబంధము నందును వ్రాయఁబడియున్నది. ఆచంద్రునకు సమస్తవేదశాస్త్రములు చక్కఁగా తెలిసినట్టి బుధుఁ డను కుమారుఁ డుండెను.

బుధునకు ప్రజ్ఞానిధియగు పురూరవుఁడును పురూరవునకు వాయు
వును వాయువునకు యయాతియు వరుసగా జన్మించిరి. యయాతికి
యదువు దుర్వసులను నిద్దరు తనయులుండిరి. అందు దుర్వసుఁడు
గుణనిధిరైయై విశ్రుతకీర్తివహించెను. ఈదుర్వసునివంశమె తుళువ
వంశమని పేరుగాంచెను. ఆతుళువవంశమున పెక్కండ్రు నృపు
లుదయంబునొందిరి. ఆవంశమునం దుద్భవించినవారిలో నొక
రగు తిమ్మదేవరాయఁడనురాజు తనకీర్తిప్రతాపంబుల భూమ్యా
కాశములయందు వ్యాపింపఁజేసి తనరాజ్యమున కధికసౌఖ్యము
కలుగఁజేసెను. ఈతిమ్మభూపతికి నీశ్వరదేవరాయలు జన్మిం
చెను. ఆ యీశ్వరరాజునకు బుక్కమాంబ యనుభార్య
యుండెను. వారిరువురియందు ధీరుతులగు నరసింహదేవ
రాయలు తిమ్మదేవరాయ లను నిరువురుపుత్రులు జన్మించిరి.
వారిద్దరిలో నరసింహదేవరాయలు మిక్కిలి ప్రతాపవంతుఁడై
తన వైరరాజుల నణఁచి కీడుకీర్తియుతుఁడై రాజ్యము నేలెను.
ఆనరసింహదేవరాయనికి నాగాంబ తిప్పాంబ యను నిరువురు
భార్య లుండిరి. వారియందు వీరనరసింహరాయలును అచ్యు
తాంశసంభవుఁ డగు కృష్ణరాయక్షితీంద్రుఁడు నుద్భవించిరి.
ఇందు వీరనృసింహరాయఁడు తనభుజబలముచేత ధరను నతి
మహిమతో నేకచ్ఛత్రాధిపతిరైయై పాలించెను. నరసింహరాయల
యనంతరము శ్రీకృష్ణదేవరాయలు రాజ్యాధిరూఢుఁడయ్యెను.

ఈపైనచెప్పఁబడినవంశావళి ఆముక్తమాల్యదయందు మను
చరిత్రమునందు నీయఁబడియున్నది. ఇందలి యంశములన్నియు
వరాహపురాణమున వ్రాయఁబడిన యంశములుగాని మరియే

యితర సమకాలికులగు ఆస్థానకవులుగాని వ్రాసిన ప్రబంధములు యందుఁగాని శ్రీకృష్ణదేవరాయని పూర్వవంశపు వివరము లేవియు నీయఁబడియుండలేదు. ఆకాలపుశాసనములలోను నింతకన్న నెక్కువ వివరములు తెలియుటలేదు. ఆకాలమున హిందూదేశమున పర్యటనముచేసిన విదేశరాయబారులును యీవిషయములఁగూర్చి యెక్కువ వివరములను తెల్పియుండ లేదు. ఈకారణములవలన వీరిపూర్వచరిత్రనుగూర్చి యిదమిత్థ మని నిర్ధారణచేయుటకు వీలుపడుట లేదు.

పైనచెప్పిన వంశావళిలోని ప్రథమభాగమంతయు చరిత్రాంశము కానేరదు. ఇయ్యది పరంపరానుశ్రుతముగా కవులు తమసంప్రదాయము ననుసరించి వ్రాయువైఖరిని మాత్రమే వ్రాయఁబడినదై యున్నది. వీరు నిరూపించినంతవరకు చరిత్రాత్మకముగ నీశ్వరరాజు తండ్రియగు తిమ్మరాజువరకు కృష్ణదేవరాయని పూర్వీకులవిషయమై మనకు తెలియుచున్నది. అందును వీరందరును తుళువవంశీకులే గాయున్నారు. కొందరు తిమ్మరాజు సాళువనరసింహరాజుకు జ్యేష్ఠభ్రాత యని యందురు గాని అట్లనుట కెట్టియాధారములును కనుపించవు. తిమ్మరాజు సాళువవంశజుఁడే యై అందును రాజ్యాధిపత్యమువహించిన సాళువనరసింహరాజుకు సోదరుఁడేయైనచో కృష్ణదేవరాయలు తాను తుళువవంశమునకుఁ జెందినవాఁడనని ఆముక్తమాల్యదలో వ్రాయుటగాని ఆస్థానకవియగు పెద్దనగాని వరాహపురాణము వ్రాసిన నందిమల్లయ్య ఘంటాసింగయ్యలుగాని వీరి వంశము తుళువవంశమని వ్రాయుటగాని యసంభవము. కాన

నింతవరకు మనకు బయల్పడిన చరిత్రాంశములనుబట్టియు శాసనములఁబట్టియు కృష్ణదేవరాయలు తుళువవంశజులనియు వీరిముత్తాత యీశ్వరరాజనియు నంతకుపూర్వ మీవంశజుల సంగతి మనకు తెలియదనియు విశదమగుచున్నది.

"తిమ్మక్షితీశుఁ డీ భూతలంబును తనభుజమున భరియించి తనకీర్తిద్యుతులను భూమ్యాకాశంబుల వ్యాపింపఁజేసి తీక్ష్ణమగు శౌర్యమును కనఁబఱచె" నని ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయలు వ్రాసికొనుటతప్ప నిశ్చయముగా నీతిమ్మరాజు ఏమిచేసినదియు చెప్పుట కెట్టి యవకాశములును లేవు. వరాహపురాణమునందు ప్రప్రథమమున నీతిమ్మరాజు కుమారుఁడగు నీశ్వరరాజు సాళువనరసింహరాయని యొద్ద దండనాయకుఁడుగ నుండె ననియు అటుపిమ్మట నీశ్వరనృపతి కుమారుఁడగు నరసరాజు "సాళువనరసింహనృపాలదండనాయకతిలకుఁ"డుగా నుండి యీనృపాలుని "సామ్రాజ్యరమాభరణుండుగా"నుండి సమస్తమైనయధికారములను చలాయించినట్లు వ్రాయఁబడి యున్నది. కాన సాళువనరసింహరాజు తుదికాలమునకు దండనాయకతిలకుండగు నరసరాజు పేరునకుదండనాయకుఁడయ్యెను రాజ్యభారమునంతయు తానే వహించి నట్లూహింపవలసి యున్నది. సాళువనరసింగరాజు పేరుమాత్రమునకే రాజుగా నుండెను గాని వారికాలములో నీశ్వరరాజును తదనంతరము నరసరాజును రజ్యభారమునంతను వహించి సాళువనరసింగ రాజు రాజ్యమును విస్తరింపఁజేసిరి. ఈశ్వరరాజు విజయములఁ గూర్చి వరాహ పురాణమునం దీవిధముగ వర్ణింపఁబడియుండెను.

సీ. ఉదయాద్రి భేదించె హస్తర నిర్జించె గండికోటపురంబుఁ గదలఁద్రవ్వెఁ
బెనుకొండ సాధించె బెద్దలూరు హరించెఁ గోవెల నెల్లూరు గుంటుపలుబెఁ
గందాణి వివలించె గొడుగుచింత జయించె బాగూరు పంచము పాడుచేసె
నరుగొండ వికలించె నామూరు మర్దించె శ్రీరంగపురమును బాటి నమరె
తే. రాయచౌహత్తమల్లధరావరాహ, మోహనమురారి బర్బరబాహుసాళ్వ
నారసింహప్రతాపసన్నాహుఁడగుచు,విశ్వహిత కారితిమ్మయయీశ్వరుండు.

ఈశ్వరునికుమారుఁడగు నరసరాజు దండనాయకుఁడుగ నుండుకాలముననే గుంటూరుజిల్లా కొండవీటిసీమయే స్వస్థానముగఁగల్గి కౌండిన్యసగోత్రుఁడై ఆర్వేలనియోగికుటుంబమునకుఁజెందిన వేమరాజపౌత్రుఁడును రాచరాజుపుత్రుఁడునగు మహాధీశాలియగు తిమ్మరసుమంత్రి నుండెను. ఈతిమ్మరసు రాజ్యశాస్త్రనిపుణుఁడై యుండ నరసరాజు తననిరుపమాన ప్రతిభాకౌశలముచే వెలయుచుండ సాళ్వనరసింహరాజు ఆకాలమున కర్ణాటసామ్రాజ్యముపై దండెత్తి విద్యానగర రాజ్యలక్ష్మిని తన వశముచేసికొని 1490-వ సంవత్సరమున నొకశుభముహూర్తమున కర్ణాటసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుండాయెను.

సాళువనరసింహరాయఁడు కొంతికాలమునకు దైవవశమున మరణింపఁబోవుసమయమున కాతనిపెద్దకుమారుఁడు తిమ్మరాజు బాలుఁడుగ నుండుటంజేసి రాజ్యాధికారమునంతయు వహింపఁజాలఁడేమోనని సైన్యాధ్యక్షుఁడగునరసరాజును కార్యకర్తగ నియమించి తనకుమారుని రాజ్యాభిషిక్తునిగఁజేసెను. సాళువనరసింహరాజు స్వర్గస్థుఁడైన పిదప నాతనికుమారుఁడగు తిమ్మరాయఁడు రాజుగ నుండి తుళువనరసరాజు సమస్తమైన రాజ్యభారమును వహించి తిమ్మరసుమహామంత్రి సహాయసంపత్తు

లతో రాజ్యపాలనము చేయుచుండెను. ఇంతలో బాలరాజు నెవరో చంపఁగా రాజ్యకాంక్షుఁడై తుళువనరసరాజే బాల రాజును చంపించె నని ప్రజలు చెప్పుకొన ప్రారంభించిరి. అంత నీయపవాదము తప్పించుకొనుటకు బాలరాజుతమ్ముఁడగు ఇమ్మడి నరసింహరాయనికి పట్టాభిషేకము కావించి యీ యపవాదను తప్పించుకొనెను. కాని బాలరాజహంతకుడగు దళవాయి యిమ్మడి నరసింహరాజుతో స్నేహము గావించి తుళువనరస రాజుపై ద్వేషము పుట్టించెను. ఈసంగతులు తెలిసికొని తుళువనరసరాజు ఇమ్మడినరసరాజుచే నాదళవాయిని హతము గావించి విద్యానగరమునుండి వేరొకదుర్గమునకు పెనుకొండకుఁ బంపి యాతనిరక్షణార్థము కొంతసైన్యము నిచ్చి తానే రాజ్య భారమునంతయు వహించి రాజ్యపాలనము చేయుచుండెను. ఇట్లు కొంతకాలము జరుగుచుండ నరసరాజు పెనుకొండదుర్గ మున 1505 లో జంపఁబడెను. ఆతని మరణానంతరమున తుళువవంశీయులే విజయనగరరాజ్యమును పరిపాలింపఁజొచ్చిరి. నరసరాయలును తాను రాజ్యాభిషిక్తుఁడైన పిమ్మట దిగ్విజ యముచేసి యనేకరాజ్యములను రాజ్యాధిపతులను వశము గావించుకొనిరి. వీరిదిగ్విజయమునుగూర్చియు కీర్తిప్రతాపములఁ గూర్చియు నానాటికవులు తమప్రబంధములయందు వ్రాసి యుండిరి. ఆముక్తమాల్యదయందును, మనుచరిత్రమునందును వ్రాయఁబడిన యీపద్యమువలన వారియశస్సు తెలియనగును.

సీ. అంభోధివసన విశ్వంభరావలయంబుఁ దనబాహుపురి మరతకముఁ జేసి
నశ్రాంతవిశ్రాణనాసారలక్ష్మికిఁ గవికదంబముఁ జాతకములఁ జేసె

గతుబంతనిఖిలరాజ్ఞికరంబుఁ జరణమంజీరంబు సాలభంజికలఁ జేసె
మహనీయనిజవినిర్మలయశస్సరసికి గగనంబుఁ గలహంసకంబుఁ జేసె
తే. నతిశితకృపాణ కృత్తమత్తారివీర, మండలేశ సమండల మకుటరత్న
మస్తమాల్యపరంపరామండనాఙ్ఘ్రి, తేశ్వరుం డగు నారసింహేశ్వరుండు.

నరసింహరాయనికి తిప్పాంబ నాగాంబ ఓబలాంబ యను ముప్వురుభార్య లుండిరి. ఈవిషయమును గూర్చియు సమకాలికులు వ్రాసిన విషయములనుబట్టి భేదాభిప్రాయములు కలుగుచున్నవి. ఆస్థానకవులగు అలసాని పెద్దన ముక్కుతిమ్మన తమ గ్రంథరాజములగు మనుచరిత్ర పారిజాతాపహరణకావ్యము లందు నరసరాయల కిద్దరేభార్య లనియు వారినప్రును కుల కాంత లనియు నీక్రిందిపద్యములవలన విశదమగుచున్నది.

తే. ఆనృసింహప్రభుండు దిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని నచ్యు
తాయతాంశజుండైన కృష్ణరాయాఖ్యు నిన్ను.

క. ఆనరసమహీవహిళా, జానికిఁ గులసతులు పుణ్యచరితలు దిప్పాం
బా నాగాంబిక లిరువురు,

కాని 1537-వ సంవత్సరమునకు సరియగు హేవిళంబి సంవత్సరమున అచ్యుతదేవరాయలు చిమూరుమండలములోని నారాయణపరమున నొకబ్రాహ్మణునకు దానమొసంగుచు వ్రాయించియిచ్చిన తామ్రశాసనమునందలి యీక్రింద వ్రాయఁ బడినవాక్యమువలన నరసరాజునకు ముప్వురుభార్య లుండి రని స్పష్టపడుచున్నది.

తిప్పాజీనాగలా దేవ్యో కౌసల్యా శ్రీసుమిత్రయో
జాతే వీరనృసింహేంద్ర కృష్ణరాయమహీపతిః
అస్యాసో౽బాంబికాదేవ్యా మచ్యుతేంద్రో నిభూపతిః.

కృష్ణదేవరాయని మరణానంతరమున కొద్దికాలమునకే వ్రాయఁబడిన తామ్రశాసనమునం దిట్లుండియుండుటచేత నీవిషయమును నిజముకాదని చెప్పుటకు వీలులేదు.

ఈపై విషయములవలన నరసరాజునకు మువ్వురుభార్య లుండి రనియుఁ వారిలో ప్రథమభార్యయగు నాగాంబవలన వీర నరసింహరాయలనియు, రెండవభార్యవలనఁ గృష్ణదేవరాయలని యు, మూఁడవభార్యవలన నచ్యుతదేవరాయలనియు మువ్వురు పుత్రులు కల్గిరనియు తెలియుచున్నది. నరసరాజునకు మువ్వురు భార్యలుండిరా లేక యిద్దరుభార్యలేయుండిరా యనువిషయమున కొంతభేదాభిప్రాయమేర్పడినను కృష్ణదేవరాయలు నరసరాజునకు నాగాంబికవలన జన్మించె ననువిషయము మాత్రము నిర్వివాదాం శమైయున్నది. కాని వీటినన్నిటినిమించిన విచిత్రమైన యింకొక జనవాదుక వినవచ్చుచున్నది. రెండవభార్యగా పరిగణింపఁ బడెడి నాగమాంబిక నరసరాజుయొక్క భార్యయే కాదనియు, వారియింట నూడిగముచేయుచుండెడి దాసీకన్య యనియు, నచటనుండుస్త్రీలలో నెల్లసౌందర్యవతి యనియు చెప్పుచు రాయలజననమునుగూర్చి యొకకల్పితకథను చెప్పుదురు. ఆకథ నిచ్చట సంగ్రహముగ వ్రాసెదను.

ఒకనాటిరాత్రి నరసరాయలు కాలోచితకృత్యంబుల నిర్వర్తింప బహిర్దేశమునకుం జన నచట నొకరిక్క యాకాశ మునుండి తనపాత్రమునఁబడెననియు నయ్యది మిక్కిలి తేజో

వంతమై కన్నులనిరుమిట్లుగొల్పుచుండ తత్క్షణమే తిమ్మరసు మంత్రి కీవార్త తెలిపెననియు నాతఁడాయుదకమును ద్రావమనె ననియు, రాయ లట్లు చేసె ననియు, బిమ్మట తిమ్మరసు నాజ్ఞానుసారమున స్త్రీయతో రతిసుఖంబునం దేల యత్నింప బట్టమహిషి వచ్చుటకు వీలులేకుండుటం జేసి నీదాసియగు నాగాంబికం గూడి సుఖంబుననున్న నాపె కీరాయలు జనించె ననియు వాడుకగా జెప్పుదురు. ఈకల్పితకథయందు నితరకల్పితకథలయందువలెనే సత్యాసత్యగ్రహణమునకు తగునాధారము లెవ్వియుఁ గాన్పింపవు. నాగాంబిక కులకాంత కా దనుటకు తగినయాధారము లెవ్వియును లేవు. తిమ్మనార్యకృత పారిజాతాపహరణమునందు నాగాంబిక కులకాంత యనియె వ్రాయఁబడెను. కొన్ని దానశాసనములు జర్చించియు నీపె కులకాంతగనె యుండియుండ వచ్చుననియు నూహింపఁబడుచున్నది. ఈపె కులకాంత కాదని నిరూపించుటకుఁ బ్రబలకారణములు చిక్కువఱకును మన మీపె కులకాంత యనియె గ్రహింపవలయు నని నామతము. ఈవిషయమునుగూర్చి వ్రాయుట సంపూర్తి చేయక పూర్వము వాడుకలోనున్న యింకొకకథను నిచ్చట బొందుపఱతును.

నరసరాజుభార్యలగు తిప్పాంబ నాగాంబ లిద్దఱు నొకనాఁడొకానొక విషయమునుగూర్చి చర్చసాగించి వాదోపవాదముల నెంచుకొనుచుండిరి. వాదన క్రమక్రమముగా పంతములోనికి దిగెను. వా రావిషయములో గెల్చినవారు ఓడిపోయినవారి కాఱుమాసములు దాసిగా నుండునటుల నేర్పరచుకొనిరి. అందు నాగాంబయే చివర కోడిపోయెను. అందువలన నాగాంబ తిప్పాంబ కాఱుమాసములు దాసిగా నుండ

యూహింపఁ జేయవలసివచ్చెను. అట్లు దాసిగా నున్న కాల ముననో లేక దాసిగా నుండిన నాగాంబికకు జన్మించినందువల ననో కృష్ణదేవరాయలు దాసీపుత్రుఁడుగా భావింపఁబడిరే ననియుఁ జెప్పుదురు. ఈ కథయును నిజమని చెప్పుట కేలాటి యాధారములును కానరావు. కాన నిదియును నమ్మఁదగినది కాదనియే చెప్పవలెను.

## 3. కృష్ణదేవరాయల జననము

కృష్ణదేవరాయల జననముఁగూర్చిన వివరములు నిర్ధా రణచేసి చెప్పుట కాధారములు సరియైనవి కాన్పింపవు. రాయ లెచట జన్మించెనో వారిజననముయొక్క తిథివారనక్షత్రము లెట్టివియో చిట్టచివరకు సంవత్సరమైన నెద్దియో తెలిసి కొనుట కవసరములైన యాధారములును కన్పించుటలేదు. రాయలతండ్రి తాతలు విజయనగరమునందే నివసించి దండ నాయకులుగను రాజ్యకార్యధురంధరులుగను నుండియున్నం దున రాయలవారు విజయనగరమునందే జన్మించియుందు రని యూహింపనగును. వీరిపుట్టుక తేదీనిగురించి చూచితిమన్నను సరియైనయాధారములు కాన్పింపవు. అనుశ్రుతముగా వచ్చు చున్న యొకపద్యమునుబట్టి కొంద రీరాయలు పుట్టుకతేదీని నిర్ధారణచేయుటకుఁ బ్రయత్నించియుండిరి గాని దానికిని సరి యగు సామాగ్రి కుదుర లేదు. ఆపద్యము నిందు పొందుపఱచు చున్నాను.

ఉ. అందలి శాలివాహనశకాబ్దము లద్రివసుత్రిసోములన్
మండితమైన యవ్వికృతివత్సరమందలి పుష్యమాసమం

దుం దగుకృష్ణపక్షమున నుండెడుద్వాదశి శుక్రవాసరం
బం దుదయించె కృష్ణుఁడు శుభాన్వితుఁ డానరసింహమూర్తికిన్.

ఈచాటుధార నాధారముచేసికొని కృష్ణరాయలు శాలివాహనశకము 1387 కు సరియగు వికృతినామసంవత్సర పుష్యమాసమునందు బహుళద్వాదశీ శుక్రవారమునాఁడు జన్మించెనని కొందఱూహించుచున్నారు. ఇందును గూర్చి యిప్పటికి దాదాపు 4? సంవత్సరములక్రింద పత్రికాముఖమున కొంత చర్చ జరిగియుండెను. ఒకానొకజ్యోతిషశాస్త్రజ్ఞుఁ డిందుండు వివరములు సరిగాలేవనియు అందులో 1?87 వ శకము వికృతినామసంవత్సరముగ నుండుటకు వీలులేదనియు పార్థివగాని తారణగాని యై యుండవలయు ననియు వాదించెను. వారము కూడ మంగళవారముగాని సోమవారముగాని యుండవలెనఁట. అద్దాన నీపద్యము సరియైనది కాదనియు పద్యముయొక్క మొదటిపాదము

"అందలి శాలివాహనశకాబ్దములం ద్వినవత్రిసోములన్"

అని యుండినచో కృష్ణదేవరాయలజననము 1?92 వ శకమున పుష్యబహుళ శుక్రవారముగా నుండవచ్చుననియు సరియైన తేది 16-1-147?-వ సంవత్సరమగు ననియు వ్రాసియుండిరి.

ఈపైనచెప్పిన రెండుతేదీలును సరియగున వని చెప్పుట కెంతమాత్రమును వీలు లేదు. పోర్చుగీసుదేశమునుండివచ్చిన నూనిజా అను రాయబారి వ్రాసిన ప్రకారము రాయలు పట్టాభిషేకమునాటికి సుమా రిరువదియేండ్లవాఁడు. దానినిబట్టి కొంతవయసునందు హెచ్చుతగ్గు లాలోచించినను పైనఁజెప్పఁబడిన 1466 గాని 1471 గాని సరియని తోఁచదు.

అట్లు గాక పోర్చుగీసు రాయబారి యగు న్యూనిజు చెప్పినమాట నాధారము చేసికొని రాయలపట్టాభిషేకమునాటికి సుమా రిరు వదిసంవత్సరములవాఁడని యెంచినచో రాయలపట్టాభిషేకము 1509 వ సంవత్సరమున జరిగియున్న ట్లిప్పటికి స్పష్టముగా తెలియవచ్చినందున కృష్ణదేవరాయలు 1509 కి పూర్వ మిరువది యిరువదైదేండ్లక్రింద జన్మించియుండవచ్చునని యూహింప నగును. అనఁగ కృష్ణరాయలజననము 1484 మొదలు 1489 వ సంవత్సరములోపల నయియుండవచ్చు నని తోఁచుచున్నది. అంతేకాని సరియైన జననకాలమును స్థిరపఱచిచెప్పుట కెట్టి యాధారములును కానరావు.

కృష్ణదేవరాయ లేసంవత్సరమునఁ బుట్టినను వారిజన్మ ముహూర్తము శుభసూచకముగను శుభదాయకముగను నుండె ననుట నిస్సంశయము. తండ్రి యగు నరసరాజు యశఃకీర్తులు దేశ మంతటను విస్తరించెను. బీజాపూరు దేశమంతయు నరసరాయని స్వాధీన మయ్యెను.

## 4. రాయలబాల్యదశ

రాయలబాల్యదశను గుఱించియు మనము తెలిసికొను టకు తగునాధారము లేవియు కాన్పింపవు. కాని నరసరాయ లే కారణముననో భార్యలలో తిప్పాంబకంటె నాగాంబికయందును వీరనరసింహరాయనికంటె కృష్ణదేవరాయలయందును నధిక ప్రేమను చూపుచువచ్చెను. ఇదియునుగాక విద్యాబుద్ధులయం దును తెలివితేటలయందును తన ప్రథమభార్య కుమారుఁడును వయసునపెద్దవాఁడునైన వీరనరసింహునికంటె చిన్నవాఁడైన

కృష్ణదేవరాయలే మిన్నగా కన్పట్టుచుండెను. కుమారు లిరువురకు నధిక మేధాశక్తిసంపన్నుఁడైన తిమ్మరసుమంత్రియే విద్యాబుద్ధుల నేరుపుచుండెను. వీరిద్దరిలో రాయలే అన్నివిధముల మిన్న యని తిమ్మరసు నరసరాజునకు చెప్పుచుండెను. ఇందువలనఁగూడ నరస రాయఁడు కృష్ణదేవరాయని నధికముగఁ బ్రేమించుచుండెను. ఇదియంతయు తిప్పాంబకు కష్టముగాఁదోఁచెను. కష్టముతోఁచు టయేగాక యిదియంతయు నెప్పటికైనను విషమించి వయసున పెద్దవాఁడైన వీరసింహునకుఁగాక కృష్ణదేవరాయలకే రాజ్యాభిషేక మగునేమో యను భయము మనసున జనించెను.

## తిప్పాంబ కౌటిల్యము

తనమనమున కల్గిన భయమువలన తనకు కృష్ణదేవరాయని యందును బ్రాహ్మణమంత్రియగు తిమ్మరసుపైనను అసూయ జనించెను. అసూయ యనునది పెద్దపెనుబామై తన్నావరించినంతనే యెట్లైనను కారణము కల్పించి కృష్ణరాయల జంపింపవలయు ననెడి యూహ యతనికిఁ గల్గెను. ఇందులకు తగిన పన్నాగము పన్నుటకు ప్రయత్నించి తనవద్దనున్న దాసీజనముచేత నీకృష్ణ దేవరాయలకు విషప్రయోగముచేయ యత్నించెననియు తిమ్మ రసు దీనినంతను తెలిసికొని రాయల రక్షించెననియు చిట్ట చివరకు తిప్పాంబ గారణాంతరములు కల్పించి నరసరాజునకు చెప్పెననియు నాసాకులు విని విసువుజెంది రాయలు కృష్ణదేవ రాయల జంపింపుమని తిమ్మరసు కాజ్ఞాపించెననియు తిమ్మర సట్లు చేయక కృష్ణదేవరాయల రక్షించె ననియు కూడ నొక గాథ కలదు. ఇదియు కల్పితకథయే యై యుండవలయు. ఇందలి సత్య మును నిరూపించిచెప్పుట కెట్టితార్కాణములును కనుపింపవు.

ఇట్టి కల్పితకథలను పుట్టించి పుక్కిటిపురాణములుగా దేశమున వ్యాపింపఁజేయుట యొకవిధమైన యలవాటై యున్నది. ఇది యటుండఁగాక అసహాయశూరుండును బాహుబలపరాక్రముండును రాజ్యభారనిర్వహణసమర్థుండును నగు కృష్ణదేవరాయలుండ నరసరాజు మరణానంతరమున వీరనరసింహరాయ లేల సింహాసనారూఢుఁడయ్యెనో తెలిసికొనఁజాలక దీని కేదియేని నపూర్వకారణముండవలయునని యూహించి యిటీవలి వారలిట్టి కట్టుకథలను గల్పించి వ్యాపింపఁజేసియుందురే కాని యిట్టి కల్పితగాథ లుప్పతిల్ల జేయుటకొండు కారణము లేదు.

## కృష్ణదేవరాయల విద్యాభ్యాసము

అన్ని విషయములందువలెనే యీ విషయమునందును ఆధారములు చాల తక్కువగా నున్నవి. మొత్తముమీఁద శత్రువులవలన నేయపాయమును గలుగకుండ సంరక్షించుటకై పితృవాత్సల్యముపూని కృష్ణరాయనికి తిమ్మరసును తనతమ్ముఁడగు గోవిందుఁడును విద్యాబుద్ధులు గఱపుచుండిరి. చిన్నతనముననే కృష్ణరాయఁ డాంధ్రగీర్వాణభాషలయందు సాహిత్యజ్ఞానము సంపాదించి కర్ణాటభాషయు హిందూస్థానీభాషయు కూడ నభ్యసించియుండెను. విద్యాసంపత్తియందు భోజరాజుతో సమానుఁడుగా నుండినట్లు అలసానిపెద్దన

"భోజసమావతి విద్యాపరిపక్వా"

యని సంబోధించియుండెను. అవయవసంధులు గట్టిపడునట్లు సాముచేసి సాముగరడీలయం దారితేఱుటచేతనే

"వ్యాయామస్థిరసంధిబంధా"

యని సంబోధింపఁబడెను. తెల్లవారకపూర్వమే దేహము

నంతను నూనె రాచుకొని గుఱ్ఱము నెక్కి దేహమునకు రాయఁ బడిన నూనెయంతయు నింకిపోవువరకు గుఱ్ఱపుస్వారి చేసెడు వాఁడు. ఈతని గుఱ్ఱపుస్వారినిగురించి పేయసనుచరిత్ర కారుఁ డీక్రిందివిధముగ వ్రాసియుండెను. "తెల్లవారకపూర్వమే యొక చటాకునువ్వులనూనెను త్రాగి తన తలకును దేహమునకును పూర్తిగ నూనెరాచుకొని తొడలవరకు నొక కొల్లాయినిగట్టి పెద్ద పెద్ద బరువులతో కసరత్తుచేసి తరువాత నొకకత్తితో మిక్కుట ముగ చెమటపట్టువఱకు సాముచేసి అప్పుడు తనయనుచరులతో కుస్తీపట్టెడువాఁడనియు నంత నొకస్వారిగుఱ్ఱము నధిరోహించి తెల్లవారువరకు నిటునటుపరిగెత్తెడువాఁ డనియు తరువాత స్నానముచేసెడివాఁ"డనియు వ్రాసియుండెను. ఇతఁడుధనుర్విద్య యందును చక్కనిపరిశ్రమచేసియుండెను. ఇదియేగాక తిమ్మరసు మంత్రి యనుగ్రహమువలన రాజనీతి దండనీతి మొదలుగాఁగల రాజ్యతంత్రవిధానముల యందును మంచిపాండిత్యమును సంపాదించెను.

### నరసరాజు మృతి

ఇది యిట్లుండ నరసింహరాయునికి ఉబ్బుగోగము సంప్రాప్తించి క్రమక్రమముగా వృద్ధినొంది తుదకు భయంకరమైన దాయెను. పెనుగొండయందుంచఁబడిన యిమ్మడి నరసింహ రాయ లేమాయెనో యెట్లు చంపఁబడెనో నాతనికి పిల్లలుండిరో లేదో వారివ్యవహారము లెట్లు అంతరించినవో చెప్పుట కేలాటి చరిత్రాత్మకము లైన యాధారములను లేవు కాని నరసరాజుయొక్క అవసానకాల మాసన్నముకాఁగా నాతనికి

నిమ్మడి నరసింహారాజుయొక్క అనుచరులవలన నేవిధముగ నైనను కష్టములు సంభవించునేమో యనెడిభయముమాత్ర ముండెను. తనకాలమున కృష్ణానదికి నుత్తరముగా నుండిన భాగములనుకూడ జయించి వారల తనయేలుబడిలోనికి తేవలె నని ప్రయత్నించెను గాని అట్లు జరిగియుండలేదు. రాయ చూరు ముదిగల్లుదుర్గములు నరసరాజు అవసానకాలమునకు తురుష్కులహస్తగతమై యుండెను. ఈపరిస్థితులలో తనయ నంతరము దేశ మెట్లు శాంతియుతముగ నుండునో యను భయము నరసరాజు నావరించుకొనియుండెను. ఇది యిట్లుండ తనపుత్త్రులలో నసూయ కన్పించుచుండెను. తనభార్యలలో నొకరియం దింకొకరికి శత్రుభావ మేర్పడియుండెను. ఈ స్థితిలో నరసరాజునకు నమ్మినబంటగు తిమ్మరసుమంత్రినే తాను నమ్మి రాజ్యభారమునంతను నాతనిసహాయసంపత్తులకే వదలుట యెల్లరకును క్షేమకర మని యెంచి తనయవసానకాలమునకు తిమ్మరసుమంత్రిని తనవద్దకు పిలిపించుకొని తనమువ్వురుపుత్త్రు లను ఆతని కొప్పగించి వారిక్షేమమును సామ్రాజ్యక్షేమమును ఆతనిహస్తగతము చేసియుండెను. అట్లుచేయుచు తనతనయు లలో పెద్దవాఁడగు వీరనరసింహరాయని రాజ్యపాలకునిగా చేయు మనియు చెప్పియుండెను. పుత్త్రులనందఱిని పిలచి వారికి సకలకార్యసమర్థుఁడైన తిమ్మరసుమంత్రిని చూపి యాతఁడు చెప్పి నట్లుచేయు మనియు నట్లు చేసిన తమసౌభాగ్యమును శ్రేయ స్సును మిక్కిలి వృద్ధి కాఁగల దనియు చెప్పెను. తదనంతరము 1505.వ సంవత్సరమున కీర్తిశేషుఁడాయెను.



## ఒక కథ

నరసరాజు జబ్బుగా నున్నసమయమున తనకుమారుల పిల్వనంపి తనవ్రేల నున్న ముద్రికాయుంగరమును తీసికొమ్మని పుత్రులకు చెప్పెననియు, వీరనరసింహారాయలు ప్రయత్నించియు చేతకాక సిగ్గుచే నవతలకుఁ బోయె ననియు, నంత కృష్ణదేవరాయలు తత్‌క్షణమే తనతండ్రియొద్దకుఁబోయి తనచేత నున్న ఖడ్గముచే నావ్రేలు నఱికి ముద్రికాయుంగరమును తీసికొనె ననియు నందువలన కృష్ణదేవరాయలే రాజ్యపరిపాలనకర్హుఁ డని నరసరాజు చెప్పె ననియు వాడుకగా కథ నొకదాని చెప్పుదురు గాని యిం దిసుమంతయు నిజములే దని తోచుచున్నది. ఇట్లే నరసరాజు చెప్పియుండిన కృష్ణదేవరాయలపక్షపాతి యగు తిమ్మరసుమంత్రి తప్పక కృష్ణదేవరాయలనే రాజ్యాధికారిగా నియమించియుండెడివాఁడు. అట్లుచేయక వీరనరసింహరాయనికే రాజ్యాభిషేకము చేసియున్నందున నీకథయం దెట్టి సత్యమును లే దనియే తోఁచుచున్నది.



## వీరనరసింహరాయని పట్టాభిషేకము

నరసరాజు చనిపోవునపుడు వీరనరసింహరాయనికే రాజ్యపరిపాలన మిమ్మని మంత్రి తిమ్మరసుతో చెప్పియున్నను వీరనరసింహరాయలకుమాత్రము తిమ్మరసునం దంతగా నమ్మకము జనించియుండలేదు. కాని యెట్టకేలకు తిమ్మరసుమంత్రి కృష్ణదేవరాయలనే రాజ్యపరిపాలకునిగాచేయవలెనని కుతూహలుఁడు గా నుండినను సామ్రాజ్యక్షేమమును తనమనమునం దిడికొని యప్పటి దేశకాలపరిస్థితుల చక్కఁగా గమనించి తమలో తాము పోరాటములను కల్పించుకొని తమశత్రువులకు తావొసఁ

గాక వీరనరసింహరాయలకే 1505-వ సంవత్సరమున జూలై నెలలో పట్టాభిషేకము గావించెను. ఈతఁడు పట్టాభిషిక్తుఁడగునాఁటి కింకను ముమ్మడినరసింహరాజు పెనుగొండయందే యుండియుండె ననుటకు కొన్ని యాధారములు లున్నవి. అదియెట్లున్నను సాళువవంశీయులను తోసిరాజని రాజ్యాధికారము వహించి విద్యానగరరాజ్యమున పట్టాభిషేకము కావించుకొన్న తుళువ వంశీయులలో వీరనరసింహరాయలే మొదటివాఁడని చెప్పవలసియున్నది. ఈతనితండ్రి నరసరాజు తనమరణకాలము వఱకును రాజ్యపరిపాలనము చేయుచుండెనే గాని పట్టాభిషేకము కావించికొనియుండలేదు.

## దేశమునందలి అందోళన

వీరనరసింహరాయఁడు రాజ్యపరిపాలన ప్రారంభింపఁగనే యదివఱకుఁ గప్పములు చెల్లించుచున్న ద్రావిడాంధ్ర దేశముల లోని రాజులు వీరనరసింహరాయనియధికారము నంగీకరించి కప్పములు కట్టిరిగాని కర్ణాటదేశములోని సామంతరాజులలో కొందఱట్లు చేయుట కిచ్ఛగింపరైరి. అంత వీరనరసింహరాయని తమ్ములగు నచ్యుతరాయనికి కొంతసేననిచ్చి కొంకణదేశమున కును ఉమ్మత్తూరురాజ్యమునకును పంప నచ్యుతరాయలు కొంకణదేశపురాజు నోడించెను గాని ఉమ్మత్తూరునందు తానే యోడి తిరిగివచ్చెను. అంత తిమ్మరసుమంత్రి వీరనరసింహరాయలను తీర్థయాత్ర లనుపేర దక్షిణదేశమునంతను పర్యటించుటకై పెద్ద సైన్యముతోఁ బంపెను. కృష్ణదేవరాయలను కర్ణాట దేశముపై దిగ్విజయయాత్ర చేయుటకుఁ బంపెను. కృష్ణదేవ రాయలును నుమ్మత్తూరుపై దాడివెడలి కోటను ముట్టడించి

మూఁడుమాసములు ఘోరయుద్ధముగావించి దుర్గమును స్వాధీన
పరచుకొనియెను. కర్ణాటదేశమునందే పెద్దదైన శివసముద్ర
దుర్గమును ముట్టడించి దానిచుట్టునుండెడి కొంతమంది పాలె
గాండ్రను జేరఁదీసికొని కావేరి కనుమమార్గములలో శత్రువుల
నెదుర్కొని శివసముద్రమును ముట్టడించెను. అంత నచట
నొకసంవత్సరకాలము ఘోరయుద్ధముజరుగ నాపురాధీశ్వరుఁ
డీయుద్ధమున నిలువలేక కావేరినదియందు ప్రాణత్యాగము చేసి
కొనెను. అంత చుట్టుప్రక్కల నున్న కొన్నికొన్ని గ్రామము
లను వశపఱచుకొని తుట్టతుదకు కర్ణాటదేశమునంతను
తనయాధిపత్యమునకు తెచ్చుకొని కర్ణాటదేశమునకు శ్రీరంగ
పట్టణమును ముఖ్యపట్టణము గావించి తనధ్వజము నెత్తించి
అచటి సామంతరాజులందరును గలసి దాదాపు కోటిరూప్యము
లను గప్పము కట్టునట్లు రాయలేర్పాటుచేసికొనివచ్చెను

ఇచట కృష్ణదేవరాయ లిట్లు దిగ్విజయము గావించుచున్న
సమయమున వీరనరసింహరాయలును తీర్థయాత్ర యనువేర
దక్షిణదేశమునంతను పర్యటనముగావించి యవసరముగా చోళ్ల
కయ్యమునకు దిగి తనశత్రువుల నోడించి తనప్రభుత్వమును
స్థిరపఱచుకొని తనరాజ్యమునకు తిరిగివచ్చెను. వీరనరసింహ
రాయలు వచ్చినకొంతకాలమునకు కృష్ణదేవరాయలును తన
పరాక్రమంబును వ్యాపింపఁజేసికొని తానును రాజధానికి తిరిగి
వచ్చెను.

ఈయుద్ధము పూర్తియైనపిమ్మట విజయనగరరాజ్యముపది
హద్దున నున్న యూసఫ్ అదిల్ఖాను రాయలమీఁద యుద్ధము
ప్రారంభించెను గాని కోవిలకొండవద్ద జరిగినయుద్ధమున హతుఁ.

డాయెను. అంతటితో నీతిరుగుబాటు ట్లాగిపోయెను. అదిల్ఖాను చనిపోయినపిదప కమాలుఖానుఁడు రాజ్యము నధిష్ఠించి గుల్బర్గ దేశాధీశుఁడగు నింకొకతురకరాజుపై యుద్ధయాత్ర చేసెను. ఈయుద్ధము పెద్దదై బీడరురాజ్యమే నాశనముచేయఁబడెను. రాజ్యాధిపతియగు మహమ్మదుషా బందీచేయఁబడెను. బీడరువద్ద నుండి బీజపూరున కీయుద్ధము ప్రాకెను. అచ్చటనుండి బెల్గామునం దలి జనులు భయవిభ్రాంతులై రాయలవారి రక్షణ వేఁడిరి. రాయలవారును వారికి శరణిచ్చి 1510-వ సంవత్సరము ఆగష్టున బీజపూరునకు చని అచటనుండి రాచూరును ముట్టడించెను. కమాలుఖానుఁడు తక్షణమే అచటికివచ్చి రాయలవారిని ప్రతి ఘటించెను కాని రాయలవారి నాదేశమునుండి మాత్రము తరిమి వేయలేదు. అచటనుండి తనదేశమునకు బోయి అచట శత్రువులనుచంపి తాను రాజ్యాధిపత్యమును వహింప ప్రయత్నించు చున్న సమయములో నతఁడు హతుఁడాయెను. అంతటితో నీతని యాశాపూరితచరిత్రము తుదిముట్టెను. ఇంతలో రాయల వారు రాచూరును ముట్టడించి పట్టుకొనిరి. అచటనుండి గుల్బర్గకుపోయి తురకసైన్యముతో పోరాడి గుల్బర్గను లాగి కొనిరి. అంతట బీడరురాజ్యమునకు పోయి అచట బందీగా నుంచబడిన మహమ్మదుషాను బందీనుండి విముక్తుఁగావించి బీడరురాజ్యమునకు పట్టాభిషిక్తునిఁ జేసెను. దీనివలననే రాయలవారికి యవనరాజ్యస్థాపనాచార్య యను బిరుదము కలిగెను. రాయలవారు యుద్ధమున జయమునుబొందియు బీడరురాజ్యమునకు తిరిగి మహమ్మదుషానురాజ్యాభిషిక్తునిగఁ జేయుటలో వారు తమయౌదార్యము వెలిబుచ్చుటయే గాక

తమ రాజనీతిశాస్త్రజ్ఞత్వమును ముఖ్యముగఁ బ్రకటించి యుండిరి.

ఇట్లు తనతండ్రి సాహసింపఁజాలని కార్యములను తాను సాధించినందులకు ప్రసిద్ధబిరుదముల నన్నిటిని తానే వహించి 1509-వ సంవత్సరముమధ్యకాలమువరకును వీర నరసింహరాయలు రాజ్యపరిపాలనముచేసెను. నాల్గుసంవత్స రములైనను పూర్తిగాకపూర్వమే వీరనరసింహరాయలు వ్యాధి గ్రస్తుఁడాయెను. అంతకంత కతనివ్యాధియభివృద్ధికాఁ జొచ్చెను. అప్పటికి తనకు అచ్యుతరాయఁడు, సదాశివరాయఁడు తిమ్మ రాయఁ డనుముగ్వురు చిన్నపిల్లలుండిరి. ఈముగ్వురు పిల్లలును పసివాండ్రైనందున తనతమ్ముఁడగు కృష్ణదేవరాయ లప్రతిమపరాక్రమవంతుఁడై యున్నందున సమర్థుఁడగు తిమ్మరసు మంత్రి కృష్ణదేవరాయని పక్షపాతియైనందునను తనయనంతరము రాజ్యము కృష్ణదేవరాయనికే యర్పితముకాఁగల దని యెంచి యెట్లైనను తనజీవితకాలముననే కృష్ణదేవరాయని రాజ్యానర్హుఁ డుగ చేయ నెంచి తిమ్మరసుమంత్రిని పిలువనంపి తనయనంతర మెట్లైనను తనకుమారునికి రాజ్యాభిషేకముచేయక కృష్ణదేవ రాయలకే రాజ్యాభిషేకమును తిమ్మరసు చేయించునని పెద్ద భయము తనమనసు నాందోళపఱచుచున్నదనియు నట్టియుప ద్రవము తప్పించుటకు కృష్ణదేవరాయని కన్నుల నూడఁబెరికి తనకుచూపవలెనని కోరెననియు తిమ్మరసుమంత్రి యావిషయ మును విని మిక్కిలి యాశ్చర్యమును జెందియు కష్ట మని యెంచక తానాకార్యమును జేసెద ననిచెప్పిపోయె ననియు, తరువాత తన మందిరమునకుఁబోయి యావిషయమై చక్కఁగ నాలోచించి కృష్ణ

దేవరాయునికి కబురంపి యాతనితో నీసంగతినంతయు చెప్పె
ననియు సంతట రాయలు భ్రమచెంది యెట్టకేలకు తన కీముప్పు
వాటిలకుండునట్లు చేయుమని ప్రార్థేయపడె ననియు నందుపై
వీరిద్దరును నేకీభవించి రాయని తనవద్ద నేయుంచుకొని కొన
యూపిరితోనున్న వీరనరసింహరాయుని కోకయాంతమేక
యొక్క కన్నులు పెకలించి తీసికొనిపోయి చూపె ననియు నంత
వీరనరసింహరాయుఁడు తృప్తిచెంది కొద్దికాలముననే తనజీవిత
ములను వదలిపోయెననియు నొకకథ వాడుకగా చెప్పఁబడు
చున్నది. ఇందలి యాథార్థ్యమును తెలిసికొనుటకు తగునాధా
రము లెక్కువగ లేవు. కాని రాయలకాలపు కథలనన్నిటికిని
సమకాలికులగు న్యూనిజు పేయసు అనుచరిత్రకారులే తాము
వ్రాసిన చరిత్రలందు వ్రాసియుండిరి. వీటిలోని నిజానిజముల
నీనాఁడు వితర్కించుటకు సరియైనయాధారములు కనుపడనందున
పాఠకులే యీవిషయనిర్ణయమును చేసికొందురుగాక.

ఇది యిట్లుండ నీసందర్భమున కృష్ణదేవరాయని యాస్థానకవి
యగు ధూర్జటిమనుమఁడు కుమారధూర్జటి తనకృష్ణరాయవిజయ
మునం దీవిషయమును గూర్చి వ్రాయుచు వీరనరసింహరాయఁడు
"సామ్రాజ్యసంపన్నుఁ డై యుండె యొక్కనాఁడు" కృష్ణరాయ
లనుపేరి మత్పుత్రరత్నమునకు దనరఁ బట్టంబు గట్టెద ఘనత
మీర ననుచు నప్పాజితోన మంతనముజేసెననియు నంత "పుత్రా!
రమ్ము రమ్మంచు బంగరుడాల్దుద్ద మెఱుంగుటుంగరము వేడ్కఁ గ
కృష్ణరాయక్షితీశ్వరు హస్తంబున నుంచె" ననియు వ్రాసియు
న్నాఁడు. ఇందు కృష్ణరాయఁడు తనకు పుత్రుఁడని వ్రాయఁబడి
యుండె. ధూర్జటికవి యిట్లు వ్రాయుటలో "పుత్రసముఁడు" అని

యూహించియుండవలెఁగాని మఱియొకటి కాఁజాలదు. కుమారధూర్జటివ్రాసినయంశములే నిక్కువములైనచో మన మిదివరలో వినియున్న కథ నిక్కువము కాఁజాలదు. చరిత్రలో విదేశీయులగు రాయబారులును సమకాలికులునగు వారబద్ధము వ్రాయుటకును కారణములేదు. అదియునుగాక వారట్టి కేవలమబద్ధములను వ్రాయుటవలన వారి కేమాత్రములాభమును నుండఁజాలదు. ఏదియెట్లున్నను ఇందలి నిజానిజములనుగూర్చి వ్రాయుటకు తగినంతయాధారములు లేవనియే మనము నిర్ధారణచేసికొనవలసియున్నది. కుమారధూర్జటి వ్రాసిన యంశములనే బలపఱచుచు కాశీవిశ్వనాథనాయనివారికి వారిస్థానాపతి యీ కాలమునవే వ్రాసినవిన్నపమునందు నీవిషయమునుగూర్చి వ్రాయుచు, "తాము పెద్దలమైతిమి, తమమర్యాదగా రాజ్యపరిపాలనం జేనేటందుకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తలు సేయుమని మంచివేళ జూచి ముద్దుటుంగర మిచ్చినారు గనుక" అని వ్రాసియుండిరి. దీనినిఁబట్టిచూచినను వీరనరసింహరాయలే కృష్ణరాయనికి బట్టముకట్టుమని తనముద్దుటుంగరము నిచ్చియుండిరని తెలియవచ్చుచున్నది.

## 5. కృష్ణదేవరాయల పట్టాభిషేకము

### —నాటి దేశస్థితి—

వీరనరసింహరాయలు 1509.వ సంవత్సరమధ్యకాలమున దివంగతుఁడాయెను. ఈనాటికి విజయనగరాజ్యమునందు శాంతి నెలకొల్పఁబడి యుండెను. కాని చుట్టుప్రక్కలనుండెడి రాజ్యములలో నశాంతి హెచ్చుచుండెను. ముఖ్యముగ నాఁటికి

భామినీరాజ్యమంతయు విచ్ఛిన్నమై యంతఃకలహము లుద్భ
వించి బీజపూరు, గోల్కొండ, అహమ్మదునగరము, బీరారు,
బీడరు అను నైదుభాగములుగ చీలిపోయెను. అందలి నవాబు
లెల్లప్పుడును తమలో తాము ద్వేషింపుచు కలహించుచుండిరి.
ఇంతకంటె నౌత్తరాహులైన గజపతిరాజులవద్దనుండి యీరాజ్య
మున కపాయము మెండుగ నుండెను. అప్పటికే గజపతిరాజులు
బహామినిరాజ్యములోని తెలింగాణా భాగముద్వారా ముందుకు
వచ్చుచుండిరి. అప్పటికప్పుడే సముద్రతీరమున కృష్ణానదినిదాటి
కావేరివరకు గజపతిరాజులు సముద్రతీరప్రదేశముల నాక్ర
మించుకొనిరి. అప్పటికే గజపతిరాజైన పురుషోత్తముఁడు చని
పోయెను. ప్రతాపరుద్రుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇంతియే
గాక విజయనగరరాజ్యమునందును కొందరు సామంతరాజులలో
కలతలుండెను. కంచినగరము వద్దనుండెడి శంబువరాయనుఁడును,
ఉమ్మత్తూరునందున్న గంగవంశపురాయాధీశుఁడును సరియైన
అదుపులో లేరు. రాయచూరుదుర్గమును గూర్చి కొన్నికలతలు
బయలుదేరెను. ఈసందర్భములలో దేశమునం దెల్లెడల నల్లరుల
నణఁచి శాంతినెలకొల్పను సరియైన ప్రజ్ఞావంతుఁడును శౌర్య
శాలియు రాజనీతిధురీణుఁడును ప్రతిభావంతుఁడునగు రాజా
రాజ్యాభిషిక్తుఁడైననేగాని దేశములం దెల్లెడలను శాంతి నెల
కొల్పవీలు లేదు. అట్టితరుణములో గృహకల్లోలముల కెంత
మాత్రమును తావులేదు. వీరనరసింహారాయలకు ముప్వురు
కుమారు లుండిరిగాని వారిలో నెవ్వరు నీకార్యభారమును
వహింపఁగల్గినవారు కారు. నరసరాజునకు వీరనరసింహారాయఁడు
గాక నాగాంబికవలన కృష్ణదేవరాయలును నింకొకభార్యవలన

అచ్యుతరాయలు రంగరాయ లను నిద్దరుపుత్రు లుండిరి. వీరిలో కృష్ణదేవరాయలే పెద్దవాఁడు. అతఁడు తనశౌర్యపరాక్రమముల నిదివఱకే కనుపఱచియుండెను. ఈసమయమున కృష్ణదేవరాయలకన్న రాజ్యభారమును భరింపకల్గిన వా రెవ్వరును కాన్పింపలేదు. మిక్కిలి ప్రతిభాధ్యుఁడును రాజనీతిధురంధరుఁడు నగు తిమ్మరసుమంత్రియు కృష్ణరాయపక్షపాతియై యుండెను. ఈ విషయములనన్నిటిని సమాలోచనముఁజేసి, ప్రత్యక్షముగఁగాని పరోక్షముగఁగాని యేవిధమైన కష్టమును బోరాటమును లేకుండ వీరనరసింహరాయఁడు మరణించిన కొలఁదికాలమునకే సర్వజ్ఞుఁడని చెప్పఁదగిన తిమ్మరసుమంత్రి యీవిజయనగర మహాసామ్రాజ్యవైభవమునంతను కృష్ణరాయని హస్తగతముచేయుట కుద్యుక్తుఁడై తనయభిప్రాయము నెల్లరకుఁ దెలియఁజేసెను. భృత్యపరివారసామంతమంత్రివర్గము తిమ్మరసునభిప్రాయమునంగీకరించిరి. సామంత రాజులు నందుల కంగీకరించిరి.

సింహావలోకనము

వీరనరసింహరాయలమరణానంతరము 1509 సం|| ఫిబ్రవరి 4 తేదికి సరియైన శుక్లనామసంవత్సర మాఘశుద్ధచతుర్దశినాఁడు రాయలపట్టాభిషేకమహోత్సవము విజయనగరపట్టణములో జరిగెను. ఈపట్టాభిషేకమహోత్సవమునకు సామంతరాజులందరికి నాహ్వానములు పంపఁబడెను. విజయనగర మెల్లెడల మిక్కిలి హృదయరంజకముగనుండున ట్లలంకరింపఁబడెను. ఈయలంకారమును కుమారధూర్జటి తనగ్రంథమున నీవిధముగ వర్ణించెను.

సీ. ప్రణుతింప నతఁడు తోరణగట్టు పరసీమ
లనురీతి నూత్నతోరణము లెసఁగ.

రిపులఖండించి సత్కృపఁ దత్సుతులనిల్పి
నట్టు ద్వారములందు ననటు లమర
విలిఖించు నతఁడు దిక్కులజయస్తంభాళి
ననుమాడ్కి జిత్రర్వహార్వ లలర
వెలయున ట్లతనిగీర్తులు దిక్తటులనన్న
సరణి ముత్తెపుముగ్గు జెగ్గులమర
తే. సభినవాలంకృతిస్ఫూర్తి నతిశయింప, నవ్పురీరత్నమపుడు మహాద్భుతముగ
బ్రకటమహిమల శ్రీకృష్ణరాయ నృపతి, శ్రీకరంబైనపట్టాభిషేకవేళ.

పట్టాభిషేకమహోత్సవమునకు మండలాధీశులగు ననేక మహారాజులు కానుకలంపిరి. సామంతరాజు లనేకులు పట్టాభిషేకమును దర్శింప విజయనగరమునకు వచ్చియుండిరి. దళవాయి నాయకులు, కమ్మదొరలు, తుళువదొరలు, నగరవిద్వాంసులు, అవధానులు, పండితులు, జ్యోస్యులు మొదలయినవారందరు సభాస్థలి నలంకరించియుండిరి. అట్లు పెద్దలందరు సభనలంకరించియుండ ననేకవిధములగు శంఖకాహళభేరీప్రచండవాద్యతతరవంబులు భూనభోంతరమునిండ శాస్త్రోక్తముగ శుభముహూర్తమునందు కృష్ణరాయలవారికి మంగళస్నానముచేయించికల్యాణవేదికయందు బంగారుపీఠమున కూర్చుండ నియమించి దశదానములు షోడశమహాదానములును చేయించి చతుస్సముద్రములనుండియు గంగా, యమునా, సరస్వతీ, గోదావరి వగైరా నదులనుండి బంగారుకలశములతో తెప్పించిన నుదకముతో అష్టాదశవాద్యఘోషములు మ్రోయుచుండఁగా సుముహూర్తమందు బ్రాహ్మణులచేత మంత్రోక్తముగ నభిషేకముచేయించి శ్రీరాయలవారికి పట్టాభిషేకమహోత్సవము గావింపఁబడెను.

ఈయుత్సవము నష్టదిగ్గజములలో నొక్కఁడగు కుమారధూర్జటి
కవి తనకృష్ణరాయవిజయమునందును స్థానాపతి తనప్రభువగు
శ్రీ శ్రీవిశ్వనాథరాయనింగారికి పంపిన రాయవాచకమును విన్నపము
నందును బహుచక్కఁగ వర్ణించిరి. వారివర్ణనము నీక్రింద
పొందుపఱచడమైనది.

### కృష్ణరాయవిజయము : రెండవయాశ్వాసము

మ. సరగం దెచ్చిరి భూసురోత్తములు గృష్ణాగౌతమీజాహ్నవీ
వరణాసూర్యసుతాకవేరతనయా వారాశిముఖ్యాంబువుల్
గరిమం గాంచనరత్నకుంభతతులం గారుణ్యవిశ్వాసత
త్పరులై యంతయుం గృష్ణరాయవిలసద్రాజ్యాభిషేకార్థమై.

తే. శంఖకాహళభేరీప్రచండవాద్య, తతరవంబులు భూనభోంతరము నిండ
బ్రాహ్మణులు కృష్ణరాయధరావరునకుఁ, జెలఁగి పట్టాభిషేకంబుఁ జేసి రెలమి.

సీ. చక్కెరవిలుకాని చక్కఁదనము గల్గి చొక్కమా సార్వటిబుక్కరాజు
సాకల్యముగ గీర్తి సర్వదిక్తటులందు బ్రాకటస్థితినిల్పునాతువారు
కంటకరాజన్యగౌరవం బణఁగించి లీలచే మించునందేలవారు
ధాటీనిరాఘాటఘోటీహతవిరోధికోటులై వెల్గు వెల్గోటివారు

తే. చండతరశౌర్యులగుకూరసానివారు
ఖాదవాలివారు మొదలైనభూమిపతుల
గొలువపట్టాభిషిక్తుఁడై చెలువుమీఱె
రమ్యగుణపాళిఁ శ్రీకృష్ణరాయమౌళి.

### రాయవాచకము

"తాము పెద్దలమైతిమి. తమమర్యాదగా రాజ్యపాలనము
జేసేటందుకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తలునేయమని మంచివేళ

జూచి ముద్దుటుంగర మిచ్చినారుగనుక దండనాయకులు అయ్య
మరసు కొండమరసు బాచరసు యెల్లమరసు వీరమరసు అప్పాజీ
లక్కణదళనాయకులు యెల్లనదళనాయకులు అప్పరపిళ్ల నున్నా
రుపిళ్ల రాయసం రామచంద్రయ్య బొక్కసం భాస్కరయ్య అవ
సరం వెంకయ్య త్రియంబకయ్య లక్ష్మీపతి ప్రధానితిప్పరసు
దళవాయిలింగరసు సాళువనారా...కాడు ఆర్వీటిబుక్కరాజు
సాళువమేకరాజు శ్రీపతివారు బూదహల్లివారు నంద్యాలవారు
ఔకువారు...తొరగంటివారు రాచూరితిమ్మరాజు సంగరాజు
వెలుగోటివారు...పెదసాని అక్కప్పనాయుడు కమ్మదొరలు
తుళువదొరలు మొదలయినవారందరున్ను నగరవిద్వాంసులు
చతుర్వేదిరామాదీక్షితులు అష్టభాషాకవితకృష్ణావధానులు
శాబ్దికం పాండిత్యం వెంకటరామశాస్త్రుర్లు సహస్రావధాని ప్రభా
కరశాస్త్రుర్లు జోస్యులు కవీశ్వర్లు మరిన్ని కలిగినపిన్న పెద్దలు అంద
రున్ను శాస్త్రోక్తముగ శుభముహూర్తమందు కృష్ణరాయల
వారికి మంగళస్నానంచేయించి, కళ్యాణవేదికయందు బంగారు
పీఠమున కూర్చుండ నియమించి, దశదానములు షోడశమహా
దానములున్ను చేయించి స్వర్ణతుల రజితతుల రత్నతుల మౌక్తి
కతుల మెరపులు కోటిగోదానాలు సహస్రకుటుంబప్రతిష్ఠలు
మొదలైనదానధర్మములు చేయించి, చతుస్సముద్రములనుంచిన్ని
బంగారుకలశములతో వుదకములు తీసికొనిరాగా, గంగా
యమునా సరస్వతీ గోదావరి నర్మదా సింధు కావేరి తామ్ర
పర్ణి మొదలయినమహానదుల వుదకములున్ను అష్టాదశ వాద్య
ఘోషములున్ను మ్రోయగా, సుముహూర్తమందు బ్రాహ్మల
చేత మంత్రోక్తముగ అభిషేకముచేయించి, ఆపిమ్మట కనకాభి

షేకం నవరత్నాభిషేకం చలువలతల్లొత్తి, పీతాంబరం ధరియించి, చందన అగరు కస్తూరి గంధాదులధరియించి, వారలనందరినిన్ని విడిదీలకంపించి, ఆపిమ్మట అల్లుండ్లు కుమాళ్లు బంధుపరిజనులున్ను స్నేహితులను పంక్తిని బెట్టుక ప్రసాపడి, సుగంధజలముల హస్తప్రక్షాళనముచేసి, ఆచమనీయ్యంజేసి గిలుకుపావాలు మెట్టి, సంక్షేపరామాయణము చదువుతాను, శతపవాలు నడిచి, రత్నకంబళిమీద కూర్చుండుకొని, అప్పాజిమొదలైనవార్ల నున్ను, దళనాయకులనున్ను ప్రధానులనున్ను పిలువనంపించి వారలతోను కృష్ణరాయలవారు ఆనతిచ్చినది:—

“వీరనరసింహరాయలవారు సింహాసన పరభారకం వహించి నడిపించినదారభ్యంయీవరకుఅచ్యుతరాయలు చంద్రమౌళిన్ని మేమున్ను కూర్చుండక వుంటిమి, యిప్పుడు మమ్మున రాజ్య పరభారకం వహించుచున్నారు గనక సింహాసనస్థులు నడిచేదే రీతు, శత్రువుల జయించేదేరీతు, మిత్రులపోషించేదేరీతు, ఆశ్రితజనులపాలించేదేరీతు, కొలిచినవారిని ఆదరించేదేరీతు, ఆత్మసంరక్షణమున కర్హులయినవారెవ్వరు. అర్థచింతవుపాయం అర్థవ్యయం సకలమున్ను తెలిసేదేరీతు, శాశ్వతమైనకీర్తి ఖ్యాతులు గలిగేదేరీతు. ఇవి మొదలైన రాజనీతులన్నియు, తాము దెలిసినవారుగదా మాకు లెస్సగా తెలియజెప్పవలె నని ఆనతిచ్చినందులకు అప్పాజి అమ్మయరసు కొండమరసు బాచరసు మొదలైనవారు నలుగురున్ను స్వామివారు ఆనతిచ్చినది నీతి కావ్యమెసరి; సకల నీతులున్ను విచక్షణములున్ను కార్యనిర్వా హములున్ను సామర్థ్యమున్ను మయ్యేది సామాజికులతో ఆలో

చనంజేసి సకలరాజ్యసారములున్ను రాయలదేవునితో రాజ నీతులు విన్నవింపజేసినది."

రాయలవారి పట్టాభిషేకమహోత్సవసందర్భమున హంపీ గ్రామమునందలి పంపాపతిదేవాలయమున శాకగోపురమును నొకసభాస్థలియు కట్టించఁబడెను. అచట నొకశాసన మున్నది. ఆశాసనమునందలి తేదీబట్టియే వీరిపట్టాభిషేక మెప్పుడు జరిగి నదియు నిర్ధారించుట కాధారమైయున్నది. ఆశాసనమునందు శాలివాహనశకము, 1430 యనియు సంవత్సరము శుక్లనామ సంవత్సరమనియు వ్రాయఁబడియున్నవి. శకము, 1430 యైనచో సంవత్సరము విభవయై యుండవలెను. ఈసంవత్సరము శుక్ల యైనచో శకము 1431 కావలసియున్నది. ఈరెండిటియందును కొంతపొరపాటు కాన్పించుచున్నది. మొత్తముమీఁద రాయల పట్టాభిషేకము 1509 లో జరిగియుండె ననుటకే యెక్కువ యాధారములు కనుపించుచున్నవి.

రాయలపట్టాభిషేకమునకు పూర్వము తనతమ్ములవలన నేదియేని భయము కల్గునేమో యను ననుమానముచేత వారి స్వాతంత్ర్యము నాటంకపఱచి తనరాజ్యముననే వారిని బందీలుగా నుంచియుండెను. పట్టాభిషేకానంతరము తిమ్మరసొక నాఁడు రాయలవద్దకుఁజని తమ్ముల నట్టు బంధించి యెల్లకాల మును బందీలుగానుంచుట రాజ్యమునకుఁగాని తనకుఁగాని క్షేమ కరము గాదనియు వారిని సంరక్షించుటయు రాజధర్మ మనియు వారలను రాజధానియం దుంచకపోయినను రాజ్యములోని కొంతదేశమును వారిపరిపాలనక్రింద నుంచి వారిని జాగ్రత్తగా కనిపెట్టియుండుట మంచి దనియు సలహా నిచ్చినందున రాయలు

నందులకు సమ్మతించి తనసోదరులకు చంద్రగిరివద్ద కొంతదేశము నిచ్చి వారిరక్షణార్థమై కొంతసైన్యమునుంచి వారి నచటికి పంపివేసియుండెను. ఇందులకు రాయలయన్నదమ్ములును జను లును రాయలను మిక్కిలి స్తుతించిరి.

## పాతకాగితముల పరీక్ష

రాయలవారు రాజ్యాభిషిక్తులైనప్పటినుండియు అఘట నఘటనాసమర్థుండును, ఘనవాగ్జాలతయు సకలకార్యధురీణత నిరూఢియు నగు తిమ్మరసునే తనప్రధానమంత్రిగా నుంచుకొని అమరేంద్రుఁడు బృహస్పతితో రాజ్యమేలినభంగి, రాజ్యము నందలి ముఖ్యవిషయములనన్నిటిని స్వయముగా తెలిసికొను టకు ప్రయత్నించుచు, రాజ్యపరిపాలన కవసరమగు రాజనీతి నంతను తెలిసికొని రాజ్యముచేయ మొదలుపెట్టెను. ఇట్లు స్వయముగా నన్నివిషయములను కనుఁగొనుటలో తనపూర్వపు రాజులు నిలువయుంచినకాగితములను పరీక్షింపఁగ విజయనగ రాధిపతియగు సాళువనరసింహరాయునిచే నుంచఁబడిన యొక కాగితము తనకు దొరకెను. తాను రాజ్యాధిపతియైనప్పటి నుండియు రాచోలు (రాయచూరు), ముద్గలుకోటలను పట్టు కొనవలెనని ప్రయత్నించెననియు వాటిని పట్టుకొనుటకు తనకు సావకాశము కుదురలేదనియు తన కవసానకాల మాసన్నమైన దనియు నీరాజ్యము నికముందు రాజ్యమేలెడువా రెవరైన నీదేశముల ముట్టడించి వశపఱచుకొనుట మిక్కిలి యవసర మనియు నాకాగితమునందు వ్రాయఁబడియుండెను. అప్పటి నుండియు రాయలకాకోటలనుపట్టుకొనుట ముఖ్యమనితోఁచెను. అందులకై వలయుసామగ్రిని సమకూర్చుట కుద్యుక్తుఁడాయెను.

ప్రథమమున తన రాజ్యమునందు శాంతి నెలకొల్పుట యవసర మనియు తదనంతరము తనకు బొక్కసమునందు గల ద్రవ్యము సిబ్బందినిగూర్చి వివరములు తెలిసికొనుటయు ముఖ్యముగ నెంచెను. తనరాష్ట్రమంతయు శాంతియుతముగనున్నదా యనుసందర్భముల నాయాదిక్కులనున్న దొరలయొక్కయు మన్నెరికములయొక్కయు నడతలును వారివారికలిమిబలము లును పల్లెపట్టణములందు పండితపామరజనులు అనుకొనెడి వార్తలును వారివారి ప్రవర్తనలును నడవడికలును కను గొనుటకుగాను కాలివేగముగల్గి బుద్ధివిచక్షణులైన బహురూపు లుగాను సంచరించి అంతరంగికవార్తలరసివచ్చు చారుల నంపి వార్తలు తెలిసికొనుటకు ప్రయత్నించెను. అట్లు తెచ్చిన వార్తలనుబట్టి తమసామంత దేశములలో నహంకరించి పరుల త్రోవపోయిన వారియొక్కయు పోవనున్న వారియొక్కయు నహంకారమణంగించి అట్టివారెల్లరు తమయాజ్ఞానుబద్ధులై యుండునట్టుతగినయేర్పాట్లుచేసి వారినందరను తమ కనువర్తను లుగ చేసికొనిరి.

## రాజనీతి విచక్షణ

ప్రతిదినమును చారులవలన నగరమునందలి సంగతు లను తెలిసికొనుచు తాను స్వయముగా రాత్రులయందు నగర మంతయు సంచరించి విషయముల తెలిసికొని నగరమునం దవసర ములగు కట్టుదిట్టములు చేయుచుండెను.

ఇట్లు తన దేశమునంతను కట్టుదిట్టములుచేయుచు తాను రాజ్యపరిపాలనకై నేర్చుకొనవలసిన సంజయనీతి, విదురనీతి, చాణక్యనీతి, మొదలుగాఁగల గ్రంథములనన్నిటిని చదివి తన

బుద్ధికౌశల్యమును వృద్ధిపఱచుకొనుచుండెను. ఇట్లు జరుగు చుండ నొకనాఁ డీక్రిందినీతిపద్యమును

క. బలవర్గము సామంతుల, బలమున కగ్గలముగలనృపాలున కొదవున్
  బలిమి పెరనృపతికాజ్ఞా, బలసంపద కెంత దవ్వు బద్దా నరేంద్రా.

వీనియందలి యర్థమును మనస్సునకు తెచ్చుకొని యొకనాఁడు సింహాసనారూఢుఁడై యుండ తన కర్నాటరాజ్యమునసుండిన రాజ్యములయొక్కయు దుర్గములయొక్కయు కోటల యొక్కయు వివరములును భండారమునందు నుండిన ద్రవ్యముయొక్కయు బంగారుమొదలుగాగల విలువగలవస్తు వులయొక్కయు వివరములను తెల్పులెక్కలను తనకు విశద పఱుపుఁడని తనసంప్రతులకు నాజ్ఞనొసంగెను. అప్పుటి యధి కారులందరు లెక్కలనుచూపుటకు మర్నాటివరకు కాలవ్యవ ధినిగోరి మరుసటిరోజున లెక్కలనుచూపిరి.

## ద్రవ్యవివరము

ఈలెక్కలనుబట్టి యారాజ్యమునం దప్పటికుండిన ద్రవ్య ముయొక్కయు విలువగలనగలయొక్కయు వివరము లీక్రిందివిధ ముగ తెలియవచ్చెను. విజయనగరపట్టణముస్థాపించినపుడు విద్యా రణ్యులవారు సింహాసనస్థునికి నిక్షేపించినది తొంబదితొమ్మిది కోట్ల యాభైయారులక్షలద్రవ్యమును నాలుగుకోట్లభూషణ ములును, ఆరుకోట్లనవరత్నములును, నుండెను. ఈద్రవ్యమం తయు పెద్దభాండారమం దున్నది. ఇదివరలో నీద్రవ్య మెవ్వ రును తాఁకియుండ లేదు. ఇదిగాక సింహాసనస్థులు తమ యవసర ములకుపోను బొక్కసమునందు నిలువచేసిన పందొమ్మిదికోట్ల యాభైయారులక్షలద్రవ్యమును, కర్ణాటకరాజ్యంబాపతు పది

కోట్లయిన భైసాలుగులతులును, దేవాదాయం, బ్రహ్మాదాయం
సర్వమాన్యంవగైరాల క్రింద, పదికోట్లను నుండినట్లు లెక్కలు
చూపిరి. మరియు అమరనాయకులవద్ద నిరువదినాల్గువేల గుర్ర
ములున్న పండ్రెండువందలయేనుగులున్ను రెండులక్షలకాల్బ
ములున్ను నుండినట్లును తెలిసికొనియుండెను గాని రాయలవారు
తనసంస్థానమునందు నగరిపైకె జీతముక్రిందనుండిన యేనుగుల
యొక్కగాని గుఱ్ఱములయొక్కగాని, కాల్బలముయొక్క
గాని లెక్కనుజూపనందున నాశ్చర్యపడి తా నావిషయ
మునుగూర్చి ప్రశ్నించినను నెవ్వరును జవాబుచెప్పనందున
కోపించినవాడై తా నారాత్రి నగరుశోధనకు బయలుదేరినట్లు
నగరువెడలి పట్నమునకు రెండామడదూరముననున్న యొక్క
గుడియందు నిలిచి యచటనే కాల్యకృత్యములను తీర్చుకొని
పూజారియిచ్చిన నైవేద్య ప్రసాదములు భుజించి యచటనుండెను.
తిమ్మరసుమంత్రి యుదయమున లేచివచ్చి రాజును గానక చారుల
బంపి రాయలున్న ప్రదేశమును కనుగొని రాయలవారు వేటకు
పోయియుండిరనియు నందుల కవసరమగు గుఱ్ఱములు యేనుం
గులు కాల్బలము మొదలుగాగల యన్ని స్తోమములతో తక్షణమే
రావలయునని యమరనాయకులవద్దకుజనెను. వీరివెంటనే నాయ
కులు, దొరలు మన్నెరకములు తమతమ రౌతులు మవుత్తులు
బంట్లు తదితరపరివారములతో తక్షణమేకదలిపోయిరి. ఈపరివా
రమంతయు కొంతదూరమున నుంచి తిమ్మరసుమంత్రి యొక్కడే
రాయలవారివద్దకు ముందుగబోయెను. ఇదియంతయు కను
పెట్టినరాయలవారు పచ్చడముకప్పుకొని నిద్దురబోవువానిరీతిగ
పండుకొని యుండెను. కొంతసేపటికి నిద్దురలేచినట్లులేచి చేతులు

కట్టుకొని నిలిచియున్న మంత్రి తిమ్మరసును గాంచి యేల వచ్చితిరని రాయలవారు ప్రశ్నించిరి. అందుపైన జరిగినవృత్తాంత మంతయు రాయలవారికి నివేదించి శ్రీవారు వేటకై యాజ్ఞ యిచ్చినట్లు పురమునందెల్లెడల తెలియఁబరచి యమరనాయకులు వగైరాలను తమతమవద్ద నున్నయశ్వములను గజములను బంట్లను సమకూర్చి తీసుకవచ్చితిననియు నాసేనయంతయు బారులుతీరి యనతిదూరముననే యుండెననియుఁ జెప్పెను. తరువాత రాయలవారుచేసినపని రాజ్యాధిపతిచేయవలసినపని కాదనియు వారట్లు చేయుట తగదనియు తమకుఁగాని తామేలుచున్నరాజ్యమునకుఁగాని క్షేమకరముకాదనియు కొంత నచ్చఁజెప్పినపిమ్మట తాము నీతిపద్యములో విన్నట్లు సామంతబలముకన్న నెక్కువయగు స్వంతబలమును సమకూర్చినచో తాను తిరిగి నగరిలోనికివచ్చెదనని చెప్పినంతలో అఘటనఘటనాసమర్థుండగు తిమ్మరసు కైజీతం, గుఱ్ఱములు, యేనుఁగులబంట్లు మొదలైన వాటిని సమకూర్చుట క్షణముననే యేర్పాటుచేసి. చతురంగబలసమేతులై పట్టణమునకు తిరిగివచ్చిరి. ఇదియే రాయలవారు స్వంతసైనికదళము యుద్ధసన్నాహమునకై గావించిన ప్రథమసంస్కరణ. ఇదివరలో రాజధానియందు రాజులకు స్వంతసైనికదళము లెవ్వియు నుండెడివి కావు. రాజులు యుద్ధమునకు బయల్వెడలవలెనన్న తమసామంతులవద్దనుండి గ్రహింపఁబడినసైనికబలముతో యుద్ధముచేసెడివారు. అందువలననే తమలెక్కలయందు స్వంతబలముయొక్కఖర్చు లెవ్వియును కాన్పించియుండలేదు. ఈసంస్కరణవలన రాయలవారికి కైజీతం, గుఱ్ఱములు, యేనుఁగులు మొదలయిన చతురంగబల.

మేర్పడినది. దీనివలన వీరు ముస్ముందు దిగ్విజయయాత్ర లవ లీలగ జరుపుటకు వీలుకలిగెను.

### సైనికదళములను వృద్ధిచేయుట

సైనికదళములను వృద్ధిచేయుటకై రాయలవారు చాల యోచనలు చేసియుండిరి. రానున్న యుద్ధములకు గుఱ్ఱపుదళ ములు ఏనుఁగుదళములు ముఖ్యమని తెలిసికొని గుఱ్ఱము లకును యేనుఁగులకును పోట్లాటనేర్పుటకు తగుశ్రద్ధవహించిరి. దీనిక్రింద రాయలవారు ఖజానానుంచి చాల ద్రవ్యమును ఖర్చు పెట్టిరి. వారిసభలో నుండెడి ప్రతినాయకునకు నొకగుఱ్ఱ మునిచ్చి నాగుఱ్ఱమునకగు నెలసరిఖర్చును నిచ్చి యానాయ కునిచేత యుద్ధమున కవసరమగు నన్నియాటల నాగుఱ్ఱము నకు నేర్పుభారము నుంచిరి. ఇట్లు చేయుటవలన గుఱ్ఱములకు మంచికసరతు నేర్పఁబడెను. ఇట్టిగుఱ్ఱములు యుద్ధములో మిక్కిలి యుపయోగించెడివి. గుఱ్ఱపుదళ మీరీతిగ వృద్ధి చేయఁబడినది. ఇట్లే యేనుఁగులును వృద్ధిచేయఁబడెను. ఆనాఁడు యుద్ధమునకు పోవునపుడు గుఱ్ఱము లెట్లలంకరింపఁబడెడివో తెలుసుకొనవలెనన్న సంస్థానకవులలో నొకఁడగు అల్లసాని పెద్దన తనమనుచరిత్రమునందు స్వారోచి వేఁటకుఁబోవునపుడు సిద్ధముచేయఁబడిన గుఱ్ఱముయొక్క వర్ణనను చదివిన మనము తెలిసికొనవచ్చును. ఆకవి మనుచరిత్రమందు నాల్గవయాశ్వా సమున నీవిధముగ గుఱ్ఱమును వర్ణించియుండెను.

సీ. పచ్చనివాఁడుముంజి పనివాగెపక్కెర పారసీ పల్లంబు పట్టమయము
రాణ నొప్పారు హైతాణంబుసింగిణి కళుకులకోరుల తరకసంబు

మిహీపసిండిపరుంజు మొహాదా కెలంకులతావు గుజ్జరి నేత కేవడంబు
డాకెలంకున సిరాజీకరాచురకత్తి కుఱుగట క్రొవ్వాడి గోరకల పొది
పీలికుంచె కలాటంబు బేరజాంబు,మణుంగు మొగమట్టు పన్ని సాహిణి యొకండు
కర్తయొదుటికి గొనివచ్చె గంధవాహా,బాంధవాబసు నేకపుహా సైంధవంబు.

ఈవర్ణనను బట్టి సాయుధంబైన హయం బెట్లుండునో తెలియనగును. ఆ ఘట్టమునకు నూహాములుగా నుండెడి కళ్లెము (వాగె) దానిని కప్పుట కొక బొంత (పక్కెర) టంగువారు (పట్టమయపు) నుండెను, ఇవిగాక పైతాణము దేశమునకుం జెందిన ధనుస్సు (సింగిణి) క్రూరములైన బాణములుకల అంబులపొది (లకోరులతంగకసంబు) బంగారుతో చేసిన పిడిగలయుద్ధకత్తి (పసిండి పరూజు మొహాదా). ఆకత్తికి పార్శ్వ ప్రదేశమున కేవడంబు. దానికి నెడమపార్శ్వమున సిరాజి దేశపు చిన్నకత్తి దానికి సమీపమున యినుప బాణములగల యొకపొది (గోఱకలపొది) మొదలైన నీయాయుధములతో నలంకరింపబడినది. మరియు తల కొక్కయిూకలతురాయి రాళ్లతో చెక్కిన ముఖపటము నా గుఱ్ఱమున కలంకారములు. ఇట్టిగుఱ్ఱములు అనేకములు తన గుఱ్ఱపుదళమునందు రాయలు తయారుచేసి పెట్టుకొనెను. ఇట్లు వృద్ధిచేసికొనగ రాయలవారికి మొత్తముసైన్యబలము ఈవిధముగ నుండియుండెను.

కైజీతంసైన్యము:—

| | |
|---|---|
| గుఱ్ఱములు | 12000 |
| ఏనుగులు | 500 |
| కాల్బలము | 300000 |

అమరనాయకులసైన్యము:—

| | |
|---|---|
| గుఱ్ఱములు | 24000 |
| ఏనుగులు | 1200 |
| కాల్బలము | 500000 |

మొత్తము:—

| | |
|---|---|
| గుఱ్ఱములు | 36000 |
| ఏనుగులు | 1700 |
| కాల్బలము | 800000 |

ఈప్రకారముగ వృద్ధిచేయఁబడినకాల్బల మాకాలమున భామినీరాజ్యములందలి మహమ్మదీయరాష్ట్రముల కాల్బలముంతటికన్న హెచ్చుగనుండెను. మహమ్మదీయులకు మాత్రము గుఱ్ఱపుబలము కర్నాటరాజ్యమునందుకన్న హెచ్చుగ నుండెను. కాల్బలము హెచ్చుగనున్న రాజ్యాధీశులను నరపతులనియు, గుఱ్ఱపుబలము హెచ్చుగనున్న రాజ్యాధీశులనశ్వపతులనియు, ఏనుఁగుబలము హెచ్చుగనున్న రాజ్యాధీశులను గజపతులనియు, పిలిచెడివాడుకలు కలదు. ఆప్రకారము కర్నాటరాజ్యాధీశులు నరపతులనియు మహమ్మదీయ రాజ్యస్థు లశ్వపతులనియు నొరిస్సారాజ్యాధిపతులు గజపతులనియు పిలువఁబడెడివారు. కర్ణాటకరాజగు రాయలు యుద్ధమున కశ్వములును మిక్కిలి యవసరమని తెలుసుకొని తానును యశ్వబలమును హెచ్చుచేయుటకు ప్రయత్నించుచుండెను.

## పోర్చుగీసువారు హిందూదేశమునకు వచ్చుట

దాదాపుగ నీకాలముననే పోర్చుగీసువారికి హిందూదేశమునుగురించి చూచాయగ కొన్ని సంగతులు తెలియవచ్చి,

ఱియా దేశము మిక్కిలి ధనవంతమైనదనియు, నా దేశముతో వ్యాపారముచేయుటవలన చాలలాభముండుననియు తెలిసికొని తమ దేశస్థుల నీహిందూ దేశమునకు పంపవలయునని యీహా వారికిఁగల్గెను. అప్పుడు రాజ్యమేలుచున్న పోర్చుగల్లునధిపతి యగు జానురాజుహిందూ దేశముయొక్క సౌభాగ్యస్థితినిగూర్చి నిజమైనసంగతులను తెలిసికొనువచ్చుటకు మూఁడు పెద్దనావలను కోరియుండెను. అయితే జానురాజుకు మరణము సంభవించెను. వారియనంతరము రాజ్యాధిపత్యమువహించిన డాన్మాన్యూయ లను రాజు వాస్కోడిగామాయను గొప్పనావికుని యాధిపత్య మున మూఁడు పెద్దయోడలను హిందూ దేశపు స్థితిగతులు కను గొనివచ్చుటకై 1497-వ సంవత్సరమునఁ బంపెను. వారుకొంత కాలము దారి తెలియక దక్షిణాఫ్రికా చివరనున్న గుడ్ హోపు అగ్రముచుట్టి 1493-వ సంవత్సరము ఆగష్టునెలకు హిందూ దేశమునందలి పశ్చిమభాగముననున్న కళ్లికోటరేవును చేరు కొనిరి. ప్రథమములో కళ్లికోటరాజుకును డిగామాగారికి కొంత స్నేహముపొడమెను గాని వ్యాపారసంబంధములు వృద్ధిచేసు కొనునంత వీలుకలిగియుండ లేదు. ఇంతలో డిగామా తనదేశ మునకు తిరిగివచ్చెను. వెన్వెంటనే కబ్రాలు అను నింకొకపోర్చు గీసునాయకుఁ డీప్రాంతమునకే వచ్చెనుగాని కొందరు పోర్చు గీసు వారిపశ్చిమ హిందూ దేశమున నివాసముగానుండుటకు నేర్పాట్లు కలుగఁజేసుకొనుటకు వీలుకలిగెనే గాని వ్యాపారము వృద్ధిచెంద లేదు. మీఁదు మిక్కిలి కొన్నిరోధములు జని యించెను. వీరితరువాత తిరిగి డిగామాగారు 1504-వ సంవత్స రమున నిండియాకు వచ్చి యీభాగమునందున్న వారితో

లేనిపోనికయ్యములుపెట్టుకొని కొంతజననాశనము గావిం
చిరి. అయితే కొచ్చిన్దేశమునమాత్రము తమఫ్యాక్టరీ
నొకదానిని స్థాపింపకల్గిరి, ఈతనియకృత్యములవలన
కొచ్చిదేశస్థులకును కల్లికోటవారికిని కొంతమనస్పర్థ లేర్పడి
నవి. డిగామాతరువాత 1506-న లోపోసొలెసను వారు
పెద్దసైన్యముతో వచ్చి కొచ్చికోటను ముట్టడించిరి. ఇంత
లో పోర్చుగల్ రాజు యాల్మీడాయనువారిని ఈపశ్చిమ
హిందూదేశమునకు వైస్రాయిగా నేర్పాటుచేసిపంపెను.
ఆల్మీడాగారు వచ్చినంతనే యీదేశస్థులతో లేనిపోని కయ్య
ములఁబెట్టుకొనుట తమవ్యాపారపుటుద్దేశములకు నష్టమని
తెలుసుకొని యచటివారితో తగవులుమానివేసిరి. అప్పుడే
విజయనగరసంస్థానము బాల్యవృద్ధిలోనున్నదని తెలిసికొని నచటి
నరసరాజుతో సంప్రతించి భట్కలువద్ద నొకకోటను కట్టుకొనుట
కనుజ్ఞనీయుడని కోరియుండెను. కాని నరస రా జందుల కంగీక
రించియుండలేదు. ఆనాటికి గోవారేవు బీజపూరుసుల్తానగు
నదిల్షాహాయాధిపత్యమున సబేయేయను వారిపరిపాలనక్రింద
నుండియుండెను. సబేయేకును విజయనగరరాజులకునునాలోజు
లలో తకరారు లుండెను. ఇట్లెచ్చట చూచినను దేశమంతట
నొకరితోనొకరు తగవులాడుకొనుచుండిరి. ఆల్మీడా యీతగవు
లలో తాను జోక్యము కలుగచేసుకొన తలచుకొనకున్నను
తాను కాలికట్టురాజుతో పోరాడవలసివచ్చెను. ఇందుకు ఫలి
తముగ మరుసంవత్సరమున తాము కన్ననూరునగరమున కట్టు
కొనినకోట ముట్టడింపఁబడెను. కాని తమదేశమునుండివచ్చిన
సైనికబలముచేత తమకోటను పోర్చుగీసువారు నిలుపుకొనిరి

ఈస్థితిలో పోర్చుగలు దేశమునుండి అల్బానోస్ డి అల్బుకర్కును వారిభాగమునకు గవర్నరులుగా నియమింపఁబడి యిచటికివచ్చి యుండిరి. ఈసమయమునకే రాయలును రాజ్యమునకు వచ్చెను.

అల్బుకర్కు గవర్నరుపదవి స్వీకరించునాటికి కల్లికోట రాజుతో పోర్చుగీసువారు కయ్యమున నోడియుండిరి. అంత నీయాల్బుకర్కు విజయనగరాధీశ్వరుఁడగుకృష్ణరాయలకు సహాయముకోఱకు రాయబారిని పంపెను. అట్లు పంపుచు తమ రాజువద్దనుండి హిందూరాజులకు సహాయముచేయు మనియు తనకు ముగ్గురు (తురక) రాజులతో యుద్ధముచేయు మని యుత్తర్వులున్నవనియు అందువలన కల్లికోటరాజుతో యుద్ధము చేయుటకు తనకు సహాయముచేయుమనియు కబురుపంపెను. మరియు కల్లికోటలోను తురకలు నశించినచో దక్కనునెడిదేశములోనున్న తురకరాజ్యములతో విజయనగర రాజులు పోరాడుటకు తాము సహాయముచేయుదుమనియు అరేబి యాపర్షియాదేశములనుండి గుఱ్ఱములను తాము పంపుదు మనియుకూడ హెచ్చరించిరి. ఇందుకు కృష్ణరాయ లేవిధమైనజబాబును పంపియుండలేదు. ఇంతలో అల్బుకర్కు గోవారేవుపై దండెత్తిపోయి యచటితురకల నోడఁగొట్టి యారేవును తాను 15.0 డిసెంబరునాటి కాక్రమించుకొనెను. ఇందుపైన కృష్ణరాయ లాల్బుకర్కును మిక్కిలి పొగడుచు తాను పోర్చుగీసువారికి సహాయముచేయుదునని రాయబారిని పంపెను. ఇట్లె బిజాపురాధీశుఁడును పోర్చుగీసువారి మైత్రినికోరుచు రాయబారిని పంపెను. రాయ లాల్బుకర్కునకు సహాయముచేసెనో లేదో మనము చెప్పఁజాలముగాని యాల్బుకర్కుమాత్రము అరబ్బీదేశమునుండియు పరిషియాదేశము

నుండియు మంచియశ్వముల పంపుట కంగీకరించి యట్లే పంపించి యుండెను. రాయలవారికిని పోర్చుగీసువారికిని జరిగినరాయ బారములవలన రాయలవారియశ్వదళము మిక్కిలి వృద్ధిచేయఁ బడెను. ఈయశ్వములను తురుష్కరౌతులయొక్కయు కబ్బిలి రౌతులయొక్కయు నాధీనముచేసి తనయశ్వబలమును వృద్ధి చేసికొనెను.

## 6. దక్షిణదిగ్విజయయాత్ర

రాయలవారు సింహాసనమునకు వచ్చిన శీఘ్రకాలముననే తమబాహుబలపరాక్రమము వీరారివర్గమునకుతీవ్రదావానలంబు జేసి గొప్పప్రసిద్ధిఁగాంచిరి. తాము రాజ్యాధిరూఢులైన నాలు గేండ్లకే తగినసైన్యమునుగూర్చుకొని దక్షిణదేశమునందలి ప్రబలినకొన్నికొన్నియల్లరుల నణచుటకు బయలు వెడలవలసి వచ్చెను.

పూర్వపు తొండమండలరాజ్యము సాంబువరాయనుల వద్దనుండి కుమారకంపన్నచేత లాగుకొనఁబడెను. అప్పటినుండి నీసాంబువరాయనులు కంచియనుకాంచీపురమువద్దనే యుండిరి. రాయలురాజ్యమునకు వచ్చినపిదప వీరలలో కొందరు కాంచీ పురప్రాంతములనుండి కొంతయల్లరిని బైలుదీసిరి. దీని నణంచుట రాయలవారి ముఖ్యకర్తవ్యమై యుండెను. అందువలన దక్షిణ దేశమునందు బయలుదేరిన యల్లరుల నణంచుటలో నీ కార్యమే రాయలవారి ప్రథమకార్యముగా పరిగణింప నగును. రాయలవారు విజయనగరమునుండి బయలువెడలి యీకాంచీ పురమునకు వచ్చి యచటియల్లరి నణంచి కాంచీపురప్రాంతముల నన్నిటిని తమయాజ్ఞయందుండున ట్లేర్పరచిరి.

## శివసముద్రము

కర్ణాటకరాజ్యములోని కావేరీతీరమున శివసముద్ర మనుకోట యొకటి యుండెను. ఈ రాజ్యమున గంగరాజు రాజ్యమేలుచుండెను. ఈ దేశపు రాజులు విజయనగర రాజులకు గప్పము కట్టుచు నాచారము కలవారు. గంగరాజు శివసముద్ర కోటను సురక్షితముగ చేసికొని, విజయనగరసంస్థానమునకు గప్పముకట్టుటకు నిష్టము లేక పరిసర రాజుల కొందరిసహాయసాను భూతులు సంపాదించి సన్మార్గము నతిక్రమించి క్రొత్తగా రాజ్యాభి షిక్తులైన కృష్ణరాయలకు వ్యతిరేకముగ ప్రవర్తించుచుండెను. రాయలవారీవిషయమును గూర్చి తమచారులవలన తెలిసికొని గంగరాజును దుర్మార్గపథమునుండి తొలగించి సన్మార్గమునకుఁ ద్రిప్పఁగోరి యొకదూతను వారివద్దకు బంపిరి కాని గంగరాజు మదోన్మత్తుఁడై యాదూత చెప్పినవిషయముల నంగీకరింపక వానిని పరిభవించి యాతఁడు వచ్చినదారినే పొమ్మనెను. అందు పైన రాయలవారు కోపోద్దీపితులై యీగంగరాజు మదమడంప చతురంగబలసమోపేతులై యచటికి బయల్వెడలిరి. ఆతనిపై యుద్ధమునకుఁ బోవుచు గంగరాజువైరియగు శ్రీరంగపట్టణపు రాజైన చిక్కరాజు సహాయముగొని శివసముద్రపుకోటను ముట్టడించి యాకోటను తమవశముచేసికొనిరి. ఈకోట రాయల వశమైనంత గంగరాజు తనయోటమిని సహింపఁజాలక కావేరీనదీ ప్రవాహమునఁబడి తనజీవితము నంతముచేసికొనెను. ఇచటనుండి రాయలవారు ఉమ్మత్తూరునకుం జని యచటి వ్యవహారముల చక్కఁబెట్టుకొని యాచుట్టుపట్లనుండు చిన్నచిన్ననాయకులతో సంప్రతించి తమయాధిపత్యము నాయాదేశములస్థిరముగా స్థాపిం

చుకొనిరి. చిక్కరాజును, రాయలను చక్రవర్తిగా నంగీకరించి తననగరమున రాయలప్రతాప మెల్లరకు విశదను కాఁగలందు లకై కృష్ణదేవరాయలధ్వజము నాతనిపట్టణమగు శ్రీరంగపట్టణమందు నెత్తించెను. శ్రీరంగపట్టణముననుండ రాయలవారు రంగనాయకులదేవాలయమునకుం జని యచటిస్వామిని సేవించి యుండిరి. అటుతరువాత యిక్కేరియరంగానకు వచ్చి యచటి సక్కులనాయకుణ్ణి నాయుడుమూకలను గాంచి వారిలో నవిశ్వాసులైన మూకలను పారదోలి మిగిలినవారిప్రభుభక్తి సరియైనదిగా నుండుటను చూచుకొని అచటిదేశమంతటను శాంతి నెలకొల్పిరి.

ఇచటినుండి దక్షిణముననున్న కూర్గు మళయాళము మొదలుగాగలదేశములకుం జని యచటను తమవిజయభేరిని మ్రోగించి తమయాధిపత్యమును స్థాపించుకొనిరి. అటుపిమ్మట విజయప్ప వెంకటప్ప యనుసేనాధిపతులకు నపారసైన్య మిచ్చి పాండ్య, చోళ, చేర దేశపురాజులను స్వాధీనపఱచుకొనుటకు వారిని పంపిరి. విజయప్పనాయఁడు చిత్తూరుతొండమండలము జింజిచోళమండలపుపాలెగాండ్రను వశముచేసికొని వారు వారీయవలసినకప్పములను నిర్ధారణచేసికొని వేలూరు ముఖ్యస్థానముగ నేర్పరచుకొని రాయలవారికై పన్నుల రాబట్టుచుండెను. ఈప్రకారముగనే యితరసామంతులును వారు వారీయవలసిన గప్పములను సక్రమముగ నిచ్చున ట్లొడంబడికల నేర్పాటు చేసికొనిరి. ఈప్రాంతదేశములయం దంతటను జనులు కృష్ణదేవరాయలయందు భక్తివిశ్వాసములు గల్గినవారే యెక్కువగా నుండి యెక్కడనో యొక్కొక్కచోట కొన్నిరహస్యకుటాలో,

చన లుండుటచేత రాయలవారికి హెచ్చుగ యుద్ధముచేయవల
సిన యవసరము గాన్పించియుండలేదు. వీరిసన్నాహమును జూచి
నంతనే రహస్యపు టాలోచనలుచేయుచున్నవారును నిస్సహా
యులై తొందరగనే లొంగిపోయి తమతమభక్తివిశ్వాసము
లను సహృదయులై నిష్కాపట్యముతో బయలుపర్చియుండిరి.

### దేశవిభజనము

ఈప్రకారము విజయయాత్ర జరిపి రాయలవారియాధీ
నము కాఁబడిన దక్షిణదేశమునంతను మూఁడుభాగములుగ
విభజించి నెల్లూరుమొదలు కొల్లడంవరకు నుండుదేశమునకు
కృష్ణప్పనాయకుఁ డనువానిని కొల్లడం మొదలు తంజావూరు
వరకును విజయరాఘవనాయకుఁ డనువానిని తంజావూరునకు
దక్షిణమందుండు దేశమునకు వెంకప్పనాయకుఁ డనువానిని
పాలకులనుగా నియమించెను. దక్షిణమున కన్యాకుమారివఱకు
నుండు దేశమంతయు నీప్రకారము రాయలస్వాధీనమునం
దుండెను. దక్షిణమున నీకృష్ణదేవరాయలు జయించి స్వాధీనము
చేసికొనని దేశ మేదియు నున్నట్లు కనుపించదు.

పైనచెప్పినరీతిని దక్షిణదేశమునంతను విజయభేరిని
మ్రోగించి, కొద్దికాలమునకే తిరిగి తమరాజధానియగు విజయ
నగరమునకు కృష్ణరాయలు ద్విగుణీకృతయశస్సుతో మిక్కిలి
వైభవముతోఁ జేరుకొనిరి.

## 7. పూర్వదిగ్విజయయాత్ర. 1513-1517

దక్షిణదేశదిగ్విజయయాత్ర ముగిసినంతనే రాయలవారు
ఒరిస్సాదేశపుగజపతిరాజులపై కన్నువేసెను. ఆనాటికి గజపతి

రాజు మహాబలవంతుఁడుగా నుండెను. గజపతిదేశము గొప్పదై యుండెను. వారిరాజ్యము నెల్లూరునందలి యుదయగిరివరకు వ్యాపించియుండెను. గజపతిరాజులసంపద సామాన్యమైనదికాదు. అట్టిమహారాజు కర్ణాటరాజ్యపరిసరప్రాంతమున నుండుట కర్ణాటరాజ్యమునకు క్షేమకరము కాఁజాలదు. కాన నట్టిస్థితిలో రాజనీతిని చక్కఁగ తెలిసికొనిన రాయల కారాజ్యముపైన కన్నుపడుటలో నాశ్చర్యమేమియును లేదు. అప్పటికి తనరాజ్యమునం దెల్లెడలను శాంతి నెలకొల్పఁబడెను. తనదేశమునందలి జనసామాన్యమంతయు కొరతలు లేక సంతుష్టులైయుండిరి. సామంతరాజు లెల్లరును భక్తివిశ్వాసపూరితులై యుండిరి. ఈసమయము దిగ్విజయయాత్రకు మిక్కిలి శుభసూచకపూరితమై యుండెను. అట్టిసమయమున శ్రీకృష్ణరాయ లీవిషయమునుగూర్చి తనమంత్రిపుంగవుఁడగు తిమ్మరసుమంత్రితో సంప్రతింప నతఁడు నందుల కియ్యకొనెను. వీరుభయులును తదితరమంత్రివర్గముతో నాలోచించి తిమ్మరసునే యాదండయాత్రకు సేనాధ్యక్షునిగా చేసి నగరాధ్యక్షత్వమును తిమ్మరసుమంత్రిసోదరుఁడగు గోవిందామాత్యునియం దుంచి మంచిముహూర్తమున చతురంగబలసమేతులై సైనికుల శంఖారావముతో గజఘంటానాదముతో వందిమాగధులకైవారముతో రాజపురోహితుల వేదఘోషముతో స్వస్తివాచనములతో యుద్రేకపూరితములగు నుత్సాహవాక్యములతో దిగ్విజయయాత్రకు బయల్వెడలిరి. రాయల వెంట వారిరాణులును వారియాస్థానకవులు పండితులు, రాజపురోహితులు, వైష్ణవస్వామియగు తాతాచార్యాది పుదుసులు ననేకబ్రాహ్మణులును అనుగమించి పోయిరి.

## ఉదయగిరికోట

ఇట్లు 1513 వ సంవత్సరమున రాయలు దండయాత్రకు బయల్వెడలెనని యుదయగిరిని పరిపాలించుచున్న ప్రతాపరుద్ర గజపతియొక్క పినతండ్రియగు తిరుమలకాంతారాయఁడు తెలిసికొన్నవాఁడై దుర్గములో సైన్యమును చేర్చుకొని, వలయు తినుబండారములను సమకూర్చుకొని, కోటను సంరక్షించుకొనుచు నుండెను. ఆనాటికోటలలో నీయుదయగిరికోట మిక్కిలి దుర్భేద్యమైనదై యుండెను. ఈకోటలోనికి పోవుటకు మార్గము దుర్గమమైనది. లోనికిఁ బోవుట కొకచిన్నత్రోవదక్క మరియొక మార్గము లేదు. ఇది నెల్లూరుమండలములో నున్నది. ఈకోట శత్రురాజుల కభేద్యమై సురక్షితముగనుండెను. ఈకోటలోని వారి నోడింపవలయు నన్న లోనుండు వారికి వలయునాహార పదార్థముల నందకుండునట్లు చేయుటయే ముఖ్యపద్ధతియై యున్నది. ఈకోటను ముట్టడించి కృష్ణదేవరాయలును రాయసం కొండమరుసయ్యయు సేనాధ్యక్షులుగనుండి యనేకమార్గముల పదునెనిమిదిమాసము లహోరాత్రములు కోటను పరిపరివిధముల పోరాటము గావించియు కోటలోనికి ప్రవేశింపఁజాలరైరి. ఈకోట కొండలమధ్యనుండుటచే చుట్టునుండుకొండలను బగులఁ గొట్టించినను లాభములేకుండెను. ఇట్లెన్నియుపాయములను దీని భేదించుమార్గము గానమి విసువుచెందియున్నతరి దైవవశమున రాయలవారిచే గనుఁగొనఁబడి కొండవెనుకనుండిన యొకమార్గమున కోటలోనికి సునాయాసముగ జనిరి. అట్లు చని లోననుండు శత్రుభటుల నెదుర్కొని వారలను సంహరించి దుర్గమును వశపఱచుకొని యచటనున్న దుర్గాధీశుని పినతండ్రిని

మేనత్తను చెరఁబెట్టి వారిని బందీలుగ విజయనగరమునకుఁ బంపిరి. వీరివిజయమును పురస్కరించుకొని ఉదయగిరియందు స్థానికముగ నున్న కోనవల్లభరాయఁడను దేవునకు అచటిశిఖల్లను గ్రామమును బహూకరించి శ్రీరాయలవారు ఏకశాసనమును వ్రాయించిరి. ఈశాసనమునుబట్టి శాలివాహనశకము 1436-న భావనామ సంవత్సర జ్యేష్ఠబహుళవిదియనాఁడీదాన మీయఁబడినట్లు కనఁబడుచున్నది. ఇది సరియగు 1514-వ సంవత్సరమగును. దీనినిబట్టి ఉదయగిరికోట ముట్టడి 1513-వ సంవత్సర ప్రారంభములో మొదలుపెట్టఁబడియుండవచ్చునని తోఁచుచున్నది. ఈయుదయగిరిదుర్గమును వశపఱచుకొన్నతరువాత నీగజపతిసైన్యము మెల్ల మెల్లగనుత్తరమునకు పోసాగెను. ఒరిస్సాదేశమునకు నీయుదయగిరికోట ముట్టడింపఁబడి రాయలవశమయ్యెనని తెలిసినపిదపనచట నుండి కొంతసైన్యమును తగినసైన్యాధిపతులయాధిపత్యమున రాయలసైన్యమునడ్డుకొనుటకు పంపఁబడెను. ఈయుభయసైన్యములును ప్రప్రథమమున కందుకూరువద్ద ఢీకొనఁగా కోటముట్టడింపఁబడెను. ఇచటనుండి తనరాజధానికిమరలుచు తిరుపతి వేంకటేశ్వర దేవాలయమునకు తమభార్యలతో జని వేంకటేశ్వరుని పూజించి రాయలవారు ముప్పదివేలవరహాలు ఖర్చుచేసి కనకాభిషేకముగావించిరి. దేవునిగుడిలో ప్రతిదినము దేవునికి నైవేద్యము పెట్టుటకు తాళ్లపాకయనుగ్రామమును దానముగనిచ్చినటుల నొకశాసనము కలదు. ఈశాసనము 6-7-1514 తేదీగలదియైయున్నది. రాజ్యాభిషిక్తులైన తరువాత శ్రీరాయలు తిరుపతివేంకటేశ్వరస్వామిని దర్శించుట యిదినాల్గవమారు. రాయలభార్యలగు చిన్నమ్మాదేవి తిరుమలాదేవియును ప్రత్యేకప్రత్యేకముగ బంగారు

కాసులవేయుల నిచ్చి తమపేర నిత్యనివేదనము జరుగుటకై గుడి యారను గ్రామము నొకయును పిరాటికలత్తూ రను గ్రామము నింకొకరును దానముగా నిచ్చియుండిరి.

ఉదయగిరికోటను ముట్టడించి స్వాధీనపఱచుకొన్నపుడే యచట తన కాకోటలో దొరకిన బాలకృష్ణుని విగ్రహము నొకదానిని తనవెంట తీసికొనివచ్చి యావిగ్రహమును భావ నామసంవత్సర ఫాల్గుణమాసమున హంపీగ్రామమున నొక పెద్దదేవాలయమును కట్టించి యచట నాబాలకృష్ణుని విగ్రహమును ప్రతిష్ఠింపించెను. దీని కాధారముగా నచట నొకశాసనము చెక్కఁబడియున్నది. ఈదేవాలయ మిపుడు శిథి లమై యున్నను నచటనుండు దేవాలయములలో మిక్కిలి గొప్ప దేవాలయముగ నూహించుటకు తగినయాధారము లిప్పటికిని కనుఁగొననగును. ఆకాలముననే రాయలవా రచటికి నతిదూర ములో హజారరామస్వామిదేవాలయము నొకదానినికట్టించిరి.

యుదయగిరివిజయము దేశమునం దెల్లెడల నల్లుకొని యెనో లేదో దీనికి వెనువెంటనే కృష్ణరాయలు తిరిగి పయనమై తనయుత్తరదిగ్విజయయాత్రను పూర్తిచేసికొనుటకై చతురంగ బలసమేతుఁడై జనుచుఁ ద్రోవలో నున్న కనిగిరికోటపై దండు విడిసెను. ఇచటికోటను ముట్టడించి స్వాధీనపఱచుకొనినపిదప గజపతి రాజ్యాధిపత్యమున పరిపాలించుచున్న వీరరుద్రగజపతిని జయించి యాతని సకుటుంబపరివారముగ వింధ్యపర్వతము వరకు పారఁద్రోలెను. ఈకోటను ముట్టడించుటకు కారణముగ జను లొకకథను చెప్పుదురు. ఆకథ నిజమనుట కెట్టియాధార ములును కనుపింపవు. అయిన నాకథ నిందు పొందుపఱచు

చున్నాను. వీరరుద్రగజపతికి యొకముద్దులకుమారితె చిన్నా దేవి యను నామె యుండె ననియు నామెను రాయలువివాహ మాడఁదలఁచి వీరరుద్రగజపతిని కోరియుండెననియు వీరరుద్రగజ పతి యందుల కంగీకరించియుండలే దనియు నాకసిచేత నీకోటను ముట్టడించి గజపతికుమార్తెను బలవంతముగ వివాహమాడె ననియు చెప్పుదురు. ఇందు కాధారము లెవ్వియును లేవు. ఆనాటిచరిత్రకారులు కాని కవులు గాని యెవరును నీవిష యమునుగూర్చి వ్రాసియుండ లేదు. అప్పటికే అనఁగా నీముట్టడి జరుగునాటికే చిన్నాదేవి కృష్ణదేవరాయలకు పట్టపుదేవిగా నున్నట్లు గట్టియాధారము లున్నవి. రాయలవారు పట్టాభిషిక్తు లైన కొలఁదిదినములకే తాము తమపట్టపుమహిషులతో పాటు తిరుపతి వెంకటేశ్వర దేవాలయమునకు జని దేవునిసందర్శించి నట్లును నచట రాయలవారు దేవుని కొకనవరత్నఖచితమైన కిరీటమును బహూకరించినట్లును అందుతో పాటు కర్పూర హారతి నిచ్చుటకు నిరువదియైదు వెండిపళ్లెరములను కూడ నిచ్చి నట్లును రాయలభార్యలగు చిన్నాదేవియు తిరుమలాదేవియు కూడ దేవునికి పాలు త్రాఁగుటకు బంగారుగిన్నెలబహూకరించి నట్లును నొకశాసనము 1513 వ సంవత్సరమున అనఁగా ఆంగీరస నామసంవత్సరమున తెనుగుకన్నడము మొదలయిన యనేక భాషలందు వ్రాయఁబడియుండెను. దీనినిబట్టి కూడ పైకథ కెంతమాత్రమును ఆధారములేదనియే చెప్పనగును.

కందుకూరు దుర్గమువశమైనంతనే రాయలసేన ముందుకు జనుచుండ గజపతిసైన్యములు మెల్లమెల్లగ వెనుకకు తగ్గు చుండెను.

ఆనాటికి అద్దంకి దుర్గము వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగెడు కేతవరము, కొండవీడు దుర్గములు గజపతి రాజ్యమునకు చెందినవై యున్నవి. ఈదుర్గములన్నిటికి కొండవీడు ముఖ్యస్థానమై యుండెను. ఈకొండవీడు 1454-వ సంవత్సరమున నొరిస్సా గజపతిరాజులక్రిందకువచ్చెను., అప్పటినుండి గజపతి రాజులస్వాధీనమునందే యుండెను. కందుకూరిదుర్గమున నుండి పారద్రోలఁబడిన గజపతిసైన్యమునకు నుత్తరమునసుండి కొండలు సామంత రాజులు సహాయముగా రాయలసైన్యమునకును గజపతిసైన్యమునకు కొంతకాల మచ్చటచ్చట పోరాటములు జరుగుచుండ గజపతిసైన్యములను దఱుముకొనుచు రాయలసైన్యము వరుసగ అద్దంకి, వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము మొదలైనదుర్గములను వశపఱచుకొనెను. ఇట్లు తఱుమఁబడిన గజపతిసైన్యము కొండవీడు దుర్గమునకు పోయి యచట కొంత విశ్రాంతితీసికొనెను. శ్రీ రాయలవారు మంత్రితో సంప్రతించి జయించినప్రాంతములకు తగినఁ తరక్షణ కట్టుదిట్టముల నేర్పాటుచేసి విశ్వాసపాత్రులగు నధికారుల స్వాధీనమునం దాయాప్రాంతములరక్షణనుంచి రాయలవారు తమ రాజధానికి తిరిగివచ్చిరి.

తమ రాజధానియందు కొన్నాళ్లుండి యచటనుండి తిరిగి. రాయలవారు కొండవీటిని ముట్టడించి గజపతి రాజ్యమును తుదముట్టింప నుద్యుక్తులై దండువెడలిరి. ఈకొండవీడుదుర్గ మిదివరలో వ్రాయఁబడినట్లు గుంటూరుజిల్లాలోనున్నది. ఈదుర్గము చుట్టుప్రక్కలనుండు అనేకచిన్నదుర్గములకు ముఖ్యస్థానమై యుండెను. ఇచటి దుర్గములలో సిదుర్గమునకుఁగల బల మసాధా

### కొండవీడు

రణమైనది. ఈదుర్గముచుట్టు ననేకసేనానులు తమసేనలతో పర
సేనలఁ జొరనీయక కాపుండిరి. అందువలన కొండవీటిదుర్గము భే
ద్యమై యుండెను. రాయలవారు కొండవీటిపై దండువెడలి
రనెడువార్త చెవినోఁకఁగానే యోఢ్రదేశపురాజగు ప్రతాప
రుద్రమహారాజు రుద్రప్రతాపుఁడై యరిభీకరంబులగు చతురంగ
బలములతో కొండవీటిరక్షణకై సరభసంబున బయలువెడలి
వచ్చెను. అటువచ్చుటలో పదమూడువందల యేనుంగులదళ
మును యిరువదివేలగుఱ్ఱపుదళము నైదులక్షలకాల్బలము తన
వెంటతీసికొని రాచూరుమల్లాఖానుఁడు, ఉద్దండఖానుఁడు, పూస
పాటిరాచిరాజు, శ్రీనాథరాజు, జన్యామలకసవాపాత్రుఁడు,
పశ్చిమబాలచంద్రమహాపాత్రుఁడు మొదలైన యనేకనాయకు
లతో కలసివచ్చి కృష్ణానదియుత్తరపువైపున దిగియుండెను. ఈ
వార్తవినినంతనె రాయలవారు ప్రధానమంత్రియగుతిమ్మరసుతో
సంప్రతించి వారిసలహా ననుసరించి కొండవీటిముట్టడిని సాలువ
తిమ్మరసుమంత్రికే వదలివైచి తాము భార్యాసహితులై యావం
తయు భీతిచెందక తమసైన్యముతో శత్రురాజుతోను వారి
సైన్యముతోను తాము స్వంతముగ యుద్ధము చేయ నుంకించిఁ
బయలుదేరి కృష్ణవేణీతటమున దండువిడిసిరి. ఇద్దరి తమస్థలముల
నేర్పాటుచేసికొని యద్దరినుండియున్న గజపతిరాజగు ప్రతాప
రుద్రగజపతితో తాము స్వంతముగా యుద్ధము చేయుట కుద్యు
క్తులైయున్నట్లు గజపతిరాజుకూడ నియ్యకొన్నచో వారు
నియమించినస్థలమున వారికిచ్చువచ్చినసమయమున యుద్ధముచేయఁ
గలమనియు వార్తను గజపతిరాజునకుఁ బంపిరి. అందులకు గజ

పతిరా జేలాటిజబాబునుపంపక యుద్ధసన్నద్ధుఁడాయెను. శత్రు రాజుయొక్క నిర్ధారణను గమనించినవాఁడై రాయలువేనుఁగులు, గుఱ్ఱముఁలతోఁకూడుకొన్న తనసైన్యముతో కృష్ణవేణీనదిని దాఁట నారంభించెను. వీరు కృష్ణానదిదాఁటకపూర్వమే శత్రు రాజులతో యుద్ధము ప్రారంభింపఁబడి కృష్ణవేణీనదియందే ఘోరయుద్ధము సాగెను. ఈయుద్ధమునం దిరుపార్శ్వముల వారికిని నష్టముకల్గి యనేకులుహతులైరి. ఎట్టకేలకు రాయలవా రతిఘోరముగను గొప్పయుక్తితోను సాధించి కృష్ణను దాఁటి యివతలియొడ్డుననున్న శత్రురాజులసైన్యమును కదనంబున నతిభీకరంబుగ నెదుర్కొని యుద్ధమున నోడించి ప్రతాపరు ద్రునిసైన్యముల నచటినుండి తరిమివైచి జయలక్ష్మిని చేపట్టెను. ఈయుద్ధమునందు శత్రురాజులచే వదలిపెట్టఁబడిన యనేకము లైన యేనుఁగులును గుఱ్ఱములును వీరిచేతికిచిక్కెను. మఱియు లెక్కకుమీఱినధనమును రాయలవారివశ మాయెను.

ఇచట యుద్ధములో జయలక్ష్మిని చేపట్టినవెనుక తిరిగి రాయలవారు కొండవీడువద్దకువచ్చి యిదివరకే సాలువతిమ్మ రుసు మంత్రిచే ముట్టడిచేయఁబడిన కొండవీటిదుర్గమును సాధిం చుటకై తిమ్మరసునకు సహాయముగవచ్చెను. ఇచట యుద్ధమున తిమ్మరసు సేనానాయకుఁడై యద్వితీయశౌర్యమును ప్రకటిం చెను. కొండవీటియందుండు దుర్గనాయకులును దుర్గాధ్యక్షులు నతిశౌర్యముతో యుద్ధముచేయసాగిరి. ఇట్లిరుపక్షములవారును దాదాపు రెండుమాసములు హోరాహోరిగా యుద్ధముచేసిరి. చిట్టచివరకు కోటనురక్షించుటకై చుట్టుకట్టబడిన యెత్తైనగోడ లను దాటుటకు రాతితోను నొకపెద్దచట్టమును కట్టి యాంచ

ట్టమువలన సాగోడలనుదాటి కోటలోనికి రాయలసైన్యము పోవుటకు మార్గ మేర్పరచుకొనెను. ఈమార్గ మేర్పడినం తనే సైన్యము కోటలోనికి సులభముగ పోజాలెను. అంత కొండవీటికోట సాలువతిమ్మర సధిపతిగనున్న సైన్యము నకు శాలివాహనశకము 1437-వ సంవత్సరమున ఆషాఢ శుద్ధయేకాదశికి సరియైన 1615-వ సంవత్సరమున జూనునెల 23-వ తేదీన స్వాధీనమయినట్లు కొండవీటివద్దనున్న యొకశాస నమువలన తెలియుచున్నది. ఆశాసనము దీనివిధముగ వ్రాయఁబడి యుండెను.

సాళువాంకశకవత్సరగణ్యాషాఢశుద్ధహరివాసరసౌరా,
సాళువతిమ్మసచివేనగృహీతం కొండవీటినగరంనగరాజమ్.

ఇట్లాదుర్గమును స్వాధీనపఱచుకొని ఆకోటలోనుండెడి వీర భద్రగజపతిని తదితరనాయకులను చెఱగొని బందీలుగఁ జేయఁ బడిన వారినందరను విజయనగరమునకు పంపివైచెను. ఇంతే టితో కృష్ణానదికి దక్షిణభాగమున గజపతిరాజుల ప్రభుత్వము తుదముట్టెను. కొండవీడుదుర్గరక్షణమునకై యప్పటికి తిమ్మరసు మంత్రినే నియమించి రాయలవారు తరువాతభార్యలతో సహా పుణ్యక్షేత్రములసేవించుట కృష్ణానదీతీరముననున్న ధరణి కోట యమరావతీగ్రామములకుం జని యచట తానుబంగా రముతో తులాభారముతూఁగి కొండవీటియుద్ధములో తన సేనానులుచూపిన ధైర్యసాహసములకు తగినపారితోషికముల నిచ్చి వారినందరను సంతోషపెట్టి యీ తులాభారబంగా రమును తగురీతిని పంచిపెట్టి తనభార్యలగు చిన్నాదేవి తిరు మలాదేవులచేత ననేకధర్మములుచేయించిరి.

ఇచటనుండి 1551-వ సంవత్సరమున అక్టోబరు 25-వ తేదీన తిరిగి తిరుపతి వేంకటేశ్వరస్వామినిసందర్శించి యచట దేవునికి తగురీతిని కానుకల నిచ్చి యచట తనదండ యాత్రనుగూర్చిన వివరములను విశదీకరించుచు కొన్ని శాసనములు వ్రాయించెను. ఇచట నాసమయమున వ్రాయింపఁబడిన శాసనములలో రాయలు "పూర్వదక్షిణపశ్చిమసముద్రాధీశ్వరుఁ"డనియు "యవనరాయస్థాపనాచార్యుఁ" డనియు మొదలుగాఁగల బిరుదాంకితుఁడుగ సంబోధింపఁబడెను. పైన వ్రాయఁబడినబిరుదులలో మొదటిబిరుద మిప్పటికిన్ని మైసూరు మహారాజునకు దర్బారులలో వాడఁబడుచున్నది.

### తిరుపతి వేంకటేశ్వరుని సేవించుట

తిరుపతినుండి తమస్వస్థానమునకుఁబోయి యచటినుండి తిరిగి కొండవీడున కుత్తరమున నున్న యుత్తరగజపతిరాజులదుర్గములను స్థానములను బట్టుకొనునుద్దేశముతో పోవుచుఁ ద్రోవలో కర్నూలుజిల్లాలోని యహోబలక్షేత్రమును యువసంవత్సర పుష్యమాసమున సందర్శించి యచటిదేవాలయములోని విగ్రహముల కనేకబంగారునగలను బహూకరించి యచటినుండి కృష్ణానదీతీరమునకుఁ బోయి యచట బెజవాడలో కొలదికాల ముండెను. ఆసమయమున శివాలయమునకు దానములిచ్చి యచటకొన్ని శాసనముల నుంచెను. ఇచట నున్నసమయమునసే చుట్టుపట్టుగ్రామము లనేకములకు భార్యాసమేతుఁడై పోయి యుండెను. ఇచటనుండి కటకరాజులగు గజపతిరాజుల దేశమునకుపోవుటకు ముస్ముందు కొండపల్లిదుర్గ ముండెను.

### కొండపల్లి ముట్టడి

ఈకొండపల్లిదుర్గమును రెడ్డిరాజులకాలములో మిక్కిలి దృఢతరముగఁ గట్టియుండిరి. రెడ్డిరాజు లంతరించినపిదప నీ దుర్గము గజపతిరాజులచేత (బడియెను. ఈకొండపల్లి దుర్గమును బట్టుకొనుటకై రాయలు ముందంజవేయుచుండెను. ఆకాలమున వీరభద్రగజపతి యీకొండపల్లిని పాలించుచుండెను; ఈదుర్గము గజపతిరాజులకు మిక్కిలి ముఖ్యస్థానమై యుండెను. అచట గజపతిరాజుల ముఖ్యసేనాను లందరును కూడియుండిరి. ఈదుర్గమును స్వాధీనపర్చుకొనుటకు కృష్ణదేవరాయలు ముట్టడించి దాదాపు మూఁడునెలలు హోరాహోరిగ యుద్ధముగావించియుండిరి. చివరకు రాయలవారు తమసైన్యబలముచే నీదుర్గమును స్వాధీనపగచుకొనిరి. ఈదుర్గమున గజపతి రాజులముఖ్యసైన్యాధిపతులు, రాజకుటుంబమువారు, రాజు గారిభార్య వారికుమారుఁడు నుండిరి. వీరినందరను యుద్ధానంతరమున బందీలుగపట్టుకొని విజయనగరమునకు తీసికొని పోయిరి.

### దండయాత్ర ముందుకుసాగించుట - తిమ్మరసు వల దనుట

కొండపల్లిదుర్గము నాక్రమించి యచటివారిని బందీలు చేసి వారిని విజయనగరమునకుఁ బంపినపిదప మిక్కిలి యుత్సాహపూరితులై తాము ప్రారంభించిన దండయాత్రల జయపరంపరలచే మిక్కిలి గర్వించినవారై, తిమ్మరసుమంత్రి వల దని చెప్పినను వినక గజపతిరాజులనివాసపట్టణమైనకటకమును పట్టుకొనవలెనని సంకల్పించెను. ఈయూహ సరియైనది కాదనియు తాము తమరాజధానినగరమునువదలి యదివరకే చాలకాలమైనదనియు గజపతిరాజులసైన్యము వారి రాజధానియందు

చాల హెచ్చుగనుండుననియు, తమరు విజయనగరమునుండి తమసైన్యమును సమకూర్చి తెచ్చుకొనుట మిక్కిలి కష్టమనియు నెన్నివిధముల చెప్పినను తిమ్మరసు విన్నవించినను రాయలవారు వినరైరి. అంత తిమ్మరసు భయసంశయాన్వితుండయ్యు చేయునది లేక తనకెంతమాత్ర మిష్టములేనివాఁడయ్యు రాయలయాజ్ఞను శిరసావహించి యుద్ధభేరి మ్రోయించి గజపతిం గెలుచుటకై ముందుకు నడువవలసివచ్చెను. త్రోవయంతటను గజపతిసైన్యముతో యుద్ధముచేయవలసివచ్చెను. ఇట్లు యుద్ధము చేయుచు గజపతి సైన్యములను దఱుముచు జమ్మిలోయ కొండాము మొదలగు కృష్ణాగోదావరి మధ్యస్థములైన ప్రదేశముల జయించి వేగిదేశపు రాజధానియగు రాజమహేంద్రవరమును రాయలవారిసైన్యము ముట్టడించెను. రాజమహేంద్రవరమున నున్న గజపతిసైన్యముల నోడించి యానగరముకూడ రాయలవారు వశపరచుకొని యచ్చటనుండి గజపతిసైన్యమును వెనుకకుఁ బారఁద్రోలుచు నచటనుండి బయలుదేరి రహితాపురము మొదలగుకొన్ని మన్యస్థానముల లోఁబరుచుకొని యటనుండి కొంతదూరముచని శాహాబులేంద్రుని వంశస్థులకు కొంతకాలము ముఖ్యపట్టణముగనుండిన పొట్నూరు గ్రామమును జయించి తమయప్రతిమమైనశౌర్యమును విక్రమమును ప్రకటించుటకై నా పొట్నూరు గ్రామమున నొకజయస్తంభమును స్థాపించి యచట నుండి విశాఖపట్టణమునందలి మధ్యస్థానమయిన మాడుగోలును వశపఱచుకొని మత్స్యవంశస్థుల ముఖ్యపట్టణముగు ఒడ్డాదిని మసిచేసిరి. అంతట సింహాచలమునకుఁ జని యచట భార్యాసమేతులై రాయలవారు నరసింహస్వామిని

దర్శించి యాగ్రామమున నొకజయస్తంభమును స్థాపించిరి. అచటికి
నరసింహస్వామి కనేకాభరణములును మాన్యములును సమ
ర్పించి కొన్నిదినము లచటనే చతురంగబలసమేతుఁడై పర
భయంకర వైభవమును ప్రకటించుచు నాసింహాచలక్షేత్రమున
నుండెను.

విజయనగరపార్థివుని శౌర్యానిలములను తప్పించుకొని
పాఱిపోయిన గజపతిరాజులసైన్యములు తమప్రభువునకు
రాయలబలంబునుగూర్చియు యేనుంగులగుంపును గూర్చియు,
సుందరమైన తురంగసంఘములఁగూర్చియు విపులముగా చెప్పి
యుండిరి. అంతట గజపతిరాజును తనమంత్రులును ప్రతాప
వంతులగు పదునార్గురుపాత్రసామంతులఁనుకూడి దండువిడిసిన
రాయలబలమునుగూర్చియు తా మెదుర్కొనవలసిన విధమును
గూర్చియు మంతనముచేసియుండిరి. ఈసమావేశమునకు వచ్చిన
బలభద్రపాత్రుఁడు, దుర్గాపాత్రుఁడు, భీమపాత్రుఁడు, ముకుంద
పాత్రుఁడు, భీకరపాత్రుఁడు, భైరవపాత్రుఁడు, రణరంగ
పాత్రుఁడు, ఖడ్గాపాత్రుఁడు, ఆఖండలపాత్రుఁడు, మురారి
పాత్రుఁడు, వజ్రముష్టిపాత్రుఁడు, తురగరేవంతపాత్రుఁడు,
గజాంకుశపాత్రుఁడు,అసహాయపాత్రుఁడు,మృగేంద్రపాత్రుఁడు,
అశనీపాత్రుఁడు అను పదనార్గురుపాత్రసామంతులున్ను రణ
రంగోత్సాహ విభవరంజితమతులై గంభీరఘణితిని సభవారలెల్ల
సెబాసన శత్రునృపాలసంఘములను తొలంగఁజేతు మనియు, తగ
వువచ్చిన కర్ణాటులబారదోలి వారిబొక్కస భాండారములను
యేనుఁగుగుఱ్ఱాలును మొదటిదొరలను హస్తగతముచేసుకొని
వచ్చి రాజుగారిముం దుంచెద మనియు, యుద్ధరంగమందు

వేటాడుతునకలుగా నరికెదమనియు మదహస్తుల తొండములతో
కూడ కొమ్ములఖండించెద మనియు చెరకుల నరికినట్లు కాల్బల
మును వారి చేతులఖడ్గములను ఖండించెదమనియు మొదలుగాఁ
గల సాహసపరాక్రమములను గడు వేడుకతో బల్కినందున
జగన్నాథస్వామిపై భారమువేసి గజపతిరాజు రణసముత్సాహ
మనస్కుఁడై కృష్ణరాయనితో యుద్ధము చేయుటకు సన్నాహ
డయ్యెను. ఈవిషయమును ఆద్యంతములు రాయలవారి
స్థానాపతియగు కమలనాభయ్యవ్రాసి వేగర్ల చేత లేఖపంపినందున
విషయములనిన్నిటిని సమగ్రముగ విన్నవారై వైరిబలమును
గూర్చి తెలిసికొన్నవారై తమమంత్రియగు యప్పాజిపల్కులం
వినకపచ్చినందునగదా నిట్టిచిక్కులు వచ్చెనని తలంచి రొట్ట
కేలకు నీచిక్కునుండి బయల్పడు యుక్తికొఱకు తిరిగి తిమ్మరసు
మంత్రితో రహస్యముగా నాలోచనచేయుటకై వారిగుడార
మున కారాత్రి వెళ్లి వారిమాట చెవినిపెట్టక యింతదూరము
వచ్చినందులకు గలుగబోవుపరాభవమునకు తగ్గయుపాయ
మాలోచించవలసినదని రాయలవారు తిమ్మరసుమంత్రిని కోరి
యుండిరి. మంత్రియు కమలానాభయ్యనద్దనుండి వచ్చినలేఖను
పరికించి గజపతివారుచేసిన యాలోచనవలన తమకు ప్రాణ
హానిన్ని మానభంగమున్ను సంభవించు నని గట్టిగా తెలుసు
కొన్నవాఁడై రాయలతో సామదానభేదదండోపాయములలో
నిట్టియపాయములను తప్పించుకొనుటకు భేదదానములుకర్తవ్య
ములనియుదండసాధనకృతులసాధ్యములు కానిశత్రువులు దానము
వలన నాత్మవశులగుదురనియు, దానము శత్రువుల మిత్రుల
జేయుననియు మిత్రుల భృత్యులను జేయుననియు ఆమాసదుర్గ

భంబగుకార్యము భేదోపాయమున ననాయాసముగ ఘటించ వచ్చుననియు చెప్పి యీసమయమున భేదోపాయముచేత తమ యత్నమును జయింపగల్గుదుమనియు నందులకు ననర్ఘ్యములైన భూషణములను బహుమానమిచ్చి బెట్టి కార్యమును సాధించవలయు ననియు చెప్పిరి. అందులకు రాయలవారు సమ్మతించి వారి బొక్కసభాండారములను తిమ్మరసుమంత్రియాధీనము చేసి తాము తిరిగి తమ గుడారమునకుపోయిరి. తరువాత తమ కాప్తులగు అయ్యమరసు కొండమరసు రాయసంపీకమరసు అవసర లక్ష్మీ పతులతో నాలోచనచేసి గజపతిరాజునకు వారిపదునార్గురు సామంతపాత్రులకును భేదము కల్గించుట కొకఘనతరయుక్తి పన్ని యీ పదునార్గురపాత్రులపేరిట పదునారు త్తరములు వ్రాయించి యుత్తరములతో పదునారు పెట్టెలలో నాభరణము లను, వస్త్రముల నుంచి వీటిని భటులకిచ్చి పదునారు త్తరము లను పెట్టెలతోసహా పదునారుపాత్రులకును బంపియుండిరి. ఈయుత్తరమున వ్రాయబడినయంశము లిట్లుండెనని ధూర్జటికవి తన కృష్ణరాయవిజయమున నీక్రిందిపద్యమున పొందుపరచి యుండెను.

సీ. శ్రీమతుకర్ణాటసింహాసనాధ్యక్షుఁడగు కృష్ణరాయధరాధినాథు
డలపదారుగురుపాత్రులకు సంప్రీతిబంపిన సులేఖంబులు, మిమ్ము మనుప్ర
గజపతిరాష్ట్రదుర్గవిశేషములనుండి మెలపుగా బలికిన పలుకుబడుల
తీరు వ్రాసితిరి మీకోరినట్లనె ఘనాభరణదుకూలముల్ బంపినార

మట్లనె రేపు జగడాని కరుగుదెంచి
నట్లు చనుదెంచి మాచేతి కతని మీరు
పట్టియిచ్చిన యపుడె మీపట్ల మేము
కొదువపడకుండ నడిపించుకొనెద మెపుడు.

ఇట్టిజాబులను పదునారింటిని వ్రాసి పదునారుపెట్టెలలోనుంచి యాపెట్టెల పదునార్గురు పరిచారకులశిరస్సులపై నుంచి శత్రుసైన్యములలోనికిఁబోయి పాత్రసామంతుల కప్పగించి ప్రత్యుత్తరముల తెండని యాజ్ఞాపించెను. ఈపరిచారకులు శత్రుసైన్యమధ్యమునుండి పోవుచుండుట చూచి గజపతి రాజు వారలనుబట్టి తెప్పించి యాపెట్టెలను తెఱచి యందుండు నుత్తరములను జూచుకొని సామంతపాత్రులందరును పెద్దకుట్ర చేసిరనియు, తమ్మును రాయల కొప్పగింతు రనియు తలంచి రాజద్రోహము జరిగె నని గ్రహించి విభ్రమజెంది భయోత్పీడితుఁడై నమ్మినవారిచే మోసముజరిగెనని వేసరిల్లి రాయులథాటికి నిల్వనేరనని నిశ్చయించుకొని గజపతి త్వరితగతి నాదేశమునువదలి యతిదూరముగ నారాత్రియె వెడలిపోయెను. మఱునాఁడుదయమున నే పదునార్గురు పాత్రసామంత రాజులు తమసైన్యములతో నచటికివచ్చి జరిగినవిషయములను తెలిసికొని యాశ్చర్య నిమగ్నులై విభ్రాంతిజెంది చేయునది లేక నిరుత్సాహులై రాజాజ్ఞ లేనిదే యుద్ధముచేయుట కిచ్చగించక వచ్చినదారినే తమతమ స్వస్థలములను చేరుకొనిరి. ఇదియంతయు కనిపెట్టిన రాయమహేంద్రుఁడు త్రైలోక్యసామ్రాజ్య మబ్బినట్లు చతురంగబలసమేతుఁడై తత్పురంబు ప్రవేశించి యచట నొకజయస్తంభమును స్థాపించి ముందుకు జనక యచటనే తనసైన్యముతో నిలిచెను. తాము తమప్రతాపమును ప్రకటించుటకుమాత్రమే వచ్చితిమనియు రాజ్యకాంక్షచేత వచ్చియుండ లేదనియు, తాము వచ్చినపని పూర్తియైనందున ముందుకు సాగిరామనియు గజపతి వారిరాజ్యమునంతయు వారికే వదలి వెళ్లెద మనియు మొద

లయినవిషయములను తెలియజేయుచు కృష్ణదేవరాయలవారు గజపతిరాజు కొకయుత్తరమువ్రాసి వారికి నమ్మకమైనబంటుచే పంపియుండిరి. అందుపైన, గజపతిరాజును మొదట కొంత యనుమానించియు తుదకు సంశయమువదలి కొన్నికానుకలు గైకొని రాయలవద్దకు వచ్చెను. అట్లువచ్చినగజపతికి రాయ లెదురేగి గౌరవముగ కౌగిలింపుచు నెనరున గారవించి యుచితరీతిని సన్మానించి గజపతివారికి ననేకబహుమానసన్మానములను గావించిరి. అందులకు గజపతిరాజును తమకుమార్తె యగు జగన్మోహినిని పత్నిగాగైకొమ్మనివేడగా రాయలవారందుల కంగీకరించి యామెనువివాహమాడిరి. వివాహసమయమున తమకుమార్తెకు కృష్ణానదికి దక్షిణభాగముననుండెడి తమ దేశమునంతయు ప్రతాపరుద్రగజపతి కానుకగా నొసంగెను. అప్పాజిమంత్రికిని తదితరమంత్రిసముదాయమునకును తగిన సత్కారము చేయబడెను.అచటనుండి తిరిగి ముగ్గురుభార్యలతో కూడుకొన్నవాడై రాజమహేంద్రవరమునకు వచ్చి యచట గోదావరిపవిత్రక్షేత్రమున కొన్ని మహాదానములనుగావించి యచటనుండి విజయనగరము చేరుకొని వెంటనే యలమేలుమంగాపతి తిరుపతివెంకటేశ్వరస్వామిని సందర్శించుటకై భార్యాసమేతుడై తిరుపతికిపోయెను,అచట వెంకటేశ్వరస్వామికి నవరత్నఖచితమగు నొకబంగారుగొలుసు నిచ్చి దేవునిపైనుండి యున్న యానందనిలయ మను విమానమునకు బంగారుపూత పూయించుటకు ముప్పదివేలవరహాలను దానమిచ్చినట్లును మరి యనేకఇతరదానములను చేసినట్లును నాదేవస్థానమందున్న దానపత్రములవలన తెలియుచున్నది. ఈదానపత్రములయందు

ఈపై నవ్రాయబడిన కళింగ దేశదిగ్విజయయాత్రలోనిముఖ్యాంశ ములు వివరింపబడియున్నవి. దానపత్రములనుబట్టి యీదిగ్విజయయాత్ర 1517-వ సంవత్సరము 2-వ జనవరికి పూర్తియై యుండవచ్చు నని తెలియనగును. ఈసమయముననే కొండ పైన స్వామివారియాలయము లోపలికివెళ్లు కవాటమార్గము వద్ద కృష్ణదేవరాయలయొక్క రాతివిగ్రహమును నావిగ్రహ మున కిరుపైపుల తిరుమలాదేవి చిన్నాదేవివిగ్రహములను చెక్కించి స్థాపించియుండిరి. ఈవిగ్రహము లిప్పటికిని చూడ నగును. ఇచటనుండి దక్షిణదేశమునందలి పుణ్యక్షేత్రముల నన్నిటిని సందర్శించుచు కన్యాకుమారియగ్రమువరకునుపోయి యచటనుండి రామేశ్వరయాత్ర పూర్తిచేసికొని తిరిగి గోకర్ణ పర్వతమును జుట్టి యచట బృహదంబాసమేతముగ, గోకర్ణేశ్వ రునిసేవించి సుముహూర్తమున విద్యానగరప్రవేశమై విఠల విరూపాక్షులకు కానుకలనిచ్చి సుఖంబుగ తమ రాజధానియందు విద్యావ్యాసంగమున కాలముపుచ్చుచు లోకపూజ్యముగ రాజ్య మేలెను.

ఉత్తరదిగ్విజయయాత్ర ముగించినపిదప కొంతకాలము నకు రాయలవారు దక్షిణఆర్కాటుజిల్లాలో నుండియున్న కాటూరుగ్రామాధిపతిపైన యుద్ధముచేయుటకు సన్నాహము జరిపెను. ఈకాటూరధిపతికిని విజయనగరరాజులకును సుమారు రప్పటికినేబదిసంవత్సరములక్రిందనుండియు తగవులుగ నుండెను. వారిగర్వము నడంచుట కిదియే తరుణ మని రాయల వారు సైన్యమును తయారుచేసికొని యుద్ధమునకై బయలు వెడలిరి. ఈకాటూరునగరముచుట్టు నొక పెద్ద కాలువ

యుండెను. ఈయుద్ధము వర్షాకాలమునం దారంభించియుండు టచే నాకాలువలో చాల లోతుగ నీరుండెను. అందువలన సరా సరి కోటనుముట్టడించుటకు రాజులసేనలకు వీలు కల్గియుండ లేదు. అద్దాన నీటిని కాలువనుండి బయటికి వెళ్లగొట్టుట కీకాలువనుండి కొన్ని పిల్లకాల్వలను త్రవ్వించి యానీటిని వెలికి పార్చి కోటను ముట్టడించి కోటను సంరక్షించుచున్న లక్ష కాల్బలముతోను మూడువేలయశ్వబలముతోను మిక్కిలి పరా క్రమముతో బోరాడి కోటను పట్టుకొనిరి. ఆకోటయందున్న వారిని చాలమందిసైనికులను చంపివైచిరి. కోటయందు ద్రవ్యము, బంగారము, నగలు మొదలైన విలువగలసామానం తయు తాము సంగ్రహించిరి. అచట దొరకినగుఱ్ఱములను యేనుగు లను తమసైన్యమున చేర్చుకొనిరి. ఇచట సంగ్రహింపబడిన ద్రవ్యమునంతను తమసైన్యాధిపతులకు పంచి వారిని బహూక రించిరి. కాటూరునగరాధిపతిని బందీగా విజయనగరమునకు కొనిపోఁగా నాతఁడు కారాగృహమునందే చనిపోయెను.

ఈకాటూరుముట్టడి పూర్తికాఁగానే తిమ్మరసుమంత్రిని కొండవీటికంపి యచట చెలరేగియున్న కొన్ని చిన్నచిన్నకలత లను సర్దుబాటుచేయించెను. ఆకలతల నణచుటలో దొరకిన యపారమైనద్రవ్యము నశ్వములు నేనుగులు విజయనగరమునకు బంపబడెను. కొండవీడును సర్దుబాటు జేసినపిమ్మట తిమ్మరసు మంత్రియు విజయనగరము చేరుకొనగా రాయలవారు మంత్రిని మహాసభలో సన్మానముచేసి తగురీతిని వారికి మర్యాదచేసిరి.

## 8. రాయచూరుదండయాత్ర

రాయలవారు తమయద్భుతబలపరాక్రమములచే బ్రతాపరుద్రుని గర్వభంగముగావించి నాలుగైదేండ్లవరకును చిల్లర కలతలను సర్దుకొనుచు విద్యావ్యాసంగములతో కాలము బుచ్చుచుండిరి. కాని వీరిమనసునందుమాత్రము సాలువ నరసింహరాజు కాగితములలో దొరకినదానియందు వ్రాయబడిన రాయచూరును జయింపవలెననెడి యభిలాషమాత్రము బాధించుచునే యుండెను. అట్టికాల మిపు డాసన్నమైన దని గ్రహించి తమయభిలాషను నెఱవేర్చుకొనవలెనని యిప్పుడు పట్టుపట్టిరి. ఈకాలమున దక్షిణదేశములోనెల్ల బలాఢ్యమగు దుర్గములలో రాయచూరుదుర్గ మొకటియై యున్నది. ఈరాయచూరుగ్రామమున కిరుప్రక్కల రెండునదు లుండెను. ఇచటి కోట కొండపైన సురక్షితముగ కట్టబడియుండెను. ఈకోటను పట్టుకొనవలెనని తనకు పూర్వు లెందరో ప్రయత్నించియుండిరి గాని వారెల్లరును పోరాటమునందు విజయమును పొందరైరి. ఈకోటను పట్టుకొని జయింపవలెననెడికుతూహలము తనకు మెండుగనుండియు నాదుర్గమునకు రాజైన బీజపురసుల్తానదిల్ షాహా తనకు స్నేహబృందములోనివాడగుటవలన కారణము లేకయే కయ్యము గల్గించుకొనుట యుక్తముకాదని తెలిసికొని యేదేని యొకకారణమును సృష్టింపయత్నించుచుండెను. చిరకాలముక్రిందట విజయనగరమువారికిని బీజపూరుసుల్తానునకును జరిగినసంధిషరతులను వితర్కించిచూడ నొకరాజ్యమునుండి యింకొకరాజ్యమునకు కుట్రపన్నెడివారుగాని సొమ్ము నపహ

రించినవారుగాని దుష్టులుగాని పోయినచో అట్టివారికి రెండవ రాజ్యమువారు ఆశ్రయమివ్వగూడదని యొకషరతుదొర కెను. ఆషరతు ననుసరించి యిపుడు కొంత కయ్యమును కల్పించుకొనుటకు రాయలవారికి సందుదొరకెను. సయ్యదు మిార్కా రని యొకగుత్తపువర్తకుఁడు విజయనగరరాజులవద్ద నశ్వములసరఫరాచేయుటకు నలువదివేలబంగారు నాణెములు పుచ్చుకొనియుండెను. ఇదివరలో నీమర్కారనేకపర్యాయము లిట్లు పైకమును తీసికొనుటయు గుత్తముల నాధరకు నప్పగించు టయునాచారముగ నుండెను. అట్లే యిపుడును తీసికొని చెప్పిన ప్రకారము గోవాలో గుఱ్ఱములను కొనక వారిదేశస్థులగు మూర్లుండెడి పొమాడా యనెడిగ్రామమునకు బోయి యచట నుండి గోవానగరమునకు బోవుటకు బదులుగా నీద్రవ్యము నంతను తీసికొని అదిలషాహ యున్నగ్రామమునకుబోయెను. ఈ పని యదిల్షాహా ప్రేరణమిాద జరిగెనని కొందరు చెప్పుదురుగాని యిది నిజమైనను కాకున్నను నట్టివానికి అదిల్షాహ యాశ్రయమి చ్చుటమాత్రము సరియైనది కాదు. ఈవిషయము నాధారపరచు కొని రాయలవారీసయ్యదుమర్కారును తమస్వాధీనముచేయు మని యదిల్షాహా గారిని కోరుటకు నవకాశము దొరికెను. అందు పైన తమకును యదిల్షాహాకును చిరకాలమునుండి యుండిన స్నేహమును సైదుమర్కారుచేసినద్రోహమును హెచ్చరించుచు నాస్వామిద్రోహముచేసిన టక్కరితనము క్షమింపతగినది కాద నియు నట్టివానికి యదిల్షాహ యాశ్రయమిచ్చుట తగదనియు చిరకాలగతమైన స్నేహ మొకద్రోహముచే భంగపడునుగాన పూర్వస్నేహమును దలచి యాస్వామిద్రోహిని డబ్బుతోసహా

తిరిగిపంపవలె ననియు కోరుచు నొకయుత్తరమును రాయలవారదిల్షాహాకు బంపిరి. ఈయుత్తరము వచ్చినంతనే తమవద్దనున్న కాజీలను సమకూర్చి యొకసభగావించి యీవిషయమై వారితో యదిల్షాహా సంప్రతించగా వారందరు సీసైదు మిక్కిలి విద్వాంసుడనియు పవిత్రమహమ్మదీయుడనియు వానిని రాయలవారి కప్పగింతపెట్టుట శ్రేయస్కరముకాదని సలహానిచ్చినందున సైదుమర్కారను తనవద్దనుండి డాబూలుగ్రామమునకు బంపి సైదుమర్కారు తనవద్దలేడని ప్రత్యుత్తరము బంపెను. సైదుమర్కారున్ను డాబూలునుం డెచటికో పలాయనమాయెను.

అదిల్షాహా వ్రాసినయుత్తరము చేరినంతనే రాయలవారు రోషపూరితులై తమయాలోచనసభను సమావేశపరచి స్వామిద్రోహికాశ్రయమిచ్చుటచే తమకును బీజపూరుసుల్తానుకును జరిగిన సంధిషరతులు భగ్నమయినట్లుగ నెంచ తగియున్నదనియు నింక నెట్టి యాలస్యముగాని యాలోచనగాని చేయకయే యుద్ధసన్నద్ధులగుటయే యిట్టిసందర్భములలో సరియైనపరిహారమనియు నొక్కివక్కాణించెను. కాని సమావేశమైనసభికులుమాత్ర మట్లుచేయుట యాక్షేపణీయ మనియు నింత చిన్నకారణమును పురస్కరించుకొని యుద్ధముచేయుట తగదనియు లోకము మెచ్చదనియు, ప్రపంచమునందందరు పరిహాసింతు రనియు ననేకవిధముల రాయలవారికి నచ్చజెప్ప ప్రయత్నించిరి కాని వారి ప్రయత్నములన్నియు విఫలములాయెను. రాయలవారు తమపట్టుదలను వదలరైరి. వారికి రాచూరును ముట్టడించి తిరిగి రాచూరును తమ రాజ్యములోనికి జేర్చుకొనవలెనను కాంక్షను ప్రతిఘటింపజాలక యెవరెంత చెప్పినను విన

రైరి. దానింబట్టి సభికులెల్లరును రాయలవారిని సరాసరి రాచూరువద్దకే చని రాచూరునే ముట్టడించుటకు పురికొల్పిరి. అంత రాయలవారును నీసలహా నంగీకరించి రాచూరు యుద్ధమునకు సంసిద్ధులైరి. అంతటి బలాఢ్యముగుకోటను వశపరుచుకొనుటవలన దనకు గలుగులాభమును యశస్సును, తేజమును దలచుకొని యుద్ధమునకై తనమనస్సును బురికొలిపి తన నిర్దోషిత్వమును వెల్లడింప రాయచూరుపై దండువెడల నిశ్చయించుకొనిరి.

అప్పటికి బీజపూరుసుల్తానుకును మిగతమహమ్మదీయ రాజులకు బీడరుసుల్తానుకు, బీరారుసుల్తానుకును నిజాముషాకును కొంత మనస్పర్థలు కలిగియుండెను. ఆసంగతిని తెలిసియున్న రాయలవారు తాము బీజపూరుసుల్తానుతో యుద్ధము చేయబోవుచుంటిమని తెలియజేసిరి. బీడరు, బీరారుసుల్తానులు వీరి నాశీర్వదించిరి. నిజాముషామాత్రము తనచెల్లెలిని అదిల్షాహాకి వివాహముచేసినందునమాత్రము రాయల కేమియు జబాబివ్వలేదు.

ఈయుద్ధమునకు బయలుదేరకపూర్వము దేవబ్రాహ్మణులపిలిపించి తమయధిష్ఠానదేవతలపూజలుగావించి బ్రాహ్మణుల సన్మానించి మ్రొక్కుబడులు పూర్తిగావించి శుభముహూర్తమునునిశ్చయించుకొనిశకునముల జూచి చతురంగబలోపేతుడై యుద్ధమునకు రాయలవారు బయలుదేరిరి. ఇట్లు బయలు దేరుటకు పూర్వమే యచటిసంగతులను ముస్ముందు కనుగొనుటకై పదివేలకాల్బలముతో నొకదండనాయకుడు రాయచూరు ప్రాంతమునకు బంపబడెను. తరువాత మరునాడుదయమున

బ్రాహ్మణులచే నియోగింపఁబడిన శుభముహూర్తము నాయ కులయాజమాన్యమున నొకరివెనుక నొకరు చతురంగబలసమే తులై చూపరులకు నద్భుతంబు జనింప మహావైభముతో బయ ల్వెడలిరి. కామానాయకుఁడను దండనాయకుని యాధిపత్య మున ముప్పదివేలకాల్బలముతోను తుపాకులతోను విండ్ల తోను వేయిగుఱ్ఱములతోను పదునారుమదపుటేనుఁగులతోను గూడి ముందు నడచుచుండెను. వీరివెంటనే యేబదివేలకాల్బ లముతోడను రెండువేలగుఱ్ఱములతోను ఇరువదియేనుంగుల తోను తిరుమలనాయకుడు వెళ్లుచుండెను. వారివెంబడి యిరువది వేల కాల్బలముఁలతోను మూడువేల అయిదువందల గుఱ్ఱము లతో ముప్పదిగజములతో తిమ్మానాయకుడును వారివెంట జనుచుండెను. ఇట్లే ఒకదళము ననుసరించి యింకొకదళముపోవు చుండ రాయలవారిసైన్యమంతయు యుద్ధముఁనకు బయలు దేరెను. అట్లు బయలువెడలిన సైన్యమునకు భూవరకోటిలోని వాఁడును ఘనదోర్వీర్యప్రభావుఁడును యుద్ధములయందును స్వామికార్యనిర్వహణముఁనందును విఖ్యాఁడును పెమ్మసానికుల చంద్రుఁడునగు రామలింగనాయకుఁడు సేనాధిపత్యమువహిం చెను. ఇట్లు బయల్వెడలినరాయలసైన్యము సమకాలికులలెక్క లనుబట్టి అంసఖ్యాకములై యుండెను.

న్యూనిజుచరిత్రకారుఁడు వ్రాసినలెక్కప్రకార మీా యుద్ధమునందురాయలవారివెంట నేడులక్షలమూఁడువేలకాల్బ లమును ముప్పదిరెండువేల ఆరువందలగుఱ్ఱములును అయిదు వందలయేబదియొక్కయేనుఁగులు నుండెను. వీరుగాక సైన్య సేవకు లెందరో యుండిరి. ఇంత పెద్దసైన్యబల ముండెనా యని·

మన మెంతమాత్ర మద్భుతపడనక్కరలేదు. మనదేశమున నిందపెద్దసైన్యముండుట అన్నికాలములలోను సహజమేనని మనకు చరిత్రవలన తెలియుచునేయున్నది.

ఈవిజయనగరసైన్యమునుగూర్చి వ్రాయుచు బారాసను నొకచరిత్రకారుఁడీరాజులసైన్యమునకు ధనమునకును మితిలేదని వ్రాసియుండిరి. స్కాటను నింకొకచరిత్రకారుఁడు డక్కను దేశపుచరిత్రను వ్రాయుచు ఔరంగజేబునవాబు రాజ్యము చేయుకాలమున దల్పతురాయను నధికారివద్ద పనిచేసిన బొందెలయధికారి దినచర్యనుగూర్చి వ్రాయుచు విజయనగర రాజులు తమమహోన్నతదశయందు ముప్పదివేలగుఱ్ఱములను పదిలక్షలకాల్బలమును కలిగియుండిరనియు వారిసంపద అనిర్వచనీయమనియు వ్రాసియుండెను. కాంటియను నింకొకచరిత్ర కారుఁడు విజయనగరరాజులసైన్యమును గూర్చి వ్రాయుచు "పదిలక్షలకు" పైననే వీరికాల్బలముండెనని వ్రాసియుండెను. అబ్దుర్రజాకను నింకొకచరిత్రకారుఁడు వీరికాల్బలము పదునొకండులక్షలనియు, 1100 యేనుంగులనియు వ్రాసియుండెను. ఇట్టివే చరిత్రలో యనేకదృష్టాంతరములు కలవు. గ్రీసుదేశము నుండి క్రైస్తుకు పూర్వము 320 సంవత్సరములకంటె అలెగ్జాండరను రాజు హిందూదేశముపై దండువెడలినపుడు మగధ రాజ్యపుసేనయందు 16 లక్షలకాల్బలమును ముప్పదివేల గుఱ్ఱములును తొమ్మిదివేలయేనుఁగులును ఉన్న ట్లూహింపబడినది.

1192-వ సంవత్సరమున మహమ్మదీయు లుత్తరహిందూస్థానముపై దండయాత్రకు వెడలినసందర్భములో ఉత్తర

హిందూస్థానమునందలి రాజ్యములు మూఁడులక్షలగుఱ్ఱము లను మూఁడువేలయేనుఁగులును వీటికి తగినకాల్బలమును దేశ రక్షణకై సమకూర్పబడినవని Hand Book of Indian Army అనుపుస్తకములో లార్డెగర్టనువారు వ్రాసియుండిరి. ఇట్లే అనేకయుదాహరణ లివ్వవచ్చును.

ఇట్లు బయలు దేరివచ్చిన రాయలసైన్యమునందలి మూరు వంశీయులను కమ్మనాయకునియాధిపత్యమున రాచూరుచుట్టు నుండు కందకములవద్దకు రాచూరుముట్టడించుటకై రాయల వారు పయనముచేసిరి. రాచూరికోటలో సురక్షితముగనున్న సైనికులందరును రాయలవారిసైన్యముపైన ఫిరంగులను కాల్చిరి. వారిఫిరంగిదెబ్బలకు తట్టుకోనలేక నీరాయలసైన్య ములో చాలమంది హతులైరి మిగిలినవారు వెనుకదిరిగి పారి పోవయత్నించిరికాని రాయలవా రట్లుచేయుట కంగీకరించక వారిని పోరాటమునకై పురిగొల్పిరి. ఈసేన యెంతగంభీరము గను ధైర్యముగను పోరాడినను లాభము కనుపడలేదు. వీరు చురుకుగ పనిచేయుటకై రాచూరుకోటగోడలోని రాళ్లనూడ పెరుకుటకై సైన్యమునకు బహుమానము లిచ్చెదమనిరి. ఒక్కొక్క రాతికి ముప్పయి నలుబయి యేబయి పణములిచ్చెదమనిరి. ఈ రీతిగ నీసైనికులకు ప్రోత్సాహముకలిగించి కోటగోడనుండి రాళ్లనూడ పెరికించిరి. అట్లు చేయుటవలన కోటబలహీనమై గ్రామమును ముట్టడించుటకు సులభసాధ్యమాయెను, కాని కోటలోనివారు సురక్షితములైన స్థలములలోనుండి పోరాడు చున్నందున రాయలసైన్యముపై నవలిలగ పోరాడుటకు మొదలుపెట్టిరి. ఇరుపక్షములవారు నీరీతిగ ధైర్యముతో

పోరాడుటవలన నీముట్టడి మూఁడుమాసములవరకు జరుగుచూ వచ్చెను.

రాచూరు గ్రామమున కిరుప్రక్కల నుత్తరదక్షిణములుగ రెండునదులు కృష్ణయు తుంగభద్రయునుండెను. ఈనదులమధ్య రాయచూరు గ్రామముకోటయు తూర్పుపడమరల పెద్దమైదానమును నుండెను. కోటకు ఉత్తరదక్షిణముల కొండ లుండెను. కోటచుట్టు దట్టమైన రాతిగోడ లుండెను. రాతిగోడలు మట్టితో పూరించఁబడియుండెను. గ్రామమంతయు నీకోటగోడలమధ్య నుండెను. కోటలో నీరు సమృద్ధిగనుండెను. తినుబండారములు దాదా పయిదుసంవత్సరములకు సరిపోవునట్లు ప్రోగుచేసియుంచబడెను. తుంగభద్రానదీతీరమునసుండియు దక్షిణమున నున్న దేశమంతయు రాయలవారిరాజ్యములోనిది. కృష్ణానదికి ఉత్తరమునసున్న దేశమంతయు ఆదిల్షాహా దేశములోనిది. రాయలవారిసైన్యము రాయచూరుముట్టడికి బయలుదేరిన వెంటనే ఆదిల్షాహావద్దనుండి కొంతసైన్యమునున్న సేనానియు రాయచూరునకు పంపబడెను. వారు కోటలోనికి ప్రవేశించిన పిమ్మట కోటద్వారములన్నియు మూసివేయుబడెను. రాయలవారిసైన్యము కోటకు నుత్తరభాగమున తమస్థావర మేర్పరచుకొని కోటను ముట్టడించిరి. పెద్దమైదాన మొకగొప్పసుప్రసిద్ధపట్టణమువలెనుండెను. రాయచూరుకోట కొంతదూరములో రాజుగారు విడిసేయుగుడారము వేయబడెను. ఈగుడారమునకు వెనుకప్రక్కన మనుష్యులు చొరరాని దట్టమయిన ముళ్లకంప స్థాపింపఁబడెను. ఈగుడారములో రాజుగారి యధిష్ఠానదేవతయు నాదేవతను పూజచేయుటకు బ్రాహ్మణులును రాజు

గారిముఖ్యమంత్రులును, రాజుగారిముఖ్యస్నేహితులు నుండిరి గుడారమునకు బయట ననేకులు రక్షకభటు లుండిరి. అచటి కనతి దూరముననే సేనాధిపతులు వారిసైన్యము బారులుతీర్చి చిన్న చిన్న గ్రామములుగ నేర్పాటుచేయబడెను. ఆమైదానమునందు పెద్దపెద్దబాట లేర్పాటుచేయబడి బాటలకిరుప్రక్కల వర్తకులు తమతమసరకులు విక్రయించుట కేర్పాటుచేయబడెను. అచట విక్రయింపబడువస్తువులకు మితిలేదు. ఈజనమున కవసరముగు ముఖ్యపదార్థములు బియ్యము, పప్పులు, కూరలు, పాలు పెరుగు మొదలయినవి కూ, సామాన్యమైనబట్టలు, పట్టుదుకూలములు, చీరెలు విక్రయింపబడుచుండెను, ఇంకొకచోట, నగలు, నాణ్యములు, బంగారువెండివస్తువులు విక్రయింపబడు చుండెను. ఇచటనే రవ్వలు, కెంపులు, కూడ దొరికెడివి. పశువులు గుఱ్ఱములు మొదలయినవాని కవసరముగుగడ్డి యితర వస్తువు లింకొకచోట నేర్పాటుచేయబడెను. ఆటలాడువారు పాటపాడువారు వినోదముచేయువారు వారివారిపనులు చాతుర్యముతో చూపుచుండిరి. పైనుండివచ్చినవారు చూచిన నీస్థావరము యుద్ధసన్నాహమునకై చేయబడినస్థావరముగ ఊహించుట కెంతమాత్రమును వీలులేదు. చూపరుల కిది యొక ప్రసిద్ధనగరముగ గాన్పించుచుండెను. యుద్ధము ప్రారంభించుటకు పూర్వము శంఖములు, బాజాలు వాద్యములు మోగింపబడెను.

ఆదిల్షాహ సన్నాహము

ఈమైదానమునందు రాయలవారు తమకును తమసైన్యమునకును ఆశ్రయమేర్పరచుకొని రాచూరుకోటను తముసము

క్షమునకే ముట్టడించిన యేర్పాటుచేత తమసైన్యము లతిధైర్య ముతో నత్యుత్సాహముతో పోరాడుచుండ రాము చెంతనే యుండి తమసైన్యము నుత్సహించుచు ప్రోత్సహించుచుండ దాదాపు మూడునెలలు గడచెను. అప్పటికి యుద్ధ మింకను ప్రారంభదశయందే యుండెను. అప్పటికి ఆదిల్షాహా తనసైన్య ముతో ఫిరంగులతో తుపాకులతో వచ్చి యుత్తరమున కృష్ణా నదితీరమున విడిసెను. ఇట్లువచ్చిన ఆదిల్షాహాసైన్యమునుగూర్చి వారినడవడులగూర్చియు కనిపెట్టుటకు రాయలవారు తమ వేగరివాండ్రను బంపి సంగతులను రహస్యముగ తెలిసికొనుచుండిరి. ఆదిల్షాహాసేన నదీతీరమున కొన్నిరోజు లుండెను. తాను వచ్చినవెంటనే రాయలవారు తమసైన్యముతో పోరాడతలపడుదురని సుల్తానూహించెను. కాని రాయలవా రట్లుచేయకుండుటవలన కొంతయాశ్చర్యముచెంది తనరహస్య ఆలోచనసభను సమావేశపరచెను. సభికులతో నీవిషయమై సల హానుపొందెను. సమావేశమైనసభికులలో కొందరు రాయల ప్రవర్తన తమ్మలక్ష్యముచేసినట్లును, తమ్ము పరిభవించునట్లును తలచిరి. అట్లు తలచినవారిలో పామూదాసేనానాయకుడగు అంకుస్ఖాను ముఖ్యుడు. వీరితో నేకీభవించినవారు హెచ్చుగ నున్నందున వీరందరు కృష్ణానదినిదాటి రాయలవారిసైన్య ముతో పోరాడుటయే మంచి దని ప్రకటించిరి. ఈయభిప్రాయము నందరు సరియైన దని ప్రకటించిరి. అందుపైన ఆదిల్షాహా తన సైన్యమునంత నొకచోటికి రప్పించెను. అట్లు రప్పించినవారిలో కాల్బలము, తుపాకులవారు, ఫిరంగులవారు, యీటెలవారు, కత్తులవారు మొత్తముమీద లక్షయిరువదివేలమంది యుండిరి.

వీరు గాక పదునెనిమిదివేలగుఱ్ఱపుదళమును నూటయేబదియేను
గులు నుండియుండెను. ఈసమావేశమైన సైన్యమును తను
చూచి సంతోషాంతరంగితుఁడై ఈసైన్యబలమువలనను తన
వద్దనున్న తుపాకులబలమునను రాయలవారిని గెల్వవచ్చు నని
ధైర్యముకల్గియుండెను. అందువలన తనసైన్యమునంతయు నదిని
దాటి అద్దరినున్న రాయలసైన్యముతో యుద్ధముచేయుట
కాజ్ఞాపించెను. అట్లు యుద్ధము చేయుటవలన రాయలసైన్యము
నోడింపగలమనియు రాయచూరును రక్షింపగల్గుదుమనియు అభి
లాష తలచియుండెను.

ఇట్లాశాపూరితుఁడై తానును తనసైన్యముతో కృష్ణా
నదిని దాటి రాయలవారిసైన్యమున కారుమైళ్లదూరమున
కృష్ణానదీతీరముననే తనసైన్యస్థానము నేర్పరచుకొని కందక
ములు మొదలయినరక్షణకార్యముల తయారుచేయుచు ప్రతి
నిమిషము యుద్ధారంభమును అభిలాష నిరీక్షించుచుండెను.

### యుద్ధము

ఈవిషయముల నన్నిటిని వేగరులవలన తెలిసికొనిన
వాఁడై రాయలు తనసైన్యమును యుద్ధమునకు సిద్ధముగ నుండు
న ట్లేర్పాటులు గావించి శత్రువులుచేయు పనులను గమనిం
చుచు తయారుగ నుండున ట్లాజ్ఞాపించెను. శత్రుసైన్యము
తమస్థానమును బలపరచుకొన్నసంగతి తెలిసినంతనే తమసైన్య
మును ముందుకునడుపవలె నని రాయలవా రుత్తరువిచ్చిరి. తమ
సైన్యము నేడుభాగములుగ విభజించిరి. శ్రీరాయలవారి
మామగారును శ్రీరంగపట్టణాధీశుఁడు నగు కుమారవీరయ్య
గారు తాము ముందుండుట కనుజ్ఞ వేడిరి. వీరితోపాటు తమ

పుత్రులను ముప్పదిమందిని యుద్ధమునకు తయారుచేసి తమ వెంట తీసికొనివచ్చిరి. రాయలవారును వీరయ్యగారిని తమసైన్యమును ఆదిల్షాహాకు రెండు మైళ్లదూరమున తమ స్థావర మేర్పరచుకొని యుద్ధమునకు సిద్ధముగనుండుడనిరి. రాయలవారు తామే శత్రుసైన్యముతో యుద్ధముచేయుటకు సిద్ధపడిరి. కాని ఆనాడు శుక్రవారమగుటచేత రాయలసలహా దారులు యుద్ధచేయుట కానాడు శుభసూచకముగా దనియు మఱునాటివరకు యుద్ధము నాపుదలచేయవలయుననియు కోరిరి. ఉభయపక్షములవారును నొకరినొకరు కాపలాకాయుచు యుద్ధసన్నద్ధులై సాయుధహస్తులై యేక్షణమున కేమి సంభవించునో యని కాచుకొని యతిజాగరూకులై వేచియుండిరే కాని యెవరును ముందంజవేయలేదు. అట్లే శుక్రవారమంతయు గడచిపోయెను. శనివారము ఉషఃకాలము సమీపింపగానే ఢంకాదెబ్బలు, మృదంగవాద్యము, జనులకోలాహలము, గుఱ్ఱముల సకిలింపులు, ఏనుగుల ఘీంకారములు, శంఖారావములు మొదలయినశబ్దజాలమువలన భయంకరమైనస్థితి యేర్పడినట్లు తెలియవచ్చెను. ఈశబ్దముయొక్క గభీరతవలన మిన్నుమన్ను ముట్టునా యనుభీతి యచటివారికి గల్గెను. ఇంతలో తెల్లవారెను. రాయలవారు తమబలమునంతను ముందుకు నడిపించుకొని తీసికొనివెళ్లునప్పటికి సూర్యోదయమైన నాల్గు గడియలు దాటెను. అంత నిరుపక్షములవారు యుద్ధమునకు సంఘటిల్లిరి. ముందరనున్న రాయల సైన్యము పురోగమించి తురుష్కసైన్యమును ఢీకొని వారిలో ననేకుల జంపిరి. అంత వరకు రాయలవారువత్తు రని తనసైన్యముతో కనిపెట్టుకొని

యున్న ఆదిల్షాహా తన ముందున్న సైన్యము పడిపోవుటజూచి తనసైన్యమునంతను ముందుకు జని దొరికినవారిని దొరికినట్లుగ నరుకుట కాజ్ఞ నిచ్చెను. శత్రుసైన్యముయొక్క ధాటితీవ్రతకు తాళజాలక రాయలవారిసైన్యములో ననేకులు యుద్ధరంగమునందే పడిసిరి. మిగిలినవారు వెనుదిరిగి పారిపోవఁజూచిరి. వీరిని వెన్నంటి తురుష్కసైన్యము ముందుకు రాజొచ్చెను. ఇట్టి దుస్థితిని జూచి నిర్వేరపడి ధైర్యమువహించి పారిపోవువారల కట్లుజనుట వీరులకు తగదనియు నట్లుచేసినచో తానే వారల జంపింతు నని భయపెట్టి తానుసైన్యాధిపత్యము స్వయముగ వహించి తురంగమును నెక్కెను. అట్లశ్వారూఢుఁడగునపుడు తన వ్రేలియుంగరమునుదీసి తనబంటులలో నొకనికిచ్చి తాను యుద్ధమున జనిపోవుట తటస్థించినచో నీయుంగరమును తనభార్యలకు చూపి వారును సంప్రదాయానుసారముగ చితినెక్కవలసినదనియు జెప్పిరి. ఆసమయమున ధైర్యమువహించి తన వెంటనున్న సైన్యమునంతకును ధైర్యము చెప్పి శత్రురాజు యుద్ధమున రాయలు చచ్చినట్లు చెప్పుకొనవలసినదేగాని లొంగిపోయెనను వార్త చెప్పుకొనుటకు వీలుకల్గనీయనని చెప్పి తన సైన్యమంతటితో ముందు కురికెను. ఇట్లు రాయలవారు సాహసించి ముందుకుజనుచుండ వెనుదిరిగి పారిపోవ నుంకించియున్న వారందరు లజ్జాళువులై యుద్ధమున జచ్చిన వీరస్వర్గము జేరగల మని ధైర్యమువహించి తాము ను ముందడుగిడి శౌర్యధైర్యములతో యుద్ధముచేయుటకు ప్రారంభించి శత్రుసైన్యమును తుదముట్టింప యత్నించిరి. వీరెల్లరు

నొక్కిపట్టి శత్రుసైన్యముపై బడి తునుమాడి వారికి పరాభవముగావించిరి. వీరిప్రతాపాగ్ని శౌర్యజ్వాలకు తురుష్క సైన్యము భయవిభ్రాంతులై చేయునది లేక సంక్షుభితులైరి. వీరిలో కొందరు పారిపోవలయు నని వెనుదిరిగి కృష్ణనీటిలోపడి చనిపోయిరి. శత్రుసైన్యము వెనుదిరిగినంతనే రాయలసైన్యము గజములతో ముందుకుజని పారిపోయెడి తురుష్కుల వెన్నంటిరి. వీరియేనుగులు తురష్కసైనికులను తమతొండములతో బట్టుకొని చుట్టచుట్టి నేలకొట్టెను. మరికొన్ని వారిని చీల్చివైచెను. ఇట్లే తురుష్కసైన్యమంతయు చెల్లాచెదరాయెను. యుద్ధమునందు పోరాడుచున్న సైనికులేగాక యనేకులు స్త్రీలు పిల్లలు పడిసిరి. అనేకు లార్తనాదముల జేయుచుండిరి. ఇది యంతయు జూచుచున్న రాయలవారు దాక్షిణ్యము వహించి తమసైనికుల నాగు డని యనుజ్ఞనిచ్చిరి. ఆదిల్షాహ యేనుగునెక్కి పారిపోయెను. రాయలవారు కృష్ణదాటి అదిల్షాహ తనకై యేర్పరచుకొన్న సురక్షితమైన గుడారమున కొంచెము విశ్రాంతిదీసికొన ప్రారంభించెను. రాయల అనుయాయులుమాత్ర మిందుల కంగీకరింపక తురుష్కసైన్యమును వెంటాడి ఒకరైనను లేకుండునట్లు చంపవలె ననిరి. అందులకు రాయ లియ్యకొనక పురోగమన మాపవలయు ననియు ఆదిల్షాహకు తగినపరాభవమును తమకుదిగ్విజయమును కలిగెననియు, వెనుదిరిగి రాచూరుకోటను పట్టుకొనవలయునన్న యాశయము నెరవేర్పవలయు ననియు జెప్పిరి.

*

## 9. రాయలవిజయములలాభనష్టములు

ఆదిల్షాహా యేర్పాటుచేసికొనియున్న శిబిరమున కృష్ణ రాయల కనంతమైన ద్రవ్యము తిరుబండారములు గుఱ్ఱములు నేనుగులు దొరికెను. వీరి కచట ఆర్నజాగుఱ్ఱములు నాల్గువేలం మూరేన్గులు నాల్గువందలఫిరంగులు యీఫిరంగులనడిపించు టకు తొమ్మిదివందలబండ్లు, గుడారములు మొదలుగాగలవి. దొరకెను. ఇవిగాక పశువులు ఎద్దులు అనేకములు దొరికెను. పిల్లలు ఆడువాండ్రు అనేకు లచట పట్టుకొనఁ బడిరి. అయితే యుద్ధానంతర మా స్త్రీలును పిల్లలును వదిలివేయబడిరి.

ఈ యుద్ధమున చనిపోయినరాయలసైనికుల మొత్తము పదునారువేలు. వీరికందరికిని తగుమర్యాదలతో దహనసంస్కార ములుచేసి వారియాత్మలకు ప్రీతికలుగుటకు తగినధర్మములు గావించి యచటనుండి తిరిగి రాచూరుముట్టడికై వెల్లిరి.

### రాయచూరు ముట్టడి - సలబత్ఖాను

ఈవంగమును పూర్తిగావింపక పూర్వ మొకతురుష్క సేనానియొక్క శౌర్యప్రతాపములనుగూర్చి కొంచెము ముచ్చ టింప నలసియున్నది. ఆదిల్షాహాయొక్క ముఖ్యరక్షకుఁడుగ సలబత్ఖా నను సరదా రుండెను. అతఁడు సుల్తానురక్షణకై అయిదువందలపోర్చుగీసుసైనికలతో వారివద్దనుండెను. సుల్తాను పారిపోయినంతనే సైనికులెల్లరు వెనుదిరిగి పారిపోవుచుండ నీసైన్యాధ్యక్షుఁడు వారినందరిని పోగుచేసి రాయలవారితో పోరాడ నుంకించెను. కాని సైనికులెల్లరు తమ్మురక్షించు కొనుమార్గమును చూచికొనిరి గాని యుద్ధముఁజేయుట కిష్టపడ

రైరి. ఇట్టిస్థితిలో తానును తనవెంటనున్న పోర్చుగీసుసైనికులును రాయలచే బందీలుగ పట్టుబడగలమని యధైర్యముతోడ తానును తనవద్దనున్న పోర్చుగీసువారును రాయలసైన్యము లోనికి దుమికి రాయలసైనికుల ననేకులచంపి కొద్దికాలము తాండవమాడెను. వీరట్లు త్రోసికొనివచ్చుటలో దాదాపు రాయలవాసందు స్థలమువరకు వచ్చియుండిరి. ఈభీభత్స మంతయు నొకత్రుటికాలములో జరిగెను. ఆసమయమున రాయలవారి అంగరక్షకులలో నెవ్వరో నీవీరుని గుఱ్ఱమును జంపివేసిరి. గుఱ్ఱము చచ్చినంతనే తురుష్కసైన్యాధ్యక్షుని వెంటనున్న పోర్చుగీసువారు వీరావేశులై అచటిరాయలసైనికుల విచక్షణలేకయే యనేకుల వధించి మిగిలినవారిని చెల్లాచెదరు చేసి పెద్దమార్గము నేర్పాటుచేసికొని సైన్యాధ్యక్షుని కింకొకగుఱ్ఱమును తెచ్చియిచ్చిరి. అయితే అప్పటికి వీరును వీరియనుచరులును చాలవరకు అలసియుండుటచేత రాయల సైన్యము వీరినందరను చుట్టుముట్టి వీరితో పోరాడిరి. ఈపోరాటమునందు పోర్చుగీసువారందరును, ఒక్కరైనను మిగులకయే చచ్చిరి. సలాబత్ఖానుమాత్రము బాగుగ దెబ్బలు తిన్నవాడై రాయల బందియాయెను.

## పోర్చుగీసువారు

కృష్ణానదీతీరమున పైవిధముగ దిగ్విజయముగాంచిన శ్రీరాయలప్రభువు తిరిగి రాచూరువద్దకు వచ్చుచుండ త్రోవలో పోర్చుగీసునాయకుడగు క్రిస్టొవిడి పిగరీడోయను నాతడు తనతోటిపాటు కొంతమంది ఫిరంగిసైనికులతో రాయలవద్దకు వచ్చెను. వారికి రాయలవారు కొన్నిగుఱ్ఱ

ములు వేయించి తనవద్దనేయుండి జరుగుచున్న రాయచూరు ముట్టడిని జూడుమని కోరియుండెను. అచటనున్న సమయములో నాతఁడచట జరుగుచున్న ముట్టడిని జూచుచుండెను. కోటలోని తురుష్కులు కోటగోడలపైనుండి మనుష్యులు కోటగోడల వద్దకు రానీయక తుపాకులుగాల్చుటయు, దగ్గర కెట్లో తప్పించుకొనివచ్చి వారిపై కోటగోడలమీదనుండి రాళ్లువిసరి వేయుటయు క్రిందనున్న సైనికుల నీవిధముున కొట్టి వారినలసటఁజెందించుటయు కోటగోడవద్దకు పోయినసైనికు లాకోటగోడ నేమియు చేయ లేక పోవుటయు నీపోర్చుగీసునాయకుఁడు చూచియుండెను. ఇట్లు చూచిచూచి యొకనాఁడు రాయలవారివద్దకు జని తనకును తనతోవచ్చిన పోర్చుగీసుసైనికులకును గోడవద్దకుపోవుట కనుమతినీయవలసినదిగ కోరియుండెను. ముందు రాయలవారందుల కంగీకరించకున్నను తరువాత నియ్యకొనిరి. వీరివెంట కొంతసైన్యమునుకూడ నిచ్చిపంపిరి. ఈనాయకుఁ డిదివరలో కోటగోడమీదనున్న వారల దినచర్యలను చక్కగ గనిపెట్టినవాఁడగుటచే తనవద్దనున్న ఫిరంగులతో కోటగోడలమీదనున్న వారల నచటనుండుటకు వీలు లేకుండున ట్లగ్నివర్షము కురిపించి మెల్ల మెల్లగ రాయలసైనికులను గోడవద్దకుతీసికొనిపోయి యచటి గోడను గొడ్డళ్లతో పగులగొట్టింప నారంభించెను. పైనున్న తురుష్కు లచటనుండజాలక వారేమి చేయఁజాలక పైనుండి కోటలోనికి పారిపోయిరి. వారినాయకుఁడు వీరికి ధైర్యము చెప్పి వారిని తిరిగి వెంటబెట్టుకొని కోటగోడలపైకి తీసికొనివచ్చెను. తా నచటికివచ్చినంతనే ఫిగరీడోయను ఫిరంగినాయకుఁడు తనవద్దనున్న ఫిరంగిని గురిపెట్టి కోటలోనినాయకుని

పడగొట్టైను. ఈనాయకుఁడు మడిసినంతనే కోటలోపల పెద్ద అల్లకల్లోలము జరిగి కోటపైనున్న వారందరును కోటలోనికి పారిపోయి సురక్షితములైనస్థలములలో తమతలలు దాచుకొనిరి. ఇచట కోటగోడలు రాయలసైన్యములధాటి కాగలేక బలహీనములై క్రిందపడాల నారంభించెను. ఇట్టిస్థితిలో నాఁటి యుద్ధమాగెను.

## కోటలో ప్రవేశము

ఇప్పటికి ముట్టడియారంభమై యిరువదిదినము లాయెను. కోటద్వారములు తెరువబడెను. ఆద్వారమున కోటలోనివారనేకులు దీనాలాపములతో నార్తస్వరములతో తెల్లజెండాలతో చేతులను పైకెత్తుకొని రక్షణవేడుచు రాయలవారున్నస్థలమునకు రాసాగిరి. ఆవిషయమును తెలిసికొన్నవాఁగె రాయలవారు తమమంత్రిని వారి కెదురుగ బంపి వారిని లోనికి బిల్పించెను. అంత వారెల్లరు రాయలవారికి సాష్టాంగపడి శరణు వేడిరి. రాయలవారు శరణాగతుల కభయమిచ్చి వారికిగాని వారి ఆస్తికిగాని యేలాటిభయము నుండజాలదని ధైర్యము చెప్పి. తాము మఱుదినము కోటలోనికి ప్రవేశింతుమనియు కోటలోని వారెల్లరు కోటలోనికి నిర్భయముగ బోవచ్చుననియు చెప్పిరి. అపుడచట నున్నవారందరును ఫిరంగిడోపై దృష్టిని ప్రసారించి వారే యీప్రబలకార్యమును సాధించినవారని పొగడిరి.

## రాయల దయాదాక్షిణ్యములు

మరునాడుదయమున మామూలుగ తాము ప్రతిదినము చేయు దైవప్రార్థన పూర్తిచేసికొని విజయానంతరము సంప్ర

దాయానుసారముగ తాముచేసెడిపూజలు దేవబ్రాహ్మణసన్మానములు నయినపిదప రాచూరుకోటలోనికి సైన్యసమేతులై ప్రవేశించిరి. రాయలవారు ప్రవేశించునప్పటికే కోటలోని జనమంతయు వచ్చి రాయలవారికి స్వాగతమిచ్చి కోటను స్వాధీనపరచిరి. రాయలవా రందులకు సంతసించినవారై కోట లోనివారి కభయమిచ్చి యిష్టమున్నవార లచటనుండుటకును అచటినుండి తమసొత్తులతోకూడ వెళ్ల నుద్దేశించినవారలు వెళ్లు టకును సెలవిచ్చిరి. అచట తాముండగనె తమసైనికులుగావించి రని చెప్పిన అకృత్యములకు తమసైనికుల దండించి తమన్యాయ బుద్ధిని దయను దాక్షిణ్యమును వెలిపుచ్చిరి. ఆగ్రామమునుండి వెళ్లదలచుకొన్న వారికి కావలసినసహాయము చేయించి ఆగ్రామములో నేమియు లేనివారికి వలసినసామగ్రి నిచ్చి రాచూరు నందే కొద్దిరోజులుండి ఆ రాచూరునగరపరిపాలన కవసరమగు నేర్పాటుల నన్నిటిని చక్కగ నేర్పరచి నాపట్టణసంరక్షణకై తగినంతమంది సైనికులను విశ్వాసపాత్రులగు సైనాధ్యక్షుల యాధిపత్యమున నుంచి తరువాత తనరాజధానికి సేనాసమేతుడై విజయధ్వనులతో చేరుకొనెను. వీరికి రాజధానియందు జనులందరు గొప్పస్వాగతమిచ్చి నగరంతయు నలంకరించి విజయోత్సవములు చేసిరి.

## ఆదిల్షాహాపంపిన రాయబారము

రాయలవారు రాజధానినగరము చేరునప్పటికె ఆదిల్షాహావద్దనుండి రాయబారి వచ్చియుండెను. ఆరాయబారియు రాయలవారికి తావచ్చినవిషయముగూర్చి కబురుపంపుచు తనకు తొందరగ దర్శనమీయవలె ననియు సుల్తానుగారిసందేశము

సాకర్షించి అందులకు తగుసమాధానము నిప్పించుమనియు కోరి యుండెను. తాము వీలుచూచుకొని రాయబారికి దర్శనమిత్తుమనియు నంతవరకు రాయబారి యచటనే యుండవలెననియు తెల్పిన సందేశము సాకర్షించి దానికి తగుసమాధానము నిత్తుమనియు రాయలవారిరాయబారికి కబురుచేసెను. రాయబారి మాత్రమందు కియ్యకొని ప్రతిదినము రాజసభకు బోవుచున్నంతలో వారికి చేయదగినసపర్యలు మర్యాదలుచేయఁబడుచునే యుండెను. ఒకనెలదినములు గడచినపిదప రాయబారిని మరునాడు బేటికి రమ్మని రాయలవా రాజ్ఞాపించిరి. ఆప్రకారమే రాయబారి రాయలవారివద్దకుపోగా వారును రాయబారి కర్హములగు మర్యాదలుచేసి వారిసందేశమును వినుపింప నాజ్ఞాపించిరి. ప్రప్రథమమునుండి సుల్తానువారికి రాయలవారి న్యాయమునందును ధర్మప్రవర్తనయందును నమ్మక ముండియుండెననియు కారణములేకయే రాయలవారు సుల్తానువారిపై వైషమ్యమువహించి యుద్ధమునకు సన్నాహులైరనియు, వారికిని రాయలవారికిని అనేకసంవత్సరములనుండియు సంధియుండగా షరతులకు భిన్నముగా రాయలవారు యుద్ధసన్నాహులై రాచూరువద్దకువచ్చిరని మొదట నమ్మజాలరైరనియు, రాచూరువద్దకు వచ్చుటయేగాక వారిసైనికులు రాచూరుజనులదోపిడి గావించి రని విని సుల్తానువారు ప్రత్యక్షముగ జూచుటకు వచ్చిరనియు, వచ్చినపిదప రాయలవారి సైన్యము తమసైన్యముతో పోరాడి అనేకులనుజంపి వారియాస్తినంతయు నాశనము కావించియుద్ధపరికరముల నపహరించిరనియు నిందులకు పరిహారముగ రాయలవారిహస్తగతమైన గుడారములను,

ఫిరంగులను, గుఱ్ఱములను, ఏనుగులను మిగత యన్నివస్తు వులను రాచూరుపట్టణమును తిరిగి యిచ్చివేయవలెననియు అట్లుచేసినచో రాయలవారికిని సుల్తానుకును నెల్లప్పుడు స్నేహ ముండగలదనియు రాయలవారికి సుల్తాను విశ్వాసపాత్రు డుగ నుండగల్గుననియు అట్లుచేయనియెడల రాయలవారి ప్రవర్తన దుష్టవర్తనగ నెంచబడు ననియు సుల్తానువారు సందే శముబంపినట్లు రాయబారి విశదీకరించెను. రాయబారిసందే శమును సంపూర్ణముగ విని రాయబారికి సాంప్రదాయాను సారము చేయవలసినమర్యాదల నన్నిటిని గావించి వారిని నూతనవస్త్రధారణులుగ జేసి వారు మరునాడు వెళ్లవచ్చుననియు వారి కీయదగుజబాబు నిత్తుమనియు జెప్పిరి. సుల్తాను వారు కోరినప్రకారము తాము సంగ్రహించిన వస్తువులను రాచూరును తిరిగి యిచ్చివేయుదుమనియు అయితే సుల్తానువారు స్వయ ముగ రాయలవారిపాదములనుస్పృశించి ముద్దుపెట్టుకొనవలయు ననియు కోరియుండిరి. ఈజబాబు విన్నంతనే రాయబారి ఆదిల్షాహాకు వారిజబాబును వ్రాసిపంపిరి. అందుకు సుల్తా నంగీకరించి విజయనగరమునకు మాత్రము తాము రాజాల మనిరి. దానిపైన రాయలవారే తమరాజ్యముసరిహద్దున నున్న ముద్గల్లుకు వచ్చెదమనియు సుల్తానువారు నచటికి రావలయు నని చెప్పిరి. ఆదిల్షాహాగారిని కలసికొనుటకై రాయలవారు బయలుదేరి ముద్గల్లుగ్రామమునకుపోయి ఆదిల్షాహారాకకై వీక్షించుచుండిరి. వారు వచ్చుచున్నారని చెప్పియుండిరే కాని వారు రానందున రాయలవారు తమసరిహద్దునువదలి ఆదిల్షాహా రాజ్యములోని బీజపూరుపట్టణమునకు పోయియుండిరి.

## రాయలవారి స్నేహయత్నము విఫలమగుట

బీజపూరు మిక్కిలి రమ్యమైనపట్టణము. అచటి నివాస గృహములు తోటలు మిక్కిలి రామణీయకముగ నుండెను. రాయలవారెల్లెనను సుల్తానువారిని రప్పించి వారిని బందిగ పట్టుకొనవలెనని యుద్యుక్తులైరి. కాని లాభములేకపోయెను. సుల్తాను ధైర్యముచేసి రాయలవారివద్దకు రాజాలకుండెను. ఆ పట్టణమున నీటివసతియు వంటచెఱకును లేనికారణమువలన రాయలవారచట నుండజాలరైరి. వారున్నసమయముననే వారిసేనలు వంటచెఱకునకుబదు లనేకగృహములను పాడుచేసి గృహముల కుపయోగింపబడిన కలపను వంటచెఱకుగా వాడిరి. అందువల్ల నాపట్టణమున మంచిమంచిగృహములును రామణీయకమైన తోటలునున్ను నాశనము గావింపబడెను. రాయలవారీకారణమువలన తిరిగి ముద్గలునకు బోయిరి. ఆదిల్షాహా తాను రానందుకు క్షమింపుడని వేడుచు తిరిగి తనసేనానియగు అసద్ఖానును బంపెను.

అసద్ఖానునకును ఇదివరలో బందీగనుంచబడిన సలబత్ఖానునకును చిరకాలవిరోధ ముండియుండెను. సుల్తానువకును రాయలవారికిని రాజీకుదిరినయెడల సలబత్ఖాను వదలి పెట్టబడుననియు వదలిపెట్టబడిన తనస్థాన ముండ దనియు నూహించి యెల్లెనను సలబత్ఖానును చంపింపవలెనని యూహ కలిగినవాడై అసద్ఖాను రాయలవారివద్దకువెళ్లి సలబత్ఖానుడు సుల్తానును రాయలవారివద్దకు రాకుండ కబురుచేసెననియు నట్టి ద్రోహిని వధించిననేగాని వీరిద్దరికి రాజీకుదుర దనియు చెప్పెను. అంతట రాయలవారు నిజానిజముల కనుగొనకయే సలబత్ఖానును

సంపాదించిన అసద్ఖాను సంతుష్టాంతరంగుడై తాను సుల్తానును తిరిగి కలిసికొనవలెనని చెప్పి పారిపోయెను. అసద్ఖానునికుట్రయు సలబత్ఖానుకథయు తెలిసికొని రాయలవారి అసద్ఖానును పట్టు కొనప్రయత్నించిరిగాని అప్పటికే యతడు పరారి ఆయెను. అసద్ఖానున్ను సుల్తానువారియొద్దకుపోయి రాయలవారు సలబత్ఖానును జయించిరనియు రాయలవారివద్దకుపోయినచో వారిని కూడ వధింతురనియు అందువలన పోకూడదనియు సలహా నిచ్చెను. సుల్తానును భయపడి రాయలవద్దకు పోయియుండ లేదు.

సుల్తాను తనవద్దకు రానందునకును అసద్ఖాను చేసిన కుట్రవల్లను రాయలవారు కోపోద్దీపితులై సుల్తానురాజ్యము లోనికి చొరబడి భామినీరాజ్యమున కిదివరలో రాజధానియైన గుల్బర్గపట్టణమును ముట్టడించి కోటనుపట్టుకొని నాశనము గావించిరి. ఆకోటలో సుల్తానుచే బందీలుగ నుంచబడిన దక్కను రాజకుమారులను విడుదలచేసి వారిలో పెద్దవాని కారాజ్యము నిచ్చి మిగిలినయిద్దరిని తనతో విజయనగరము తీసి కొనిపోయి వారిద్దరికిని తగినరీతిని పెద్దపదవుల నిచ్చి తనవద్దనే నిలుపుకొనియెను. ఇంతటితో నీఘట్టము ముగిసెను.

## రాయచూరు పతన ఫలము

అయితే రాయచూరుపతనమువలన మహమ్మదీయరాజా లలో కొంతసంచలనము కలుగకపోలేదు. ప్రథమమున రాయల బలపరాక్రమముల కద్భుతపడి అభేద్యమగురాచూరుకోటయే వీరిచే పట్టుకొనబడి నాశనముగావింపబడగ తమతమరాజ్యము లన్నియుకూడ రాయలవారిచే ముట్టడింపబడగలవని భయపడి

మహమ్మదీయులలో నున్న వైషమ్యములు సర్దుబాటుచేసికొని తామందరు నైక్యులై యున్నగాని రాయలవారి రాజ్యకాంక్ష నాపజాల మని తెలిసికొని రాయలవారితో కయ్యమునకు ప్రయత్నించిరేగాని కాల మప్పటిలో సరిగ నుండనందున తమ ప్రయత్నముల నుపసంహరించుకొనిరి. రానున్నచరిత్రలో విజయనగరసామ్రాజ్యక్షయమున కిదియె ప్రాథమికకారణ మాయెను.

రాయచూరుయుద్ధఘట్టము పూర్తియైనంతనే యుద్ధము సమాప్తికాలేదు. పైకి కనుపడు పెద్దపెద్దమంటలు చల్లారెనే కాని అచటనచట రాలిననిప్పురవ్వలు రాజి చుట్టునున్న స్థలముల నంటుకొనుచునే యుండెను.

గోవావద్ద కొన్నిభూములను పోర్చుగీసువా రాక్రమింపగ సాలువ తిమ్మరసు కొంతసైన్యముతో నచటికి 1523.వ సంవత్సరమునపోయి కొంత యుద్ధమునసల్పెను. కాని తిమ్మరసు గెల్పొందియుండ లేదు. తిమ్మరసు తరువాత నీభాగములను తిరిగి రాబట్టుకొనుటకు అసద్ఖానుడు తనవద్దనున్నసైన్యములను పంపి తమవద్దనుండి పోర్చుగీసువారు లాగికొన్నస్థలములను తిరిగి ఆక్రమించుకొనియుండెను.

## 10. రాయలకుమారునిరాజ్యాభిషేకము

ఈచిన్న తిరుగుబాట్లు జరుగుచున్నను రాయలవారు తామునూత్ర మెచటికిని చనక తమకును వయసువృద్ధియగుచున్న కారణమున తమముద్దుగులికెడు నా రేండ్లవయసుగల కుమారుని రాజ్యపట్టాభిషేకముగావించి తాము జీవించియుండగనే తమకుమారుడు రాజ్యముచేయుచుండగ తాము తగినసల

పాలనిచ్చుచు రాజ్యవైభవమును దేశాభివృద్ధియు జూడ గోరిక గలిగియుండిరి. ఈయుద్దేశమును మనసునందుంచుకొని తాను రాజ్యభారమును వదలిపైచి పసిబాలుడగు కుమారునికి 1524-వ సంవత్సరమున రాజ్యపట్టాభిషేకము గావించిరి. తాము తమ కుమారునికి ప్రధానామాత్యులుగనుండి రాజ్యభారము నంతయును తిరిగి తామే భరించుచుండిరి. ఇదివరలో ప్రధాన మంత్రిగ నుండిన సాళువతిమ్మరసును తమువద్దసలహాదారుగ నియమించుకొనియే యుండిరి. తిమ్మరసుమంత్రియొక్క కుమారుని విజయనగరసంస్థానమునందొకగొప్పయధికారిగ నియమించెను. తాను రాజ్యభారమును వదలుకొనుటయేగాక తానే పసిపిల్లవాడైన రాజునకు తగిన మర్యాదలుచేయుచు నవసరమగు నపుడు ప్రణామమునుగూడ జేయ మొదలుపెట్టెను. ఈపట్టాభిషేక సందర్భమున నెనిమిదినెలలవరకు నుత్సవములు చేయుచునే యుండిరి.

### పసిరాజు మరణము

పట్టాభిషేకమునకై నిరంతరముగ చేయబడుచున్న యుత్సవములు జరుగుచునేయుండ పసిరాజు రోగగ్రస్తుడాయెను. రోగగ్రస్తుడగుటయేగాక ఆపసితనముననే కళ్లుమూసి దివంగతుడాయెను. వృద్ధరాజైన కృష్ణదేవరాయనికిశోక మపారమై యనంతమాయెను.

### దుర్వార్తలు

ఇది యిట్లుండ పసిరాజు విషముచే తిమ్మరసుకుమారునిచే జంపబడెననెడి దుర్వార్త దేశమునందు ప్రబలి

యుండెను. ఈదుర్వార్త తనకు తెలిసినంతనే కోపమును పట్టం జాలక తిమ్మరసును తిమ్మరసుకుమారుని తిమ్మరసుసోదరుఁడైన గొండజుని వారియితరబంధువులను రాజసభకు బిల్వనంపి సభలో పెద్దలు పిన్నలందరిసమక్షమున తిమ్మరసు నుద్దేశించి యీరీతిగ పల్కెను.

## తత్ఫలితము

"నిన్నింతకాలము ప్రియమిత్రునిగ నెంచితిని. ఈరాజ్యమున కిప్పటికి నలువదిసంవత్సరములుగ ప్రభువుగ నుంటివి. ఈరాజ్యమును నీవు నాకే యిచ్చియుంటివి. అట్లుచేయుటలో నీవు నీవిధికి వ్యతిరేకముగ ప్రవర్తించియుంటివి. అందువలన నేను నీకు విశ్వాసపాత్రుఁడనై యుండ నవసరములేదు. నీవు నీతివర్తనుఁడవే యైనచో మాసోదరుఁడు నాకళ్లుతీయించమని నీకు విధించినపుడు, నీవట్లు గావింపక అందుకు భిన్నముగ ప్రవర్తించి వారిని మిరాదు మిక్కిలి మోసము గావించి మేక యొక్కకళ్లు నూడదీయించితివి. ఇట్లుచేయుటలో నీవు ద్రోహమును బూని రాజద్రోహి వయితివి. నీతోబాటు నీకుమారులును ద్రోహులే అయి యున్నారు. ఇప్పుడు నీవును నీపుత్రులును నాకుమారునికి విషప్రయోగము చేసినట్లు తెలియవచ్చినది. గనుక మిమ్ముల నందరిని ఖైదీలుగ బంధించడమయినది."

అని చెప్పుచు తానే స్వయముగ లేచి వారివద్దకువచ్చి వారిని తనచేతితో తాకి పట్టుకొని అట్టుచేయుచు నచటనున్న పోర్చుగీసువారిని తనసహాయమునకై బిల్వనంపి వారిసహాయమును కోరియుండిరి. సాలువతిమ్మరసుమంత్రియు వారితమ్ముడును పుత్రుఁడును బందీలు చేయఁబడి మూఁడుసంవత్సరములు

ఖయిదీలుగ నుండిరి. ఇది జరిగినపిదప నరసనాయకునికుమారుని బలవంతముగ పెనుగొండి తోటలలో మోసకృత్యము జరిపిన కొండమరేనికుమారుని తనమంత్రిగా నియమించుకొనెను.

సాలువతిమ్మరసు కుమారుడైన దమ్మానాయకుడు ఖైదీ నుండి పరారి ఆయెను. పరారియై దొంగలు బందిపోటువారు నివసించెడు రమణదుర్గమును కొండగుహాలలో దాగికొనెను. ఆగుహాలలో దమ్మానాయకునిబంధువు డొకడు ముఠాకు నాయకుడుగ నుండెను. ఆనాయకునిసహాయము కొంత సిబ్బంది నేర్పాటు చేసికొని రాయలవారిపై యుద్ధమునకు దమ్మానాయకుడు బయలుదేరెను. వీరి నెదుర్కొనుటకై రాయల వారు కొంతసైన్యమును బంపగ దమ్మానాయకు డాసైన్యముతో పోరి యోడిపోగా తిరిగి బందీగా రాయలవారివద్దకు తేబడెను. అంతట రాయలవా రీదమ్మానాయకుని బందీలుగనున్న సాలువ తిమ్మరసును, వారితమ్ముడైన గొండారాజును పిలిపించి వీరందరును బ్రాహ్మలుగ నున్నందున ధర్మశాస్త్రానుసారముగ జంపించుటకు వీలు లేనందున వారి కంటిగ్రుడ్లుపీకించి వారిని తిరిగి బందీలుగజేసి ఖయిదునం దుంచిరి.

## రాయలవారి అవసానకాలము

పైన వ్రాయబడిన విషయములు జరిగిన కొద్దికాలమున కే బీజపూరుసుల్తానగు ఆదిల్షహా అశ్వగజసమేతకాల్బలమును సిద్ధముచేసికొని తమవద్దనుండి యాక్రమించుకొనబడిన రాయచూరు కోటను తిరిగి పట్టుకొనునుద్దేశముతో బయలుదేరెను. ఈసంగతి తనకు తెలిసినంతనే తా నెవ్వరికిచెప్పకయె యుద్ధప్రణాళిక నొకదానిని తయారుజేసి తాను దాని నవరోహించి

తత్క్షణమే రాయచూరునగర ప్రాంతమునకు జనెను. అప్పటికప్పుడే ఆదిల్షాహా రాయచూరు చేరెను. రాయలవారశ్వారూఢులై వచ్చినన్న సంగతి తనచెవిసోకినంతనే తిరుగనాలోచింపక ఆదిల్షాహా యాచటినుండి వెనుదిరిగి పారిపోయెను. రాయచూరునువచ్చుచు రాయలవారు పోర్చుగీసువారివద్దనుండి అరువందలగుఱ్ఱములుగల అశ్వదళమును విక్రయమునకుపుచ్చుకొని రాయచూరు వచ్చినంతనే యిదివరలో రెండుసార్లు ఆదిల్షాహామాట దప్పెననియు తాను ప్రమాణముమీద చెప్పినపని నింతవరకు చెప్పిన రీతిని ఆచరించియుండలేదనియు నీమారైన నట్లు చేయవలెననియు నట్లుచేయనియెడల యుద్ధముచేసి తనను బందీగావించి జన్మఖైదీగనుంచెద ననియు వెనుదలంచినవిషయముల తెలియజేయుటయే గాక బెల్గాము నగరమును స్వాధీనపరచుకొనువరకు యుద్ధము గావింతుననియు నొకసందేశమును రాయలవారది ల్షాహాకు బంపిరి.

ఇంతలో చలికాల మాసన్నమైనందున రాయలవారు ముందుకు వెళ్లక తిరిగి విజయనగరము చేరుకొని యుద్ధసన్నాహము చేయ నారంభించిరి. ఈయుద్ధమునకై పోర్చుగీసువారి సహాయమును గోరుచు గోవాయందున్న ప్రభుత్వాధికారి కొక సందేశమును రాయబారిద్వార బంపిరి. బెల్గామును యుద్ధమున గెల్చినంతనే గోవాకు పదునైదుమైళ్లదూరమున నున్న నీబెల్గాంగ్రామమును పోర్చుగీసువారి కిత్తు ననియుకూడ వాగ్దానము చేసియుండెను.

ఇట్లు గొప్పరియెత్తున యుద్ధసన్నాహములుచేయుచుండ విధివశమున తనపూర్వీకులగు రాజులనెల్లర తనపొట్టను పెట్టు

గొన్న వ్యాధియొకటి రాయలవారి నావేశించెను. ఈ వ్యాధి వలననే తాను తన ప్రఖ్యాతచరిత్ర నంత ముగించుచు దివంగతు డాయెను. ఇంతటితో రాయలవారి వైభవము, విజయనగర సామ్రాజ్యవైభవము నంతరించెను. హిందూ సామ్రాజ్యచరిత్రలో నొక ప్రకరణ మింతటితో ముగిసెను.

## 10. రాయలస్మృతి

రాయలవారి జననకాలనిర్ణయ మెంతకష్టమో వీరి మరణకాలము నిర్ణయించుటయు నంతకష్టముగనే కనబడు చున్నది. వీరిసమకాలికు లెంతచరిత్ర వ్రాసియున్న నీసందర్భ మునుగూర్చి వ్రాసినవా రొక్కరును గాన్పించుటలేదు. శాసన ముల నాధారముచేసికొందమన్న నవియు నీవిషయనిర్ణయ మున కెంతమాత్రము నాధారభూతములు కావు. కావలి వెంకటరామస్వామిగారు The Deccan Poets అనుపుస్తక మును వ్రాయుచు కృష్ణదేవరాయలవారు 1524-వ సంవత్సర మున కాలగతినొందె నని వ్రాసియుండిరి. ఇందుల కనుగుణముగా దేశములందు చాటువుగ జెప్పబడుచున్న నీక్రింది పద్యమువలన శ్రీకృష్ణదేవ రాయలవారు శాలివాహనశకము 1447కు సరియగు 1526 వ సంవత్సరమున చనిపోయినట్లు తెలియవచ్చుచున్నది.

> బోరున యాచకప్రతతిభూరివిపద్దశనొందుచుండఁగా
> నారయశాలివాహనశకాబ్దము లద్రియుగాబ్ధిసోమలం
> దారణవత్సరంబున నిదాఘుదినంబున జ్యేష్ఠశుద్ధష
> ష్ఠీరవివాసరంబున నృసింహునికృష్ణుఁడు చేరె స్వర్గముఁ
> ద్వారక నున్న కృష్ణుఁ డవతారసమాప్తము నొందునట్లుగాన్.

ఈపద్యమునుబట్టి తారణనామసంవత్సర జ్యేష్ఠశుద్ధషష్ఠీ ఆదివారమునాడు (1525) రాయలవారు చనిపోయినట్లు తెలియుచున్నది. ఇది యిట్లుండ నింకొకశాసనమునుబట్టి కృష్ణదేవరాయలవారికి చాలజబ్బుచేసినట్లును వారు జీవింపరని నిశ్చయముచేసికొని కోనప్పనాయకుడనునతడు రాయలవారికి తారణనామసంవత్సర మార్గశిర శుద్ధ విదియ శనివారమునాడు గంగోదకము సేవింపజేసెననియు నప్పటికి రాయలవారిపుత్రులగు తిరుమలదేవరాయలవారు రాజ్యముచేయుచుండిరనియు తెలియుచున్నది. మనిషి జీవించరని నిశ్చయింపబడినపిదప నాచరమావస్థయందు గంగోదకము నిప్పించునాచారము మన దేశమునం దుండియేయున్నది. మరియొకకవులనుబట్టి రాయలవారి అల్లుడగు రామరాజుగారు విజయనగరమున వ్యయనామ సంవత్సర వైశాఖశుద్ధ పౌర్ణమినాటికి రాజ్యముచేయు చుండినట్లు వ్రాయబడియున్నది. దీనినిబట్టిచూడ రాయలవారు 1526-వ సంవత్సరమున స్వర్గస్థులైరియని కొంతయనుమానము గలుగుచున్నది.

అయితే కృష్ణదేవరాయలవారు 1529-30 వరకు జీవించియున్నట్లు శాసనము లనేకము లుండియున్నవి. వాటినిబట్టియే చరిత్రకారులు రాయలవారు 1530 వరకు జీవించియున్నట్లును వారిమరణము 1529-30 సంవత్సరములలో జరిగియుండవలయు ననియు వారు చనిపోయినపిదప వారిసోదరు లగు అచ్యుత రాయలవారు 1530-వ సంవత్సరమున పట్టాభిషిక్తులైరనియు నిర్ధారణచేసియుండిరి. అచ్యుతదేవరాయల పట్టాభిషేక మెచట నెప్పుడు జరిగినదనునంశమునుగూర్చియు భిన్నాభిప్రాయ

ములు మెండుగ నున్నవి. ఈ అచ్యుతదేవరాయల వారును వారియుద్ధరిసోదరులును కృష్ణదేవరాయలవారిచే బంధింపబడి వారు రాజ్యముచేసినంతకాలము బందీలుగా చంద్రగిరిలో నుంచబడి రని న్యూనిసుచరిత్రకారునివలన తెలియుచున్నది. కృష్ణదేవరాయలవారు చనిపోవకపూర్వము మరణశాసనము నొకదానిని వ్రాసియుండి రనియు నాశాసనమునందు తన కొక పదునెనిమిదిమాసముల వయసుగల చిన్నకుమారు డుండె ననియు, అట్లయ్యును తనకుమారుడు చిన్నతనమువలన రాజ్యార్హుడుకాడనియు, రాజ్యమునకు రాజగుటకు అచ్యుత దేవరాయలే అర్హుడనియు వ్రాసియుండె నని న్యూనిసుచరిత్ర కారుడు వ్రాసియుండెను. కాళహస్తియందు దొరికిన యొకా నొకశాసనమునుబట్టి అచ్యుతదేవరాయలవారు కాళహస్తి గ్రామమున విరోధిసంవత్సర కార్తికమాస బహుళపంచమినాడు రాజ్యాభిషిక్తుం డాయె నని తెలియవచ్చుచున్నది. మరియొక సమకాలికుండైన రాజనాథడిండిము డనునతనివలన అచ్యుత దేవరాయలవారు తిరుపతిలో తిరుపతివేంకటేశ్వరస్వామివారి యెదుట విజయనగర రాజ్యమునకు రాజుగ పట్టాభిషిక్తులు గావింపబడిరని వ్రాయబడియుండెను.

ఈసందర్భమున నే మరికొన్ని శాసనములవలన రాయల వారి అల్లుడగు అళియరామరాజు విజయనగరసామ్రాట్టుగ 1526-వ సంవత్సరమున నే రాజ్యముచేయుచున్నట్లు తెలియు చున్నది.

ఇన్ని భిన్నభిన్నములుగ నున్నవిషయములు శాసనముల యందు గన్పించుటకు నెద్ధియేని గొప్పకారణ మొకటి యుండ

వలయును. అది యొద్దియని తన మాలోచించి వీటినన్నిటిని పమన్వయము చేయుట శక్యమా యని చూడవలయును.

రాయలవారు జీవించియుండగనే తగునూరుఁడైన తిరుమలరాయలు రాజ్యాభిషిక్తుఁడాయె ననుటయు నాతఁడు కొద్దికాలమునకె మృతినొందె ననుటయు నిస్సందేహములైన విషయములే యైయున్నవి. తిరుమలరాయలు చనిపోయిన పిదప కృష్ణదేవరాయలవారికి ప్రమాదమైనజబ్బుచేసి మరణావస్థయందుండిరనియుకూడ నూహింపవచ్చును. ఆసమయముననే వారు జీవించుట దుర్లభమని శాసనమునందు వ్రాయబడినట్లు గంగోదకసేవనము జరిగియుండును. అయితే దైవవశమున వారాస్థితినుండి బయల్పడి సజీవులై యుండిరనుట కెంతమాత్రము ననుమాన ముండఁ జాలదు. వారికి తిరిగి స్వస్థత చికూరినపిదప రాజ్య మెవరికి సంక్రమింపఁజేయవలయునా యనెడి విషయము రాయలవారిని హెచ్చుగ నాందోళనపఱచియుండవలెను. ఆసందర్భమున రాజ్యార్హులైనవారి గుణగణముల నాలోచించుటలో కొంతకాలయాపనము జరిగియుండవలెను. ఒకప్రక్క తన కొకపసిపాపఁడు తల్లిపాలు కుడిచెడు పుత్త్రుఁ డొకఁడుండెను. రాజ్యమున కర్హుఁడై యనేకయుద్ధములందు గెల్పొంది మంచిశూరుఁ డనియు ధీరుఁ డనియు పేరుపడిన యల్లుఁడు రామరా జొకఁ డుండియుండెను, సమర్థుఁడును రాజ్యము చేయఁదగినవాఁడునై యిదివరలో తనచే బంధింపఁబడి బందీగా చంద్రగిరియందుంపఁబడిన అచ్యుతదేవరాయ లింకొకఁ డుండియుండెను. వీరిలో నెవరు రాజ్యార్హులాయని రాజ్యవేత్తయగు కృష్ణదేవరాయలవా రాలోచించుటలో

నెట్టియాశ్చర్యము నుండజాలదు. రాయలవా రీవిషయము లన్నిటిని సమగ్రముగ నాలోచించి ముఖ్యముగ నాసమయమున దేశక్షేమమును మనసునం దిడికొని పసిపాపడైన తన పుత్రునిహక్కులను మఱచిపోక సమర్థుడైన తనకుమార్తె భర్తయగు రామరాజుయొక్క అర్హతలను గమనించి ప్రథమమున తమసోదరు డగు నచ్యుతరాయునికి తానొనర్చిన యక్రమమునకు దగినపశ్చాత్తాపమును చూపి దానికి పరిహారముగ నాతనికి కొంత యుపకారముచేయ నెంచి తనపసిపాపకు సంరక్షణకర్తగ నల్లుడగు రామరాజును యువరాజుగ నియమించి తనసోదరుడగు నచ్యుతరాయునియందు రాజ్యాధికారమును నిల్పియుండిన నుండవచ్చునని తోచుచున్నది. వీరిలో వీరిద్దరు, రామరాజు అచ్యుతరాయలు వారివారియిష్టప్రకారము ఎవరిమట్టుకు వారే రాజ్యాధిపతులుగ వ్యవహరించుచు శాసనములను తమయిచ్ఛవచ్చినట్లు ప్రకటించి యుండవచ్చునని యూహింపనగును. ఈయూహయు కేవలము నిరాధారమై నిరంకుశమైనదిగ నెంచ నవసరములేదు. పెనుగొండ కైఫీయతునుబట్టి రాయలు తనయవసానకాలమున రామరాజును యువరాజుగనుండి తనసోదరుడైన అచ్యుతరాయునికి రాజ్యనిర్వహణమునందు సహాయముచేయవలసినదిగ కోరినట్లు తెలియవచ్చుచున్నది. ఈయంశములనే కొందరు ఇతర హిందు మహమ్మదీయచరిత్రకారులును వ్రాసియుండిరి. అచ్యుతరాయలును తనసోదరుని అంత్యసందేశమును గౌరవించి రామరాజును రాజ్యనిర్వహణమునం దుంచుట కంగీకరించియుండెను. అయితే చరిత్రయందు రాయలయనంతరము విజయనగర

సామ్రాజ్యమును పరిపాలించినది అచ్యుతరాయలా లేక కృష్ణదేవరాయలపసిపాపయైన కుమారుఁడా యనుసంశయము విచారణీయమే.

శాసనములన్నియు కృష్ణదేవరాయలతరువాత రాజ్యము చేసిన దచ్యుతరాయలే యని స్పష్టీకరించుచున్నవి. ఈవిషయ మునే కొందరు హిందూ పోర్చుగీసుచరిత్రకారులును స్పష్టముగ వ్రాసియుండిరి. కాని మహమ్మదీయచరిత్రకారులు మాత్ర మీ యచ్యుతదేవరాయలపేరుకూడ బయటికిరానీయక రామరాజే రాజ్యముచేసియుండెనని వ్రాసియుండిరి. మొత్తముమీఁద దీర్ఘ ముగ నాలోచించి తనకుమారునిహక్కులను నాశనముగావింపక నాతనిని రామరాజు హస్తమునందుంచి వానిపేర రామరాజును యువరాజుగ నియమించియుండవలెను. అయితే రాజ్యావ సరములను గమనించి రాజ్యాధికారమంతయు నచ్యుత రాయలవశము చేసియుండవలెను. ఈక్లిష్టపరిస్థితియం దిమిడి యున్నస్వారస్యమును గమనించి అచ్యుతరాజు తత్క్షణమే విజయనగరమునకు రాక చంద్రగిరియందేయుండి రాయలవారి మరణానంతరము ప్రథమమున శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామి వారి సముఖమునను తరువాత కాళహస్తియందును తిరిగి విజయనగరమునందును ముమ్మారు ముచ్చటగ పట్టాభిషేకమహో త్సవములను గావించుకొనియుండెను. అప్పటినుండియు నెవరి సామర్థ్యమును బట్టి వారు సామ్రాజ్యనిర్వాహణమునకై ప్రయ త్నములు గావింపఁగా, చిట్టచివరకు అచ్యుతరాయలే రాజ్యాధి పత్యమును వహించియుండ వచ్చునని తోచుచున్నది. రాజ్యాధి పత్యము వహించియు నచ్యుతరాయలు రామరాజుతో

పక్ష్యత చేసికొని తామిద్దరును రాజ్యనిర్వహణమునందు సమానముగ బాధ్యతను వహించియుండి రని 1535-వ సంవత్సరమున ఫిబ్రవరి 7 వ తేదీగల శాసనమునుబట్టి తెలియవచ్చుచున్నది.

ఈపై యంశములనన్నిటిని సమన్వయము చేసికొన్నచో మూఁడుసంగతులు స్పష్టపడగలవు. తిరుమలరాయఁడు చనిపోయినపిదప రాయలవారు తనతరువాత రాజ్యమేలవలసినవిధమును 1526 వ సంవత్సరమున నే యేర్పరచియుండెననియు, వారు జీవించియుండగనే రామరాజు అచ్యుతదేవరాజు తమంతట తాము రాజ్యాధిపతులుగ వ్యవహరించుచుండిరనియు రాయలవారు 1529-30 సంవత్సరమున చనిపోయియుందురనియు వారియనంతరము అచ్యుతరాయలే పట్టాభిషిక్తుడై రామరాజుతోపాటు రాజ్యనిర్వహణ బాధ్యతనువహించియుండెననియు మనము గ్రహింపవలసియున్నది.

## 11. రాయలభార్యలు: సంతతి.

చరిత్రకారులవలననేమి, రాయలరసుకాలికులగుపోర్చుగీసువారివలననేమి, యితరగ్రంథములవలననేమి, రాయలకు ముగ్వురుభార్య లున్నట్లు తెలియుచున్నది. వారిపేరులు చిన్నాదేవి, తిరుమలదేవి, అన్నపూర్ణాదేవి యు. రాయలజననవృత్తాంతములోవలెనే యాతనివివాహవిషయమునకూడ ననేకచిత్రచరిత్రములు వాడుకలో నున్నవి. వానిలో సత్యాసత్యగ్రహణముజేయుట కడుగష్టము. మొదటి యిద్దఱు భార్యలును రాయలుదాసీపుత్రుఁడని మొదటవివాహమాడనొల్లక వానిం

జంప యత్నించి రనియు నది కొనసాగక యాతని భర్తగ నంగీక రించి రని చెప్పుగాథలలో కొంచెమైనను సత్యమున్నట్లు తోచదు. పోర్చుగీసుచరిత్రకారుఁడగు న్యూనిసు వ్రాసిన యుత్తరములవలన రాయలకు జిన్నతనమునందే వేశ్యాసంపర్క మలవడినట్లు తెలియుచున్నది. ఈమెయే చిన్నమదేవి.

రాయలవారిపట్టాభిషేకానంతరము యామెకై యొరుల కంటఁబడకుండ నర్ధరాత్రమున మారువేషమున నామెయింటికేఁగి యామెవద్ద కొంతకాలము ప్రతిరాత్రి యుగడిపి కోడికూతకు పూర్వమే కోటచేరుచుండెడివారు. ఒకనాఁడు రాయలు చిన్నమ దేవి సమీపమునకుఁ బోవుచుండగ తిమ్మరుసు వీక్షించి యాశ్చర్యనిమ గ్నుఁడై యాతని వెంటనంటి వేశ్యయింట ప్రవేశింపఁ బోవుచుండ నాతని గలుసుకొని యాతనిని మందలించి రాజ్యాధిపతియగు రాయల కిట్టిది తగ దనియు, శత్రువులకిట్టివిషయము తెలిసిన వారు తుదముట్టింతు రనియు, పరరాజుల కీవిషయము తెలిసిన తమపుత్రికలకువివాహముచేయుట కిచ్చగింప రనియు రాజ్యము నందు పరువుమర్యాదలుఁ నశించుననియు ననేకవిధములుగ రాయల వారికి బోధించియుండెను. రాయలవారు నందులకు లజ్జావనతవద నులై తాముచేయుకార్యము సరియైనదని చెప్పజాలకయు తమ లోపమును గప్పిపుచ్చుటకు యత్నించకయు తను తామెపైనున్న గాఢానురాగమే తమప్రచ్ఛన్నప్రవర్తనకు కారణమనియు తాము చిన్నాదేవికి సంపూర్ణముగ వశులైతిమనియు నామెను వదలి తాముండజాలమనియు రాజ్యభిక్ష నిచ్చి రాజుగాచేసిన యాచార్యమును మనసునందిడికొని ప్రేమభిక్షనుకూడ పెట్టు మనియు రాయలవారు తిమ్మరసును వేడికొనియుండిరి. ఇట్లు

కోరుచున్న రాయలమనోభావమును గ్రహించినవాఁడై యాతనిప్రేమ నామెనుండి మరలింపజాలనని తెలిసికొన్నవాఁడై రాయలకోరిక కనుమతింపకపోయినచో గొప్పసంచలనము రాజ్యమున బయలుదేరక తప్పదని కనుగొన్నవాఁడై రాయల కోర్కె కొలదికాలమునకె నెరవేర్చెదనని వాగ్దానముచేసెను. కొంతకాలమునకు రాయలకు స్వజాతికన్యయగు తిరుమలాదేవిని వివాహముగావించి పిదప నీచిన్నమదేవినిగూడ వివాహము గావించి యీమెను పట్టమహిషినిగా జేసెను.

రెండవభార్యయగు తిరుమలాదేవి రాయలు ప్రథమమున వివాహమైనభార్య. ఈమె వివాహానంతరమే చిన్నాదేవిని వివాహముచేసికొన్నది. తిరుమలాదేవి గజపతిరాజకూతురని కొందరు చెప్పుదురుగాని అది సరికాదు. గజపతిరాజ్యమును జయించుటకు బోవునప్పటికే వీరిద్దరు భార్య లుండిరిగాన నీమె గజపతిరాజకుమార్తె యనుట కెట్టియాధారమును లేదు. ఈమె శ్రీరంగపట్టణపు రాజకుమార్తె యని తోచుచున్నది.

మూడవభార్య అన్నపూర్ణాదేవి. ఈమెగజపతి రాజపుత్రిక. గజపతిరాజుతో యుద్ధముచేసి వారిని జయించినపిమ్మట నారాజు తనకుమార్తెయగు జగన్మోహినీ దేవినిచ్చి వివాహముగావించెను. ఈజగన్మోహిని దేవియే యన్నపూర్ణాదేవి. ఈమెనే తుక్కాంబ యనికూడ పిలుతురు. ఈమె నేసందర్భములో వివాహ మైనదియు నిదివరలో తెలిపియుంటిమి.

ఈముువ్వురుభార్యలుగాక రాయలకు నింక తొమ్మండు గురుభార్యలుండి రని న్యూనిసుచరిత్ర కారుడు తనచరిత్రలో వ్రాసియుండెను. వారెవ్వరో మాత్రము మనకు తెలియరాదు.

రాయలవారు ఈముప్వురుభార్యలయందును గొంచె మించుమించుగ సమానప్రేమగలవారై యుండిరి. రాయలవా రెచటికేగినను తనభార్యలను వెంటబెట్టుకొనియే పోవుచుండిరి. యుద్ధమునకు జనినపుడు తీర్థయాత్రలు గావించినపుడు మరి యెచటికి వెళ్లినను భార్యాసమేతులై వెళ్లుచుండిరి. శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామిని దర్శించుటకు పోయినపుడెల్ల నీభార్యలు వారివెంటనే యుండిరి. వేంకటేశ్వరస్వామివారి ఆలయమున చిన్నాదేవి తిరుమలాదేవితోసహా రాయలవారి కంచు విగ్రహములు ప్రతిష్ఠింపబడియున్నవి. వీటిని మనమిప్పటికిని చూడనగును. అప్పటికి అన్నపూర్ణాదేవి వివాహముకాలేదనియే మన మూహింపవలెను. అమరావతి శ్రీకాళహస్తి మొదలయిన క్షేత్రములను రాయలవారు సందర్శించినపుడు వారి భార్యలు వారివద్ద నున్నట్లు మనకు దృష్టాంతములు కలవు. ఈభార్యలు ముప్వురున్ను వారిలో వారు మిక్కిలి సఖ్యతగలిగి యుండిరి.

ఈముప్వురుభార్యలకు వేర్వేరుగృహము లుండెడివి. వారివారికి ప్రత్యేకముగ చెలికత్తెలు దాసీజన ముండెడివారు. వారిజనానాలోని కితరపురుషు లెవరును రాజాలరు. అచట నుండువారందరును స్త్రీలుగాని నపుంసకులు గాని యైయుండిరి. ఇచటిస్త్రీలు పరాయికంటె కగపడరు. రాజుగారియాజ్ఞ లేనిదే పరాయివా రెవ్వరును వీరిని సందర్శింపకూడదు. ఈదేవేరుల వద్ద బాదాపు పండ్రెండువందలకు తక్కువగాని స్త్రీజనముండెడి వారు. ఈభార్యలవద్ద చెప్పనలవికాని బంగారువెండినవరత్నఖచి

తమకు భూషణములుండెడివి. ఇవిగాక హెచ్చుగ ధనమును వీరికి ప్రత్యేకప్రత్యేకముగ నుండెడిది.

మొత్తముమీాద నీభార్యలుముప్పురిలో చిన్నాదేవి యందు రాయలవారికి కొంత హెచ్చుప్రేమయుండెననుటకు సందేహము లేదు. ఆమెపైగలప్రేమను బహిర్గతముచేయుటకై యీామెపేర నొకపట్టణమును నిర్మించె నని న్యూనిసుచరిత్ర కారుడు వ్రాయుచు నాపట్టణముపేరు నాగలాపురమని చెప్పి యుండెను. ఈపేరునుబట్టి రాయలవారు తమతల్లి పేర నీగ్రామ మును కట్టించిరేమోయనుట యొక్కువసమంజసముగ నున్నది. అది యెట్లున్న నీపుర మిప్పటి హాస్పేట అయియున్నది. ఈపుర ముచుట్టు నొకయుచ్ఛమైన రాతిగోడను కట్టించిరి. తమ రాజ్యమునందలి ప్రముఖనాయకుల నందరి నీగ్రామమున తమకు వసతిగృహములను శారుగ కట్టవలసినదిగ నుత్తరవు నిచ్చిరి. అంత నాపురమున నాయకులందరును పెద్దపెద్దభవన ముల నిర్మాణముచేసియుండిరి. ఇట్లు నిర్మాణముచేయబడిన నాగలాపురమునకు వచ్చెడిప్రతివస్తువుపైన సుంకము నిర్మాణము చేసి యీగ్రామమునకు గొప్ప ఆదాయమును కల్పించెను.

ఈపురమున కిరుప్రక్కల రెండుపర్వతపంక్తులుండెను. ఆపర్వతపంక్తులమధ్య నొకపెద్దచెరువును నిర్మాణము చేయించెను. ఈ చెరువునిర్మాణమునకై పోర్చుగీసు దేశమునుండి మంచి కట్టడపుపనివారల పిలిపించి వారిచే నీచెరువును కట్టించెను. ఈచెరువును కట్టించునపుడు కొంతకాలమువరకు పగలుకట్టిన భాగము రాత్రి వేళల పడిపోవుచుండెను. అప్పుడు శాస్త్రవేత్తల విచారించినంతలో చెరువు బలికోరుచున్నదని వారు చెప్పి

యుండిరి. అందుపైన బందీలుగనుండి నురిదీయబడవలసిన వారినందరి నాచెరువువద్ద చంపి వారినెత్తుటి నీచెరువునకు బలిగా నిచ్చియుండిరి. తరువాత చెరువుకట్టడము చక్కగ నిలిచి యుండెను. ఈచెరువునకు నీరువచ్చుటకును వచ్చిన నీటి నుప యోగించుటకును రాతిగొట్టములను పెట్టించిరి. ఈచెరువు నందలి నీటివలన భూములను బాగుచేసి మంచితోటలను పైర్లను వేయించి దేశసౌభాగ్యమును వృద్ధిగావించిరి. ఈచెరువుకింద వరి గోదుమపంటలు హెచ్చుగ పండుచుండెడివి.

రాయలవారి కిభార్యలవలన మగశిశువు లిద్దఱుజన్మించి యుండిరి. వారిలో నొకరు తిరుమలదేవరాయడు. ఈతడు ఆరుసంవత్సరముల వయసుగలవాడుగ నున్నపుడే రాయల వారు వానిని పట్టాభిషిక్తునిగజేసెను. కాని విధివశము నీతడు మరణించెను. ఈతడు మరణించినపిదప రాయలవారి కింకొక పిల్లడు జన్మించెననియు వానినే రాజ్యాభిషిక్తునిగాజేయుట కిచ్చగింపక వానిస్థానే రామరాజును యువరాజుగను రక్షణ కర్తగనుంచెనని మహమ్మదీయచరిత్రకారులు వ్రాసియుండిరిగాని పోర్చుగీసువారుగాని యితరసమకాలికులు గాని యీవిషయ మునుగూర్చి వ్రాసియుండలేదు. ఈయిద్దరుతప్ప రాయలవారి కింకెవ్వరును మగసంతతిలేదు. రాయలవారికి మగసంతతి నిల్వకుండుట శోకగాథ చెప్పబడుచున్నది. ఆగాథయందలి సత్యాసత్యముల నిర్ణయింపజాలము. అయిన నీగాథ నీకింద వ్రాయుచున్నాను.

రాయలు నర్మదానదికి దక్షిణమునసుండు దేశమును జయించెను. అతనికి లక్షసైన్యమిండెను. కృష్ణరాయని గజ

బలమంతేయు నొకసామంతునివద్ద నానెగుందివద్దనుండెను. ఆసామంతు నానెగుంది విడిచి మరియొకచోటికి బోవలెనని రాయలవా రాజ్ఞాపించిరి. ఇది వినిన యిద్దరుగోసాయీ లా సామంతుని బంపవలదని రాయలవారి ననేకవిధముల ప్రార్థించిరి. గోసాయి లెంత ప్రార్థేయఁబడినను రాయలవారు లక్ష్యముచేయక నాసామంతుని దేశాంతరమునకు బంపివైచిరి. గోసాయి లెంతచెప్పినను వినక వారినవమానించినందులకు నాగోసాయీలు కోపించి సంతాన హీనుఁడ వగుదు వని రాయలవారిని శపించిరి. అందువలన నీతనికిగల్గిన మగశిశువు లెవ్వరును నిలిచియుండ లేదనియు నానెగుందికైఫీయతునవ్రాయ బడియున్నది. ఇందలి నిజానిజములను పాఠకులే వితర్కింప నర్హులు. మొత్తముమీద రాయలవారియనంతర మీసామ్రాజ్యమును పరిపాలించుటకు వారిసుతు లెవ్వరును లేరు.

రాయలవారికి తిరుమలాంబ వెంగళాంబ యని నిద్దఱు కూతుఁ మాత్ర ముండిరి. వీరిద్దరికిని తగురీతిని విద్యాబుద్ధులు గఱపి వారిని రామరాయ తిరుమలరాయ లను నిద్దరన్నదమ్ముల కిచ్చి మహావైభవముతో వివాహము గావించిరి. ఈరామరాయ లే రాయలవారి అవసానకాలమున వారిపసిపాపకు రక్షణకర్తగా నుండి యువరాజుగ నున్నట్లును కొంతకాలము రాజ్య భారము నాపిల్లవానికి రక్షణకర్తగా జరిపినట్లు నిదివరకే వ్రాసి యుంటిమి. రాయలయనంతర మచ్యుతదేవరాయలు రాజై పట్టాభిషిక్తుఁడై రాజ్యముచేసెను. అచ్యుతరాయల కాలము నందే తురుష్కులు విజృంభించి రాయచూరును లాగికొనిరి. అచ్యుతదేవరాయలతరువాత నాతనికుమారుఁడు వెంకట్రాయలు

రాజ్యముపాలించెను. ఆటుపిమ్మట రాయలవారి అల్లుడైన రామరాయలు రాజ్యాధిరూఢుఁడై రాజ్య మేలెను. వీరెవ్వ రును విశేషవిక్రమవంతులుగారు. రామరాయలు తురుష్కులచే 1565-వ సంవత్సరమున తల్లికోటయొద్ద జరిగినయుద్ధమున నోడింపఁబడెను.

తల్లికోటయుద్ధానంతర మీదేశమున నున్న జనులు దిక్కు లేనివారై ధనధాన్యములువిడిచి విజయనగరమును వదలి వెల్లి పోయిరి. ఇంతటితో విజయనగరసామ్రాజ్య మంతరించెను.

రామరాయలయొక్క సోదరుఁడును కృష్ణదేవరాయని రెండవఅల్లుఁడునైన తిరుమలరాయనివంశీయులు చంద్రగిరికివచ్చి దానిని తమరాజధానిగ జేసికొని దక్షిణదేశమును పాలించు చుండిరి. 1639-వ సంవత్సరమున చెన్నపురి నింగ్లీషువారి కిచ్చిన శ్రీరంగదేవరాయ లీతిరుమలదేవరాయని కారవపురుషుఁడు. వీరివంశీయు లిప్పటికి నానెగుంది సంస్థాదినాధిపతులుగ నున్నారు.

వీరిద్దరుగాక రాయలవారి కింకొకకుమార్తె మోహ నాంగి యను నామె యుండెననియు నామె మరీచీపరిణయమను గ్రంథమును వ్రాసెననియు చెప్పుదురుగాని దీనికెట్టి దృష్టాంతర మును కాన్పింపదు. ఆపుస్తక మిప్పుడు దొరకదు.

## 12. శ్రీకృష్ణదేవరాయలవారి వ్యక్తిత్వము స్వభావము

ఈభారతదేశమేలినచక్రవర్తులలో చరిత్రకు తెలిసినంత వరకు నశోకుఁడు సముద్రగుప్తుఁడు చంద్రగుప్తుఁడుతప్ప కృష్ణ దేవరాయసార్వభౌమునితో పోల్పఁదగిన రాజు వేరొకఁడు లేఁడని నిక్కముగ జెప్పనగును. సామర్థ్యమునగాని దూరదృష్టి యందుగాని రాజకార్యనిర్వహణమునగాని దేహబలమునగాని

నీతని కీడగుచక్రవర్తి యింకొకడు గాన రాడు. ఈతనియుద్ధములే యితని బలపరాక్రమములను శౌర్యధైర్యములను వేనోళ్ల జాటుచున్నవి. ఈతని రాజ్యము ఓఢ్రదేశమునయున్న పోట్నూరు గ్రామమునుండి కన్యాకుమారీ అగ్రమువరకును బంగాళా ఖాతమునుండి అరేబియామహాసముద్రమువరకును విస్తరించి యుండెను. ఈదేశమునందలి భద్రతారతమ్యమే నీతనిరాజ్య కార్యనిర్వహణా చాతుర్యమును సహస్రముఖముల నుద్ఘోషించుచున్నది.

ఈరాజు మిక్కిలి పొడగరిగాని మిక్కిలి పొట్టివాడుగాని గాక సమానశరీరముగలవాఁడుగ నుండెను. మంచిరూపము గలిగి కమనీయమైన కాంతిగల్గి ముఖమునందు గొప్పవర్చస్సుతో గూడుకొనియుండెను. కాయము కొంచెము స్థూల మనియే చెప్పవచ్చును. ఈతనికి చిన్నతనమునందె స్ఫోటకవ్యాధివచ్చి నందున మొగమంతయు మచ్చలతో నిండియుండెను. ఈతని విస్మితవదనమున ఎల్లప్పుడు నానందము తాండవమాడు చుండెను. రాయలవారు కోపిష్ఠియనియే పేయసుచరిత్రకారుడు వ్రాసియుండెను. కోపమువచ్చినపుడు పిచ్చికోప ముండెడిది. అయినను శాంతస్వభావుఁడనియే మొత్తముమీఁద చెప్పనగును. రాజఘటవలన కీవితోపాటు అహంకారము నుండియుండెను. ప్రజలకష్టనిష్ఠురములను తెలిసికొనుటకు రేయి యనక పవ లనక యెల్లసమయములయందు సిద్ధముగ నుండెను. విదేశీయుల సన్మానించి వారిని గౌరవించుటయందు గొప్పశ్రద్ధవూని వారికి తనదేశ క్షేమసమాచారముల దెల్పుచు వారి దేశస్థితిగతుల నారయుచు విదేశములతో వర్తకవ్యాపారము వృద్ధిచె.

దించి దేశసౌభాగ్యము నభివృద్ధిజేసెను. మిక్కిలి చనవుగనున్న స్నే
కనబడుచుండెను. స్నేహితులు విరోధులను వివక్షతలేక యెల్లరు
రాయలవారియందు భయభక్తులతో మెలగుచుండెడివారు.
ఈత డ్జ్ఞపనులయందు బరిపూర్ణసామర్థ్యమునుగలిగి సమస్త
జనులయందును సమానభావమును జూపుచు నెల్లరచే గొని
యాడఁబడుచుండెను.

రాయలు చిన్నప్పటినుండి వ్యాయామముల
యందు మిగుల కాంక్ష కల్గిన వాఁడగుటచే హెచ్చుగ
కృషిచేసి దృఢకాయమును సంపాదించెను. ఈత డశ్వా
రోహణమునందు పాండవసోదరులగు నకులసహదేవుల నై
పుణ్యము చాతుర్యము గలిగియుండెనని పారిజాతాపహరణ
మున వ్రాయబడియున్నది. ఈతనిదినచర్యనుగురించి యిది
వరకే వ్రాసియుంటిని.

ఈతడు గర్విష్ఠియనుటకు సందేహములేదు. ఆదిల్షాహ
తనతో యుద్ధమునం దపజయముగాంచి రాయబారిని పంపి
నపుడు రాయబారి కీతడు చూపిన అలక్ష్యభావము ఆదిల్షాహ
తనపాదములస్పృశించి ముద్దిడవలయు నని పెట్టినషరతు
వందులకై తానుపడినశ్రమ తనగర్వమును అహంకారమును
నిరంకుశత్వమును చాటుచున్నవి. ఇంతమాత్రముచేత
రాయలు ఉదారహృదయుఁడు కాఁడని గాని దయా
పాత్రుఁడు కాఁడనిగాని చెప్పుట కెంతమాత్రమును వీలులేదు.
ఈతని దివ్యచరిత్రమునందు ఉదారస్వభావము నుదహ
రించెడిఘట్టము లనేకములు కలవు. అయితే యీవిషయమున
మాత్రము రాయలవారి కేలకో హెచ్చుపట్టుదల కల్గి

చియుండెను. కొండవీటియుద్ధమునం దపజయము గాంచిన ప్రతా పరుద్రగజపతికుమారుఁడైన వీరభద్రగజపతిని పారిజాతాప హరణ మను గ్రంథమున జెప్పినట్లు "కరుణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్". రాయచూరుయుద్ధమునం దోడిపోయి తురుష్కసైన్యము నదిని దాటి పారిపోవుసమయమున తన సైనికులు నఱకుచుండ జూచి రాయలవారు తమసైన్యము నట్లు చేయవల దనిచెప్పి వారిజీవముల రక్షించియుండుటలో రాయలవారు తమయౌదార్యమును జూపియుండిరి. ఇట్టివే వీరిచరిత్రయం దనేకములైన విశేషఘట్టములను జూపవచ్చును.

రాయలు ధార్మికు డనియు న్యాయపథము ననుసరించెడివాఁ డనియు జెప్పుటకు తా వ్రాసిన ఆముక్తమాల్యదయందు వ్రాసినధర్మనీతియే తార్కాణము. అందు వ్రాయఁబడినధర్మములన్నియు నిదివరలో పెద్దలు వ్రాసినధర్మములే తిరిగి భాషాచాతుర్యముచూపి వ్రాయఁబడినవి. ధర్మములను వ్రాసియున్నందున వానిని వా రనుసరించిరా లేదా యను సంశయము వేయుమాట. వారిమనోగతాభిప్రాయములు వారిచే వ్రాయఁబడిన ధర్మనియమములవలన తేటపడగలవు.

## 13. రాజధానివర్ణన

రాయలవారి మహౌన్నత్యమునుగూర్చియు వారికీర్తి ప్రతాపమహిమములనుగూర్చియు వారిరాజ్యవిస్తీర్ణతనుగూర్చి వారిసామ్రాజ్యవైభవమును గూర్చియు వ్రాసినవారు వారి సమకాలికులైన పోర్చుగీసుచరిత్రకారులే. పోర్చుగీసువారు మనదేశమునకు రానిచో మనదేశములోని రాజులలో నెల్ల మేటి యని ప్రఖ్యాతివడసి తురకలధాటి కడ్డుపడి యప్రతిమాన

ప్రతాపముచే వారల నోడించి తా నపజయ మనునది యెట్టిదో యెఱుఁగక యిరువదియేండ్లు మహావైభవముతో రాజ్యముచేసి 1530-వ సంవత్సరమునఁ గీర్తిశేషుఁడైన యీమహారాజుచరిత్ర మనచెవిని బడెడిదికాదు. సమకాలికులైన పోర్చుగీసువారితో రాయచూరువద్ద రాయలవారికి తోడ్పడిన "ఫిగరీడో" యను రాయభారి వెంటవచ్చిన పేయసనునాతఁడు రాయలరాజ్యమును చక్కఁగ వర్ణించెను. దానిని విపులముగ నెఱుంగఁగోరువారు తెనుఁగున "వీరభద్రరావు"గారు రచించిన "జీర్ణకర్ణాటకరాజ్య" మను గ్రంథమును, నాంగ్లేయభాషయందు "సూయెల"లనువారు వ్రాసిన "విస్మృత సామ్రాజ్య"మను (The Forgotten Empire) గ్రంథమును జదువవలెను. ఆ పుస్తకములలోని యంశములు కొన్నిటి నిందు వ్రాయుచున్నాను.

## నగరద్వారములు

"పట్టణమున కాఱుమైళ్లయావలినుండి యడ్డముగ డెబ్బదిమైళ్లపొడవున వ్యాపించి నగరమునుజుట్టియున్న పర్వత మాలికనుండియే పట్టణములోని కందందు మార్గము లున్నవి. ఇవియే నగరద్వారములు. ఇవితప్ప నగరప్రదేశమునకు మార్గాంతరములు లేవు. బలిష్ఠములైన ప్రాకారములీపర్వతశ్రేణులనడుమ నున్న సమతలముల నావరించి కొండల నొండొంటితో బంధించి యున్నవి. ప్రజలు నడుచుటకు మంచి బాటలు కలవు. అవి యాప్రాకారద్వారముల మూలముననే పోవుచున్నది. ఆద్వార ములు వీరభటసంరక్షితములై యొప్పును. పర్వతమాలికలలో నందందుగల సరోవరములు నగరములోని తోటలకును పరి. పొలములకును జీవనాధారములై యున్నవి.

### సాగలాపురద్వారము

పశ్చిమదిశనుగల ద్వారములలో సాగలాపురము (Hospet) ద్వారముదగ్గఱ నున్నది. గోవానుండి వచ్చెడి బాట యొక్కటి యీద్వారముననే విద్యానగరమును ప్రవేశించు చున్నది. కనుక నిది బలాఢ్యములగు ప్రహరులతోడను దుర్గముల తోడను సుభద్రమై యున్నది. కోటగోడకుఁ బార్శ్వభాగ మునజలప్రపూర్ణములైన యగడ్తలు గలవు. రాజసదనము నగర మధ్యప్రదేశమున నున్నది. ఆప్రదేశభాగమున రాజ్యభవనము వరకుఁగల వీథులు - దండనాథులయు - సామంతప్రభువు లయు-మనోజ్ఞములైన సౌధములచే నొప్పుచుండును. గృహములు నానావిధచిత్రములచే నలంకృతములై రామణీయకములై విరా జిల్లుచున్నవి. రాజాంతఃపురభవనమునకు ముందుభాగమున సువిశాల సమతల మొండు గలదు. నగరమధ్యమున నుండుటచే నీసమతలము మిగుల ప్రయోజనార్హముగ నున్నది. రాజనగరము పోర్చుగల్ దేశపురాజధానియైన లిస్బను(Lisbon) నగరదుర్గమున కంటె నధికస్థల మాక్రమించుకొని దుర్భేద్యమును సురక్షిత మునునగు ప్రహరిచే నొప్పియున్నది. మఱికొంతదూరము పోవునెడల సుందరతరములగు సౌధవాటికలచేఁ జెలువొందెడు నింకొకవీథి వచ్చును. అది ధనాఢ్యుల కావాసభూమి. అందు నవరత్నములును నానావిధవస్త్రములును ప్రపంచమునంగల ప్రతివస్తువును వెలకు లభించును.

"ఈనగరమున ననర్ఘములైన మణులయు వజ్రములయు వ్యాపార మత్యధికము. ఇందుచే నిం దన్ని తెగలవారును జేరుట కవకాశ మేర్పడుచున్నది. ఈనగరవైశాల్య మొక

వైపునుండి నిర్ణయించుట యసాధ్యము. నే నొకపర్వత మెక్కి కొంతవరకు విస్తారభాగము చూచినాఁడను. నగరమంతయు ననేకపర్వతశ్రేణులనడుమ నుండుటచే గొంతప్రదేశము మాత్రమే నాకు గోచరమయ్యెను. నేను చూడఁగల్గినభాగము రోము (Rome) నగరమంత యుండి కడుమనోజ్ఞముగ నున్నది. దానిలో వనములు తటాకములు నీటికాలువలు నున్నవి. తురకవీథికిఁ దరువాత నొకకాలువ ప్రవహించుచు జామ నారింజ నిమ్మ పనస పోఁక మామిడి మున్నగుతోటలకు సమృద్ధిగ జీవనము నొసఁగుచు వానిని చక్కఁగ బెంచి యాభాగము నొక మహారామసదృశముగ నొనర్చినది. అసంఖ్యాకముగను నగణితముగను నున్న యీమహానగరసంఖ్యను గూర్చి నే నిం దుదాహరింపను. అది యతిశయోక్తిగ నగపడునేమో యని భయము.

"విజయనగరము లోకమునందలి సమస్తవస్తుసముదాయమునకు నాకరమగు పట్టణము. పలుదెఱఁగులైన ధాన్యము లిందు సమృద్ధముగ ఫలించి మిక్కిలి చౌకగ లభించును. గోదుమపంట తక్కువ. ముఖ్యములైన పండుగ దినములలో రాయలు విద్యానగరమున నుండి సనాతన సంప్రదాయానుసారము విందులు వినోదములలోఁ బాల్గొనుచు. ఈయుత్సవసందర్భములందుఁ బ్రభుత్వమువారు సామ్రాజ్యమునఁగల మహారాజులు రాజులు దండనాయకులు మొదలగు వారిని కుటుంబపరివారసహితముగ నాహ్వానింతురు. రాష్ట్రము నందలి నాటకత్తియల నందఱను బిలిపింతురు. కాని యుద్ధ

మునకు వెళ్లియున్నట్టియు సామ్రాజ్యపు మేరలను గావలి యున్నట్టియు సేవలనుమాత్రము రప్పించుట లేదు."

ఈవిషయమునుగూర్చి వ్రాయుచు "డాక్టరు బార్బోసా" యనుపోర్చుగలు దేశస్థుఁడీనగరము నైశ్వర్యమును నౌచిత్యమును ఉత్కృష్టతనుగూర్చి నీవిధముగ వ్రాసియుండెను.

"వీథులును చౌకులును మిగుల విశాలములైనవి. అన్ని దేశములయు అన్నిమతములయు జనులు తఱుచుగ నీ నగరమునందుగూడి మిక్కిలి క్రిక్కిరిసి లెక్కకుమీరి యుందురు. ఈపట్టణమున వ్యాపార మపారముగ జరుగును. పెగు (Pegu) నుండియు లంకనుండియు విగు ఁలకైమైనసొమ్ము లనేకము లిందు గలవు. నరసింగ (విద్యానగర) రాజ్యమున నొక వజ్రపు గనియు దక్కనురాజ్యమున మరియొక్కటియు నున్నందున నీదేశములోనే వజ్రము లనేకములు గోచరించుచున్నవి. ఆర్మజు (Ormuz) సీలు (Co-I) దేశములనుండి దిగుమతియగు ముత్యములును చిన్నముత్యములును సరిగబుట్టాలపట్టును రక్తాంబరములును పగడములును విశేషముగ నిందు గన్పట్టును. రాజకీయోద్యోగులతోడను గవర్నర్లతోడను రాజ్యాంగ వ్యవహారములనుగూర్చి మాటలాడుగృహమొకటి రాజున కున్నది. వారందరును బోయీలు మోసికొనితెచ్చు వెలగల పల్లకీలలో వచ్చుచుండిరి. పల్లకులును గుఱ్ఱపురౌతుసమూహములును రాజనగరద్వారముకడ నెల్లప్పుడు పడిగాపులుండును. సొంతపైకముతో గొన్న గజాశ్వములలో నీరాజునకు వలయు 900 యేనుగులును 20,000 కంటె నెక్కువైనగుఱ్ఱములును నిలువయుండును."

విజయనగరము కొండలచేఁ జుట్టఁబడియున్నది. ఈ కొండలలోఁ బట్టణము లోపలికి వచ్చుటకును వెలుపలికిఁ బోవుటకును వీలైన మార్గము లున్నవి. ఇవి తప్ప నీ పట్టణమునకు వేఱుమార్గములు లేవు. ప్రతిమార్గము మొదటను నొకగుహ యున్నది. అచ్చట మార్గరక్షణార్థమై నియమింపబడిన కొందఱుభటు లుందురు. ఈకొండలనడుమ ననేకజలాశయములును సారవంతములైన పెక్కుభూములును గలవు. పశ్చిమమున నాగలాపుర మను నొకగొప్పపట్టణము కట్టఁబడియున్నది. అది కొండలచేతను బురుజులచేతను సురక్షితమైయున్నది. ఇచ్చటనే రా జెప్పుడును నివాసముచేయుచుండును. ఇందుచే నచ్చట వర్తకము వృద్ధియై యాస్థానము పెక్కురు వర్తకులు నివసించుచో టయ్యెను.

ఆయూరినడుమ నొకపెద్దచెఱువు త్రవ్వఁబడియుండెను. ఇప్పుడు మన మినుపగొట్టములగుండ నీరు దెప్పించుకొనున ట్లప్పు డచ్చటివారు ఱాతిగొట్టములగుండ నీరు దెప్పించుకొనుచుండిరి. ఇచ్చట నొకదేవాలయము గట్టింపఁబడినది. ఈనాగలాపురమునుండి విజయనగరమునకుఁ బోవుమార్గమున నిరుప్రక్కలను బాటసారుల సుఖముకొఱకు ననేకవృక్షములు నాటఁబడియుండెను. విజయనగరముచుట్టును బలాఢ్యమైన గోడ యొకటి గలదు. ఈగోడను జుట్టుకొని యనేకములైన తోఁటలును వరిపొలములు నున్నవి. ఈగోడకు కొంచెము దూరముగా నింకొకప్రాకారము గలదు. విజయనగరము నందంతటను బెక్కుచక్కనిగృహములును ఉన్నతములైన మేడలును నేత్రానందకరములయిన మందిరములు నున్నవి.

ఈపట్టణమున రాయల కొక విశాలభవనము గలదు. ఇది పోర్చుగీసువారి రాజధానియైన "లిస్బన్" అనుపట్టణముకంటె నెక్కువచోటు నాక్రమించుకొనియుండెను. ఇది మిగుల బలాఢ్యమై దుర్భేద్యముగా నుండెను. ఈమందిరమును దాఁటినవెంటనే రెండు గొప్పదేవాలయములు గనఁబడును. అందొకదానిలోఁ బ్రతిదినమును గొఱ్ఱెలను మేఁకలను బలి యిచ్చునాచారము గలదు. సంవత్సరమున కొకసారి యా దేవున కుత్సవము గావించి యం దనేకవిగ్రహములతో నీ దేవుని రథ మెక్కించి యూరేఁగింతురు.

కొన్నివీథులలో ననేకవిధములరత్నములను విలువగల వస్త్రములను విక్రయించెదరు. ప్రతిదినము సాయంకాలము జరుగుసంతలో నశ్వాదిజంతువులను ఫలములను శాకములను నింకను ననేకవిధవస్తువులను విక్రయించెదరు. అచ్చటవలయు వస్తువులన్నియు దొరకును.

ఈనగరములో నొకమూలను "మూరు"లను తురుష్కులు నివసింతురు. వీరు రాయలవద్ద వేతనములు గొని సైనికులుగా నుండిరి. ఇచ్చట వజ్రములు మొదలగు నమూల్యమణుల వర్తకము విరివిగా జరుగుచుండెను. ఇచ్చట దొరకని వస్తువే లేదు. గువ్వలు పావురములు మొదలగు పక్షులను విక్రయించెదరు. అచట నదులను దాఁటుటకై గుండ్రముగా తోలు చుట్టబడిన "పుట్టి" యని పిలువఁబడు నొక రకము పడవలు కలవు. ఇవి గుండ్రముగనుండి ప్రవాహమున గిరిగిరఁదిరుగుచు బోవును. ఈపుట్టినిఁబట్టియే "నీపుట్టిమునుఁగ" యనుసామెత పుట్టినది. ఈనగరమున విట్ఠలాలయము, విరూపా

తాలయము నను రెండుగొప్ప దేవళములు గలవు. ఇవి యాత్రి కులచే దొడ్డమహిమగలవిగా నెన్నబడుచుండెడివి. ఈ దేవా లయములకు పెద్దపెద్దగోపురములు గలవు. గోపురములపైఁ జిత్రములైన యనేకవిగ్రహములు చెక్కఁబడినవి. మహారాష్ట్రుండు గర్భాలయములోనికి బ్రాహ్మణులు దప్ప తక్కినవారు పోగూడదనునియమము కలదు. ప్రతియేటను జరుగునుత్సవములకు రాజు విజయనగరమునకు వచ్చియుండును. ఆయుత్సవదినము లందు స్త్రీలు తమనృత్యములను, మల్లురు మల్లయుద్ధములను, నటులు నాటకములను, మాంత్రికులు (గారడీవాండ్రు) తమ వినోదములను జూపి రాజుచే తమతమయోగ్యతకుఁ దగురీతి సన్మానింప బడుచుందురు. రాత్రులయందు బాణసంచును గాల్చెదరు.

యుద్ధముచేయుటకు పదిలక్షలుసైన్యము ముంచబడినది. ఇంకను గావలసిన నెక్కువగా రప్పించుసామర్థ్యము రాజునకుఁ గలదు. ఇచ్చట సేనాను లద్భుతపరాక్రమముగలవారును మిగుల ధనికులు నై యున్నారు. సేనాధిపతులే సైన్యములకు జీతము లిచ్చెదరు.

నాగలాపురమునుండి యీశాన్యదిశగా విశాలమైన మార్గ మొకటి కమలాపురముద్వారా విద్యానగరరాజమందిర ప్రాంగణమువరకు వెళ్లుచుండెను. ఈమార్గమున నాగలాపుర మున కొకటిన్నరమైలుదూరమున శ్రీకృష్ణదేవరాయనిచే నిర్మింపఁబడిన యనంతశయనాలయము కలదు. ఈ యాలయ మునకు సింహద్వార ముత్తరాభిముఖమై యున్నది. ఇందలి గర్భాలయము చతుష్కోణాకృతిగల పెద్దమండపము. ఈదేవా

లయమునందు విష్ణువిగ్రహమును ప్రతిష్ఠించుట కుద్దేశింపఁబడెను. కాని యేకారణముననో యీవిగ్రహ మిపుడు హొసపేటలో నున్నది. ఈయాలయముయొక్క గోడ లిపుడు శిథిలావస్థయందున్నవి.

నాగలాపురమునకు రెండున్నర మైళ్ల దూరమున మల్పనగుడి యను గ్రామ మున్నది. ఈగ్రామమునకు కొంత దూరమున చేనిలో వలయాకారముగల్గి నష్టకోణాగారరూపమున నెనిమిదికమానులతో నిర్మింపఁబడిన వసాగా యను వసారావరకునచ్చుటకు రాతిసోపానములునుగల్గి చూపఱకు నయనోత్సవదాయకముగ నుండెడిబావి యొకటి కలదు. ఆబావి నొక వారకాంత త్రవ్వించెను. దీనిపేరు సూళెయబావి. ఇచ్చటికి సమీపముననే మహమ్మదీయనాయకులసమాధులు కొన్ని గలవు.

ఈవీథి మిక్కిలి విశాలవంతమై యిరుపార్శ్వముల నిండ్లవరుసలు కడుచక్కగ నిర్మింపఁబడియుండెను. బాటసారులకు నీడ నొసగు పెద్దపెద్దవృక్షము లీబాటవెంబడి పెంచబడెను. ఈవీథియందు వరుసగ ననేక వస్తుసామగ్రులను విక్రయించెడి యంగడు లుండెడివి. ఈమార్గముననచ్చెడివర్తకులపై సుంకములను వసూలుచేయుట కొకసుంకగృహ ముండెడిది. ఈవీథి జనాకీర్ణమై కిటకిటలాడుచుండెడిది. ఇపు డీచిహ్నము లేవియు నచటఁ గనబడవు.

## క్రీడాగృహము

కమలాపురమునుండి కంప్లిమీఁదుగ వాయవ్యమూలగ వెళ్లినచో అంతఃపురావరణమును అంతఃపురస్నానగృహము,

నున్నవి. ఈగృహము మిక్కిలి రామణీయకముగ నున్నది. పాలరాతితో తయారు చేయఁబడియున్నది. పైనకమలము చిత్రింపఁబడియున్నది. మహమ్మదీయపద్ధతిలో నీగృహము తయారుచేయఁబడియున్నది. దీనికిచుట్టు నొకగోడ కలదు. అందు నాల్గువైపుల ద్వారము లున్నవి. ఈమందిరమధ్యమున ముప్పదియడుగుల చదరమై యేడడుగుల లోఁతుగలట్టియు స్నానగృహమునుండి దిగుటకు సోపానములుగలట్టియు రాతి గొట్టములతో తుంగభద్రానదినుండి తేఁబడిన నీటితో నింప బడినట్టియు రాజును వారియంతఃపురకామినులును వినోదార్థ మేతెంచి జలక్రీడలగావించునట్టియు క్రీడాగృహ మొకటి కలదు.

## నీటికొలను

ఈస్నానగృహమునకు బశ్చిమమునను నచటికి సమీప మునను ఎనిమిదడుగులలోఁతు గలిగి ముప్పదిగజముల వెడల్పు గల్గి దాదాపు నూరుగజములపొడువుగల నీటికొల నొకటి కలదు. దీనికిని రాతిగొట్టముల మార్గమున తుంగభద్రా నదినుండి నీరు వచ్చును. రాజాంతఃపురమున నివసించెడిపరివార జనమునకును రాజదర్శనార్థమైవచ్చిన నితరప్రముఖవర్గము వారికి నిది స్నానార్థమై యుపయోగింపఁబడెడిది. ఇచటనే యీఁత పందెములుకూడ జరుగుచుండెడివి.

## మజ్జనశాల

ఈస్నానగృహమున కనతిదూరమున నొక మజ్జనశాలయు చంద్రశేఖరుని దేవాలయమును నున్నవి. మజ్జనశాలయం దొక చిన్నకొలను కలదు. మజ్జనశాలలో నేకశిలామయమగు నొక

తెల్లనిగాఁ తొట్టె యుండెను. ఈతొట్టెలో పండుగదినములలో పాలుపోసి యుంచెడివారు. ఈక్షీరము నచటికి యుత్సవ సందర్భమున వచ్చెడి బీదజను లుపయోగించుచుండెడివారు. అచ్చటనే యింకొక రాతితొట్టెయు దానిచుట్టు ననేకరాతి ఫలకము లుండెడివి. ఈ రాతిఫలకములయందు భోజనము చేయుటకు వీలుగనుండునట్లు పల్లములు చేయబడెను. ఈ పల్లములైన రాతిపలకలయందు బీదలు భోజనము చేయుటయు రాతితొట్టెలోని నీటిని త్రాగుటయు నాచారముగ నుండెడిది.

కృష్ణదేవరాయలు ప్రథమమున గజపతిరాయలతో యుద్ధముగావించి జయించినపుడు తనయంతఃపురస్నానగృహ మునకు వాయవ్యమూలను తనవిజయమును సూచించు విజయ మందిరము నొకదానిని కట్టించెను. దీనినే "దసరాదిబ్బ" యనియు పిలిచెడువారు. ఇదియే సింహాసనవేదిక. ఈవేదికయం దిముడ్చఁబడిన శిల్పకళ యద్భుతమైనది. వేదికకు క్రింద భాగమున నైదువిగ్రహములు చిత్రింపఁబడినవి. వీటిని జను లందరు పంచపాండవులవిగ్రహము లని తలంతురు. ఈవేదికకు చుట్టుఁగల రాతియందసంఖ్యాకములగువిగ్రహములు చిత్రింప బడియుండెను. ఆనాటివేషములు వస్తువాహనాదికములు చరిత్రవిశేషము లావిగ్రహముల రూపమున ప్రకటింపఁబడెను. యశ్వారోహణము వీరులయారేగింపులు వేశ్యాంగనలనృత్య ములు మృదంగవాయిద్యములు వేటకాండ్ర మృగయా వినోదము లీరాతిఫలకములయందు మిక్కిలి మనోహరముగ చెక్కఁబడినవి. ఆకాలమున దసరామహోత్సవమున జరిగెడి వినోదములన్నియు నచట చిత్రింపఁబడెను. ఈవిగ్రహము

లన్నియు బహురామణీయకములై మనోహరములై హృదయరంజకములై నొప్పారుచుండెను. ఈదేశమునం దింతటి యపూర్వమగుచిత్రములు మరియింకెచటను గానరావు. తెల్లని రాతియందు దీవిగ్రహములు విస్పష్టముగను స్ఫుటముగను కనబడుచున్నవి.

### రాజసందర్శన గృహము

ఇచటికి సమీపముననే రాజసందర్శనగృహ మొకటి కలదు. ఇచట మహర్నవమి యుత్సవసందర్భమున రాజు వేదికపై గూర్చుండ రాజును సందర్శింపవచ్చిన సామంతనృపులు, దండనాయకులు, నాయకులు శ్రీమంతులు విదేశరాయబారులు, సంచారులు, చరిత్రకారులు, కవులు, గాయకులు మొదలయినవారొక్కరొక్కరుగవచ్చి వారివారికానుకలను రాజుగారి కొసంగెదరు. ఇచటనే రాయలభార్యలు నవరత్నఖచితసర్వాభరణాలంకృతలై బంగారుకలశముల చేతబూని కరదీపికాసహస్రములు వెలుంగ రాజచంద్రునకు నీరాజన మర్పింతురు. ఇచటనే లలితకళాప్రదర్శనములకు నవకాశ మొసంగఁబడుచుండెను.

### హజారరామాలయము

రాజగృహమునకు ముందర నీరామాలయ మున్నది. రాయలవారు సూర్యోదయకాలమునకే స్నానమాచరించి యంతఃపురావరణమున నున్న దేవాలయమున కరిగి కులాచారానుష్ఠానవిధులఁ దీర్చుకొనెడివారని "పేయసు" చరిత్రకారుఁడు వ్రాసియుండెను. ఆయాలయమే రామాలయమై యున్నది. ఈయాలయము రాజనగరునకును రాజగృహమునకును ముందుగ నున్నందున "హజారరామాలయము" అని

పిలువఁబడెను. ఈగుడిలో నొకద్వారముయొక్క కుడిపార్శ్వ మునసున్న గోడమీఁద వ్రాయఁబడిన శాసనమువలన నీదేవాలయము కృష్ణదేవరాయనిచే క్రీ. శ. 1513 వ సంవత్సరమున చైత్రశుద్ధపంచమినాఁడు నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది. రాయ లాసమయముననే యీ దేవాలయ కైంకర్యమునకై నైదూళ్లు మాన్యముగ నిచ్చి యొకచెఱువును త్రవ్వించి ధారా పూర్వకముగ సమర్పించియుండెను.

ఈ దేవాలయముయొక్క పడమటిభాగమున రామ చంద్రవిగ్రహ మున్నది. కొంతభాగము నల్లటిరాతిచేతను మరికొంతభాగము పసుపునీలములుచేరి యాకుపచ్చవర్ణముగల రాలచేతను కట్టఁబడియున్నది. ఈదేవాలయమునందలి గోడల మీఁదను పైకప్పులమీఁదను ననేకచిత్రములను చిత్రించి వాటికి నిప్పటికిని వన్నె మాయనిరంగులు వేసియుండిరి. పైభాగమంతయు యుద్ధసంబంధములైన చిత్రములతో నింపఁబడెను.

## రాణిమందిరము

ఈ దేవాలయమున కుత్తరభాగమున పెద్దప్రాకారము గల్గిన పెద్దయావరణ గలదు. ఆయావరణమున మధ్యభాగమున విశాలమైన రాణీమందిర ముండెడిది. అంతఃపురస్త్రీలు తమ్మితరులు చూడకుండ నిందు వసించుచు బయటనుండు చిత్రములు గమనించుటకు వీలుగనుండున ట్లీమందిరము తయారుచేయఁబడెను. ఇప్పు డిదియంతయు శిథిలమంది యున్నది.

## మంత్రాలోచనమందిరము

ఈ యావరణమున నిప్పటికిని నిగ్గులుగుల్కుచు నిన్న నేఁడు కట్టినట్లు చూపరుల కానందజనకమయిన రెండతస్తుల

సుందరతర మగు పాలరాతి మేడయొకటి కలదు. ఇదియే మంత్రాలోచనమందిరము. ఇందు స్తంభములు హెచ్చుగ నున్నవి. ఈభవననిర్మాణమునందు హిందూమహమ్మదీయశిల్ప నైపుణ్యములు సమ్మేళనము నొందినవి.

## గజశాల

ఒక్కొక్క గజమునకు వేఱువేఱుగా నొక్కొక్కగది చొప్పున మిగుల బలమైన గోడలతో నున్నతములై విశాలములగు నంతరములు గల్గి సుమనోజ్ఞము లయిన గోపురములతోఁ గూడిన యొకగజశాల యేర్పాటుచేయఁబడియున్నది. ఈగజశాలయందు పదనొకండేనుగు లుండుటకు పదనొకండుగదు లున్నవి. ఇందులో మధ్యగదికి పైన నొకచదరపుబురుజు కలదు. బహుశః ఇది పట్టపుటేనుగశాలయై యుండవచ్చును.

## దస్తరములకొట్టు

ఇచటికి సమీపముననే రాజకీయపత్రములు నితరములగు కాగితములను దస్తరములయందు కట్టగట్టియుంచుటకై యొక కొట్టు కట్టఁబడియుండెను. ఈకట్టడపుచసారాలో కరణములు తమలెక్కలను తయారుచేయుచు కూర్చొనియుందురు.

## పొలిమేరదేవత

ప్రాకారమునకు వెలుపలిద్వారమున కావలివైపున రెండుదేవాలయము లుండె ననియు నందొక దేవాలయమున నొకదేవత కనేకములైన గొఱ్ఱెలను బలియిచ్చుచుండిరనియు "పేయసు" చరిత్రకారుడు వ్రాసియుండెను. ఆదేవాలయములలో నొకటిమాత్రమే యిప్పుడు కనబడుచున్నది. అదియే పొలిమేరదేవత.

## మసీదు

రాజనగరమున మహమ్మదీయులు నివసించుట కొక ప్రత్యేకవీధియు వారు తమదేవుని ప్రార్థనచేయుట కొకమసీదును నిర్మింపఁబడియుండెను. విజయనగరాధీశులు పఠాయి మహమ్మదీయరాజ్యములతో కయ్యమునకు కాలుఁ ద్రవ్వియున్నను తమరాజ్యమున నివసించెడి మహమ్మదీయులతో సామరస్యభావముతో నుండియున్నట్లే నిదర్శనములు చాటుచున్నవి.

## టంకశాల

రాజసందర్శనశాలకు నైరృతిదిశను ప్రభుత్వపు టంకశాలయుండెడిది. ఇది యిప్పుడు నాశనముచేయఁ బడినది. గోడలు మాత్ర మిపుడు చూడనగును.

## నరసింహవిగ్రహము

పంపాపురమార్గమధ్యమున నొక పొలమున వీరనరసింహవిగ్రహ మున్నది. శ్రీకృష్ణదేవరాయలవారు 1525 వ సంవత్సరమున నీవిగ్రహము నేకశిలలోఁ జెక్కించినట్లును తదీయారాధనకై కొంతమాన్య మిచ్చినట్లును నొకశాసనమువలన తెలియవచ్చుచున్నది. ఈవిగ్రహమునందలి కొన్నిముఖ్యభాగములు పగులఁగొట్టఁబడినవి. నరసింహస్వామి ముక్కు లేకుండుటచే నిపుడు చూచుటకు భయంకరముగ నుండును. ఈవిగ్రహభాగములు కొన్ని కుప్పలుగ నిప్పటికిని చూడనగును.

## పంపానగరము: హంపి

ఈపంపాపురము పూర్వపు విద్యానగరరాజుల ప్రధానపట్టణము. విరూపాక్షుని దేవాలయ మిచట నుండుటవలన నిది

దక్షిణకాశి యని ప్రఖ్యాతి వడసినది. ఈపట్టణము కొండల మధ్యభాగమున నొక చదును పీటభూమిపై నిర్మింపఁబడిన పట్టణము.అది రాయలవారు రాజ్యముచేసిన కాలమున జనాకీర్ణమై కిటకిటలాడుచుండెడిది. ఈపట్టణముయొక్క జనసంఖ్య దాదాపు ముప్పదిలక్షలు. ఈపట్టణముఁయొక్క యుత్తరభాగమున తుంగభద్రానది యతివేగముతో నిరుకైనకొండల మధ్య గొప్పప్రవాహముతో పారుచుండును. ఇచటి కొండప్రదేశమున మిక్కిలి నునుపైనరాళ్లు దొరికెడివి. ఈరాళ్లవలన నాకాలమున శిల్పకళ మిక్కిలి వ్యాప్తిచెందియుండెను. ఈమెత్తనికాంతులతో విలసిల్లు రాతితో నీపట్టణమున నాకాలమున ననేకభవనములు నిర్మింపఁబడెను.

"పంప"యనునామము పురాణప్రసిద్ధము. తుంగభద్రకిది వేఱొక నామము. పంపాదేవినిగూర్చి యొక గాథ కలదు. పంపాదేవి బ్రహ్మకుమార్తె యనియు నామె యీ మాల్యవంత పర్వతప్రాంతములో జరించుచు నచటచట పూచినపుష్పముల నేకరించి యచటి ఋషిపుంగవులకు మిక్కిలి భక్తితో సమర్పించుచుండెననియు నామెభక్తికి మెచ్చి ఋషిపుంగవులు వరమిచ్చిరనియు నావరప్రసాదమున మహాదేవుఁడగు విరూపాక్షదేవుఁడీమెకు భర్త యాయె ననియు పంపావిరూపాక్షు లిద్దరును భార్యాభర్తలుగ నీ పంపానగరమున నుండిరనియు వారికి విరూపాక్షదేవాలయ మిచట నిర్మింపఁబడెననియుఁ జెప్పుదురు. విరూపాక్షునికి రెండవభార్య భువనేశ్వరి. ఇద్దరుభార్యలతో విరూపాక్షుఁడును నీయాలయమునఁ బ్రతిష్ఠింపఁబడిరి. ఈపంప యను నామమే కన్నడభాషయందు హంప యనియు లోకుల

నోటబడి హంప "హంపి" యాయెననియు, దీని నిపుడు హంపీ నగరమని వాడుచున్నారని తెలియుచున్నది. ఈహంపీ నగర సామ్రాజ్య శిథిలములన్నియుఁ జూడనగును.

## విరూపాక్షాలయము

విరూపాక్షునికి నిర్మింపఁబడిన దేవాలయము మిక్కిలి పురాతనమైనది. శ్రీకృష్ణదేవరాయలవారు తమపట్టాభిషేక మహోత్సవసందర్భమున నీదేవాలయమున రంగమండపమును నిర్మించి పూర్వోత్తరద్వారగోపురములను కట్టించిరి. తూర్పున శ్రీకృష్ణదేవరాయల యాజ్ఞానుసారముగ నత్యున్నతమైన గాలి గోపురము నొకదానిని విట్టప్పయనుశిల్పి కట్టెను. ఈ దేవాలయ మునకు దగ్గఱనే భువనేశ్వరాలయమును కలదు.

విరూపాక్షాలయపు గాలిగోపురమున కెదురుగనున్న వీథి మిక్కిలి పెద్దదై యున్నది. ఇది ముప్పదియైదడుగుల వెడల్పు గలిగి దాదా పెనిమిదివందల గజములపొడవు గలదియై యున్నది. ఈవీథి కిరుప్రక్కల ముఖ్యులైన రాజ్యాధికారుల భవనము లుండెడివి. ఇచటనే రాజమందిరము నుండెను. ఉత్సవ సమయములలో రాయలవారిమందిరప్రాంగణమున నుండి కూడ వినోదముల వీక్షించుచుండి రని "పేయసు" చరిత్రకారుఁడు వ్రాసియుండెను.

ఈపురవైభవమును గూర్చి వ్రాయవలయునన్న నెంతై నను వ్రాయవచ్చును. ఆకాలమున నీవైభవమును జూచినచరి త్రకారు లీవిషయమునుగూర్చి వ్రాసి తమతమ దేశపురాజు లకుఁ బంపి ప్రకటించియుండిరి. ఆచరిత్రలన్నియు నిప్పటికి ప్రక టింపఁబడియే యున్నవి. ఈవిషయములనుగూర్చి యెక్కువగా

తెలిసికొనఁగోరు వా రాయాచరిత్రలను జదివి యానందింతురు గాక. ఈచిన్నిపొత్తమునం దింతకంటె విపులముగ వ్రాయుట కవకాశము లేదు.

## తిమ్మరసుమంత్రి

ఈతఁ డఖండ ప్రతిభాశాలి, అనుపమధీవిశాలుఁడు, ప్రచండ రాజకార్యధురంధరుఁడు. అప్రతిమానరాజనీతి శాస్త్రజ్ఞుడు. నిరుపమానప్రతిభాధుర్యుఁడు.

ఇతనిపేరు తిమ్మరసు. ఇంటిపేరు సాళువవారు. ఇతని గోత్రము కౌండిన్యసగోత్రము. ఇతఁడు వేమరాజునకు పౌత్రుఁడు; రాచిరాజునకు పుత్రుఁడు; నాదెండ్లవారిదౌహిత్రుఁడు.

పేరునుబట్టియు, నింటిపేరునుబట్టియు, నీతఁడు క్షత్రియ వంశీయుఁడని కొందఱు ఊహించుచున్నారు. తిమ్మరసులోని "అరసు" శబ్దము కర్ణాటభాషలో రాజశబ్దమునకుఁ బర్యాయ పదము. తిమ్మరాజును తిమ్మరసని పిల్చెడివారు. వీరిపూర్వికులు మొదటనుండియు సాళువవంశజులైన రాజులవద్ద మంత్రులుగ నుండెడివారు. సాళువవంశజులు క్షత్రియులైనందునను తిమ్మరసుపేరులోని "అరసు" రాజపదముయొక్క పర్యాయపదమైనందునను నీ తిమ్మరసు క్షత్రియుఁడని వ్రాసియుందురే కాని మఱివేరు కాదు. వీరు బ్రాహ్మణులనియు నారువేలనియోగులనియు ప్రబలనిదర్శనము లున్నవి. మంగళగిరిలోని దేవాలయ స్తంభముమీఁద శాసనమున నీతిమ్మరసు నియోగిబ్రాహ్మణుఁడని వ్రాయఁబడియున్నది. సింహాచలములోని దేవాలయమున నున్న శాసనమున

"సాళ్వతిమ్మనృపతిః ద్విజన్మాగ్రణిః"

యని వ్రాయఁబడియుండుటచేత నీతఁడు బ్రాహ్మణుఁ డనుటయే సత్యము. తిమ్మరసు మేనల్లుఁడైన నాదెండ్ల అప్పయామాత్యునికి, మాదయ్యగారిమల్లన తాను వ్రాసిన రాజశేఖర చరిత్రము నంకితముఁజేయుచు నాగ్రంథమున మల్లన అప్పయామాత్యునిఁగూర్చి "ఆరువేలవంశవార్ధిపూర్ణ చంద్రమా!" యని వ్రాసియున్నందున అప్పయామాత్యుఁ డారువేలనియోగి బ్రాహ్మణుఁ డని స్పష్టపడుచున్నది. వీరి మేనమామయగు తిమ్మరసును నారువేలనియోగిబ్రాహ్మణుఁడే యనుట నిర్వివాదాంశము.

తిమ్మరసు, గోవిందరాజు లిద్దరన్నదమ్ములు. వీరు చిన్నతనమున చాఁబీదవారై యుండిరి. వీరితల్లిదండ్రులు నాసమయమునసే మగణించినందున వీరు మేనమామయగు నాదెండ్ల చిట్టిగంగనవద్ద విద్యనభ్యసించుచుండిరి. చిట్టిగంగన చంద్రగిరియందు రాజువద్ద మంత్రిగ నుండెను. ఈగంగనయే తిమ్మరసుకు విద్యాబుద్ధులుచెప్పించి అర్థశాస్త్రమును రాజనీతిశాస్త్రమును నేర్పించెను. తనవద్దనే ప్రథమమున దివాణములో లేఖరిగ నుద్యోగమున ప్రవేశపెట్టెను. తిమ్మరసు తనప్రతిభ వలన కొద్దికాలముననే పెద్దపదవినిపొంది గంగనామాత్యుని మరణకాలమునకు తుళువనరసరాజువద్ద గౌరవములు పొంది ముఖ్యమంత్రిపదవిని సంపాదించెను. తిమ్మరసు తన ప్రజ్ఞావిశేషములవలన ఒహుజనశ్లాఘాపాత్రుఁడై తనయశోవైభవమును నలుదిక్కుల వ్యాపింపఁజేసెను.

తన కార్యనిర్వహణప్రతిభచేతను తనప్రజ్ఞావిశేషముల చేతను రాజ్యమునం దెట్టియుపద్రవములు కలుగకుండ కాపాడెను. ప్రతివిషయమునుగూర్చియు బాధ్యతగల్గిన ప్రతిమనుష్యునిఁగూర్చియుం దాను తెలిసికొని, వారిబుద్ధిని, వారిస్వభావమును, వారినైసర్గికగుణములను, వారితలంపులను, గుణశీలవృత్తములను కనుగొని వారితో మెలఁగుచుండెడివాఁడు. అధికారవిషయములనే గాక రాజాంతఃపురమునందు ప్రతిదినము జరుగుచుండెడి సకలవిషయములను కుట్రలను తగవులను తెలిసికొని యెవరి నేరీతి మర్యాదచేసి సమాదరింపవలెనో వారి కాప్రకారము మర్యాదచేసెడువాఁడు. రాజ్యమునందుగాని, నగరమునందుగాని, పట్టణములయందుగాని, పల్లెలయందుగాని, రాజాంతఃపురమునందుగాని యెంతరహస్యముగనైనను ఎట్టికార్యముజరిగినను తిమ్మరసు ఆవిషయమునుగూర్చి తత్క్షణమే తెలిసికొని రాజును, రాజబంధువులను, పట్టపురాణులను, అధికారులను, ఉద్యోగులను, నిరుద్యోగులను, దాసదాసీజనమును మంచి వినయవిధేయతలుగల్గి వర్తించునట్లు ప్రతివారి నదుపాజ్ఞలయం దుంచెడివాఁడు. ఇట్లు చెప్పసంతమాత్రమున నీతనికి విరోధులు గాని ప్రతికక్షులుగాని లే రని తలంచుటకు వీలు లేదు. అయితే వీరికి గల "అత్యధికమైనప్రతిభయు, అప్రతిమానమైనప్రజ్ఞయు అత్యద్భుతమైన మేధాశక్తియు అకళంకమైన సామ్రాజ్యభక్తియు అత్యనుపమానమైనసమున్నతయు అప్రతిబద్ధమైనయాజ్ఞయు, వీటినన్నిటిని మించి యథాపూర్వమును క్షాత్రమును కరుణయు కటాక్షమును బ్రహ్మతేజస్సును ప్రతిపక్షుల

భయకంపితులనుజేయఁగా వారెల్లరును తిమ్మరుసు ననువర్తించు వారైరి."

"పేయస"ను పోర్చుగీసుచరిత్రకారుడు తిమ్మరసును గూర్చి యీ క్రిందివిధముగ వ్రాసియుండెను.

"Salvatinica who is the principal person that enters the building, supervises the whole, for he brought up the king and made him king and so the king looks on him like father. Whenever the king calls to him he addresses him as Lord (Sentor) Salvatinica and all the captains and nobles of the realm make salaam to him."

"రాజమందిరమును ప్రవేశించువారిలో ముఖ్యుఁడగు సాల్వతిమ్మరసు అచటివిషయములనన్నిటిని సరిచూచును. అతఁడే రాజును పెంచి పెద్దవానినిగఁజేసి రాజుగఁజేసెను. అందువలన రాజు తనని తండ్రివలె గౌరవించును. రాజు వారిని పిలిచినపుడెల్ల "అప్పాజీ" యని పిలుచును. రాజ్యము నందలి యమరనాయకులు పెద్దలు వారికి సలాములుచేయుదురు." అని పేయసు వ్రాసియుండెను.

కృష్ణదేవరాయని పెంచినవాఁడు తిమ్మరసు. పెద్దవానిని జేసినది తిమ్మరసు. విద్యాబుద్ధులు నేర్పినవాఁడు తిమ్మరసు. రక్షించినవాఁడు తిమ్మరసు. పోషించినవాఁడు తిమ్మరసు. రాజ్యాభిషిక్తునిగఁజేసినవాఁడు తిమ్మరసు. దిగంతవిశ్రాంతయశస్కునిగఁ జేసినవాఁడు తిమ్మరసు. ఇది యది యన నేల? తిమ్మరసు లేనిదే కృష్ణదేవరాయఁడు లేఁడనియే చెప్పవలసియున్నది. అట్టితిమ్మరసు యొక్క అంత్యదశ చిత్రవిచిత్రమైనది. అట్టిమహామహునికి జరుగవలసినదికాదు. అది దైవప్రేరితము విధికృతము.

## రాయలకాలములోని నాణెములు

కృష్ణదేవరాయనికాలమున వాడుకలో నుండిన నాణెములలో బంగారువి రాగివి మాత్ర మిపుడు కొన్ని మద్రాసు మైసూరు ప్రదర్శనశాలలయం (Museum) దున్నట్లు తెలియ వచ్చుచున్నవి. ఇప్పుడున్న నాణెములపైన నీ విగ్రహములు జూడనగును.

1. శ్రీ వేంకటేశ్వరస్వామి
2. బాలకృష్ణుఁడు
3. గరుడుఁడు
4. శివుఁడు-పార్వతి
5. నంది.

పై విగ్రహములలో మొదటిమూఁడు విగ్రహములు విష్ణునంశముగల విగ్రహములు. మిగిలినవి రెండు శివచిహ్నములుగలవియై యున్నవి. ఈ నాణెముల రెండవవైపున సంస్కృతాక్షరములు లిఖింపఁబడియున్నవి. ఈసంస్కృతాక్షరము లాయారాజుల నామధేయములై యున్నవి. నాణెములు సామాన్యముఁగ గుండ్రముగనున్నట్లు బార్బోజా వ్రాసియుండెను.

బంగారునాణెములు మూఁడు విధములైనవి.

1. వరహా.
2. అర్ధవరహా
3. వరహాలో పదవవంతు ఫణము.

వరహానే "పరదో" యనియు "గద్యాణ" మనియు చెప్పె వారు. "వరహా" యను పేరునుబట్టి యొకప్పు డీనాణెముపైన "వరాహావతారపు" బొమ్మ చిత్రింపఁబడియుండెనని చెప్ప

వచ్చును. వరాహమును చిత్రించిన నాణెములు చాళుక్యుల కాలమున నుండెడివి. వరహాలలో కొన్ని గట్టివరహాలు కొన్ని దొడ్డగరహాలు మరికొన్ని శుద్ధవరహాలని మూడువిధములు. వీటిలో నొకదానికి నింకొకదానికి భేదము తెలిసికొనుటకాధారములు లేవు. "వార్తిమ" యను పాశ్చాత్యచరిత్రకారుడు దిరువది పణములు వగహాయనియు అబ్దుల్‌రజాకను మహమ్మదీయ చరిత్రకారుడు పదిపణములే వరహా యనియు వ్రాసియుండిరి. ఈభేద మెట్లువచ్చెనో తెలియదు. ఒకటి గట్టివరహా రెండవది శుద్ధవరహా యైయుండవచ్చును. ఇవికాక చక్రవరహా యని యింకొక నాణె ముండెడిది. ఆనాణెముపైన చక్రముండెడిది. ఈనాణెములు గాక మాడయనునాణె మింకొకటి కలదు.

ఈపైన వ్రాసిననాణెములు బంగారునాణెములు. ఇవి గాక వెండినాణెము లుండెడివి గాని అవి యెవ్వియో మనకు తెలియుట లేదు.

పణము కాసు రాగినాణెములు. వాటివిలువనుగూర్చి మన కంత స్పష్టముగ తెలియదు.

విజయనగరరాజ్యములోని నాణెములు విజయ నగర సామ్రాజ్యమునందే గాక హిందూదేశమందంతటను చెలామణి యగుచుండినట్లు మనకాధారములు గలవు. బార్బోజా చరిత్ర కారుడీవిషయమును గూర్చి క్రీ. శ. 1516వ సంవత్సరమున వ్రాయుచు "పెనోడా నరసింహరాజు రాజ్యమునందలి కొన్ని నగరముల యందు ముద్రించబడి హిందూదేశమునందంతట ను పయోగింపబడుచుండెను" అని వ్రాసియుండెను.

## 14. రాజ్యాంగము : కేంద్రప్రభుత్వము

—◎ రా జా ◎—

మహారాజు తనరాజ్యమున సర్వస్వతంత్రుఁడు. ఆతని నడ్డుపెట్టఁగల వా రెవ్వరును లేరు. ఇట్లు చెప్పినంత మాత్రమున నాతఁడు విచ్చలవిడిగ నిచ్చవచ్చినరీతిని జనుల బాధల పెట్టునని చెప్పుటకు వీలులేదు. రాజు లెంత స్వాతంత్ర్యము న్నను ధర్మానుబద్ధుఁడై యుండెడివాఁడు. ధర్మప్రకార మాచరింపనిచో పెక్కుచిక్కులు సంభవించును. హిందూధర్మశాస్త్రము ననుసరించి బ్రాహ్మణుఁ డెట్టి నేరముఁ గావించినను వానిఁ జంపుటకు వీలులేదు. ఈధర్మము న్యాయమైనను కాకున్నను దీనిని ధర్మశాస్త్రజ్ఞులు మార్చననేతప్ప ఇతరత్ర యీన్యాయము ననుసరింపవలసినదే.

కృష్ణరాయ లెంతస్వతంత్రుఁడైనను యీధర్మమున కొకానొక సందర్భమున బద్ధుఁడు కావలసివచ్చెను. తాను రాజ్యముచేయు కాలముననే క్రీ. శ. 1524-వ సంవత్సరమున తనకుమారునికి రాజ్యపట్టాభిషేకముఁగావించి తానే ప్రధానమంత్రిగనుండి తనకు సాళువతిమ్మరసుమంత్రిని సలహాదారునిగ నియమించుకొనియుండెను. ఇట్లు జరిగిన యెనిమిదిమాసములకు తన కుమారుఁడైన పసిరాజు తిరుమలదేవుఁడు జబ్బుపడి చనిపోయెను. కాని పసిరాజు చనిపోయిన కొద్దికాలముననే సాళువ తిమ్మరసు యొక్క కుమారుఁడైన తిమ్మదన్నాయకుఁడు చంపెనని వార్త రాజ్యమున ప్రబలెను. ఇది తనకుఁ దెలియవచ్చినంతనే కృష్ణదేరాయ లాగ్రహ పరవశుఁడై పిల్లవాఁడైన తిమ్మదన్నాయకుని వాని తండ్రియగు తిమ్మరసును వారి వాండ్రనందరిని

కారాగృహము నం దుంచెను. బందీగనుండగ తిమ్మదన్నాయ కుఁడు ఖైదునుండి పాఱిపోయి కొంతసైన్యముఁజేర్చుకొని కృష్ణరాయనికే యెదురుతిరిగెను. ఈతిరుగుబాటు నతిశీఘ్ర కాలముననే యణచివైచి తిమ్మదన్నాయకుని తిరిగి బంధించి చెఱ యందుంచి యాతనికండ్లను మాత్ర మూడదీయించి వైచి యా తనిని గ్రుడ్డివానిగఁజేసెను. దీనినిగూర్చి వ్రాయుచు "న్యూని స"ను చరిత్రకారుఁడు బ్రాహ్మణుఁడుచేసిననేరమున కాతఁడు వధార్హుఁడేయైన నప్పటి ధర్మశాస్త్రమునకు బద్ధుఁడై కృష్ణరా యల ట్లాతనినివధించుట కంగీకరించక గ్రుడ్డు పీకించెనని విమ ర్శించి యుండెను. గనుక నేరమెంతచెడ్డదైనను, అపరాధి వధార్హుఁడైనను ధర్మానుసరణముగ రాజు అతనిని వధింప నుత్తరువీయఁజాలకపోయెను.

మరియు రాజు తనయిచ్చవచ్చినరీతి నాచరించి జనుల బాధపెట్టుట కేలాటి యాటంకము లేకున్నను ప్రజాభిప్రాయము నకు భిన్నముఁగ బ్రవర్తించినయెడల జనులు తమయిండ్లను దేశ మును వదలి పరదేశములకుఁబోవుటయు నట్లు వారువెళ్లుటవలన నా దేశము జనవిహీనమై రాజునకు రాఁదగిన రాఁబడి రాకుండు టయు నందువలన రాజునకు నష్టముకల్గుటయు జరుగును. ఇది యెట్లున్నను కృష్ణరాయలు తాను రాజ్యము చేసినంతకాల మిట్టినిరంకుశ చర్యల నెన్నడును జరిపినట్లు కనఁబడదు. అయితే కృష్ణరాయల తరువాత రాజ్యముచేసిన వారికాలమున నిరంకుశత్వము ప్రబలినట్లును జను లా నిరంకుశచర్యలను భరింపఁజాలక తమదేశమును విడనాడి వెళ్లుటయు నందువలన. రాజ్యసౌభాగ్యసంపదలకు హానికల్గుటయు తదనంతర మారాజ-

తన నిరంకుశప్రభుత్వమునకుఁ బశ్చాత్తాపముఁ దెలిపి సక్రమప్రభుత్వమున రాజ్యమేలినట్లును వలసఁబోయినజనము తిరిగి తమదేశమునకు వచ్చినట్లును క్రీ. శ. 1563-వ సంవత్సరపు శాసనమువలన విదితమగుచున్నది.

## మంత్రి

రాజనీతిప్రకారము సప్తాంగములలో నొకటి మంత్రిబలము. మంత్రిలేనిరాజ్యము తొండములేని యేనుఁగును బోలియుండును. దీనినే యొకకవి యిట్లు వ్రాసియుండెను.

క. మండలపతి సముఖమ్మున, మెండైన ప్రధానిలేక- మెలఁగుటయెల్లన్
గొండంత మదపుటేనుఁగు, తొండము లేకుండినట్లు దోచుర సుమతీ

రా జెల్లపుడు తనరాజ్యమున నున్న సచివప్రముఖుల సలహా ననుసరించి రాజ్యపరిపాలనము జేయవలసియున్నందున తనవద్ద ప్రఖ్యాతపురుషుల నట్టిమంత్రులుగ నేర్పరచుకొన వలయును. అవసరమైనపుడు సరియైనవారి కొఱకు వెదకి కొనుట సరికాదు. అందువలన మంచివారిని మంత్రులుగ తనవద్ద రాజు నియమించుకొనవలెను. కృష్ణరాయ లెల్లపుడు బ్రాహ్మణులనే యేర్పాటు చేసికొనెడివాఁడు. కృష్ణదేవరాయలు మంత్రుల నేర్పాటు చేసికొనుటలో మంచికట్టుదిట్టముల చేసికొనెడివాఁడు. రాయలవారు బ్రాహ్మణులనే నమ్మి వారికే మంత్రిపదవుల నొసగెడివారు, బ్రాహ్మణులయెడుం వారి కుండు విశ్వాసము మెండు. వారివిశ్వాసమును తమ మంత్రు లెవ్వరు చెఱుపలేదు. అందువలన వారివిశ్వాసమును సరియైన దనియే చెప్పనగును. నిజము చెప్పినచో వారిరాజ్య సంపదయు వారిరాష్ట్రసౌభాగ్యమును చాలవరకు మంత్రియగు

సాలువతిమ్మరసుయొక్క యుక్తి యుక్తమైన పరిపాలనవలెనే పెంపొందినది. రాయలవారివద్ద సాలువతిమ్మరసు మాత్రమే గాక రాయసముతిమ్మరసు, కొండమరసు, అయ్యపరసు, రామభట్లయ్య మొదలుగా గల ననేకబ్రాహ్మణులు వారికి సహాయులుగ నుండిరి.

"నూన్యునిసు" చరిత్రకారుఁడు వ్రాయుచు బ్రాహ్మణులు చాల నమ్మదగినవా రనియు ప్రచండమైన తెలివితేటలు గలవా రనియు లెక్కలు వ్రాయుటలో నేర్పరు లనియు సన్నని మనుష్యులేయైనను రూపవంతులే యనియు బలిష్ఠులే యనియు వ్రాసి చాకిరిచేయుటకుఁ బనికిరా రనియు వ్రాసియుండెను.

రాయలవారి వద్ద లెక్క కెందఱు మంత్రులుండిరో తెలియదు గాని యున్నవారుమాత్రము రాయలవారియిష్టమున్నంతవరకు వారివద్ద మంత్రిత్వముచేసియుండిరి. వారికి సాలువ తిమ్మరసు ప్రధానమంత్రి. రాజునకు దరువాత రాజంతటివాఁడు. సమస్తజనులు సామంతులు నాయకులు, ప్రభువులు మొదలయిన వారందరు తిమ్మరసుమంత్రి మన్ననలయం దుండెడివారు. రాజకీయవిషయములం దన్నిటియందును నీ తిమ్మరసు మంత్రికే అగ్రతాంబూలము. వీరుగాక యింకొక యుపప్రధానియు భాండాగారికుఁడు నుండువారుగాని యుపప్రధాని చేయుపను లెవ్వియో తెలియుటలేదు. రాయవాచకమునుబట్టి ధర్మాసనాధికారి యని యింకొకమంత్రి యుండినట్లు తెలియుచున్నది. భాండాగారికుఁ డనఁగా కోశాధికారి. ధర్మాసనాధికారికి ధర్మము న్యాయనిర్వహణముపై నధికార ముండెడిది. ఇంక నితరమంత్రు లుండిన నుండవచ్చునుగాని వా రెవ్వరో

వా రేయేపనుల నిర్వర్తించుచుండెడివారో యిపుడు తెలియుట
లేదు.

### రాజసభ

మంత్రులతోపాటు రాచకార్యములను చక్కఁబెట్టుట
కొకరాజసభ యుండెడిది. ఇదియే కార్యనిర్వాహకసభ. రాజు
చేయవలసిన పనులనుగూర్చియు, చక్కబెట్టవలసినకార్యములనుఁ
గూర్చియు రాజసభలో సమాలోచించుట సామాన్యముగ
నుండెడిది. ఒక్కొక్కప్పు డీసలహాదారులు రాజుమాట నటు
పెట్టి తమతమ యిష్టము వచ్చినట్లు చేయుటయు కలదు. అట్లు
మంత్రు లేకీభవించి చేసినపుడు రాజుగారి యధికారము నిరర్థక
మగుచున్నది. రాయలవారు ప్రథమమున పట్టాభిషిక్తుఁడైనపు
డొకసారి వారు కోరినవిషయమున సంజాయిషీ నీయకుండుటచే
వారు నిస్పృహఁజెంది రాత్రివేళ నగరమునకు మామూలుగ
గస్తీకిపోయి తిరిగి నగరికిరాకుండుటయు తిమ్మరుసుమంత్రి విషయ
మును కనుగొని తాను సైన్యమునంతను బయలుదేరదీసి రాయల
వారున్న దేవాలయమువద్దకు వేఁటయనుమిషమీఁద బయలు
దేరుటయు నిదివరలో వ్రాసియుంటిమి. ఆసమయమున రాయల
వారు తమలో తా మిట్లనుకొన్నట్టు రాయవాచకమునం దీవిధ
ముగ వ్రాయఁబడియున్నది.

“రాయలవారు తమచిత్తాన సింహాసనపరభారమునకు కర్తలజేసినమాత్రం
ఇంతేగాని సకలప్రపంచమున్ను సామాజికలు ముఖాంతరముగానే
నడుస్తావున్నది తమమాట పలుకులు యెవ్వరు వినేరు అధికారతరుణ
మందు స్వాతంత్ర్యముగా నడిపిస్తే మంత్రభిన్నమై కార్యములు
కొనసాగదు. కాఁబట్టి వాకిటి చిన్నపెద్దలు తమరయ్యే తెలుసుకొని
వొఖకార్యం నడిపిస్తే అప్పుడు తమకు స్వతంత్రముగా నడుచును.

ఈపైన వ్రాసినదానినిబట్టి వ్యవహారమంతయు రాజు ఇష్టములేకనే సామాజికల యిష్టమువచ్చినట్లు జరుగుచుండెనని స్పష్టపడుచున్నది.

కృష్ణదేవరాయలవారికాలమున నీరాజసభ యెట్లుండునో మనుచరిత్రమునం దీవిధముగ వర్ణింపఁబడియెను.

సీ. ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల, శరదిందుముఖులు చామరము లిడగ
బణిసూనుకణాదబాదరాయణసూత్ర, ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వభూవి నభీరుభటకదంబ కరాళ, హేతిచ్ఛటచ్ఛాయనిరులుకొనఁగ
సామంతమండనోద్దామ మాణిక్యాంశు, మండలం బొలసి యీరెండఁగాయ
మూరురాయరగండ పెండారమణిమ,రీచిరించోళి గలయ సావృతము లగుచు
నంకపాళినటద్దుకూలాంచములు, చిత్రమాంజిష్ఠ విభ్రమశ్రీ వహింప

క. భువనవిజయాఖ్యసంస,ద్భవనస్థితసింహపీఠి బ్రాజ్ఞాలగోష్ఠిం
గవితామధురిమ డెందము ,దవులం గొలువుండి సదయతన్నను బల్కెన్.

చక్కనిస్త్రీలు వింజామరలు వీచుచుండ, వైయాకరణులు తార్కికులు శాస్త్రజ్ఞులు తమతమశాస్త్రములను గూర్చి యుపన్యసించుచుండ నిరుప్రక్కలభటులు తమచేతులలోని కత్తులను ఝుళిపించుచుండ, రత్నాభరణములుదాల్చిన రాజులు కొలిచి యుండ, కవులయొక్కయు పండితులయొక్కయు తియ్యని వాక్కులు తనమనంబు నానందపఱచుచుండ తనకాలధరించిన పెండారములయందలి మణులకాంతులు ప్రసరించుచుండ తెల్లని పట్టువస్త్రములధరించి భువనవిజయ మను సభాభవనమున మూరు రాయరగండఁడని ప్రసిద్ధిగాంచిన శ్రీకృష్ణరాయలు సింహాసనాధిష్ఠుఁడై యుండెను.

ఈసభ "భువనవిజయము" అను నామమును కల్గియుండెను. ఈసభ కమరనాయకులు, వారి ప్రతినిధులు, ఉద్యోగస్థులు, సామంతులు, ప్రభువులు, దళవాయులు, వర్తకులు, రాయబారులు, పండితులు, కవులు, తత్త్వజ్ఞులు, మతస్థులు మొదలగునవారందరు వచ్చుచుండెడివారు. ఈసభలలో వల్లభాచారి, చైతన్యుడు, వ్యాసతీర్థులు, తాతాచారి మొదలగునపండితులు తమతమ ప్రాశస్త్యమునుగూర్చి దీర్ఘోపన్యాసములనిచ్చి చర్చలజరపు చుండిరి. ఇట్టిసభలలోనే అలసానిపెద్దన, తిమ్మన, ధూర్జటి, రాధామాధవుడు మొదలయినకవిశేఖరులు వారివారిపాండిత్య ప్రకర్షకై బహూకరింపబడిరి. ఇంతగ వర్ణింపఁబడిన సభాభవనము మిక్కిలి పెద్దదై యుండవలెను. ఇంత పెద్ద సభాభవనము రాచకార్యముల నిర్వహించుటకు పనికిరాదు. అందువలననే రాయలవారు రాచకార్యములనుగూర్చి యాలోచించునపుడు తానును తనమంత్రులును కలసి కార్యాలోచనసభను వేఱుగ జరుపుచుండెడివారు. ఈరాచకార్యాలోచన సభనుగూర్చి "పేయసు" చరిత్రకారుఁ డిట్లు వ్రాసియుండెను.

> "(అచటినుండి) రాయలవారు ముందొకఁడవగా వేయబడి పైనుండి క్రిందవరకు చక్కఁగ నద్దబడిన బట్టలతో పరివేష్టింపఁబడినయున్న యొక యింటిభాగమున చేరి...అచట తనరాజ్యములోని యధికారులతో ముచ్చటించి నగరపాలనము జేయుచుండెను...ఇట్లు వీరితో సంప్రతించినపిదప తనకై బయటవేచియున్న యితరపెద్దలను వ్యవహర్తలను లోనికి పిలిపించును."

దీనినిబట్టి రాచకార్యనిర్వహణార్థమై జేయబడెడి కార్యాలోచనసభ వేరనియు రెండవది పెద్దరాజసభ వేరనియు తెలిసి

కొనవలసియున్నది. ఈకార్యాలోచనసభ యిప్పటి Working Committee, Privy Council, Executive Council మొదలయినసభలను పోలియుండెడిది.

ఆముక్తమాల్యదయం దీసభలనుగూర్చి వ్రాయుచు నీ సభ్యులు వీలగునంతవఱకు బ్రాహ్మణులుగ నుండవలయు ననియు అందును వయసు ముదిరి దాదాపు ఏఁబదిసంవత్సరములకు పైఁబడి డెబ్బదిసంవత్సరములకు లోపలనుండువారుగ నుండవలయు ననియు రాజనీతిశాస్త్రము తెలిసినవారై యుండవలె ననియు వ్రాయఁబడియున్నది. అట్టివారు లభించినపుడు ధర్మము తనదృష్టిపథమున నుంచుకొని తుదిపర్యవసానమును తానే నిర్ణయించుకొనుచు నితరుల నీపనికి నియమించి వ్యవహారము కొనసాగింపవచ్చుననియుకూడ నీపద్యములయందు వ్రాయఁబడియుండెను.

ఈరాజసభ కందఱుసభ్యులు రావలయునన్నవిధి లేదు. ఈసభలు బహిరంగములైనవియు కావు. కృష్ణరాయలవారి సభల నెక్కువతఱచుగ జరుపుచుండెడివారు. ఈసభానిర్ణయములను రాజు పాటింపవలసిన విధియు లేదు. రాయలవారాదిల్షాహాంపై యుద్ధముచేయుక పూర్వము ఆయుద్ధమును నిశ్చయించుకొని తిమ్మరసు మొదలయిన మంత్రులతోకూడిన నీసభను సమావేశపఱచి వారితో నీవిషయమునుగూర్చి సంప్రతించియుండెను. ఈసమావేశమయిన సభలో ప్రథమమున తిమ్మరసుమంత్రి చెప్పినసలహాను రాజుగాని యితరసభ్యులుగాని అంగీకరించి యుండ లేదనియు, సభికులెల్లరును యుద్ధము వలదని రాయలవారితో వాదోపవాదములు జరిపినను వా రందుల

కంగీకరింపలేదనియు రాజొక్కరుఁడే బాధ్యత వహించి యుద్ధముచేయుటకు నిశ్చయించె ననియు, చివరకు యుద్ధ మొకటనండి ప్రారంభించవలయుననెడి విషయమున సభ్యుల యభిప్రాయముతో నతఁ డంగీకరించెననియు నీ నూనుచరిత్ర కారుఁడు వ్రాసియుండెను. దీనినిఁబట్టిచూడ కొన్ని విషయము లలో రాజు సభ్యులయభిప్రాయముల ననుసరించుటయు మరి కొన్ని విషయములలో వారియభిప్రాయమును నిరాకరించు టయుఁ గన్పించుచున్నది. గనుక సభ్యులయభిప్రాయము ప్రాముఖ్యముగాదని తెలిసెను ప్రతివిషయమునందును రాయల వారు సభ్యులతో సంప్రదించియే వారిచ్చువచ్చినరీతినే వ్యవహ రించుచుండెనని స్పష్టపడుచున్నది. ఏదియెట్లున్నను, రాయల వారికి తిమ్మరసుపై మిక్కిలి విశ్వాసముండెననియు వారిసలహా సహాయమువలననే తనరాజ్యము నంతనైపుణ్యముతో పరి పాలించి ప్రఖ్యాతిపొందెననియు చెప్పుటలో నెట్టి యతి శయోక్తియు లేదు.

## రాజ్యమునందలి వ్యవహారకర్తలు లేక కార్యనిర్వాహకులు

ఈవిజయనగరసామ్రాజ్యమున ద్రవ్యసంబంధపు లెక్క లను వ్రాసి జాగ్రత్తగ నుంచెడివారిని సంప్రతు లని యనఁగా కరణము లని యందురు. ఇట్టివారు తొంబ్బదుగు రుండి రని రాయవాచకమువలన తెలియుచున్నది. నరసింహ రాయలకాలమున "తొమ్మిదిసంప్రతులనున్ను పిలువనంపగా కరణాలువచ్చి పదునెనిమిది రేవుల లెక్కలున్ను వినిపించి" రని యొకచోటను "ఒకనాడు కొలువులోపలను కరణీకుల పిలువనంపి వారలతోను కర్ణాటక రాజ్యానకు యెన్నిలక్షలరాజ్యములుకు

ఆ రాజ్యములో గిరిదుర్గ, స్థలదుర్గ, వనదుర్గ, జలదుర్గములు ఎన్ని? కోటలు ఎన్ని? నగరములు గ్రామభూములు ఎన్ని? ఏయేదుర్గాలకు యెంతనగరిబొక్కసానవుండె? రొక్కరూపాయలకున్ను నవరత్నభూషణములకున్ను స్థాపించివుంచిన నిక్షేపములకున్ను శివమణియగార్లమీద చెల్లునిలువకున్ను, వివరముగా లెక్కవ్రాసి తెచ్చి చదువుచుని తొమ్మిదిసంప్రతులకును విన్నపంజేసినది" యని వ్రాయుటచేత సంప్రతులనఁగ కరణాలనియు వీరిప్పటి గ్రామకరణాలవలెగాక రాజ్యమంతకు కరణము లనియు అనఁగా రాజ్యమునందలి యంశముల నన్నిటినిఁగూర్చి వ్రాయఁబడు లెక్కలన్నియు వీరే తయారుచేయుచుందురనియు అట్టివారు రాజ్యమునందు తొమ్మిదిమందిమాత్రమే యుండిరనియు తెలియుచున్నది. ఈతొమ్మండుగురు కరణములయొక్క ప్రత్యేక విధు లెట్టివియో తెలిసికొనుట కాధారములు లేవు గాని వీరు మాత్రము రాజ్యములోని అన్నివిధములైన లెక్కలను తయారుచేయుచుండెడివారని మాత్రము తెలియుచున్నది. ఈ కరణము ప్రస్తుతప్రభుత్వములలోని సెక్రటరీలు నిర్వర్తించెడు కార్యములనే నిర్వర్తించియుందు రని మన మూహింపనగును. వీరిలో నల్లాలనాథుఁడు చిన్నభాండారమున కధిపతియని రాయవాచక గ్రంథమునుబట్టియే తెలియుచున్నది.

## చిన్న, పెద్ద, భాండారములు:—Treasury.

రాయలవారి రాజ్యమున రెండుభాండాగారము లున్నట్లు మనకు రాయవాచకమువలననేమి పేయసుచరిత్రకారుని వ్రాతలవలననేమి తెలియుచున్నది. శాసనములను బట్టి బంగారుభాండాగారమనియు రవ్వలభాండాగారమనియు రెండు

భాండాగారము లున్నట్లు కనబడుచున్నది. రాయవాచకములోని చిన్న పెద్దభాండాగారములును శాసనములలోని బంగారు రవ్వలభాండాగారములు నొకటియే యైనయెడల చిన్న భాండాగారము బంగారు భాండాగార మనియు పెద్దభాండాగారము రవ్వలభాండాగార మనియు మన మూహింపనగును." ఇది యెట్లున్నను రెండు భాండాగారము లుండెననుట నిస్సంశయము. "విద్యారణ్యులవారు యీపట్నం గావించేటప్పుడు సింహాసనస్థునికి నిక్షేపించినది తొంభయి తొమ్మిదికోట్ల యాభైయారులక్షల ద్రవ్యంగాక భూషణములు నాల్గుకోట్లున్ను, నవరత్నములు ఆరుకోట్లున్ను వున్నవి. అదిగాక యీవరకున్ను సింహాసనస్థులు సింహాసనమున్ను నడుపుకొని శెలవుశిద్ధాయలుపోగా బొక్కసానవుంచినది పందొమ్మిదికోట్ల యాభయారులక్షలద్రవ్యం." అని రాయవాచకమునందును "పూర్వపురాజులు అనాదినుండియు భాండాగారమునుంచెడి యాచారముకలదనియు ఆయారాజు చనిపోయినపిదప నాభాండాగారమును జాగ్రత్తగా తాళమువైచి సీలుచేసి యితరులకు కనబడకుండ దాచెడివారనియు, అందలిద్రవ్యమును రాజ్యమునందు ప్రత్యేకావసరముగల్గిననే కాని వాడుకొనెడి వారుకారనియు" పేయసుచరిత్రకారుడును వ్రాసియుండిరి. మరియు రాజ్యముచేసెడిప్రభువు పూర్వికుల భాండాగారమునుంచి తన భాండాగారమును ప్రత్యేకించెడు "వారనియు" కూడ పేయసు వ్రాసియుండెను. వీటినిబట్టిచూడ, పూర్వపురాజులభాండారము పెద్దభాండార మనియు రాజ్యము చేయుచున్న రాజుల భండాగారము చిన్నభాండాగారమనియు గూడ నూహింపవచ్చును.

ఈ రెండు భాండాగారముల లెక్కలను అల్లాలనాథుఁడే చూచు చుండె నని రాయవాచకమువలన బోధపడుచున్నది. క్రీ. శ. 1527-వ సంవత్సరమున రాయసం తిమ్మరసు బంగారుభాండాగార ముయొక్క వ్యవహారమును చక్కబెట్టుచున్న అధికారియని శాసనమువలన తెలియుచున్నది.

## ధర్మాదాయములు దేవాదాయములు

ధర్మాదాయ దేవాదాయములనుగూర్చి విచారణఁజేసెడు కార్యాలయ మొకటి యుండినట్లు ఆముక్తమాల్యదలో వ్రాయఁబడిన విషయములవలన తెలియనగును. రాజ్యమందలి దానశాసనముల నన్నిటిని ప్రభుత్వోద్యోగి యొకడు సరుకూర్చి జాగ్రత్తచేసెడివాడని శాసనములవలన తెలియవచ్చుచున్నది. రాయవాచక గ్రంథమువలన బ్రాహ్మణుల కీయఁబడిన సర్వాగ్రహా రములనుగూర్చి విచారించుటకు ధర్మాసనంధర్మయ్య యను ప్రభుత్వోద్యోగి యొకఁడుండినట్లును వానిని పిలువనంపగా ధర్మయ్యవచ్చి "ద్రావిడరాజ్యములో గల అగ్రహారములును ఆంధ్రదేశం, హొయిసలదేశం, మొరసునాడు, మొల్నాడు, కర్నాటకం, ఘట్టశీమ, చేర, చోళ, పాండ్య మగధ మళయ ఆదిగాగల అగ్రహారములను" గూర్చి రాయలవారికి వివరించి విన్నపం చేసినట్లున్న వ్రాయఁబడియున్నది. వీటినన్నిటినిచూడ ధర్మాదాయములను గూర్చి యొక ప్రత్యేక కార్యాలయ ముండె డిదని యూహింపనచ్చును.

## అదవన లేక ఆదాయమును సూచించు కార్యాలయము

గ్రామ, స్థల, సీమ, నాడు, రాజ్యముల సరిహద్దులు తెలియఁ జేయునట్టియు, గ్రామమునందలి భూస్వాముఁలయొక్కయు

వారివారికి గలభూములయొక్కయు వారు పండించు పంటల యొక్కయు వారు రాజ్యాధిపతికి ప్రతిసంవత్సరం అచ్చవలసిన శిస్తుమొత్తములను తెలియఁజేయునట్టియు లెక్కలు ప్రత్యేక ప్రత్యేకముగ నుంచినట్లు స్థలచరిత్రలను బట్టి కొంతవరకు తెలియుచున్నది. ఇదియే ముఖ్యమైన కార్యాలయము. దీనినే "అదవన" యనియు దీనివివరములను తెల్పువది "అదవన తంత్ర" మనియు తెలియవచ్చుచున్నది. "అదవన" యను పేరు 1515-వ సంవత్సరపు శాసనమునందు వ్రాయఁబడి యున్నది. ఈ ఆదాయపులెక్కలను జాగ్రత్తచేయువారగు అమరనాయకులఁగూర్చియు వారు సిద్ధము చేయవలసిన గుఱ్ఱములు ఏనుఁగులు కాల్బలము వగైరాలనుగూర్చియును కూడ లెక్కలనుంచియున్నట్లు తెలియనగును.

## గూఢచారులు

ఈకాలమున నొకరాజ్యముపై నింకొక పరిసరరాజ్యము వారికి విరోధము, అసూయ, అసహిష్ణుత హెచ్చుగనుండెను. అప్పటి కీప్రాంతమున హిందూరాజ్యములు తురకరాజ్యము లుండెడివి. హిందూరాజ్యములయం దొకరాజ్యమువారికి నింకొకరాజ్యమువారికి మనస్పర్థలు హెచ్చుగ నుండెడివి. రాయల వారు రాజ్యమునకు వచ్చినకాలమునకు కొండవీడులో రెడ్డి రాజ్య మంతరించి గజపతిరాజుల వశమయ్యెను. అంతటితో తృప్తిఁజెందక గజపతిరాజులు విజయనగర రాజ్యములోని కొన్నిభాగముల నాక్రమించిరి. రాయలపూర్వులు గజపతిరాజు లను కృష్ణానదికి ఉత్తరమువరకు పారఁద్రోలఁ బ్రయత్నించిరి గాని అట్లు చేయఁజాలరైరి. ఇది యిట్లుండ రాయలవారికిని

కురకల రాజ్యములకును విరోధములు హెచ్చుగ నుండెను. హిందూ మహమ్మదీయుల మధ్యకన్న మహమ్మదీయులలో వారిలో వారికి హెచ్చువైషమ్యము లుండెను. ఈ కారణముల వలన పరిసర రాజ్యములస్థితిగతు లెప్పటికప్పటికి తెలిసికొనుటకు రహస్యముగ తెలివిగలట్టియు విశ్వాసపాత్రులైనట్టియు చారుల నేర్పాటుచేయవలసియుండెను. అందువలన రాయలవారు ప్రతిదిన మాచరింపవలసిన విధ్యుక్తకర్మములలో నీ గూఢచారులతో సంప్రతించుట యొకవిధియై యున్నది. ఈ చారులనుగూర్చి వ్రాయుచు రాజధానియందు నివాసగృహము లుండువారుగను నానాభాషావిదులుగను ఇతరవేషముల నెఱుంగనివారుగను తమ్ము నితరులు గుర్తింపకుండునట్లుగ నుండవలెను. వీరికి కోరినదానికన్న కొంచెము హెచ్చుజీతమును ఇవ్వవలెనని ఆముక్తమాల్యదలో వ్రాయబడినది. రాయవాచకమున నీవిషయమునుగూర్చి యిట్లు వ్రాయబడియుండెను.

“గనుక కృష్ణరాయలవారు ఆనందమునొంది భూవిస్తారమున్ను, రాజ్యాంగములున్ను జూడవలెను అని నిశ్చయించి ముఖ్యులగు చారుల వలన ఆయాదేశములున్ను ఆయాస్థలములనుండేదొరలు మన్నెరికముల నడతలున్ను వారివారికలిమిబలములున్ను, గ్రామాదులున్ను, పల్లెపట్టణములున్ను, పండితపామరజనులు ఆడుకొనేవార్తలున్ను, కోటకొత్తళములయందలి పడవడికెలు తెలిసి నానాటిప్రవర్తనములున్ను గోప్యముగావచ్చి పలకరించేటట్టుగ కాలువేగంగలిగి బుద్ధిచాకచక్యులై బహుభాషాంతరములు తెలిసి బహురూపములుగానున్ను సంచరించి అంతరంగ వార్తలరయించేటట్టుగా విజయాపురం, ఆరగం, చెన్నపట్నం, శ్రీరంగ

పట్ణం, చదరంగపట్ణం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం, పుమ్మత్తూరు, శివసముద్రం, పెనుకొండ, గోలకొండ, గుర్రంకొండ, మేల్నాడు, మొరసునాడు, ఘట్టంశిమ, అరవరాజ్యం, మళయాళం, కొచ్చి, కోంకణం, కేరళం, విరాటపురం, వరాటదేశం, మగధదేశం, మత్స్యదేశం, విదర్భదేశం, కాంభోజనగరం, కాశ్మీరఖండం, ఢిల్లీనగరం, ఇవిమొదలయిన తావులకున్ను, తులువహైమ మొదలైనదక్షిణరాజ్యములకున్ను, చంద్రగిరి, గండికోట, కడప, నంద్యాల, బెల్లంకొండ, రాచూరు, ముదుగల్లు, నిడిగల్లు, మైసూరు మొదలయినస్థలములకున్ను, వేగర్లను నియమించి అంపించి పట్టణములసంచరించంగా అహంకరించినారానిన్ని, పరులతో వపోయినారని వినినానున్న వారిని అజ్ఞచేయమని కట్టడ చేసినారమని మీరందరున్ను నగరిఅజ్ఞమీరక నడచుకొమ్మని ఆనతిచ్చినారు"

ఈచారులు తమదేశమునకు సంబంధించిన విషయములనేగాక పరిసర రాజ్యవిషయములను గూడ శోధించి కనుగొనవలసియున్నందున వీరిపని మిక్కిలి కష్టముతో కూడుకొన్నదైయున్నది.

## రాయబారులు

ఈచారులుగాక రాయబారులు కూడనుండెడివారు. ఈరాజ్యమునసుండి పరిసరరాజ్యములకుఁ బోయెడువారు పరరాజ్యములనుండి యీరాజ్యమునకు వచ్చెడురాయబారులు నుండెడివారు. రాయబారులను మిక్కిలి గౌరవించి మర్యాద చేసెడివారు. ఈరాయబారుల నాకాలమున స్థానాపతులనియుఁ బిలిచెడివారు. తాము రాయబారులుగ నున్నపుడు పరరాజ్యములలోని విశేషములను తమరాజ్యమునకు తెలియఁజేయ

వలెను. గజపతిరాజుతో రాయలవారు యుద్ధము చేయుచున్న సమయమున రాయలవారి రాయబారి గజపతిరాజువద్ద నుండుటవలననే రాయలవారికి గజపతిరాజువద్దనున్న పదునార్గురు పాత్రులు లేకమై రాయలవారిని నాశనము చేయ ప్రయత్నములు జరుగుచున్నట్లు రాయలవారికి తెలియఁజేయఁబడెను. ఆముక్తమాల్యదలోఁ జెప్పినట్లు పరిసరరాజ్యముల రాయబారులతో "సరసశ్లాఘంబులు" సలుపవలయును. పరరాజుల అకృత్యములను కూడ గోరంతలుగ జేసి యుక్తియుక్తమైన మాటలతో దాటించి వారిమనసు నొప్పించక తమయుద్దేశమును బయలు పరుప వలయును.

## 15. రాష్ట్రీయప్రభుత్వము

### స్థానిక ప్రభుత్వము

రాయలకాలమున నిప్పటివలెనే గ్రామమే రాజ్యాంగమునందు ప్రాథమికభాగము. మూఁడు నాల్గుగ్రామములను కలిపి "స్థలము" అని పిలిచెడువారు. అనఁగా నీస్థల మిప్పటి ఫిర్కాతో సమానముగ నుండెడిది. కొన్నిస్థలములను కలిపి సీమయని పిల్చెడువారు. కొన్నిచోట్ల నీసీమనే "నాడు" అని వాడెడువారు. ఈనాడుశబ్దము దక్షిణహిందూస్థానమున మొదటినుండియు వాడుకలో నున్నది. కన్నడదేశములో నాడు అన నాల్గైదుసీమలయొక్క సమ్మేళనము. తెనుఁగుదేశమున నీనాడుకు సీమకు హెచ్చుభేదము కనుపించదు. ఒక్కొకచోట సీమకన్న నాడు ఇంకొకచోట నాడుకన్న సీమ హెచ్చు గ్రామములను కల్గియుండెడిది. ఇంకొకపుడు సీమనాడులమధ్య

భాగ ముండెడిది కాదు. నాడుకు పైని "రాజ్యముం"డెడిది. రాజ్యాంగమునం దీరాజ్యమే ప్రధానము. ఈరాజ్య మిప్పటి రాష్ట్రమునకు సరిపోవును. ఈరాజ్యము లన్నియు కలిసి సామ్రాజ్యమైనది. సామ్రాజ్యమునందలి అంగములనన్నిటిని సులభముగ తెలియగలందులకీ క్రింద నుదాహరించుచున్నాను.

| | |
|---|---|
| గ్రామము | ప్రాథమికము |
| స్థలము | కొన్ని గ్రామములు |
| నాడు-లేక-సీమ | కొన్ని స్థలములు |
| రాజ్యము | కొన్ని నాడులు-లేక-సీమలు |
| సామ్రాజ్యము | కొన్ని రాజ్యములు |

రాయలకాలమున విజయనగరసామ్రాజ్యమునం దెన్ని రాజ్యములుండెనో తెలియుట లేదు. ఈ రాజ్యములు దేశావసరములఁబట్టి మాఱుచుండెడివి. రాయలకాలమున ప్రతినిత్యము హిందూమహమ్మదీయుల పోరాటములు జరుగుచుండెడివి. హిందువులపైకి మహమ్మదీయులును మహమ్మదీయులపైకి హిందువులును పోరాటమునకు సిద్ధముగ నుండెడివారు. అందువలన వీలునుబట్టియు యుద్ధములయొక్క యవసరములఁబట్టియు నీరాజ్యములు మారుచుండెడివి. మొత్తముమీఁద రాజ్యమునకు ముఖ్యపట్టణమును స్థిరపరచుటలో నొకకొండయున్న స్థలముగాని మంచి కోటను నిర్మించుటకు వీలయిన ప్రదేశముగాని యేర్పాటు చేయఁబడుచుండెడిది. ఆముఖ్యపట్టణమునుబట్టి రాజ్యమును మారుచుండెడిది. రాయలవారివివాహకాలమున కీరాజ్యము లున్నట్లు శాసనమున వ్రాయఁబడియుండెను. (1) ఘనగిరి (ప్రస్తుతపు పెనుగొండ) (2) గుత్తి (3) కందనవోలు (కర్నూలు) (4)

చంద్రగిరి (5) ముల్బాగల్ (6) రాయదుర్గం, ఇవిగాక గండికోట స్థలం, సిద్ధవట్టం, పొట్టాపి, నాగవట్టం సీమలుకూడ ఆశాసనము నందే పేర్కొనఁబడియుండెను. రాయలవారు రాజ్యమునకు వచ్చినంతనే కావేరివద్దనుండెడి భాగమున యుద్ధముగావించి ఆక్రమించుకొని క్రొత్తరాజ్యము నొకదాని నేర్పాటుగావించి దానికి శ్రీరంగపట్టణమును ముఖ్యపట్టణముగ జేసిరి. గజపతి రాయనిపై యుద్ధముగావించి ఉదయగిరికోటను ముట్టడించి గజపతిరాజు నోడించినపిదప కొండవీటిరాజ్యము నేర్పాటు గావించెను. అదిల్షావాలుతో పోరాడి కృష్ణానది తుంగభద్రా నదులకు మధ్యస్థమై యున్న భూభాగమును స్వాధీనపరచుకొని రాయచూరురాజ్యమును రాయలవారే యేర్పాటు గావించిరి. ఇవిగాక బారకూరురాజ్యము, శ్రీశైలరాజ్యము, నల్లూరి రాజ్యము, హంపి, హస్తినావతిరాజ్యములును కూడ రాయల వారు ఏర్పాటు కావించిరి.

## రాజ్యాధిపతి లేక దుర్గదన్నాయకుఁడు

రాజ్యములను పరిపాలించుటకు దుర్గదన్నాయకులు యేర్పరచఁబడిరి. దుర్గదన్నాయకులే అమరనాయకులుగ నుండిరి. వీరు రాజ్యపరిపాలనముఁజేయుచు కొంతసేనను సామ్రాజ్యమునకు నప్పగించవలెను. అందుకు ప్రతిఫలముగ వీరి కమరమాగాణీలు తమ దేశమున నిచ్చుచుండిరి. వీరు రాజ్యపరిపాలకులేరైనను సామాన్యముగ విజయనగరరాజధాని యందే యుండవలసి వచ్చెడిది. సామ్రాజ్యపుసరిహద్దున నుండెడి దుర్గదన్నాయకులు తప్ప మిగతా వారందరును సామ్రాజ్య రాజధాని యగు విజయనగరముననే నుండెడివారని పేయసుచరిత్రకారుఁడు

వ్రాసియుండెను. అయితే సరిహద్దున నుండెడి దన్నాయకులు మాత్రము సరిహద్దులలోనికి పరాయివారు వచ్చి యల్లరిచేయ కుండున ట్లెల్లప్పుడును తమరాజ్యములలో నుండెడివార నియు వారు దసరామహోత్సవములకు కూడ రాజధానియగు విజయనగరమునకు వచ్చెడివారు కారనియు పేయసుచరిత్ర కారుఁడు వ్రాసియుండెను. మిగతా దన్నాయకులందరు విజయ నగరమునందే యుండి తమస్థానే రాజ్యమును పరిపాలించుట కొక కార్యకర్త నేర్పాటుచేసికొనెడివారు. ఆ కార్యకర్తయే ఆయారాజ్యములలోని న్యాయపరిపాలనయు రాజ్యపరిపాల నయు చేయుచుండెడివాఁడు. ఈదన్నాయకులు సంవత్సరమునకు కొంత మొత్తమును తమరాజధానితరపున విజయనగరసామ్రాజ్య కోశభాండాగారమునకు జమకట్టించు నాచార ముండెడిది. కొండవీటిదుర్గమును రాయలవారు 1514-వ సంవత్సరమున స్వాధీనపరచుకొన్నపుడు కొండవీటిరాజ్యమునకు సాలువతిమ్మ రసును దళనాయకునిగ నేర్పరిచినను తిమ్మరసు తనకుగాను నాదెండ్లగోపన్నను కొండవీటిపరిపాలనకై యుంచి తాను రాయలవారితోనుండి గజపతిరాజుపై జరుపఁబడిన యుద్ధము నందు తాను నధికారము వహించియుండెను.

తనరాజ్యమునందు రాజ్యాధిపతికి రావలసిన ద్రవ్య మును వసూలుపరచుట, రాజ్యమునందు శాంతి, భద్రతలు ఏర్పాటుచేయుట, ప్రజానీకమున కవసరములగు పనులను జక్కఁబెట్టుట, రాజ్యమునందలి జనుల మధ్యనున్న తగాయి దాలను విచారించి వారిమధ్య సామరస్యము నేర్పరచుట మొదలుగాగల విధులన్నియు నీదుర్గదళనాయకులు నిర్వర్తించ

పలసినవై యున్నవి. ఈవిధుల నన్నిటిని తాము సొంతముగఁ గాని తమ పక్షమున నింకొక కార్యకర్తను నియమించిగాని నెరవేర్చుచుండెడివారు.

రాయలవారీ దళనాయకులందరిని బ్రాహ్మణజాతినుండియే నేర్పాటు చేసికొనెడివారు. అట్లు చేయుటకు రాయలవారికి కాబ్రాహ్మణుల యందుండు విశ్వాసమే కారణము. ఆముక్తమాల్యదలో నీవిషయమై యిట్లు వ్రాసియుండిరి.

క. దుర్గములాప్త ద్విజవర, వర్గమునకే యిమ్ము దుర్గవర్తితతిక
త్వర్గశిఖరాధిరాజ్యవి, నిర్గతసాధ్వసతపొడమ నిలుపఁగఁ గలదిన్.

ఇందులకు గారణమును రాయలవారే ఆముక్తమాల్యదయం దిట్లు వ్రాసియుండిరి.

తే. బాహుజాంఘ్రిజములు ఖవిడంబనకునయినఁ, గొలిచిమనువిప్రధర్మంబు దెలిసిరైన
యాని సంకటముల నిల్వఁగానఁ దఱచు, బ్రాహ్మణుని ప్రభుఁ జేయుట పతికి
హితము.

ఈ బ్రాహ్మణులు విశ్వాసముతో పనిఁజేయుదురనియు కష్టసమయములలో చిక్కులను విడదీయఁగల శక్తిసామర్థ్యములు గలవారనియు రాయలవారి అభిప్రాయమై యుండెను.

## సీమ లేక నాడు

సీమ లేక నాడు లందే యధికారు లుండి పాలనచేయుచుండిరో మనము కనుఁగొనుటకు తగిన సాధనసంపత్తు లేమియు నగుపడవు. ప్రతిసీమయందు పారుపత్యదారుఁడనిగాని మనేగాడని గాని యొకరుండినట్లును వారికాగితములు లెక్కపుస్తకము లుంచుట కొక సావిడియున్నట్లును తెలియవచ్చు

చున్నది. సీమయందు రాయసంవారు అవసరంవారు రాచకరణ ములుగ నుండెడివారని యొకశాసనము వలన తెలియుచున్నది. వారే యే విధులకు నియోగింపఁబడిరో మాత్రము మనకు తెలియదు. ఇట్టి యుద్యోగు లుండినట్లు రాయవాచకము నందుకూడ వ్రాయఁబడియున్నది. అయితే ఈయుద్యోగులు రాయలవారిసమక్షముననుండి వారివెంట వెళ్లుచున్నట్లు వ్రాయఁబడియున్నది. రాయసం వారనఁగా వ్రాసెడువారు. అనఁగా లెక్కలు వ్రాసెడువారు. అవసరంవారనఁగా అవసర ములను తెల్పెడివారు. వీరినే అవసారికలని పిలిచెడివారు. ఇట్టి వారు సామాన్యముగ రాజుగారి జనానాలో హెచ్చుగ నుం డెడివారు. ఈ రాయసంవారుగాని అవసరంవారుగాని సీమ లలో నేయేవిధులను నిర్వర్తించుచుండిరో తెలియుటలేదు. నాడుకు సంబంధించినంతవరకు తలవరి యొక్కఁ డున్నట్లు మాత్రము 1530-వ సంవత్సరపు శాసనమువలన మనకు తెలియు చున్నది. తలవరి యేపనిచేయుచుండెనో తెలియుటలేదు.

## స్థలము

స్థలమున కొక కరణము లెక్కలను వ్రాయుచుండినట్లును తనపుస్తకముల జాగ్రత్త పఱచుట కొక సాహిణియుండినట్లును తెలియవచ్చెడిని. ఇంతకన్న స్థలపరిపాలనను గూర్చి తెలియుట లేదు. ఈస్థలమునందలి జనుల మధ్యనుండెడి తగాయిదాలను కరణములు పరిష్కరించుచుండినట్లు చుక్కాయిపల్లి కైఫియతు వలన తెలియుచున్నది.



## గ్రామము

గ్రామపరిపాలన యిప్పటికివలెనే కరణము రెడ్డి (మునసబు యొక్క హస్తగతమై యుండెడిది. ఇప్పటికరణములు రెడ్లు నిర్వర్తించెడి విధులనే వీరప్పుడును చేయుచుండెడివారు. గ్రామములోని భూములు వాటిగుడికట్టు, వాటిలోనిపంటలు, వాటివలన రావలసినట్టియు వచ్చినట్టియు సాదాయము మొదలయిన లెక్కల నీగ్రామాధికారులు తయారుచేయుచుండెడి వారు. గ్రామస్తులకును రాజోద్యోగస్తులకును మధ్యగనుండి గ్రామస్తుల కష్టసుఖములను పైయధికారులకు తెలియచెప్పి వానిని చక్కపెట్టుచుండెడివారు. వీరుగాక గ్రామములో తలారి యింకొకడుండెడివాఁడు. ఈతలారి గ్రామకావలి. ఈగ్రామాధికారులకు ప్రత్యేకముగ జీత ముండెడిదికాదు. వారలకు వంశపరంపరముగ ననుభవించుటకు కొంతపొల మిచ్చెడివారు. ఆ పొలమువలన నీగ్రామోద్యోగులు తమతమ జీవనమును జరుపుకొనెడివారు. ఈభూముల ననుభవించుటయేగాక గ్రామమున కొన్నిమిరాసీలను మామూళ్లను వసూలు పరచుకొని అనుభవించెడివారు.

ఈపైనజెప్పిన గ్రామాధికారులు గాక గ్రామమున పురోహితులు, చాకలి, మంగలి, కంసాలి, నీటివాడు, కుమ్మరి, మొదలయిన యితర గ్రామోద్యోగులును నుండెడివారు. వీరికి వంశపారంపర్యముగ ననుభవించెడ భూము లుండెడివి.



## నీటివసతులు

రాయలకాలమున నీటివసతులకు ప్రత్యేకముగ ప్రభుత్వపు ఏర్పాటు లేమియు లేవు. కాని దేశమంతయు సస్యశ్యామముగ

నుండినందున వ్యవసాయమునకు ముఖ్యావసరమగు నీటివసతులుం చక్కగనుండెడివని యూహింప వలసియున్నది. ప్రత్యేకప్రభుత్వపు టేర్పాటులు లేకున్నను రాజ్యమునందంతయు వ్యవసాయమే ముఖ్యమైన జీవనోపాధియైయున్నందునను, నీటివసతుల నేర్పాటుజేయుట సప్తసంతానములలో నొకటియైనందునను, రాజులు, ప్రభువులు, అమరనాయకులు, ధనికులు మొదలయిన వారెల్లరును, చెరువులను నూతులను, కాల్వలను, త్రవ్వించుట నాచారముగ నుండెడిది. రాయలకాలమున పేయసుచరిత్రకారుఁడు వ్రాయుచు తాను నాగలాపురమున పెద్దచెఱువును త్రవ్వించుట ప్రత్యక్షముగ చూచిన ట్లీవిధమున వర్ణించియుండెను.

"ఈచెరువును త్రవ్వించుట కీ ప్రదేశమును చుట్టియున్న పెద్దకొండ బద్దలుకొట్టఁబడెను. ఈచెరువును త్రవ్వుటకు దాదాపు 15 వేలం లేక 20 వేలమందిజనులు పనిచేయుచుండిరి. వీరు పనిచేయునపు డీపని చేయువారందరు చీమలవలె భూమిపైన కనుపడుచుండిరి. ఈపని చేసెడువారిని నాయకుల కప్పగించి వారు సరిగ పనిచేయుచున్నట్లు జమాయిషి చేయుటకును, పనితొందరగ ముగించుటకు నేర్పాటు జేసిరి."

బీజపూరుచరిత్రకారుఁడగు "ఇబ్రహింషిరాజి" అను నాతఁడు రాయలు విజయనగరమువద్ద నొకకాలువను త్రవ్వించ మొదలుపెట్టెనని వ్రాసియుండెను. రాయలమంత్రులలో నొకరగు రాయసంకొండమరసు కొండవీడుసీమలోని కొండసముద్రము తిమ్మసముద్రమను రెండుచెరువులను త్రవ్వించినట్లు శాసనములవలన తెలియుచున్నది. రాయ లుదయగిరి దుర్గమున రెండుచెరువులు త్రవ్వించియుండెను. ఇట్లే మంత్రులు, నాయ

షులు, వర్తకులు, ద్రవ్యవంతులు మొదలయినవారనేకులు చెరువులు, కాలువలు, నూతులు, త్రవ్వించి భూములకు పశువులకు మనుజులకు నీటివసతులు గలుగజేసి దేశసౌభాగ్యమును హెచ్చుజేసియుండిరి. ఇట్లు చెరువులు వగైరాలను త్రవ్వించుటయే గాక యిదివరకుండిన చెరువులను బాగుచేయించుచుండిరి. చెరువుపోషణకై రాయలు బాలిరెడ్డి యనుసధికారికి దశబంధయినాము నిచ్చినట్లు తెలియుచున్నది.

భూములను వ్యవసాయముజేయు రహితులలో నీటిని సంపకము జేసికొనునపుడు తగువులాడకుండ నీటిని సకాలమున నుపయోగించుకొనుటను గూర్చి రాయలవారు తాము రాజ్యము చేసినకాలములో కొన్ని శాసనములు చేసినట్లు రాతిశాసనముల వలన తెలియవచ్చుచున్నది.

## 16 భూమి: ఆదాయము

గ్రామములలో నుండెడు భూములను గ్రామకరణములు కొల్చి సరియైన లెక్కలను తాటియాకులలో వ్రాసి నిల్వచేసెడివారు. వీటిని తాటియాకుకవిలె లనిచెడు వారు. వీటిని గ్రామ సావిడి యందు జాగ్రత్త పఱచెడువారు. వీటినిబట్టి గ్రామసరిహద్దులు, ఆసామిసరిహద్దులు, భూమిలోనిపంటవగైరాలు తెలియనగును. అప్పుడప్పు డవసరములను బట్టి భూములను కొలత చేయుటయు కద్దు. కొన్ని తెనుగుజిల్లాలలో తిమ్మరసుమంత్రి భూములను కొలతవేయించినట్లు కనబడుచున్నది. కన్నడదేశమునందలి భూములనన్నిటిని రాయలవారే కొలత వేయించి లెక్కలను తయారుచేయించిరి.

ఈభూములలో కొన్నిభూములు పల్లపుభూములు, కొన్ని మెట్టభూములు. ఇప్పటివలెనే పల్లపుభూములయందు మాగాణిపైర్లను, మెట్టభూములయందు మెట్టపైర్లను వేయఁబడి పెంచఁబడుచుండెడివి. నీటివసతి యవసరమగు వరి, చెఱకు, అరటి, తమలపాకులు, కూరలు, తోఁటలు, పల్లపుభూములలో పైర్లు, వీటినే నీరారంబ భూములని పిలిచెడివారు. మెట్టపైర్లు అనగా, రాగి, సజ్జ, చోళం, పప్పుధాన్యములు, మొదలయిన పంటలు తయారుచేయఁబడెడి భూములన్నియు కాడారంబ భూములు. వీటికి వర్షమే యాధారమై యుండెను.

ఆకాలమున భూ ఆదాయము సంబంధించినంతవరకు గ్రామములు మూఁడువిధములుగ విభజింపఁబడెను.

1. భాండారవాడగ్రామములు. 2. అమరగ్రామములు. 3. మాన్య గ్రామములు

1. భాండారవాడగ్రామములు: ఈగ్రామములు ప్రత్యేకముగ రాష్ట్రియప్రభుత్వము క్రిందనుండి కేంద్రప్రభుత్వాధికారులచే పరిశీలింపఁబడుచుండెడి రాజ్యమాన్యములు. ఈగ్రామములనుండి వచ్చెడి ఆదాయమంతయు రాజుగారి భాండాగారమునకు చేర్పఁబడును.

2. అమరగ్రామములు : సామ్రాజ్యావసరములకు సరియగు చతురంగబలమును సమకూర్చుకొనుటకు రాయలవారు తనదేశమునంతను నాయకులకు పంచిపెట్టి వారలవద్దనుండి కొంత సేనను కొంతద్రవ్యమును పుచ్చుకొనుచుండెడివారు. ఈపద్ధతినే అమరమనియు నీనాయకులను అమరనాయకులనియు పిలిచెడివారు. ఇట్టి అమరగ్రామములు విజయనగరరాజ్యమునం

బనేకము లుండెడివి. ఈనాయకులు గ్రామము అమరము చేయు పద్ధతిని నాయంకరపద్ధతి యని పిలిచెడివారు. ఈపద్ధతిని నాయకు లందు రాజుగారి యిష్టమున్నంతకాలము గ్రామములను అమరముజేసెడివారు. రాజుగారికి యిష్టము లేకున్నగాని, కోపము వచ్చినగాని నీయమరగ్రామములను నాయకులవద్ద నుండి లాగికొని యితరుల కిచ్చెడివారు. 1523 వ సంవత్సరమున తరిగొండ రామానాయఁడు రాజుగారిపై తిరుగుబాటు చేసి నపుడు చింతరాజుపాలెం, అమరనాయకుఁడగు నాముల నేని కుమార పెద్దబుచ్చినాయఁడు రామానాయునికి సహాయము చేసె ననెడి యనుమానముపైన చింతరాజుపాలెం గ్రామమును వారి వద్దనుండి రాయలవారు లాగికొనిరి. దువ్వూరుసీమలోని అవుకు గ్రామమును తనకార్యకర్తయగు బుక్కరాజు తిమ్మరాజు కిచ్చెను. తిమ్మరా జీగ్రామమును తనవద్ద కొంతకాల ముంచుకొన్నపిదప అచ్యుతదేవరాయలు గాను లాగికొని యితరుల కిచ్చెను. ఇట్టి యుదాహరణ లనేకము లుండెను. అమరగ్రామములు అమర నాయకులు వంశపారంపర్యముగ ననుభవించెడివి కావు.

ఈ అమరనాయకులు రాజుగారికి సైన్యము నిచ్చుటయే గాక కొంతద్రవ్యమును ప్రతిసంవత్సర మిచ్చుచుండెడివారు. ఇవిగాక నూతనసంవత్సరాదినాడు రాజుగారికి గొప్పగొప్ప బహుమతులను, భోజనపదార్థముల నిచ్చు మామూలుండెడిది. క్రమప్రకారం యివ్వవలసిన చతురంగబలసైన్యమును ద్రవ్య మును మామూళ్లను అమరనాయకు లీయనియెడల రాయల వా రమరనాయకుల తప్పిదమునకు శిక్షించుటయు కలదు. రాయలవారి పట్టాభిషేకముయిన పిదప అమరనాయకుల

లెక్కలు పరిశీలించగా వారప్పటి కీయవలెనమొత్తములు హెచ్చుగ నున్నందున నమరనాయకులు భయపడి రాయల వారికి బాకీమొత్తముల నిచ్చుట కంగీకరించి తమతప్పును క్షమించవలని ప్రార్థించుటయు రాయలవారు వారిని మందలించి క్షమించుటయు వారిపూర్వబాకీల క్రింద వారిపద్దయేనుగులను గుఱ్ఱములను సైన్యమును రాయలవారికి నప్పగించుటయు వీనివలన రాయలవారు పెద్దసైన్యమును తయారు చేయుటయు జరిగియుండెను.

3. మాన్యగ్రామములు: రాయలవారు తమరాజ్యమున హిందూమతపోషణను బాగుగ జేసిరి. రాయలవారు తమకాలమున నిట్టిమాన్యములనేకములను సంస్థలకును ప్రత్యేకవ్యక్తులకు నిచ్చియుండిరి. అవి బ్రహ్మాదాయ దేవాదాయ, మఠపుర్య, సర్వమాన్యములునై యున్నవి.

## బ్రహ్మాదాయమాన్యములు

బ్రాహ్మణుల కిచ్చినమాన్యములు బ్రహ్మాదాయమాన్యములు. ఇవియే అగ్రహారములనియు శ్రోత్రియమాన్యములనియు పిలువబడెడివి. ఈమాన్యములు వారి పాండిత్యప్రకర్షకుగాని వారి శిష్యులకు చదువుజెప్పుటకుగాని యీయబడెడివి.

## దేవాదాయమాన్యములు

దేవాలయములయందు నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, బ్రహ్మోత్సవములు జరుపుట కీయబడిన మాన్యములు దేవాదాయమాన్యములు.

## మతపురమాన్యములు

శైవ, వైష్ణవ, మతముల ప్రచారమునకై యీయఁ బడినమాన్యములు మతపురమాన్యములు.

ఈమాన్యములకన్నిటికి రాజులకు కొద్ది జోడిగాని శ్రోత్రియముగాని ప్రతిసంవత్సర మియ్యవలెను.

సర్వమాన్యమునకు జోడీగాని శ్రోత్రియముఁగాని యీయనక్కరలేదు.

ఇవిగాక కొత్తభూములను బాగుజేసి సాగుకై రహితుల కిచ్చుటవలన నాయాప్రదేశములు కొత్తగ్రామములుఁగ నేర్పడెను. ఆగ్రామములోని భూములను తక్కువమక్తాలకు నాగ్రామస్థుల కిచ్చుచుండెడివారు.

## ఆదాయము

ఈభూములనుండి వచ్చెడి ఆదాయము, రెండువిధములు. (1) ధాన్యాదాయము. (2) సువర్ణాదాయము. ధాన్యాదాయమున పండినపంటలో రాజ్యమున కిచ్చుభాగము. కొన్ని పంటలలో ధాన్యభాగము నివ్వక వచ్చిన ఆదాయములో భాగమునకు బదులు దానిసరియైన ధరను బంగారునాణ్యములలో నిచ్చునట్టి ఆదాయము సువర్ణాదాయము.

దేశమునందలి భూములను కొలిచి లెక్కలు వ్రాసి యుండెడివారని యిదివరలో వ్రాసియుంటిని. ఈలెక్కలన్నియు తాటాకులమీద వ్రాసి గ్రామచావిడియం దుంచఁబడెడివి. ఈ లెక్కలలో భూమివిభాగములు వానియజమానులపేళ్లు వాని విస్తీర్ణము, గ్రామమునందు, సాగుజేయబడెడిఆయకట్టు (గుడి

కట్టు). దేవబ్రాహ్మణుల కీయఁబడినభూములవివరములు రహితుల క్రిందనున్న భూముల మొత్తము, రహితు లీయవలసిన ఆదాయమొత్తములు మొదలయిన వివరములన్నియు నీకవిలె లెక్కలలో వ్రాయఁబడెడివి.

భూములలోని పంటలో భాగము ధాన్యమని గాని "దవన" మని గాని వాడెడువారు. "దవన" మనుపదము తెలుగుపదమేగ్గైన నిప్పుడు మనదేశమునందు వాడఁబడుట లేదు గాని కన్నడదేశములో నిప్పటికిని వాడుకలో నున్నది. ధాన్యము నవధాన్యములకు వాడబడుచున్నది. దవనము మిరియములు దనియము మొదలయినవాటికి వాడబడెడిది.

బంగారునాణెముల లో నీయఁబడు నాదాయము సువర్ణాదాయమని చెప్పియుంటిని. సువర్ణమనుపదము కన్నడపదమయిన "హొన్ను" అనుపదమునకు సంస్కృతపాఠాంతరము. "హొన్ను" అనగ వరహాలో సగభాగము.

పన్నులు:—పన్నులనే సుంకములనియు వాడెదువారు. ఈపన్ను లనేకములు. 1 వ్యవసాయపుపన్నులు. 2 పుల్లరిపన్ను; అడవిపన్ను. 3 కృషిపన్ను. 4 వర్తకపుపన్ను. 5 సైన్యపుపన్ను; రక్షణపన్ను. 6 వృత్తిపన్ను. 7 సంఘపుపన్ను. 8 ఆస్తిపన్ను, 9 మతముపన్ను. 10 మాన్యగ్రామముపన్ను.

1. వ్యవసాయపన్నులు:—పల్లపు (నీరారంబ) పొలముల వలన కాడారంబ (మెట్ట) పొలములవలన వచ్చెడిరాబడి వ్యవసాయపుపన్ను. ఈపన్నులు కొన్ని ధాన్యరూపముగను మరికొన్ని సువర్ణరూపముగను వసూలు జేయఁబడెడివి. సామాన్యముగ నిలవయుండు పంటబమీఁద ధాన్యపుపన్ను

వసూలుచేయఁబడెడిది. తొందరలో పాడయిపోయెడు పంటల మీఁద సువర్ణాదాయము వసూలుచేయఁబడెడిది.

2. పుల్లరి:—అడవిపన్ను; దేశమునకు ముఖ్యాదాయము వ్యవసాయమువలననే రాబడినను అడవులునుండియు మంచి ఆదాయమే వచ్చుచుండెడి. వ్యవసాయమునకు పశువులు మిక్కిలి అవసరము. ఈపశువులను మేపుటకు మంచిగడ్డి అవసరము. ఈగడ్డి అడవులయందు బాగుగ దొరకును. ఈగడ్డిపైన వచ్చెడి పన్ను పుల్లరిపన్ను. గొఱ్ఱెలను మేపినందు కీయఁబడెడిపన్ను "అడతరి" అడవిలోనుండి గృహోపయోగమగు కట్టెలు వచ్చెడివి. దీని కీయఁబడెడిపన్ను "కొండగుత్త". ఈపన్నులన్నియు వేలము వేయబడి హెచ్చుపాటదారున కిజారాయియ్యఁబడెడివి.

3. పరిశ్రమలపన్ను:—ప్రతిగ్రామమునందు మగ్గములు పెట్టి నేఁతనేయుదురు. ఈమగ్గములపైన పన్ను విధించఁబడి వసూలుచేయఁబడెడిది. దీనినే మగ్గదరియని మగ్గరి యని పేరులతో వసూలుచేసెడివారు.

దూదిచిక్కు దీసెడివారిపై వేయఁబడుపన్ను పింజాని గారు లేక పింజసిద్ధాయము. పింజ అనగా దూది.

కుమ్మరివాండ్రు తాము తయారుచేసినకుండల నమ్ముకొన్నందుకై వారివలన వసూలుచేయఁబడెడిపన్ను. "కుంబారితరిగ" వాండ్రు తయారుచేసిన కుండల కిచ్చెడిపన్ను "చక్రకానిక".

గానుగవాండ్రు గానుగగుత్త, బెల్లం తయారుచేయువారు ఆలేయసుంకము, ఉప్పుతయారుచేయువారు ఉప్పారసి

ద్దాయము, కల్లుగీయువారు యీడిగెసుంకము, కమ్మరవాండ్రు పెద్దకొలిమిపన్ను యిచ్చుచుండెడివారు.

4. వ్యాపారపన్నులు:— పెద్దవ్యాపారము చేయువారు వారి మూలధనముపైన పదునారవవంతు పన్ను నీయవలసి యుండెడిది. దీనినే "మూలవీస" మనియెడివారు. మూలధనముపై వీసమనగా పదునారవవంతు. చిల్లరవ్యాపారస్థు లిచ్చెడిపన్ను "కిరుకుల" మనెడివారు. వీరివద్దనుండి లాభముపై పన్ను వసూలు జేయఁబడెడిది.

ఒకప్రత్యేకస్థలములోగాని పేటలోగాని, గ్రామమున గాని విక్రయించెడి వస్తువులపైన వసూలుచేయబడిన సుంకము స్థలసుంకమనిగాని పేటసుంకమనిగాని చెప్పఁబడెడిది. ఈ ప్రకారముగ విక్రయింపఁబడిన జొన్నలు, ఉప్పు, కంద్లు, కుం[illegible], పెసలు, మినుములు, సెనగలు ఉలవలపైని సుంకము వసూలు చేయఁబడినట్లు కొండవీడుకు సంబంధించిన 15[illegible] న సంవత్సరపు కాగితములవలన తెలియవచ్చుచున్నది. ఈసుంకమే గ్రామములలోజరిగెడు సంతలలో వసూలుచేయఁబడుచుండెడిది. ఈ సంతలవలన రాజ్యమునకు చాల ఆదాయము వచ్చుచున్నందున నీసంతలను ప్రోత్సహించుచున్నట్లా కాలపు కాగితములవలన తెలియుచున్నది.

విక్రయవస్తువుల నొకచోటనుండి యింకొకచోటునకు తీసికొనిపోవునపుడు మార్గమధ్యమున వసూలు చేయఁబడెడిపన్ను 'మార్గాదాయము" "ఉభయమార్గాదాయము."

ఒకరాజ్యమునుండి యింకొకరాజ్యమున కెగుమతిజేయ బడెడు ధాన్యములపైని రసవర్గములపైని సుంకమువసూలు జేయఁబడెడిది. ఇది మామూలాదాయము.

పట్టణములలో కొట్లలో సరుకులు నిలువజేసికొని వ్యాపారము జేసెడివారివద్దనుండి వసూలుచేసెడిపన్ను "మండి సుంకము".

ఇట్లె వ్యాపారమునందు ప్రతివస్తువుపైన పన్ను వసూలుజేయబడుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇన్నిపన్ను లతో వ్యాపార మెట్లు జేయఁబడుచుండెడిదో మనకు విశదముగ తెలిసికొనుటకు తగిన సావకాశములులేవు. మొత్తముమీద వ్యాపారము బాహాటముగ జరుగుచున్నట్లే యూహింపతగి యున్నది.

5. సైన్యపుపన్ను రక్షణపన్ను:—దుర్గనాయకులు దేశ మునకు తమవద్దనున్న సైనికదళములవలన రక్షణ నిచ్చెదరు. వారిరక్షణకై గ్రామస్థులవద్దనుండి "మేర"లను వసూలుజేయు చుండెడువారు. దత్తమండలములలో వసూలుచేయబడిన మేరలను "దుర్గదన్నాయకనివర్తన" లని చెప్పినట్లు కొన్ని కైఫీయతులవలన తెలియుచున్నది. ఈమేరల నరవదేశము నందు దన్నాయకరమగమై యనియు మైసూరురాజ్యమునందు దన్నాయకరస్వామ్యమనియు పిలిచెడివారు.

సైన్యసంరక్షణకై వసూలుజేయబడెడిపన్నులు "దళ విలి" యనబడెడిది.

కోటలను మరమ్మతు చేయుటకు వసూలుచేయఁబడెడి పన్ను కోటైమగమై యని అరవదేశమున చెప్పఁబడెడివి.

నాడుతలవారిక యనెడిపన్ను నాడునందలి తలవారు లకై వసూలుచేయఁబడెడిపన్ను. తలారులు గ్రామరక్షణకై నియోగింపఁబడెడివారు. వారిజీతముల క్రిందతలవారికపన్నును వసూలుచేసెడివారు.

6. వృత్తిపన్నులు:— ప్రతిజాతివారు పన్నుల నిచ్చు చుండెడివారు. చాకలివాండ్లు ఊరుచెరువునందలి నీటిని వాడి నందుకు అగసారుపన్ను నిచ్చెడివారు. వీరు బంజరుభూముల నందుండెడి సున్నమును వాడుకొన్నందుకు పన్ను నీయవలసి యుండెను కాని యీపన్ను కొంతకాలమైన పిదప తీసివేయ బడెను.

కంసాలివారు తమవృత్తిపైన పన్నునిచ్చెడివారు. ఉరిశిక్ష ననుభవించవలసిన వారిని ఉరితీసెడి వారివద్దనుండి పన్ను వసూలుచేయుబడెడిది. ఇది మిక్కిలి చిత్రమైనపన్ను. వానికి యిచ్చుటకుబదులు వానివద్దనుండి పన్నువసూలుజేయుట యాశ్చర్యజనకముగ నుండకపోదు. అయితే యురితీసెడివాండ్రు మాలకులస్థులు. వారుచేసెడిపని మిక్కిలి కష్టతమమైనపనియై యున్నది. అందువలన నీపనిని వూనుకొన్నవారికి మాలకులము 'వా' రొక్కరూకచొప్పున నిచ్చుచుండెడివారు. ఈప్రకారము వసూలుచేయఁబడినసొమ్ము హెచ్చు మొత్తమయ్యెడిది. ఆ మొత్తమునుండి రాజులు పన్నులు వసూలుచేసెడివారు. ఇది బహుచిత్రమైన పన్నునుటలో సందేహములేదు. ఈపన్ను వసూలుజేయుట యెట్లు సంభవించెనో యిపుడు మన మూహింపఁజాలము.

మాదిగవాండ్రు రాజ్యమునకు తమవంతు వృత్తిపన్ను చెల్లించవలసియుండెను. వీరు రహితులకు తోలుబొక్కెనలు, చెప్పులు, తాళ్లు తయారుజేసి యిన్వవలెను. ఇందుకు ప్రతి ఫలముగ రహితులు ధాన్యము నిత్తురు. ఇట్లు రహితులనుండి సంపాదింపబడిన ధాన్యమునకు సుంకము చెల్లించవలసి యుండెను.

బోయవారు అరణ్యవాసులు. వీరు అరణ్యములోని సరకులు వాడుకున్నందుకు రాజ్యమునకు సుంకము కట్టవలసి యుండెను. ఇదిగాక వీరు గొప్పవారి పల్లకీలు మోయుదురు. అందుకువారు వృత్తిపన్ను కట్టవలసియుండెను.

ఉద్యోగస్తులు, న్యాయాధికారులు, పన్నులనిచ్చెడి వారు. బ్రాహ్మణులవద్దనుండి వారిపౌరోహిత్య, పాండిత్య సంపాదనలపై, పన్నులు వసూలుచేయఁబడెడివి. కాని వీని వివరములు మాత్రము మనకు తెలియుటలేదు.

7. సాంఘికపన్నులు:—సాంఘికపన్నులలో ముఖ్యమైనది పెండ్లిసుంకము. ఈసుంకము ప్రతివారిని బాధించునది. పెండ్లి చేసికొన్న పెండ్లికొడుకు పెండ్లికూతు రీయవలసిన సుంకము. కొన్నిసమయములలో పెండ్లికూతు రొకరూకయు పెండ్లి కొడుకు మూఁడురూకల నిచ్చెడివారు. ఈసుంకము అష్టాదశవర్ణ ముల వారికిని సంబంధించినపన్ను. కరణకమ్మగొల్లల వద్దనుండి నూటొక్కమాడలు పెండ్లి సుంకము క్రింద వసూలుచేయఁ బడినట్లు తెలియవచ్చుచున్నది. ఈ పెండ్లిసుంకముగాక పెండ్లి పందిలికి పన్ను పెండ్లియూరేగింపునకు పన్ను వసూలుచేయఁ బడెడిది. ఈపన్నులబాధను తప్పించుకొనుటకై కొందఱువివా

హాములు మాసివేసినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఈ పెండ్లిసుంకమును గూర్చి యనేకులు తమ అయిష్టతను తెలియఁజేయుటయేగాక యీపన్నును వసూలుజేసినవారిని దూషించుటయు జరిగెను. ప్రథమమున నీసుంకమును రద్దుఁజేయుటకు ప్రయత్నించినది 1507 వ సంవత్సరమున తిమ్మరసు చేతనైయున్నది. అప్పటికి వీరనరసింహరాయఁడు రాజ్యమేలు చుండెను. ఆకాలమున గుత్తిరాజ్యమునందు మాత్ర మీపన్ను రద్దుచేయఁబడెను. రాయలవారు రాజ్యాభిషిక్తులైన పిమ్మట తిమ్మరసుమంత్రి ఆదెప్పనాయఁడు గౌనితాతన్న మొదలయిన అధికారులు శ్రీవారితో నీసుంకమును రద్దుజేయమనివిన్నవించిరి. రాయలవారును వారితో నేకీభవించుచు నీసుంకమును తన సామ్రాజ్యమున రద్దుజేసినట్లు శాసనమును ప్రకటించిరి. రాళ్ల మీద నీశాసనమును లిఖించి ప్రతిపట్టణమునందు బహిరంగస్థలమున ప్రచురణ జేయించిరి. ఈసుంకమును రాయలవారు రాజ్యముచేసినంతకాలము వసూలు జేసియుండలేదు. కాని రాయలవారి తరువాత అచ్యుతదేవరాయనికాలమున తిరిగి యీసుంకము వసూలుజేయు ప్రారంభింపఁబడెను.

సంఘములోని కొన్నికులములలో ప్రభుత్వమువారు కులపెద్దల నేర్పరచి వారిని ఆయాకులములలో వివాదములను పరిష్కరించుటకు నేర్పాటు చేసియుండిరి. అట్టి కులపెద్ద లాకులములలో వివాదముల పరిష్కరించి వారివలన తప్పులు, కానికలు, కప్పములు, మొదలయినవి పుచ్చుకొనుట కధికార మీయఁబడినది. ఈప్రకారము వారు వసూలుపరచుకొన్న

ధనగాయంచి కొంతభాగమును ప్రభుత్వమువారు "సమయ సుంక" మను పేరు వసూలు అనుకొనెడివారు.

8 ఆస్తిపన్నులు:— ఇందు ముఖ్యమైనపన్ను ఇండ్లపన్ను. దీనికే యిల్లరి యనెడువారు. ఈపన్ను యిండ్లమీఁద, వసారాలమీఁద, దొడ్డిమీఁద వసూలు జేయఁబడుచుండెడిది. ఇండ్లకే గాక యితర ఆస్తిపైనకూడ పన్నువసూలుచేయఁబడెడిది. నౌకలపైన వసూలుచేయఁబడెడిపన్ను "అడ్డతెర" ఇట్లే ఆవులవలన, యెద్దులవలన, దున్నపోతులవలన, పన్నువసూలుజేయఁబడెడిది.

9. మతపన్నులు:-ఇందు ముఖ్యమైనది మహారాజప్రయోజనములు. ఈపన్ను గ్రామదేవతల యుత్సవసందర్భమున వసూలు జేయఁబడెడిది. ఈవసూలుజేసినసొమ్ముతో గ్రామదేవతయొక్క నిత్యనైవేద్యదిపారాధనలు జరుపుటయునుత్సవములు గావించుటయు జరుగుచుండెడిది. గ్రామదేవతలే దేశమునందలి క్షామములను కలుగఁజేయుననియు దేశమునందలి మహామ్మారి, మసూచికము, కలరా మొదలయిన రోగములీదేవతల కోపమువలన నుద్భవించుననియు యిట్టి దేశక్షామమును రోగములను శమింపజేయుట ప్రభుత్వపువిధులలో నొకటియనియు మూఢనమ్మిక దేశమునందు కలదు. అట్టిక్షామములను నివారణజేయుటకై యీమహారాజప్రయోజనములు వసూలుజేయఁబడి గ్రామదేవతలప్రీతికై యీడబ్బువెచ్చింపఁబడెడిది.

10. మాన్యగ్రామములు:— మాన్యములనుండి వసూలు జేయఁబడెడిపన్ను జోడి, పట్నంకానుక, కద్దాయము. శ్రోత్రియ బ్రాహ్మణులు, ఫకీర్లు మున్నగువారి కానుక. మాన్యములవలన

వసూలుజేయఁబడునది జోడి శ్రోత్రియము. చిన్నవారు పెద్దవారి కిచ్చునది కట్నం. బలవంతముగా తీసికొన్నది కద్దాయము.

పైన వ్రాయఁబడిన పన్నులుగాక ననేకమామూళ్లుండెడివి. ఈమామూళ్లు మతమునకు సంబంధించినవి కొన్ని సంబంధించనివి కొన్నియు నైయున్నవి.

మతసంబధములైన మామూళ్లు.

శైవులు గుడిపెద్దలయిన జంగములకిచ్చెడిది "గణాచారి తరి"యందురు. దీనినే మన తెనుగువారు వీరముష్టిపన్ను అనెడి వారు. శైవమతములలో వీరముష్టివారు జంగమువారు నుండెడివారు.

శివునిగుళ్లలోనున్న తంబలఅర్చకులకు గణాచారు లిచ్చునది గణాచారిపన్ను.

ఇట్లె వైష్ణవ దేవాలయములలో వైష్ణవులు తమజియ్యరు గారికిచ్చునది జియ్యరుతరి.

గ్రామములో దేవతలకు అమ్మవార్లకు జరుపవలసిన జాతర్లకు వసూలుజేసెడిపన్ను జాత్రపన్ను. ఈపన్ను గ్రామస్థులందరును చెల్లించవలెను.

మతమునకు సంబంధించనిపన్నులు.

విప్రవినోదులపన్ను; దొమ్మరపన్ను

విప్రవినోదిపన్ను; విప్రవినోదులనగా బ్రాహ్మణులకు వినోదమును కల్గించెడివారు. ఈవిప్రవినోదులు చమత్కారము చేత జీవించుచు సంవత్సరమునకొకమారు గ్రామసంచారముజేసి డబ్బునుసంపాదించెదరు. ఒక్కొకప్పుడు బ్రాహ్మణులకు జైనమతస్థు లకు తగాదాలు వచ్చినపుడీవిప్రవినోదులు తమ చమత్కారక

దనముచేతబ్రాహ్మణులకు సహాయముగావించి వారుజయించునట్లు సహాయపడి రనియు అందువలన బ్రాహ్మణులు వర్షాశన మిచ్చుట కంగీకరించిరనియుఁజెప్పుదురు. ఈకథ నిజానిజము లెట్లున్నను విప్రవినోదులు తమమామూళ్లను బ్రాహ్మణకుటుంబముల నుండియే వసూలుపఱచుకొనుచుండిరి.

దొమ్మరపన్ను: దొమ్మరులు కసరతుచేసియు కొంత ఆటను నేర్చుకొనియు జనుల కానందముకలుగఁజేసి గ్రామస్థులందరి వలన తమమామూళ్లను వసూలుజేయుదురు.

ఆదాయము:-వసూలు

ప్రభుత్వమునకు రావలసిన ఆదాయమంతయు నెట్లు వసూలుచేయఁబడుచుండెడి దనునంశమును గూర్చి తగినంత సమాచారము తెలియుట లేదు. భూములను మక్తాల కిచ్చురోజు లలోనగా ప్రతిసంవత్సరము జూనునెలలో మంత్రులు భూము లున్నగ్రామములకు వెళ్లుటయు నచట భూములను కౌలు కిచ్చు నపుడు తమకు రావలసినమొత్తము నేర్పరచుకొని తిరిగి కోతలసమయమున తామే వెళ్లి తమకురావలసిన ధాన్యాదాయ మును వసూలుచేసికొని వసూలుపఱచిన ఆదాయము నచటనే హెచ్చుధరలకు విక్రయించి ధాన్యాదాయమును ధనాదాయ ముగమార్చి ద్రవ్యమును తీసికొనివచ్చెడివా రని కొందరు చెప్పు చున్నారు. కాని యిది సరియైనపద్ధతి యని తోచదు. ఈవిష యమునందలి వివరముల నానాటిచరిత్రకారులు విశదముగ వ్రాసియుండ లేదుగాని న్యూనిసుచరిత్రకారుఁడు వ్రాయుటలో ప్రభుత్వమువా రీయాదాయమును వసూలుచేసి యిచ్చు హక్కును హెచ్చుపాటదారునకు వేలము వేసెడువా రనియు

వ్రాసియుండెను. ఇదియే సరిగ నుండవచ్చునని తోచుచున్నది. ఇట్టి వేలములలో సామాన్యముగ నమరనాయకులే తమపేర గాని తమసంబంధీకులపేరగాని వేలంపాట కొట్టివేయించుకొని రయితులను వత్తిడిచేసి కొంత హెచ్చుమొత్తములను వసూలు పరచుకొనెడివా రనియు తెలియవచ్చుచున్నది. ఇది నిజమైనను కావచ్చును. ఇందులో నమ్మదగనిది లేదు. ద్రవ్యరూపముగ నిచ్చెడిపన్నులను వసూలుచేసెడివారిని సుంకరు లనియు సుంకర వారనియు పిలిచెడివారు. భూములలోని పంటలు చెడిపోయి నపుడు ప్రభుత్వమువారు తగురీతిని విచారణగావించి, పన్నులలో మొత్తమునుగాని కొంతభాగమును గాని మినహాయింపు చేయు చుండెడివారు.

పన్నులు వసూలుచేసెడువారు రయితులను చాలవరకు బలవంతముచేసి వత్తిడిపెట్టి వారివ్వవలసినదానికన్నను వారివ్వ గల్గినదానికన్నను హెచ్చుమొత్తములను వసూలు చేసెడివా రని న్యూనిసున్ను వేయసున్ను చరిత్రకారులు వారివారి యుత్తర ములలో వ్రాసియుండిరి. కొన్ని రాతిశాసనములయందును నిట్లు వ్రాయుటవలన నీతప్పుడుప్రవర్తన జరుగుచుండె నని స్పష్టపడు చున్నది. 1512-వ సంవత్సరమున క్రొత్తచెరువుగ్రామమున దేవా దాయ బ్రాహ్మణాదాయ భూములనుండి వత్తిడిచేసి హెచ్చు మొత్తములను వసూలుపరిచినట్లు రాయలవారికి తెలియరాగా వారు స్వయముగ విచారించి హెచ్చుగ వసూలుచేయఁబడిన మొత్తములను తిరిగి యిప్పించిరనియు నొకశాసనమువలన తెలియుచున్నది. శ్రీమూష్ణమను గ్రామమున నిట్లే వత్తిడిచేసి డబ్బువసూలుచేసినందున నచటిజనము గ్రామము వదలి వెళ్లి

పోయిరనియు నందుపైన 1513-వ సంవత్సరమున రాయలకొలువులోని యధికారి చిన్నప్పనాయకుఁడనువాఁడు ఆగ్రామమునకు వెళ్ళి అచటివారలకు తగినరీతిని మాటలుచెప్పి వారిని సమాధానపరిచి తక్కువ రేట్లకు భూములను మక్తాలకిచ్చి గ్రామస్థులనందరిని తిరిగి గ్రామమునకు రప్పించిరనియు శాసనమువలన తెలియవగు సంశము లే. ఈవిషయములనన్నిటిని చక్కగ మనసునం దుంచుకొనియే కాఁబోలు తమగ్రంథమగు ఆముక్తమాల్యదయం దీక్రిందిపద్యమును రాయలవారు వ్రాసియుండిరి.

ప్రజ నవసి చన్నఁ బిలువక కప్పుకుల గొలుచు
నమ్మియిండ్లింధనంబులకాయె నసెడి
కలని నక్కైన యధికారిగలనృపతికి
పేదుదీవుల గొన్నసమృద్ధి లేదు. (ఆము. 4 ఆ. 237.)

(ప్రజ నష్టపడిపోయినచో అట్టివానిని తిరిగి పిలువక వానిగృహములను అమ్మి వంటచెఱకుక్రింద నుపయోగించు నధికారిని యుద్ధమునందు నక్కక్రింద పోల్చిరి. అట్టివా రుండ కూడ దని అభిప్రాయము)

ప్రభుత్వమునం దమరనాయకులుకూడ నీరీతినే ప్రజలను బాధించుచుండిరి. కొండవీడునం దమరనాయకుఁడుగ నుండెడి బాచమర సెట్టి రయితులను బాధించె నని తెలియుచున్నది. ఈబాచమరసును గూర్చి కొన్నిచాటుపద్యములు వ్రాసినట్లు అప్పకవీయమునందు మూఁడవ ఆశ్వాసమున నుదాహరింపఁబడెను.

ఆ. వె. గోలకొండతురక గోవులభక్షించు, కొండవీటివిప్రకులము నెల్ల
బాచమరసు చేత భక్షించుచున్నాఁడు, తురక మేలా! బాచమరసు మేలా

అధికారు లిట్లు బలవంతముగ రయితులవద్దనుండి వసూలు చేయుట కొన్ని శాసనములయందు వ్రాయఁబడియుండెను. కొప్పోలు, తిప్పలూరు గ్రామములలో రాయలుకట్నములను, సుంకరస్థావరములను, మినహాయించినను సుంకరవారు బలవంతముగ వసూలుచేసియుండిరి. నంద్యాలలోని వీరజియ్యారను అర్చకుఁడు కట్నములు, కానుకలు, మినహాయించెనేగాని భూములను తీసికొని వ్యవసాయముజేయుట కంగీకరించలేదు. అధికారుల నడవడిని తెలియఁజేయఁగల శాసనము లనేకములు దేశమునందంతట నుండెను. రాయలకాలమున నీసంగతులను గూర్చి తెలిసినంతనే విచారణచేసి వానిని సర్ది జనులకు సమాధానము చెప్పుచుండెడివారు.

రాజ్యాదాయము నెట్లు ఖర్చుపెట్టెడివారో తెలిసికొనుట కవకాశములు హెచ్చుగలేవు. గాని ఆముక్తమాల్యద నాల్గవ యాశ్వాసమునందలి యీ క్రిందిపద్యమువలన కొంత తెలియ నగును.

మ. స్ర:- ఊరవా భాగంబు భోగంబు భయము నొకపాలు గ్రసేనా
వనార్థం బిరువాల్నిండారు బండారిలుబోర నొకపాలు

ఈపద్యమునుబట్టి వచ్చెడి ఆదాయములో నొక భాగము రాజుగారిఖర్చులకును ధర్మమునకును రెండుభాగములు సైనికబలమునకును నాల్గవభాగము భాండారమున నుంచుటకును ఖర్చుపెట్టవలసినదిగ వ్రాసియుండెను. రాజధర్మములను గూర్చి వ్రాయఁబడిన ప్రతిగ్రంథమునందు నీవిభాగమే వ్రాయఁబడియుండెను. న్యూనిసు, వేయసుచరిత్రకారులును నిట్లే వ్రాసియుండిరి. వచ్చెడియాదాయములో రెండువంతులు సైన్యపు

ఖర్చుల క్రిందననియు మూఁడవవంతులో రాజుగారి స్వంత ఖర్చులకు బ్రాహ్మణులకు నితరుల కీయఁబడెడి ధర్మఖర్చులకు నని న్యూనిసుచరిత్రకారుఁడు వ్రాసియుండెను. తనకు పూర్వపు రాజ్యాధిపతులు దాఁచియుంచిన ద్రవ్యమును తాను ముట్టక యే దాఁచియుంచి రాయలు తన ఆదాయమున కొంతభాగ మును ప్రత్యేకభాండారమునం దుంచెడివాఁడని పేయసు చరిత్రకారుఁడు వ్రాసియుండెను.

రాయలవారు రాజ్యాధికారము వహించినసమయమున రాజ్యముయొక్క ఆదాయము మొత్తముమీఁద పదికోట్ల నాణెములనియు నందులో యుద్ధసంబంధమైనఖర్చు నాల్గుకోట్ల యేనుబదిలక్షలనాణెములనియు రాయవాచకమునందు వ్రాయఁ బడియుండెను. రాష్ట్రాదాయములో యుద్ధసంబంధమైన ఖర్చు పోను మిగిలిన అయిదుకోట్లయిరవైలక్షల బంగారు నాణె ములలో రాజుగారిస్వంతఖర్చులకును ధర్మములకును పోను మిగి లినమొత్తము భాండాగారమునం దుంచఁబడెడి దనియు కూడ వ్రాయఁబడియుండెను. రాయలవారు తాము రాజ్యము చేసినంత కాలము తమకు పూర్వులు నిలువఁజేసియున్న భాండాగారము నందలి ద్రవ్యమును ఖర్చుపెట్టియుండలేదు.

రాజ్యాదాయమును వృద్ధిగావించుటకు రాయలవారి కాలమున ననేకప్రయత్నములు చేయఁబడెను. రాజభాండా రముననుండి ద్రవ్యమును రయితుల కప్పుగనిచ్చి క్రొత్తభూము లను సాగుచేయించియుండిరి. అడవిభూములలోని చెట్లను నరి కించి భూమిని వ్యవసాయమున కుపయుక్తముగనుండునట్లు చేయించి వాటిని సాగుచేయించిరి. చెడిపోయినచెరువులను

మరమ్మతుచేయించియు క్రొత్తచెరువులను త్రవ్వించియు క్రొత్త భూములను సాగుచేయించిరి. పరాయిదేశములతో వ్యాపారమును వృద్ధిచేసి దేశసౌభాగ్యమును వృద్ధిచేయించిరి.

## దేశరక్షణ

విజయనగరరాజ్యమున ప్రతిగ్రామమునందలి జనులను ఆస్తినిరక్షించుటకు ప్రత్యేకముగ నేర్పాట్లుండెడివిగాని రాజ్యమునకంతకు కలసి చేయఁబడినయేర్పాట్లు కనుపించవు. ప్రతిగ్రామము యొక్క రక్షణార్థమై తలారి లేక తలయారి యని యొకరుండెడివారు. అతఁడే గ్రామకొత్వాలు. ఈతలారికి గ్రామవివాదములను పరిష్కరించు నధికారముండెడిది. అయితే విజయనగరరాజ్యమునమాత్ర మీయధికారము తలారికి తగ్గింపఁబడెను. గ్రామమును దొంగలబారినుండి రక్షించుటయే యీతలారికి ముఖ్యమైనవిధి. గ్రామమునందలి టక్కరులను అల్లరివాండ్రను కాపుదలచేయుట యింకొకవిధి. గ్రామములో చోరీపోయినసొమ్మునంతను తలారి వెదకి యజమానికి వప్పఁజెప్పవలయును. అట్లుచేయఁజాలనియెడల నాసొమ్ము నాతఁడే అచ్చుకోవలయును. ప్రభుత్వమునకువలయు కూలిపనివారల నీతలారియే యేర్పాటుచేయవలయును.

తలారికి జీతబత్తెములులేవు. గ్రామమునఁదు కొంతభూమి తలారికి మిరాసిహక్కుగ నీయఁబడెడిది. ఇదిగాక ప్రతిరయితును పండినపంటలో కొంతభాగము మేరగ నిచ్చుచుండెడివాఁడు. గ్రామస్థులందరు గ్రామమున కొంతద్రవ్యమును ప్రోగుజేసి ప్రతిసంవత్సరము నీతలారి కిచ్చుచుండెడి వారు. దీనిని "తలవారికె" యని చెప్పెడివారు. ఇవిగాక వర్తకులవద్ద

నుండి, పెద్దరయితులవద్దనుండి, తలారులు కొన్ని మామూళ్లను వసూలు చేయుచుండెడివారు. దేవాదాయములనుండి ధర్మాదాయములనుండి నీతలారికి కొంత యీయఁబడుచుండెడిది. వివాహాదిసమయములలో కొన్నిమామూళ్లు వసూలుచేయబడెడివి.

## కావలిగారు

ప్రతిగ్రామమునకున్నట్లే గ్రామసమూహమయిన స్థలమునకు కావలిగారుండెడివారు. వీరు గ్రామతలారిపై యధికారులు. తలారులు గ్రామమునఁజేసెడిపనులను పరీక్షించి వారి మంచిచెడ్డల నాలోచించుటయు స్థలప్రదేశమునందలి రక్షణకు సంబంధించినపనులు నిర్వహించుటయు నీకావలివారి విధ్యుక్తధర్మములు. 1516-వ సంవత్సరమున రాయలవారు కూనపల్లి పెద్దనాయఁడనువారిని మల్లెలసంతుకు కావలిగారుగ నేర్పరచి వానిని తలారులపై యధిపతినిఁజేసినని శాసనమువలన తెలియుచున్నది. దీనినిబట్టి ప్రతినాడునకు నొకకావలిగారుండిన ట్లూహింపనగును. ఈకావలిగారునే "మహానాయఁకాచారి" యని పిలుచుచుండెడివారు.

కావలిగార్లకును మాన్యములు మిరాసిహక్కు నిచ్చెడివారు. వీటిని కావలిమిరాసీ మాన్యము లందురు. వీరికిచ్చెడు యితరమేరలు కట్నములు వర్తనము లనేకము లుండెడివి.

దేశమున శాంతినెలకొల్పి జనులకు రక్షణభద్రత నేర్పాటుజేయుట వీరిముఖ్యధర్మము. తమస్థలమునకుగాని నాడునకుగాని లోబడియున్న గ్రామములన్నిటిని వీరు జాగ్రత్తచేయవలెను. వీరు జనులను చోరులనుండియు బందిపోటు

దారులనుండియు రక్షణచేయువలెను. గ్రామములోని వస్తు సామగ్రి పోయినదని రాయలవారికి ఫిర్యాదువచ్చినచో వా రాగ్రామమునకు సంబంధించిన దన్నాయకుని పిల్పించి, పోయినవస్తుసామగ్రినిగాని పోయినవాని విలువనుగాని యిప్పించుటకు ప్రయత్నించెడివారని న్యూనిసుచరిత్రకారుఁడు వ్రాసియుండెను. దీనినిబట్టిచూడ కావలిగార్లకునుతలారులకును దన్నాయకుఁ డధిపతియని తోఁచుచున్నది.

## పాలెగారు

గ్రామములయొక్కయు స్థలములయొక్కయు నాడుల యొక్కయు పరిసరప్రాంతముల నుండెడి అరణ్యములవలన కలిగెడి భయములనుండి రక్షించుటకై పాలెగార్ల నేర్పాటుచేసి వారికి రాయలవారు జాగీర్ల నిచ్చుచుండెడివారు. ఈపాలెగార్ల కిచ్చిన గ్రామములలో వీరు చిన్నకోటలను కట్టుకొని చుట్టు పక్కలనున్న గ్రామములను రక్షణఁజేయుచుండెడివారు. ఈ గ్రామములనన్నిటిని రక్షించు బాధ్యత నీపాలెగార్లదై యున్నది. అసాధ్యములగు కారడవులనుండి భూపీడనముఁజేయు కిరాతుల నడుమలో నుంచుట కాయడవులదగ్గర నున్న గ్రామములను శూరాగ్రేసరులకు జాగీరుగ నిచ్చుట మంచి దని రాయలవా రాముక్తమాల్యదయందు వ్రాసియుండిరి. అట్లే వారుధైర్యవంతులైనవారికి జాగీర్లనిచ్చి గ్రామములరక్షించుట కేర్పాటుచేసియుండిరి.

అక్కలరొమ్రమనాయఁడను బందరుగ్రామకాపురస్థుఁ డొకఁడు బసవశంకరుఁడను బిరుదముపెట్టుకొని రాళ్లమడుగు గ్రామమునకువచ్చి ఆగ్రామమునందలి బ్రాహ్మణులను బాధపెట్టు

చుండెను. అప్పు డాగ్రామములోని బ్రాహ్మణులెల్లరు గ్రామ
మును వదలి దగ్గరనే యుండియున్న రామవరగ్రామమున నివ
సించుచుండిరి. ఇట్లుండ నొకానొకసమయమున రాయలవా
రా గ్రామము ద్వారా తిరుపతికి జనుచు రాళ్ళమడుగు గ్రామము
దొంగలకాటపట్టి యున్నదని తెలిసికొని యక్కలయెర్రమ
నాయని బిల్వనంపి వాని నా రాళ్ళమడుగు గ్రామమునకు కావలి
గారుగ నియమించి రాళ్ళమడుగు గ్రామమును పరిసర ప్రాంత
ములను దొంగలబారినుండి రక్షించమని యాజ్ఞాపించి యుండిరి.
యెర్రమనాయుడును చేయవనున్న చెయ్యేరు గ్రామమున
కోటగట్టుకొని ఆ దేశమునంతను సంరక్షించుచుండెను.

ఇంకొకపుడు రాయలవారు మునిమడుగు గ్రామమునకుఁ
బోయి యచటనుండి గుత్తిగ్రామమునకుఁ బోవ యత్నించుచుండ
నచటిజను లా త్రోవసరియైనది గాదనియు దొంగలున్నారనియుఁ
నడవిజంతువులు కూడ బాధపెట్టుననియు రాయలవారితో విన్న
వించిరి. అపుడు రాయలవారచటి నరసింహస్వామి దేవాలయ
మును దర్శించి తనవద్దపనిలోనున్న కౌలూరుబద్దారెడ్డి యను
వారి నా ప్రాంతముల రక్షణకొరకై యేర్పాటుగావించి నాయా
ప్రాంతములనున్న యరణ్యములను త్రోవలను బాగుచేయింప
నాజ్ఞాపించెను. అందుకు ప్రతిఫలముగ వారికి రెండు గ్రామ
ములను జాగీరిచ్చి యిచ్చవచ్చినచోట కోటను నిర్మాణముచేసి
కొనుటకు రాయలవా రానతిచ్చిరి. బద్దారెడ్డియు రాయల
వారికోరికను శిరసావహించి రాచర్లవద్ద కోటనుకట్టుకొని
దేశమునంతను రక్షించుచుండెను. ఇట్లు జరుగుచురాగ కొంత
కాలమునకీప్రాంతమంతయు తిరిగి దొంగల కాటపట్టాయెను.

తుపాకులచెన్నమనాయఁ డను నొకమాల అచటిదొంగల రాయఁడు. ఈసంగతి రాయలవారికి తెలిసినంతనే చెన్నమనా నాయుని హతమార్చవలయు నని బద్దారెడ్డి కుమారుల కాజ్ఞ నొసఁగెను. బద్దారెడ్డి ముఁవ్వురుపుత్రులు నీచెన్నమనాయని వెంటాడి, పోరాడి, వానిని, వానిపరివారమును సంహరించిరి. కాని యాపోరాటమునందు బద్దారెడ్డి యిరువురుకుమారులు చనిపోయిరి. చనిపోయిన బద్దారెడ్డికుమారుల జ్ఞాపకార్థమై రాచర్లవద్ద యొకదేవాలయము కట్టింపఁబడెను.

ఈవిధముగ నెన్ని ప్రయత్నములు చేసినను దొంగల నుండి జనులకు భయముపోలేదు.



నగరసంరక్షణ

నగరములు వివిధపాలెములుగ విభజించఁబడి ప్రతిపాలె మునకు నొక్కొక్కతలారియు వానిక్రింద కొందరు పరిచార కులు నియోగింపఁబడిరి. వీరందఱు నగరమునందలి పాలెములను కాపలా చేయుచు రాత్రివేళలయందు పగటిపూటలయందు తిరుగుచుండెడివారు. తాము కాపలాకాయు సమయమున జరుగుచుండెడి విశేషములను పైయధికారులకు తెలియఁజేయు చుండవలెను. ఈపైయధికారిని జంగమయ్య యని పిలిచెడు వారు. ఈజంగమయ్య క్రింద సుమారు పండ్రెండువేలమంది తలార్లు కావలివారు పనిఁజేయుచుండెడివారు.

రాయలవారికాలమున రోడ్లమీఁదను బహిరంగస్థల ములయందు నల్లరిచేసెడివారిని గట్టిగ శిక్షించునట్లు శాసించి నందున, జనులు నిర్భయముగ నుండెడివారు. నగరికావలివారు తలార్లు తమతమపనులను చక్కఁగ నిర్వర్తించుచుండిరా లేదా

యని రాయలవారే స్వయముగ పరీక్షించుచుండిరి. రాయలవారప్పటప్పట ప్రచ్ఛన్న వేషమున తిరుగుచున్నందున తాచేవార్లందరు మిక్కిలి భయముతో తమపనిని చక్కఁబెట్టుచుండిరి. రాయలవారికాలమున నీనగరరక్షణ బహుచక్కఁగ జరుగుచుండెడిది.

అయితే యీవిధమైనకాపలావలన నగరమునందలి ప్రేమికులు రాత్రివేళల తమప్రేమికులవద్దకు వెళ్లుట బహుకష్టముగ నుండెడిది. అందువలన నిట్టివారు రాత్రివేళలయందు తలారులతో మంచిమాట గావించుకొనవలసివచ్చెడిది. ఇదిగాక దివాణములో రాత్రివేళ నగారా వాయించినపిదప వీథులయందు జనము తిరుగరా దని యొకశాసనముండెడిది. అందువలన ప్రేమికులకు మితిలేనికష్టము లుండెడివి. అందువలననే యొకకవి "నిరంకుశోపాఖ్యాన" మను గ్రంథమునం దీవిధమున వ్రాసియుండెను.

> " ప్రొద్దుపోయిన దని తలారులకు వెఱచి
> యొకవిధంబున నారాత్రి యుండఁ దలఁచె."

## 17. వర్తక వ్యాపారములు

రాయలవారి కాలమున వర్తకముబహుచక్కఁగపోషింపఁబడెను. రాయలవారికాలమున వారి ఆదాయములో ముఖ్యభాగము రేవులవద్ద వసూలుచేయఁబడినదే. ప్రాక్పశ్చిమదేశముల నుండి యనేకవస్తువులు తెప్పింపఁబడెడివి. పాశ్చాత్యదేశము నుండి వచ్చెడివస్తువుల నిచటికి తీసికొనివచ్చెడి వారిలో ముఖ్యులు అరబిదేశీయులగు మూరులును పోర్చుగీసువారు నయియుండిరి.

అరబ్బులు : పోర్చుగీసువారు : వీరు ముఖ్యముగ నరే బియానుండియు పర్షియానుండియు గుఱ్ఱములను తెచ్చెడివారు. గుఱ్ఱము లాదేశమునందు చక్కఁగ పెంచఁబడెడివి. మహామ్మ దీయులు హిందూదేశము నాక్రమించినపిదప యుద్ధములో గుఱ్ఱముల నెక్కువగ వాడుట మొదలువెట్టిరి. ఆకారణమున గుఱ్ఱపువర్తకము వృద్ధికాఁజొచ్చెను.అయితే అరబ్బులు మహామ్మ దీయులగుటచేత గుఱ్ఱములను వారు మహమ్మదీయులకే విక్ర యించుచు హిందూరాజులకు విక్రయించుట తగ్గించిరి. ఇందు వలన హిందూరాజులకు నరబ్బులకు కొంతవైర మేర్పడి చాల మందియరబ్బులను హిందూరాజులు చంపించిరి. రాయలవారు రాజ్యమునకు వచ్చుటకుపూర్వమే పోర్చుగీసువారు హిందూ దేశమునకువచ్చుట తటస్థించెను. అందువలన రాయలవారు పోర్చుగీసువారిని ప్రోత్సహించి వారిద్వారా వచ్చినగుఱ్ఱముల నన్నిటిని తామే విక్రయించుకొనెడివారు. అట్లు విక్రయించు కొనుటవలన తమయశ్వదళమును హెచ్చుచేసికొనిరి. గుఱ్ఱ ములనుగాక యితరములైన యనేక వస్తువులను రాయలవారు తెప్పించుకొనుచుండెడివారు.

రేవుల్మావు. మతంగజంబులు మణిశ్రీఖండముక్తాదియౌన్ ·
రావాణిజ్యముపెంచియేలఁగ నగున్.

అని ఆముక్తమాలద్యయందు రాయలవారు వ్రాసి యుండిరి. గజములు హెచ్చుగ సింహళద్వీపమునుండి కొని తేఁబడెడివి.

### రేవుపట్టణములు

రాయలవారు రాజ్యమునకు వచ్చునప్పటికే ముఖ్య మగు గోవారేవుపట్టణము మహమ్మదీయుల వశమైయుండి తరువాత వారివద్దనుండి పోర్చుగీసువారివశమైనది. రాయల వారికాలమున ముఖ్యముగ ప్రసిద్ధిలోనున్న రేవుపట్టణముల నీక్రింద వ్రాయుచున్నాను.

హొనవరు, భట్కాలు, బాకనూరు, బ్రాకలూరు, మంగ ళూరు, కంబోల, క్విలను, కెయాలు, నాగపట్నం, మైలాపూరు, పులికటు.

పాశ్చాత్యదేశములనుండియేకాక హిందూదేశమున నుండియు నొకచోటనుండి నింకొకచోటికి నవధాన్యములు, రస వర్గములు, మిరియాలు, ధనియాలు, ఇంగువ, పంచదార, నెయ్యి మొదలయిన వివిధరకములవస్తువులను తెప్పించుకొనుట పంపుట మూలముగ వర్తకవ్యాపారములు చక్కఁగ పోషింపఁ బడుచుండెడివి.

### వర్తకమార్గములు

వర్తకసరళికొఱకు మంచిబాటలు దేశమునం దంతటను వేయఁబడియుండెను. పశ్చిమసముద్రతీరమున నున్న భట్కాలు నుండి విజయనగరమువరకు నుండుమార్గము, తూర్పుసముద్ర మునసుండి యింకొకమార్గము, కాశీ రామేశ్వరములకుపోయెడు మార్గము, విజయనగరమునసుండి కాంచీపురమునకు పోవు మార్గము, బందరునుండి కోవిలకుంటవరకు కోవిలకుంటనుండి కంప్లివరకుపోయెడిమార్గము, అహోబిలమునుండి కంబంవరకు గుత్తినుండి మునిమడుగువరకు మార్గము ఆనాటిమార్గములలో

కొన్ని ముఖ్యమార్గములు. ఇవిగాక యింకననేకమార్గము లుండె
డివిగాని సరియైన మార్గము లనుటకు వీలులేదు.

ఆ కాలమున సరకుల నొకస్థలమునుండి యింకొక
స్థలమునకు తీసికొనిపోవుటకు బండ్లుండెడివి కావు. మనుష్యులు
మూటలను నెత్తిన కట్టుకొని పోవుట, కావడిలో సరకులు పెట్టు
కొని పోవుట, గుఱ్ఱములమీదగాని, ఎద్దులమీదగాని, గాడ్దెల
మీదగాని, మూటలుకట్టి యిరుపార్శ్వముల వ్రేలాడవేసి తీసి
కొనిపోవుట మామూలై యుండెను. ఈమార్గములును సరియై
నవి కానందునను త్రోవలో బాటసారులను, దొంగలుకొట్టుట
మామూలుగా నున్నందునను బాటసారు లొక్కరొక్కరుగ
పోకసమూహములుగఁ బోవుచుండిరి.

వర్తకులు తమసరకు లొకస్థలమునుండి యింకొకస్థలము
నకు తీసికొనిపోవుటకు వీలయినంతసావకాశములను రాయల
వారు కల్పించుచుండిరి. అచ్చటచ్చట సంతల నేర్పాటు చేసియు
వర్తకులకు తమవస్తువుల విక్రయించుటకు సావకాశములను
గల్గించి వారివర్తకమును ప్రోత్సహించుచుండిరి. ఇట్లేర్పాటు
చేయఁబడినసంతలకు పురుషులు స్త్రీలు ఇతరగ్రామములనుండి
వచ్చి వస్తువులను కొనెడివారు. దీనినే ఆముక్తమాల్యద
యందు రాయలవారు "ఊరూర సంతసంతకుఁ దిరుగ బెద్దలింటఁ
సంతరించిన పిలుకువాటిగోడిగల" యని వర్ణించియుండిరి.

## 18. పరిశ్రమలు

దేశమునం దారోజులలో నిప్పటివలెనే ముఖ్యమైన పరి
శ్రమ వ్యవసాయము. అందును వరిపంట ముఖ్యమైనది.
రాజ్యమునందు తెల్లబియ్యమును తినెడివారు. నల్లబియ్య

మితరదేశములకు రవాణా చేయఁబడెడిది. బీదలు సామాన్య ముగ సజ్జ, జొన్న పండించుకొని తినెడివారు.

చెఱకుపంట మంచివృద్ధిలో నుండెను. చెఱకునుండి బెల్లము, పంచదార, తయారుచేయుట ముఖ్యమైనపరిశ్రమలు.

నీటివసతిగల ప్రతిగ్రామమున మామిడిపండ్లు, పనసపండ్లు నారింజపండ్లు, అరటిపండ్లు, నిమ్మపండ్లు, కరిబూజపండ్లు, ద్రాక్ష పండ్లు, పండించెడివారు.

అన్నివిధములైన కూరగాయలు నాదినములలో పండిం చెడివారు. తమలపాకులపంట కొన్నిగ్రామములయందు ముఖ్యమైనపంట. అరఁటియాకులలో మంచివ్యాపారము జరుగుచుండెడిది.

వాసనగలపుష్పములను అందును ముఖ్యముగ గులాబి పుష్పములను పెంచి వాడెడువారు. స్త్రీలు పూవులగుత్తులను తమతలలయందును పురుషులు పూదండలను తమతలలచుట్టును ధరించెడివారు. ద్రవ్యవంతులు పుష్పములను తమపడకల మీఁద విరజల్లెడునాచార మాకాలమున నుండెడిది.

దూది వడికి నూలుతయారుచేయుట నూలుతో బట్ట లనునేయుట యింకొకపరిశ్రమ. సర్వసామాన్యముగ జనులు నూలువడకెడువారు. బట్టలను తయారుచేయునది జాండ్రవారు, సాలెవారు, పద్మసాలీలు నయియున్నారు. వీరు బట్టలునేయు టకు తొగటుమగ్గం తెల్లమగ్గమని రెండువిధముల మగ్గము లుండెడివి. తొగటుమగ్గముతో రంగుగుడ్డలను తయారుచేసెడి వారు. వీరుగాక మాలవాండ్లు కూడ బట్టలను నేసెడివారు, "సగముసాలెనేత సగముమాలనేత" యని సామెతకూడ దీనిని

బట్టియే వచ్చియుండును. దక్షిణదేశమున కురుబలను గొర్రెల కాపర్లు మంచినూలుదుప్పట్లను తయారుచేసెడివారు. పట్టుబట్టలు బెంగళూరు, గుత్తి, మొలకాల్మూరు, రాయదుర్గం, బళ్లారి గ్రామములయందు హెచ్చుగ తయారుచేయఁబడెడివి.



సముద్రతీరమునను సముద్రమునకు దూరముననున్న ప్రదేశములయందును కూడ ఉప్పును పండించెడివారు. ఈ ఉప్పు పంట యొక్క వమంగి జనముచే తయారుచేయఁబడెడివి.

ఇనుము కూడ నీరాజ్యమున సమృద్ధిగ నుండెడి దనియు నిచటనుండి యితర దేశముల కెగుమతిచేయఁబడుచుండెడి దనియు తెలియవచ్చుచున్నది. ఇనుము నా కాలమున నీదేశము నకు కావలసిన దానికంటె హెచ్చుగనే దొరకుచుండెడిది.

వజ్రములు కర్నూలనంతపురంజిల్లాలలోను భూమి నుండి త్రవ్వఁబడెడిది. వజ్రకరూరను గ్రామమున వజ్రములు దొరికెడివి. రాయలవారి రాజ్యమునకు వజ్రములవలన హెచ్చునాదాయము వచ్చుచుండెడిది.

## 19. న్యాయపరిపాలన

రాయలవారి కాలమునకు పూర్వమే విద్యారణ్యుల వారు న్యాయపరిపాలననుగూర్చి పరాశరమాధవీయమను గ్రంథము వ్రాసియుండిరి. ఈ పుస్తకమున వ్రాయఁబడిన యంశములనుబట్టియు, రాయలవారి కాలపు శాసనములను బట్టియు నప్పటి న్యాయపరిపాలననుగురించిన కొన్ని వివరములు తెలిసికొననగును.

## న్యాయాధికారి-రాజు

ప్రాగ్దేశములయందెల్లెడల దేశమునకు న్యాయపరిపాలనాధికారి రాజే అయియుండెను. రాజ్యాధిపతియే ప్రజలలోని తగువులను స్వయముగ తీర్మానము చేయవలెను. విశాలమైన రాజ్యమున స్వయముగ నీవిధిని రాజ్యాధిపతి నిర్వహించుట కష్టసాధ్యముగాన దేశమునందంతట తనబదులు న్యాయమును పరిపాలించుటకు న్యాయస్థానముల నేర్పాటుచేయవలసియుండెను. ఈన్యాయస్థానమునే "సభ" యనెడువారు. ఈసభలలో కొన్ని ముఖ్యమైనవి, మరికొన్ని అముఖ్యమైనవి యని రెండువిధములు. ముఖ్యములైన సభలు క్రమముగ న్యాయమును తీర్మానించుచుండెడివి. ముఖ్యములైనసభలలో కొన్ని "ప్రతిష్ఠిత" సభలు మరికొన్ని "అప్రతిష్ఠిత" సభలు. ప్రతిష్ఠిత సభలు కొన్నిస్థలములలో ఖాయముగ నుండెడివి "అప్రతిష్ఠితసభ" లధికారి యెచట నున్న నచటనే న్యాయపరిపాలనజేసెడివి. ఈసభలలో రాజుగారే స్వయముగ న్యాయపరిపాలనజేసినచో నాసభ "శాస్త్రిత" సభ యని పిలువబడెడిది. అట్లుగాక రాజుగారికిబదు లింకొకరు న్యాయాధికారిగ నియోజింపబడినచో నాసభ "ముద్రితసభ" యని పిలువబడెడిది. ఈభేదముల నీక్రింద చూపించుచున్నాను.



ఈసభలలో ముఖ్యమైనది రాజధాని యందుండు సభ. జనుల ఆస్తికి సంబంధించినవివాదములను (అనగా సివిల్) పరిష్కరించుటకును జనులను శిక్షించుట కర్హములైన వివాదములను (క్రిమినల్) తీర్మానించుటకు నధికారము లీసభకుండెడివి. ఈసభకు న్యాయాధికారి రాజు. వీరికి న్యాయపరిశీలనయందు సహాయముగనుండుట కొరకు ప్రాడ్వివాకుడు నిద్దరు సభ్యులు నుండెడివారు. ఈనల్గు రధికారులు కలసి న్యాయపరిపాలన చేసెడివారు. వీరుగాక నిరుపక్షములవారి యొక్కయు వారి వారి సాక్షుల యొక్కయు వాఙ్మూలములను వ్రాసికొనుట కొరకు లేఖకు డుండెడివాడు. వీరికి సహాయముగ నొకగణకు డుండెడివాడు. ఈగణకుడు కక్షిదారుల లెక్కలను తెల్పుచుండెడి వాడు. వీరికి తోడుగ కక్షిదారులను వారిసాక్షులను న్యాయ స్థానమునకు పిల్చుకొని వచ్చుటకు "సాధ్యపాలుడను నింకొక యధికారి యుండెడివాడు. న్యాయాధికారులు న్యాయస్థాన మున న్యాయపరిపాలనము చేయునపుడు న్యాయస్థానమును నిశ్శబ్దముగ నుంచుటకును న్యాయాధికారియిచ్చిన తీర్పు నములు జరుపుటకును నీసాధ్యపాలుని విధియైయుండెను.



రాజా

రాజుగారు న్యాయాధిపత్యమును వహించినపుడు వారే న్యాయపరిష్కారము చేయవలెను. ప్రాడ్వివాకులు సభ్యులును రాజుగారికి న్యాయ పరిష్కారమునందు సహాయు లుగ నుండవలెను. రాజుగారు చేసిన తీర్పుపై తమసంతకమును ముద్రయు నుండవలెను. రాజుగా రితర విషయాసక్తులై నపుడు తమస్థానమున నింకొక ప్రతినిధి నేర్పాటు జేయుట కధి

కారముండెడిది. అట్టి ప్రతినిధికి రాజుగారి స్థానే తీర్పు నిచ్చుట కధికారముండును. న్యాయస్థానమున రాజుగా రాసీనుడగుట కొక ధర్మాసనముండెడిది. దానిని బట్టి న్యాయస్థానమును ధర్మాసన మని కూడ పిలిచెడివారు.

### ప్రాడ్వివాకుడు

న్యాయపరిశీలనయందు రాజుగారికి సహాయుడుగ నుండి న్యాయమును కనుగొనుటకై సాక్ష్యములను విచారించుట కీప్రాడ్వివాకు డేర్పాటు చేయబడెను. ఏసందర్భములకు ధర్మసూత్రము లేరితి నుపయోగించవలెనో, కక్షిదారుల వాదములబట్టి న్యాయ మెటున్నదో పరిశీలించి తమతమ ప్రత్యేక అభిప్రాయములను తెల్పుటకై యీప్రాడ్వివాకుడు, సభ్యు లేర్పాటు చేయబడిరి. ప్రాడ్వివాకునికిగాని సభ్యులకుగాని కక్షిదారుల వివాదములను తీర్మానించుట కధికారము లేదు.

కక్షిదారులు స్వయముగ రాజుగారికిగాని రాజుగారిచే నేర్పాటుజేయబడిన అధికారికిగాని తమవివాదముల గూర్చి విన్నవించవలెను. నష్టపడిన జనులు రాజుగారు దోవను పోవునపుడు వారితో స్వయముగ చెప్పికొన్నట్లున్ను వారు చెప్పిన విషయముల నాలోచించి అప్పటికప్పుడే తీర్పుచెప్పుటకు తనవద్ద నున్న పెద్దమనుష్యుని ప్రతినిధిగ నేర్పరచి వివాదముల విచారించి పరిష్కరించెడువా రనియు న్యూనిసు చరిత్రకారుడు వ్రాసియుండెను.

నేరములు జరిగినపుడు రాజుగారు తమయెదుట తామే స్వయముగ విచారించెడువారు. నేరము చేసెనని చెప్పబడిన మనిషిని పిలిపించి తత్క్షణమే విచారణ చేసెడివారు. సామాన్యముగ

నేరములను జేసినవారిని రాజుగారివద్దకు తలారి తీసికొనివచ్చి నేరమిస్వభావమును వివరించును.

ఆస్తిని గురించిన వివాదములలో కక్షిదారులు స్వయముగా రాజానని యెడల వారి తరఫున పనిచేయుట కితరుల నియోగించుకొనవచ్చును. అట్టిప్రతినిధులు జేసిన పనులకును కక్షిదారులు బద్ధులగుదురు కాని నేరస్థుకెట్టితరులను నియోగించుటకు వీలులేదు. నేరస్థుడు తానుండి, తననిర్దోషిత్వమును తానే నిరూపించవలయును.

## ప్రతిజ్ఞాపత్రము - ఉత్తరవాదము

ఆస్తికి సంబంధించిన వ్యాజ్యములలో వాది ప్రథమమున తనవాదనగల ప్రతిజ్ఞాపత్రమును దాఖలు చేయవలెను. ప్రతిజ్ఞా పత్రమునకు ప్రతివాది తనయుత్తరవాదమును దాఖలుచేయవలెను. ప్రతివాది తనయుత్తరవాదమును దాఖలు జేయుటకు వాయిదా కోరిన నిచ్చెడు మామూలు కలదు. కాని నేరస్థునికి మాత్రము తనయుత్తరవాదము తెలుపుకొనుటకు వాయిదా నిచ్చెడువారు గారు. మొదటివాయిదానాటికే నేరస్థుడు తనయుత్తరవాదముతో సిద్ధముగనుండవలెను. ప్రతిజ్ఞాపత్రము, ఉత్తరవాదము సిద్ధమయినవెంటనే న్యాయాధికారి సాక్ష్యమును విచారించును. సాక్ష్యము రెండువిధములు 1. మనుష్యమాత్రము. 2. దైవికము. మనుష్యమాత్రమైనసాక్ష్యముద్వివిధము. 1. వాగ్రూపకము 2. దస్తావేజుసంబంధమైనది. మనుష్యమాత్రసాక్ష్యములేనప్పుడు దైవికసాక్ష్యముపైనాధారపడెడివారు. దైవికసాక్ష్యమన్న దేవునిపై భారముంచి యొక శపథము నంగీకరించుట. నిజమైన వాదములయందు దైవబల

ముందు నను నమ్మకమే శపథముల నంగీకరించుటకు గలకార ణము. సాక్ష్యము పూర్తియైన పిమ్మట న్యాయాధికారి తన తీర్మానమును "జయపత్ర" మూలమున బహిరంగపరచును. ఈ "జయపత్ర"ము పైన న్యాయాధికారియు, ప్రాడ్వివాకుడు, సభ్యులు సంతకములు చేయుదురు.



నేరస్థులకు శిక్షలు మాత్రము బహుక్రూరముగ నుండెడివి. దొంగతనము చేసినవానికి చెయ్యిగాని కాలుగాని నరకుట శిక్ష. హెచ్చు వస్తువులు దొంగతనముచేసిన వారికి ఉరిశిక్షయు వేయబడెడిది. స్త్రీనిగాని కన్యనుగాని జెరిచిన నేరమున కురి శిక్షయే. ప్రభుత్వాధికారులు రాజద్రోహము చేసినచో నట్టి వారిని సజీవులుగనుండగనే తలుపులబెట్టెడువారు. ఒక్కొక్కప్పుడు కాలుచున్న కత్తినిగాని యినుపముక్కనుగాని పొట్టలోనికి పొడిచెడువారు. చంపిన నేరమున కురియేశిక్ష. రాజులు తమ కసినితీర్చుకొనుటకు నేరస్థుల నేనుగులవద్దకు నెగురవేసి చిత్రవధగావించెడు వారు. ఈ యేనుగులు తమవద్ద కెగుర వేయుబడిన నేరస్థులను తొండములతో చీల్చి చంపివైచెడివి.

రాజుగారు దేశసంచారముపోయినపుడు గ్రామము లోని జనులు వారివద్దకు జని తమతమకష్టసుఖములను చెప్పు కొనెడి వారు. అప్పుడు రాజుగారు వారివారి వాదప్రతివాద ముల విని తమ తీర్మానములను తెల్పి ప్రజల సంతోషపరిచెడు వారు. ఆసమయమున రాజసభ అప్రతిష్ఠిత సభయగును.

రాజధానిలో న్యాయపరిపాలన జరిగెడి పద్ధతిని గూర్చి యిదివరలో వ్రాసియుంటిమి. రాజ్యమునందు వివిధరాష్ట్రముల

యందును, సీమలయందును నీవిధముగనే న్యాయాధికారుల
నేర్పాటుచేసి వారివలన న్యాయము పరిపాలింపబడెడిది.
అచ్చటచ్చట నేర్పాటుచేయ బడిన న్యాయసభల కచటి పెద్దయధి
కారు లాధిపత్యమును వహించి న్యాయమును నిర్వహించెడి
వారు. గ్రామసీమల యందలి న్యాయాధికారు లిచ్చిన తీర్పు
లను విమర్శించి వాటిని మార్పు చేయుటకుగాని రద్దుచేయు
టకుగాని రాష్ట్ర న్యాయసభల కధికారముండెడిది. కావేరి
సముద్రమునం దొక మల్లంరాజను వారు హనమద్గుండ మను
గ్రామకరణీకమిరాసి తనకు గలదని యచటి ధర్మాసనమునందు
దావాచేయగా నాతని దావాధర్మాసనముచే త్రోసి వేయబడెను.
అందుపైన నీమల్లంరాజు గండికోట పరగణా కధిపతిరైన
నంద్యాల పెదనరసింహరాజుగారివద్ద నప్పీలు చేయగా నరసింహ
రాజుగారు ధర్మాసన మేర్పాటు గావించి రెండు పక్షముల
వారిని విని మల్లంరాజుకే మిరాసీ హక్కుగల దని నిర్ధారణ
చేసి "జయలేఖను" వ్రాయించియిచ్చిరి.

అమరనాయకులు:—అమరనాయకులకు గూడ న్యాయ
పరిపాలన చేయుట కధికార మున్నట్లుండెను. బందిపోటు
దోపిడి దొంగతనము జరిగిన పిదప నేరములవలన బాధచెందిన
వా రీయమరనాయకులవద్ద చెప్పుకొనుటయు నమరనాయకు
లా దొంగలను పట్టించి విచారణ జరిపి శిక్షార్హులను శిక్షించు
టయు జరుగుచుండె నని ఆముక్తమాల్యదలో నీపద్యభాగము
వలన తెలియనగును.

తే. అనిన వలతిగఁ గోల్పెకఁ యతఁడు రెడ్డి
రాజుఁ గనుఁగొని

ఈపద్యమువలన దొంగకొట్టిన పిదప దెబ్బలుతిన్న వాడు గ్రామరెడ్డితో గాని రాజుతో గాని చెప్పు నని భయపడి వానిని జంపుటకు ప్రయత్నించె నని వ్రాయబడియున్నది.

ఇట్లే దేవాదాయ ధర్మాదాయాధికారులు తమధర్మా దాయమునకు సంబంధించిన ప్రదేశములలో జరిగిన చిన్న చిన్న నేరములను తాము విచారించుటకును శిక్షార్హులను శిక్షించు టకు నధికారముగల్గియుండిరి.

సర్వసామాన్యముగ నెచ్చటి తగవుల నచటి పెద్దలు ధర్మాసనమును సమావేశపరచి తగురీతిని విచారించి పరిష్కరించెడి యాచారము కలదు. కొండజాతి వారితగవులను కొండజాతివారును, వ్యాపారస్థుల తగవులను వ్యాపారస్థు లును, కులతగవులను కులపెద్దలును గ్రామతగవులను గ్రామ పెద్ద లును విచారించుట యుచితమని పరాశరుడు తన గ్రంథమునందు వ్రాసియుండెను. అట్లేజరుగుచుండెను. అట్లు వారిచే జేయబడిన తీర్మానములును న్యాయముగ నుండినట్లె తెలియవచ్చెడిని. ఈ న్యాయమును గూర్చివ్రాయుచు నొకకవి యొకచిత్రమైన విషయమును వ్రాసియుండెను.

ఒకానొక బ్రాహ్మణుడు కొండమండల గ్రామమునుండి వరంగలు ప్రాంతమునకు పోవుట తటస్థించెను. ఈ బ్రాహ్మణు డచటికి బోయిన పిదప నచటికనతి దూరముననున్న యక్కల వాడ యను గ్రామమున నొక సౌందర్యవతియగు భోగస్త్రీ యుండ నామెతో నొకరాత్రి గడుపవలెనని కుతూహలుడై వేశ్యమాతతో నీవ్యవహారమును మాట్లాడి పరిష్కారము చేసి కొనెను. ఆరాత్రికి వేశ్యమాత నాసౌందర్యవతి నీతనివద్దకు

పంపక తనవద్ద నున్న పరిచారికలలో నొకతెను పంపెను. ఆ బ్రా
హ్మణుఁడీసంగతిని గమనించక తనవద్దకు పంపబడిన పరిచారికతో
రాత్రినంతయు గడిపెను. తరువాత వేశ్యమాత చేసిన మోసమును
తెలిసికొని నచటి తలారివానితో నీమోసవిషయమై నివేదించెను.
తలారు లావేశ్యమాతను బంధించి కామశాస్త్రవేత్తలకు పెద్దల
పిలువనంపి వారి నీవ్యవహారమును పరిష్కరింప గోరిరి. కామ
శాస్త్రవేత్తలు ధర్మాసనముగ సమావేశమై కామశాస్త్రమునందు
మంచి ప్రవీణతను సంపాదించి ప్రఖ్యాతి గాంచిన గోవిందశర్మ
యనువా రటుపోవుచుండ వారిని రావించి వారి నీవిషయమున
న్యాయమును తేల్పుమని కోరిరి. శర్మగారు కామశాస్త్ర గ్రంథ
ముల పరీక్షించి వేశ్యమాత గావించిన మోసమున కాపెశిరో
జములు క్షౌరముగావించి తలబోడి చేయించుట న్యాయ
మైనను ధర్మాసనస్థులు కొంతదయ చూపవలయునని యు జెప్పిరి.

అప్పటి న్యాయాధికారులు న్యాయమును కనుగొనుటకై
శక్తివంచన లేక ప్రయత్నించి నిజమును కనుగొని తీర్పుల నిచ్చు
చుండెడివారు. విచారణయంతయు శాస్త్రానుసారముగ జేయు
చుండెడివారు. న్యాయ శాస్త్రమునకు విరుద్ధము కాకుండ నిజ
మును మాత్రమే గ్రహించి న్యాయనిర్వాహణము చేసెడివారు.
మాటలకు విరుద్ధార్థములు కలుగజేసి అర్థభేదములనుబట్టి న్యాయ
విరుద్ధము గావించెడువారు గారు. అందువలననే కక్షిదారులు
ధర్మాసనముయొక్క తీర్పుతో సంతుష్టి జెందెడువారు గాని
సామాన్యముగ నీతీర్పును రద్దుపరిపించుటకై యింకొక ధర్మాస
నమునకు పోయెడివారు కారు. వ్యవహారములు చాలవరకు
మధ్యవర్తులచే తీర్మానింపబడుచుండెడివి. కక్షిదారులు తమ

నరు వ్యవహారపత్రికల నిచ్చిన పిదప మధ్యవర్తినేర్పాటు గానించుకొని వారియొక్క మధ్యవర్తిత్వమును నంగీకరించెదమని ప్రతిజ్ఞా పత్రిక వ్రాసియిచ్చి మధ్యవర్తి తీర్పును శిరసావహించెడు వారు. వీరి మధ్యవర్తిత్వము నుల్లంఘించినను చేయవగిన కార్య మింకొకటి కనుపించదు. అట్లుచేసినట్లు కనుపించదు. ప్రజాభిప్రాయమున్ను అట్లుల్లంఘించుట కంగీకరించెడిది కాదు.

శాస్త్రసంబంధమైన విషయముల గూర్చి విమర్శింపవలసి నపుడు ధర్మశాస్త్ర సంబంధం దారితేరిన బ్రాహ్మణులు పెద్దగా నున్న ధర్మాసన మేర్పాటుజేయబడెడిది. ఒరాసీలు మేరలను గూర్చి చర్చింప వలసినచో నావిషయమునందు ప్రవీణులైన వారితోకూడిన ధర్మాసన మేర్పాటుచేయబడెడిది. సామాన్యముగ నీవిషయములన్నిటిని అగ్రహారము లందుండెడి మహాజనుల కప్పజెప్పెడివారు. గ్రామ మర్యాదల గూర్చివిమర్శించ వలసినచో గ్రామపెద్ద లుండెడి ధర్మాసన మేర్పాటు చేయబడెడిది. ఇట్లేయేవిషయమును గూర్చి విమర్శింపవలసినప్పుడా విషయమునుగూర్చి బాగుగ తెలిసిన పెద్దమనుష్యులుగల ధర్మాసన మేర్పాటు చేయబడెడిది.

## సాక్ష్య విచారణ

వ్యవహారపత్రములను ధర్మాసనమున కందజేసిన పిదప విచారణ జరుపబడును. సాక్ష్యవిచారణకు పూర్వము సాక్ష్య మిచ్చువారు ప్రమాణము చేయవలెను. ప్రమాణము చేయుటకు సాక్షులు దేవాలయమునకు పోయి అచటి చెరువులో స్నానముజేసి తడిగుడ్డలతో దేవుని ముఖము జూచుచు ప్రమాణముజేయువలెను. కొన్ని సమయములప్పుడు దేవునితీర్థమును

పుచ్చుకొని ప్రసాదమును చేతబట్టుకొని ప్రమాణముజేయ వలెను. సాక్ష్య విచారణానంతరము ధర్మాసనమున తీర్పు చెప్ప బడును. తీర్పును "జయపత్రిక" యని పిలిచెడివారు. ఈ జయ పత్రికను గ్రామ మునసబునకును గ్రామకరణమునకును పంపించెడి వారు.

న్యాయనిర్వహణమునందు ప్రత్యేకముగ న్యాయవాదు లుండెడివారుకారు గాని ధర్మశాస్త్రములు మాత్ర ముపయో గింపబడెడివి. హెచ్చుగ యాజ్ఞవల్క్యస్మృతి యుపయోగింప బడెడిది. గ్రామములయందు ధర్మాసనములు దేవునిగుడిలోని మంటపముల యందేర్పాటు చేయబడెడివి. ఒక్కొక్కప్పుడు గ్రామ మున వేపచెట్టుక్రిందకట్టబడిన అరుగుపై ధర్మాసన మేర్పాటు గావించి న్యాయవిచారణ గావింపబడినట్లు చరిత్రవలన తెలియుచున్నది. దేవునియందు ప్రజలకు భక్తిమెండుగా నున్నం దున దేవునిసముఖమున జను లబద్ధము చెప్ప రను నమ్మికవలన నీ ధర్మాసనము సామాన్యముగ దేవాలయమునందే యేర్పాటు చేయబడెడిది.

## 20. సైనికవిధానము MILITARY ORGANIZATION

విజయనగరాధీశులు, అందును ముఖ్యముగ కృష్ణదేవ రాయలు, తమదేశమును తురుష్కులబారినుండి తప్పించి వారితో యుద్ధమున కెల్లప్పుడును సంసిద్ధులుగనుండి వారిని చెదరగొట్టుటకై తమపరిపాలన నేర్పాటుచేసియుండిరి. ఈ యేర్పాటుననుసరించి దేశరక్షణకుగాను తగినకోటలను తగినంత సైన్యమును సిద్ధముగ నుంచి యుండిరి.

కోటలు:—ఆకాలమున రాజు లభేద్యములైన కోటలను నిర్మాణముచేసియుండెడివారు. చాలభాగముకోటలన్నియు మట్టితో నిర్మాణము చేయబడెడివి. ముఖ్యమైన కోటలను మాత్రము రాతితో కట్టించెడివారు. పూర్వసాంప్రదాయముల ననుసరించి కోటలు గిరిదుర్గ, స్థలదుర్గ, జలదుర్గ, వనదుర్గ యని నాల్గువిధముల నుండెడివి. ఇదిగాక గహ్వర, కర్దమ గ్రామ కోష్ఠ దుర్గములని మరినాల్గువిధములైన కోట లున్నట్లు కొన్ని గ్రంథములయందు వ్రాయబడియుండెను. స్థలదుర్గములదగ్గరకు శత్రుసైన్యములు రాజాలకుండుటకై లోతైన కందకములను కోటచుట్టు త్రవ్వించెడువారు. సైనికులు కోటదగ్గరకు రాకుండుటకును, వచ్చెడివారిని దరిజేరనివ్వకుండుటకును, రాళ్లు, కత్తులు విసరుటకు కోటగోడలపై "పాశన" యంత్రము లమర్చబడియుండెడివి. కొన్ని ముఖ్యమైనకోటగోడలపైన తుపాకిమందుపయోగించబడెడి "దంబోల" యను తుపాకినుంచెడివారు. ఇదిగాక కోటలను శత్రువులనుండిరక్షించుటకు మందుతో కాల్చబడెడు ఆకాశబాణములు, అర్ధచంద్రబాణములునే అప్పుడుసిద్ధముగనుంచబడెడి. ఈకోటల సంరక్షణము నమ్మకమైనవారును విశ్వాసపాత్రులునగునమరనాయకులపైనుండెడిది.

## సైన్యము; సైన్యవిభాగములు

అమరనాయకులు తమసొంతఖర్చుతో కొంతసైన్యమును రాజ్యావసరములకై యెల్లప్పుడును సిద్ధముగ నుంచవలెను. ఇది అమర లేక అమరనాయకులసైన్యము. ఈఅమరనాయకుల సైన్యము దాదాపు లక్షమందికాల్బలము ముప్పదియైదువేల అశ్వబలము, ఇదిగాక గజబలమునుకూడ కొంతసిద్ధముగ

నుంచవలెను. రాజుగారు తమ రాజ భాండారమునుండి, ఖర్చు పెట్టి తయారుగనుంచెడి సైన్యము రెండవది. దీనినే కైజీతపు సైన్యమందురు. రాయలవారికి పూర్వ మీా కైజీతపు సైన్యముండెడిదికాదు. ఈ కైజీతపు సైన్యము నేర్పాటు జేయుటకే రాయలవారు పట్టాభిషిక్తులైన పిదప ప్రయత్నము చేసి ఫలింప జేసిరి. కైజీతపు సైన్యమున కబ్బలి తులువ మొరస జాతుల వారిని ప్రోత్సహించి చేర్చియుండిరి. ఈజాతులవారు యుద్ధము నందు మిక్కిలి నిపుణతేగలవారు.

ఇరువదివేల గుఱ్ఱములును నూటయిరవయి యేనుగ ఘట్టములున్ను రెండులక్షల కాల్బలమున్ను అమరనాయకుల సైన్యముయొక్క సంఖ్యయని యు, పండ్రెండు వేల గుఱ్ఱములు అయిదువందల యేనుగులఘట్టములు లక్షకాల్బలమును కైజీతము యొక్కసంఖ్యయనియు రాయవాచకము నందు వ్రాయ బడియుండెను. ఘట్ట మనగ పది యేనుగులు.

సైనికుల వస్త్రధారణము:—యుద్ధసమయమున సైనికు లందరును తోలుతో తయారుచేయబడిన వస్త్రములను ధరించెడు వారనియు నావస్త్రములను ధరించినపుడు వారిముఖము చేతులు పాదములు మాత్రము కనుబడుచుండెడివనియు తెలియ వచ్చు చున్నది. "చర్మాంత ప్రతికళ సంకృచ్ఛశరీరా" యనియు "సంవృ శ్యా ననచరణా" యనియు నొకకవి వ్రాసియుండెను. అశ్వము లను గజములను యుద్ధసమయమునందు ప్రత్యేకముగ నలంక రించినట్లు మనుచరిత్రవలన స్పష్టమగుచున్నది. ఈవిషయమును గూర్చి యిదివరకే వ్రాసియుంటిని.

యుద్ధముచేయుపద్ధతి:—రాయలవారి కాలమున సాంప్రదాయములకు హెచ్చుప్రాముఖ్య మివ్వబడుచుండెడిది. శకునములను ముహూర్తములను జాగ్రత్తగ కనిపెట్టుచుండెడివారు. రాయలవారి వెంట నెల్లప్పుడును శాకునికు లుండి శుభాశుభ శకునములగూర్చి చెప్పుచుండెడివారు. యుద్ధసన్నద్ధులు కాక పూర్వము శకునములను ముహూర్తములను చక్కగ గణించి పరీక్షించెడివారు. గొప్పకార్య మారంభించక పూర్వము జనుల వాక్కు లెట్లుండెడివో కనుగొని వారు చెప్పుకొను "ఉపశ్రుతి" వలన జయాపజయముల నిర్ణయించుకొనెడువారు. ఈయుపశ్రుతి వలననే తమపనో నిశ్చయమును చేసికొనెడువారు. కళింగదేశము పై యుద్ధమునకు వెడలక పూర్వము తనమంత్రియగు నప్పాజిని రాజధానియం దుపశ్రుతి యెట్లున్నదో కనుగొనుటకై తెల్లవారు జామున పంపెను. అప్పాజీ వెళ్లుచు కొంత మంది చాకలవాండ్ల గృహములవద్ద,

కొండవీడు మనదేరా కొండపల్లి మనదేరా,
కాదని యెవ్వరు వాదుకువచ్చిన కటకము దాకా మనదేరా.

యను పదము పాడుచుండుట విని యీవచనము లుపశ్రుతిగ జేకొని తదనుసారముగ కళింగదేశ ప్రవేశమును గజపతి రాజున కపజయంబును నిశ్చయించుకొని రాయలవారితో సంప్రతించి తత్క్షణమే యుద్ధసన్నాహము గావించిరి.

యుద్ధసంబంధమగు విషయములన్నియు నొక ప్రత్యేక శాఖ క్రింద నున్నట్లు నాశాఖ "కందాచార" శాఖయని పిలువబడినట్లును శాసనముల వలన తెలియుచున్నది. ఈశాఖలో

ననేకుల కు ద్యోగము లివ్వబడెను. ఈశాఖకు నాయకుడు ప్రాముఖ్యమైన యుద్యోగి. వీరి స్వాధీనముననే నీశాఖయంతయు నిర్వహింపబడుచుండెడిది.

ఆకాలమున రాజులు సామాన్యముగ స్వయముగ యుద్ధముజేయు టాచారముకాదు. కాని కృష్ణదేవరాయలు మాత్రము ఉమ్మత్తూరుపై యుద్ధము ప్రారంభించినప్పటి నుండియు తాము స్వయముగనే యుద్ధమునకు వెళ్లుచుండెడి వారు. యుద్ధసన్నాహము ప్రారంభించినంతనే రాయలవారు రాజధానినగరమున విశాలబహిరంగ ప్రదేశమున వెలిగుడార ములు వేయించి ఆగుడారములందు తాము విడిదిజేసెడువారు. తాముగుడారముననుండి తమవారలను, మన్నీలను, రౌతులను, ప్రస్థాధికారులను, కరణములను, రాయసంవారిని, అవసరం వారిని మొదలుగాగల యధికారులనందరి నచటికి రావించి వార్లను తమతమ వద్దనున్న యుద్ధపరికరములతో, ఆయుధ ములతో, స్తోమములతో, ఆయత్తపాటులతో నగరిలెక్క ప్రకారము ఏనుగులు, గుఱ్ఱములు, రౌతులు, కాలువ, బంటు మొదలయిన చతురంగబలములతో యుద్ధమున కాయత్తముగు డని యానతిచ్చెడు వారు. అట్లానతిచ్చిన వెనుక వచ్చెడి వారిని సమకూర్చుకొనుచు మెల్ల మెల్లగ పయనమై రోజు కామడ దూరము చని అచట నింకను రావలసినవారికై రెండుమూడు దినములుండి, అందరుసైనికులు చేరువరకు మెల్ల మెల్లన పోవుచుండెడివారు. రావలసిన వారందరు చేరిన వెంటనే సైన్యసమేతులై గమ్యస్థానమునకు తొందరగ పోయెడువారు. రాయలవారెల్లప్పుడు తమకైశితగాండ్లతో

మధ్యనుండెడువారు. మిగిలిన సైన్యమంతయు నాల్గుభాగ ములుగ విభజింపఁబడి రాజుగారికి నాల్గువైపుల నాల్గుభాగ ములుగ నమరనాయకుల యాధిపత్యమున నడచుచుండెడివారు. వీరు పయనమైపోవునపుడు యుద్ధముసేయుజనమేగాక యితర జనము హెచ్చుగ నుండెడిది. వీరివెంట సేనానాయకులు వారివెంట వారిభార్యలు వారిపిల్లలుకూడ నుండెడివారు. సైనికుల కవసరమగు తినుబండారములు, గుఱ్ఱములు, పశువులు వీటికవసరములగు ఉలవలు, గడ్డి మొదలయిన వస్తువులు-ఇది యది యననేల? అవసరములగు నన్నివస్తువులు రాజుగారి వెంటనే వెళ్లుచుండెడివి. వీరందరివెంట భోగస్త్రీలుకూడ నుండెడివారు. వీరెచట విడిసిన నచటనే పెద్దపట్టణముగనుండి రమ్యమైన బాటలు గృహములు తయారై యుండెడివి. రాజు గారు విడిసిన ప్రదేశమునుండి యింకొక ప్రదేశమునకు బయలుదేరునపుడు గంటమ్రోగింపఁబడి సమావేశమయిన జనులందరును వస్తుసమేతముగ పయనమై వెళ్లినపిదప విడిది పట్టణము తగులబెట్టఁబడెడిది.

ఇప్పటివలె నాకాలమున ప్రభుత్వమువారు సైనికులకు వలసినవస్తువుల నిచ్చెడువారు కారు. అయితే వారికి మాత్రము లోటెంతయు నుండెడిది కాదు. ప్రతిసైనికదళమున కవసరమైన వస్తువులను తెచ్చి విక్రయించుటకు వర్తకులును వచ్చెడివారు. ఈవర్తకు లంగళ్లుపెట్టి వస్తువులను విక్రయించుచుండెడివారు. బంగారు వెండి నగలు చీరెలు మొదలయిన వస్తువులన్నియు యీ నాయంగళ్ల యందు విక్రయింపఁబడుచుండెడివి.

శత్రురాజ్యప్రసరిహద్దులను జేరినంతనే తమరాజ్యము నందలి కొండజాతులవారిని శత్రుస్థానములను నాశనము చేయుటకై వదలిపెట్టెడువారు. ఈకొండజాతులవారు యుద్ధ భూమియందు చేయు సహాయము మెండుగ నుండెడిది అందు వలన నీకొండజాతులవారిని జాగ్రత్తతో నదుపునందుంచెడి వారు. రాయలవారు దిగ్విజయయాత్రకు పయనమై పోవునపుడు తనరాజ్యమునందు నివసించియున్న పదునెనిమిది కొండజాతుల సమూహములను పిలిపించి వారికి విందొసంగి తమకుముందుగ ముప్పదిమైళ్లదూరమున ప్రయాణముచేయుచు శత్రుసైన్య మును శత్రువులసామానులను, గొఱ్ఱెలను మేకలను గుఱ్ఱ ములను సంగ్రహించుటకై యేర్పాటు గావించెడివారు. ఒక్కొకప్పుడు శత్రుప్రదేశములను తగులబెట్టించుచుండిరి.

సామాన్యముగ నాకాలమున కోటలే ముఖ్యమైన రక్షణస్థానము లైనందున ముందు కోటలనే ముట్టడించెడు వారు. కోటలను ముట్టడించుటలో కోటగోడలను పగులగొట్టుట గోడలలో కంతలనుజేయుట ముఖ్యమైనసాధకములు. ఒక్కొ క్కప్పుడు కోటగోడలపైకి ప్రాకి గోడలపై నెక్కుటయు కద్దు. కోటగోడలవరకు పోవుటకు కోటగోడల పక్కనున్న కందకములపై వంతెనలకట్టుటకు మంచిపనివాం డ్రుండెడివారు. కోటతలుపులు పగులగొట్టుటకేనుగు లుపయోగింపఁబడెడివి.

పెద్దమైదానముల యందు యుద్ధము చేయవలసిన చోట హిందూసాంప్రదాయముల ననుసరించి యిరుపక్షములవారును ముఖాముఖి యెదురుగనుండి పోరాడుచుండెడివారు. అయితే రాయలవారు సైన్యమునంత నొకసారియే యుద్ధరంగమునకుఁ

బంపక సైన్యమును పలుభాగములుగ విభజించి ముందరనున్న రెండు మూడుభాగముల సైన్యమును మాత్రము ముందుప యోగించెడువారు. రాయచూరుయుద్ధమున నిట్లే చేయగా ముందుండి యుద్ధముచేయుచున్నవారు తురకసైనికు లుప యోగించిన తుపాకిగుండ్లధాటికి తట్టుకొనలేక పారిపోవసాగిరి. అప్పుడు పారిపోవుచున్న రాయలసైన్యమును తురకలయశ్వ దళము వెంటాడెను. ఆసమయమున మిగిలియున్న శేష సైన్యమును రాయలవారు ప్రోత్సహించి వెంటబడి తరుముచు వచ్చుచున్న గుఱ్ఱపుదళమున కెదురుతిరిగి పోరాడి దానిని నాశనముజేసి యుద్ధమునందు విజయముగాంచిరి.

యుద్ధమున జయించిన ప్రదేశములయందు నమ్మకమై నట్టియు విశ్వాసపాత్రులైనట్టియు నధికారుల నుంచి అచటి ప్రజలకు తగునేర్పాటులు గావించుటకు తమయధికారులను రాయల వా రాజ్ఞాపించెడివారు. భయమువలన శత్రువులను లొంగదీసినను నయమువలన వారికి విశ్వాసముకలిగించి రాయల వారు వారిని పాలించెడివారు.

విజయనగరరాజ్యమున నౌకాదళమున్నందులకు రాయల వారు వహించిన బిరుదములే తార్కాణములు. గోవా పట్టణ మాకాలమున తురకల స్వాధీనమునం దుండెను. గోవాను వశ పరచుకొనుటకు పోర్చుగీసువారు ప్రయత్నించి నపుడు రాయల వారి నౌకాదళాధికారియగు "తిమోజా"డను వారు తమ నౌకాదళముతో పోర్చుగీసువారికి సహాయము గావించి గోవాపట్టణమును తురకలవద్దనుండి వశపరచుకొన్నట్లు తెలియు చున్నది.

## 21. రాయలవారు: మతము: మతవ్యాప్తి

విజయనగర రాజ్యస్థాపనకు పూర్వము దేశమునందంతటను మతవైషమ్యములు హెచ్చుగనుండెడివి. మహమ్మదీయ రాజులు దేశమునందు రాజ్యస్థాపనము ప్రారంభించిన కాలమున హిందూమతవిధ్వంసనము చేయుటవలనను హిందూ దేవాలయముల నాశనముజేయుటవలనను మతవైషమ్యములు పెరిగి వీరశైవమతవిజృంభణమును వీరవైష్ణవమత ప్రాముఖ్యమును దేశమునందు హెచ్చెను. మతసంఘర్షణల వలన దేశమునందు పోరాటములు హెచ్చి దేశమంతయు చీకాకైయుండెను. అద్వైతమతప్రతిష్ఠాపనాచార్యులగుమాధవాచార్య విద్యారణ్యులవారి యాధిపత్యమున విజయనగర రాజ్యస్థాపన జరిగియుండుటచేత నీరాజవంశజులయందు మత సామరస్యము హెచ్చుగ నుండెను. వీరు రాజ్యము చేసినంత కాలము, మతములన్నియు దేశమునందు పోరాటములులేక వృద్ధిచెందుచుండెను.

కృష్ణదేవరాయలవారు వైష్ణవమతస్థులు. వీరు వ్రాసిన విష్ణుచిత్తీయగ్రంథమే వీరిమతమును ప్రకటించుచున్నది. వీరు వైష్ణవమతము ననుసరించిరని చెప్పుటచేత నితరమతముల ద్వేషించిరనిగాని, నిరసించిరనిగాని, అలక్ష్యము చేసిరనిగాని చెప్పుట కెంతమాత్రమును వీలులేదు. రాజ్యారూఢులైన కొద్దికాలమునకే హంపీనగరమువద్దనున్న విరూపాక్ష దేవాలయమును రాయలవారు బాగుచేయించిరి. వైష్ణవ దేవాలయములను శివాలయముల ననేకవిధములుగ బహూకరించిరి. తిరుపతి, కాంచీపురము, సింహాచలము, అహోబిలము,

తిరువణ్ణామలె, చిదంబరము, కాళహస్తి, శ్రీశైలము నందలి దేవాలయములను వృద్ధిచేసి ఆదేవాలయముల కనేక దానముల నిచ్చిరి. జైనమతస్థులు దేశమున సుఖముగ జీవించిరి. వీరశైవులు మతద్వేషమువలన శ్వేతాంబరజైనులను హింసించి నపుడు రాయలవారిలింగాయతుల శిక్షించిరి.

రాయలవారి రాజ్యమున హిందూమతస్థులేగాక యితర మతస్థులును మిక్కిలి ప్రేమతో నాదరింపబడుచుండిరి. మహమ్మదీయులు, క్రైస్తవులు యూదులు రాయలరాజ్యమున సురక్షితముగనుండితమతమతముల ప్రచారముగావించుకొనుచుండిరి. పాశ్చాత్యదేశమునందు వ్యాప్తమైయున్న క్రైస్తవమతమునందును గొంత సత్యముండకపోదని తలంచినవారిలో రాయలవారొక్కరు. మహమ్మదీయులను జయించియు వారి మతసంబంధములైన మసీదులతోగాని యితరమతైకవిషయములలోగానివారు ఏలాటి జోక్యమును కలుగజేసికొని యుండలేదు. అన్ని మతములవారిని తమసైన్యములో జేర్చుకొనుచుండిరి. సమస్తమతముల యొక్కయు సత్యాసత్యముల విమర్శించుచు వారి వారి తారతమ్యములంబట్టి యుచిత గౌరవ మొసగుచు సమస్తజనుల నేకదృష్టితో జూచుచుండెడివారు. బార్బోసా యనుచరిత్రకారు డీవిషయమున గూర్చి యిట్లు వ్రాసియుండెను.

మతసహనము

"తనరాజ్యమునకు వచ్చిన వారిని గూర్చి చికాకుపడక, వచ్చినవారు క్రైస్తవులా యూదులా మహమ్మదీయులా యని వితర్కించకయే, వారివారిమతస్వాతంత్ర్యముతో నిచ్చవచ్చి

నట్లు వ్యవహరించుటకును వచ్చినవారు వారికిచ్చువచ్చినపుడు తమదేశమునకు తాము వెళ్లుటకును స్వాతంత్ర్యమును రాజుగా రిచ్చియుండిరి.

కృష్ణదేవరాయలకాలమున ప్రాముఖ్యముగ నుండినది వైష్ణవమత సాంప్రదాయమే. సాళువనరసింహరాయలు వైష్ణవ మతావలంబకులే. వారికి తిరుపతి వేంకటేశ్వరస్వామియందు భక్తి మెండు. అట్లే కృష్ణదేవరాయలకును తిరుపతి వేంకటేశ్వర స్వామియందు భక్తి అనిర్వాచనీయము అపారమైనది. వీరు రాజ్యము చేసినకాలమున రాయలవారు సుమారు రేడు మార్లు తిరుపతివేంకటేశ్వరస్వామిని సందర్శించినట్లచటి శాసనములవలన కనుపట్టుచున్నది. వారి దిగ్విజయ యాత్రలను గూర్చినవివరములన్నియును చాల భాగ మా శాసనములను బట్టియే తెలిసియున్నది. వీరు శ్రీవేంకటేశ్వరస్వామి సందర్శనము చేసికొన్నసందర్భమును గూర్చి యిదివరలో వ్రాసియుంటిమి. గజపతిరాజుతో యుద్ధముచేసి గెల్చిన సందర్భముననే తిరుపతివేంకటేశ్వరస్వామిని నాల్గుమారులు సందర్శించినట్లు కనబడుచున్నది. ప్రతిమారు నచటికి రాయలవారే గాక వారితో వారి భార్యలున్ను వారి అధికారులున్ను పురోహితులున్ను గూడ వెళ్లినట్లు తెలియవచ్చుచున్నది. అట్లు వెళ్లినపుడు స్వామివారి కనేక దానములు గ్రామదానములు, భూమిదానములు, ద్రవ్యదానములు బంగారు వెండి నవరత్న దానములు చేసియుండిరి. ఆసందర్భమున నొకమారు తమ యొక్కయు తమప్రియ భార్యలగు తిరుమలాదేవి చిన్నాదేవుల యొక్కయు కంచు విగ్రహములను స్వామివారి గుడివాకిట

నుంచినట్లు తెలియుచున్నది. ఈ విగ్రహముల నెవ్వరు దచట పెట్టినదియు సరియైనకాలము మాత్రము తెలియుటలేదు. ఈ కంచువిగ్రహముల నిప్పటికి నచట చూడనగును. రాయల వారికి వేంకటేశ్వరస్వామి యందు గల అఖండభక్తివిశ్వాసములు వారిదానములే వేనోళ్ల చాటుచున్నవి. వీరి సకలదిగ్విజయ ములకు శ్రీవేంకటేశ్వరస్వామి వారి యాశీర్వచనమే కారణమై యుండెను.

## వైష్ణవులు

రాయలవారి కాలమున వైష్ణవులలో రెండు తెగల వారుండిరి. (1) రామానుజుల వారి యనుచరులగు శ్రీవైష్ణ వులు. (2) మధ్వాచార్యుల యనుచరులగు మాధ్వులు. ఈ రెండు తెగలవారిలో కొద్దిపాటి భేదములు తప్ప హెచ్చుగ లేవు. మొత్త ముమీద మధ్వమతముకన్న శ్రీవైష్ణవమతమే జనాకర్షణీయ ముగనుండెను. మధ్వమతస్థులు బ్రాహ్మణులలో తప్ప మరి యితర వర్ణములలో లేరు. రాయలవారి కాలమున వైష్ణవులలో చాల ప్రసిద్ధి చెందిన పండితు లుండెడివారు. వారి వలన మత ప్రచార మద్భుతముగ జేయబడుచుండెడిది. తాతాచార్యుల వారు కృష్ణదేవరాయలవారి మతగురువు. వీరిపాండిత్య మసా ధారణమైనది. శ్రీ వైష్ణవమత ప్రచారము అహోబలమత యతులచేతకూడ హెచ్చుగ జేయబడుచుండెడిది. అహోబల మతస్థాపకులలో నొకరగు శఠకోపయతియే రాయలవారి ఆస్థానకవి యగు నలసాని పెద్దనకవీశ్వరుని గురువైనట్లు మను చరిత్రలో నీపద్యమువలన తెలియుచున్నది.

క. కొలుతున్ మద్గురు విద్యానిలయుం గరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా,
దళితా శ్రితజనదురిత,చ్ఛలగాఢధ్వాంతసమితి శఠకోపయతిన్.

ఈ శఠకోపయతియే యాంధ్రదేశమున వైష్ణవమత ప్రచారముచేసినట్లు రాయలవారి ప్రఖ్యాతగ్రంథమగు నాముక్తమాల్యదయందు వ్రాయబడియున్నది.

## మధ్వులు

ఆకాలమున కొందరు వైష్ణవవంశజు లీమతప్రచారము వారి జీవితాశయముగ జేసికొని దేశమంతయు ప్రచారముచేసి మతాభిమానమును వృద్ధిచేసిరి. అట్టివారిలో ముఖ్యులు కందాడై వంశస్థులును పరవస్తువంశస్థులు నైయున్నారు.

మధ్వమతము వైష్ణవమంతవృద్ధిలో లేకున్నను మొత్తము మీాద నలక్ష్యము చేయతగినదిగాదు. ఈ మతస్థులలో వ్యాస తీర్థులవారు పురందరదాసు మొదలయిన ప్రఖ్యాతపురుషు లుండిరి. వ్యాసులవా రీమతమునందు ప్రముఖులు. వీరు మొదట ముల్బాగల్మఠమున నుండి సాళువ నరసింహరాయల కాలమున వారిరాజధానియగు చంద్రగిరికి వచ్చియుండిరి. ఈవ్యాసులవారు కొంతకాలము తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి సాన్నిధ్యమున పూజారిగ నుండిరి. రాజధాని విజయ నగరమునందు స్థాపింపబడినపుడు వీరు నచటికి వచ్చియుండిరి. వీరికి కృష్ణదేవరాయలవారివద్ద హెచ్చుగ పలుకుబడి యుండెను. వ్యాసులవారు గొప్పవిద్వాంసులును వాగ్వా దమున మిక్కిలి నేర్పరులు మంచి నడవడికల్గినవారును నై యుండిరి. ఈ వ్యాసులవా రీమతమునుగూర్చి మిక్కిలి యభి మానముతో ప్రచారము చేయుచుండెడివారు. వీరివలన నీమత

మున హనుమంతునికి మంచి ప్రాముఖ్యత యొసంగబడెను. కృష్ణదేవరాయలవారు మరణించిన తరువాతకూడ నీవ్యాసులవారు కొంతకాలము జీవించియుండిరి. కాని వారి ప్రచారమువలన మధ్వమతావలంబనము వృద్ధిగాంచ లేదు. కృష్ణదేవరాయల యనంతర మీమధ్వమతమునకు రాజపోషకత్వము తగ్గిపోయి నను వ్యాసతీర్థులవారి యుపదేశములయందలి యుత్కృష్టతను బట్టి యిప్పటికి నీ మతము బ్రాహ్మణులయందు ప్రకాశించుచునే యున్నది.

## శైవమతములు - శంకరమతము

రాయలవారి కాలమున వైష్ణవ శైవ జైన మతములు వృద్ధిగాంచెను. శైవమతములు బ్రాహ్మణాబ్రాహ్మణ విభేదములతో నుండెడివి. శంకరాచార్యులవారిమతము బ్రాహ్మణ మతము. ఈమతమునకు ముఖ్యస్థలము శృంగేరి లేక శృంగగిరి. ఈమతముయొక్క శాఖలు పుష్పగిరి విరూపాక్షము కుంభకోణమునం దున్నవి. ఇచటి మఠాధిపతులు వేదాధ్యయనము చేసి అద్వైతవేదాంతమును లోకమున ప్రసరింపజేసిరి.

## లింగాయతమతము

బ్రాహ్మణేతరశైవమతములు రెండువిధములు - లింగాయతు మతములు, తదితరములు. లింగాయతుమతములు తెనుగుకన్నడదేశములలో వృద్ధిగాంచినవి. అట్టివానిలోనివి శ్రీశైలము సంగమేశ్వరదేవాలయములు. ఈమతములలో వీరశైవ సంస్కారియగు బసవాచార్యునియుపదేశములు ప్రచారము చేయబడెడివి. వీరి యుపదేశములన్నియు వారివారి

స్వభాషలలోనే చెప్పబడుచుండెడివి. లింగాయతులకు సంబంధిం పని యితరశతములు అరవదేశమునందు తిరుప్పనందాలు, ధర్మపురం, తిరువాది తుఱైౖ గ్రామములయందుండెడివి. వారు పూజాక్రమమునం దరవభాష నుపయోగించెడివారు.

వైష్ణవమతములు వడహాలై తెంగలై యను రెండు విధములు. వడహాలై వైష్ణవులు వేదప్రామాణ్యమును జూచె దరు. తెంగలై వైష్ణవులు ప్రబంధములను ప్రమాణము చేసి కొని వాటికే ప్రాముఖ్యత నిచ్చెదరు. అహోబిలము తిరుపతి శ్రీరంగము మఠములు వడహాలై మఠములకు చెందినవి. మేల్కోట వానమామలై తేంగలై మఠమునకు జెందినవి.

మధ్వమఠములు వైదిక ధర్మసాంప్రదాయములు. వేద ములు ఉపనిషత్తులు ధర్మశాస్త్రములు పురాణములు మధ్వ మతములకు ప్రమాణములు. ఇట్టిమఠములు ఉడిపి, ముల్బా గల్లు విజయనగరమునందు నుండెను.

## జైనమతములు

జైనమతములు కృష్ణదేవరాయనికాలమున ప్రబలముగ నుండెడివి వీటిముఖ్యస్థలము శ్రావణబెలగొల. ఈ గ్రామము విజయనగర రాజ్యములోనిది. ఈమతముగాని మతముగాని జనామోదమును పొందియుండలేదు.

ఈ మఠము లన్నిటియందును శాస్త్రజ్ఞానము అధ్య యనము హెచ్చుగ జరుగుచుండెను. ఈ మఠములలో మత విషయకశాస్త్రములనే గాక సామాన్యవిద్యకూడ జెప్పబడు చుండెను. వైద్యశాస్త్రమునందుకూడ నచట విద్య చెప్పబడు చుండెను. ఈమఠస్థలమతములతో సంబంధముకలిగించుకొనక

రాయలవారీమతములన్నిటిని సమానముగ నాదరించుచు సమానముగ పోషించుచుండిరి.

## దేవాలయములు

రాయలవారి రాజ్యమున దేవాలయము లనేకములు బాగుచేయబడుటయేగాక కొత్తవి కొన్ని నిర్మింపబడెను. ఈ దేవాలయములలోని యధిష్ఠానదేవతలకు మనలో రాజులకు వలెనే నవరత్నఖచితములగుకిరీటములు, భుజకీర్తులు నగలు నాణ్యములు పట్టువస్త్రములువిలువగల్గి మంచిపుష్టి నిచ్చు ఆహారములు పువ్వులు చందనము సువాసనగల నూనెలు సంగీతకచ్చేరిలు, భోగపుమేళములు మొదలగునవన్నియు నేర్పాటు గావింపబడెను. ఈ దేవాలయపోషణకొరకు నిత్యనైవేద్య దీపారాధనలకు భూదానములు గ్రామదానములు జేయబడెను. ప్రతిపండుగకు దేవునికి నుత్సవములు జరుపుట కేర్పాట్లు గావింపబడెను. దేవాలయముల కివ్వబడినగ్రామములను భూములను, వెండి బంగారు వస్తువాహనములను చక్కగ విచారించుటకు స్థానికుల నేర్పాటుచేసియుండిరి. రానురాను స్థానికుల సంఖ్య హెచ్చుకాగా వారిలో నొక్కరిని స్థానాచారిగగాని స్థానాపతిగగాని యేర్పాటు చేసియుండిరి. ఈ స్థానాచారి దేవాలయమునకు సర్వస్వతంత్రుడు గానున్నను దేవాలయములకు సంబంధించిన వ్యవహారముల నన్నింటిని చక్కబెట్టుచుండెను. ఈస్థానాచార్యులు తమవిధులను జరుపుచుండిరా లేదా యని పరిశీలించుటకై సీమపారుపతిదారు ఉండెడివారు. వీరు రాజుగారిచే నియమింపబడిన యధికారి. దేవాలయపు లెక్కలను సక్రమముగ నుంచుటకు కరణము లుండెడివారు. వారు లెక్కలు

వ్రాయుటకు దేవాలయమునందు ప్రత్యేకముగ చావిడి యేర్పాటు చేయబడెడిది. వీరుగాక దేవాలయమునందు ముఖ్యమైన అధికారి పారుపతిదారుడై యుండెను. దేవాలయమునకు సంబంధించిన ద్రవ్యమునంతను జాగ్రత్తచేసియుంచుటకు శ్రీభాండారమనుపేర నొక గది యుండెడిది. ఆగదియందు దేవాలయమునకుసంబంధించిన ద్రవ్యమును వస్తువాహనములునుంచబడెడివి. ఈదేవాలయముల యందే కులవ్యవహారము లన్నియు పరిష్కరింపఁ బడి ప్రజలకు నీతి బోధింపబడు చుండెడిది. రాయల కాలమున నీదేవాలయములు మతజీవనమునందు సంఘజీవన మందు ప్రాముఖ్యతవహించెను.

## అమ్మవార్లు - జాతర

దేవాలయములేగాక ప్రతిగ్రామమున నొక ప్రత్యేకమైన అమ్మవా రుండెడిది. అట్టి అమ్మవారికి ప్రతిసంవత్సరమును జాతరలు జరుపబడుచుండెడివి. ఈజాతర సమయములలో పెక్కు మేకలు, గొఱ్ఱెలు, దున్నలు బలి యివ్వబడు నాచారముండెను.

దుర్గాదేవి. విజయనగర రాజధానియందు దుర్గాదేవి ముఖ్యదేవత. దసరా వుత్సవములలో తొమ్మిది రోజు లిట్టిజాతరలు రాయలవారి సమక్షమున నే జరుగుచుండెడివి.

గ్రామములయం దీ జాతరలు జనులకు హెచ్చుసంచలనము గలిగించెడివి. గ్రామములందలి స్త్రీలు గొర్వెచ్చదము రంటుకొని (నిశామిళిత) పసుపు కలిపిననీటియందు జలకమాడి నూతన వస్త్రములు ధరించి కన్నుగవల కాటుకదీర్చి సిందూర తిలకమును ముఖమున గుండ్రముగ దిద్ది, గొప్పుల విరులు గ్రుక్కి వేప చిగురుదండలను మెడలవైచి, చిన్ని చిన్ని సొమ్ములను ధరించి,

తమతమ ప్రాణప్రియులు వెంటరా, గ్రామమునందలి స్త్రీ లాపర్వ దినములందు బయలుదేరి శక్తిభవనమునకై జాతర వీక్షించుటకు వెళ్లెడివారు. అచట మితిలేని మేకపోతుల నరుకుటయు, కల్లుద్రావుటయు జరుగుచుండెడిది. అచట విపరీతమైన ధ్వని చేయబడుచుండెడిది. ఆసమయమున నచటికి వచ్చిన స్త్రీలు తమతమ మొక్కుబడుల చెల్లించుటకు మొదలుబెట్టెదరు. ఒకతె సీడిమ్రాను వ్రేలాడును. ఎట్టికలువలుగల చెరువునందువలె నింకొకతె నిప్పుకేటచరించును. పందిరి నిప్పులగుండము నందింకొక్కతె ప్రవేశించును. (ఇంకొకతె అరటాకుమీద నృత్యము చేయును). ఇంకొకతె తనమూపునుండి పెరికిన మాంసమును బలియిచ్చును. ఇట్లే అచటికి వచ్చిన పూవుబోండ్లు తమ శక్తికొలది భక్తి పూరితలై యాశక్తిని పూజింతురు. ఈపైన వ్రాయబడిన యంశములన్నియు రాయలవారి యాస్థానకవులలో నొకరగు తెనాలిరామకృష్ణకవి తన పాండురంగమాహాత్మ్యమున మూడవ ఆశ్వాసమునందు వివరించియుండెను. ఈవిషయమునుగూర్చి బార్బోసాయను చరిత్రకారు డీవిధముగ వ్రాసియుండెను.

"ఈప్రాంతపు స్త్రీలకు విగ్రహారాధన యందుండెడి భక్తి వలన మిక్కిలి అద్భుతమైన పనులు నెరవేర్తురు:—"ఎవ్వరేని యొక కన్య తాను వరించిన యువకుని వివాహమాడ దలచిన, తన వివాహము జరిగినచో తనదేహము నా యువకుని కర్పింపక పూర్వ మా దేవతకు గొప్పముడుపు చెల్లించెదనని శపథము జేయును. తా గోరినయువకుడే తనభర్తగ సంభవించినచో నాతనికి తనదేహము నర్పింపకపూర్వ మా దేవతకు తన రక్తమును

సమర్పింపవలసి యున్నదని వానితో నివేదించి ఒక శుభ ముహూర్తమున నొక వాహనము దెప్పించి, బావినుండి నీరు లాగుటకు వీలయిన యేతము వంటి యేతమును తెప్పించి దానిని తనవాహనము పై నిల్పి దానికి రెండు యినుపకొంకెముల వ్రేలాడగట్టి యుంచెదరు. ఆ పర్వదినమున నీకన్య స్వజనము తోను బంధుజనముతోను కూడుకొని వాద్యములు మ్రోగుచుండ పాటలు పాడుచుండ, నృత్యగాండ్లు నృత్యము చేయుచునుండ, కటిక్రిందిభాగమువరకు వస్త్రమును ధరించి బండి నెక్కును. అంత నేతముయొక్క కొంకెల రెంటి నామె కటిప్రదేశమున కిరుపార్శ్వములనున్న మాంసభాగ మున గుచ్చి పైకి లాగుదురు. దేహమున కిరుపార్శ్వముల నుండి రక్తము ప్రవహించుచు క్రిందభాగము నంతను రక్త మయము జేయుచుండ నీకన్యగాలిలో వ్రేలాడుచుండును. ఈ వ్రేలాడుచున్నకన్య కత్తి నొకదానిని చేతబూని దాని నటునిటు విసరుచు మిక్కిలి సంతోషముతో నిమ్మకాయల తనభర్తపై విసరుచు, నెగుర వేయుచుండ బండి గుడివద్దకు తీసికొని పోబడును. అచట నీకన్యను దింపి ఆమెకు కలిగిన గాయములకు చేయదగిన చికిత్సను గావించి ఆకన్య నామెభర్త కప్పగింతురు. అనంతరము పెద్దపండుగ గావించి వచ్చిన వారికి తగిన మర్యా దలు చేసి వారివారి శక్త్యనుసారము విందు గావింతురు"

ఈవర్ణనను బట్టిచూడ నప్పటి వారికి దుర్గాదేవి సముఖ మున నామె యందుగల భక్తివలన మిక్కిలి సాహసమైనట్టియు ఘోరమైనట్టియు కృత్యములు నాచరించి ఆశ్చర్యకరమైనట్టియు నద్భుతములైనట్టివిషయముల సాధింపవచ్చుననెడి మూఢనమ్మ

కముతో జనులుండెడివారనియూహింపనగును. ఈపైన వ్రాసిన యంశములను జదువుటకే దేహముకంపించుచుండ ప్రత్యక్షముగ జూచెడి వా రెట్లుండిరో యూహింపనశక్యముగదా!

## తీర్థయాత్రలు

ఇప్పటివలెనే రాయలవారు రాజ్యముచేసెడి సమయమునను జనులు తీర్థయాత్రలు చేయుచుండెడివారు. మహమ్మదీయులుత్తరహిందూస్థాన మాక్రమించినప్పటి నుండియు నుత్తర హిందూస్థానమునందలి కాశీ ప్రయాగ మొదలయిన క్షేత్రములకు వెళ్లుట క్షేమకరముగ నుండలేదు. అయినను నాక్షేత్రములకు జనులు పోవుచునేయుండిరి. తీర్థయాత్రలు చేయుటకు రాయల రాజ్యమునందు పుణ్యక్షేత్రములు లేకపోలేదు. చిదంబరం, విరూపాక్షం, తిరుపతి, కంచి, శ్రీశైలము, తిరువణ్ణామలై, హరిహరం, అహోబిలం, సంగమేశ్వరం, శ్రీరంగం, కుంభకోణం, మహానంది, గోకర్ణం, రామేశ్వరం మొదలయిన పుణ్యక్షేత్రములు రాయలవారి రాజ్యమునందే యుండెను. ఈక్షేత్రములకు బోవుటయు సులభ సాధ్యముగ నుండియుండలేదు. దోవలు సరియైనవి లేవు. నదులు దాటుట కష్టతరముగ నుండెడిది. వెళ్లుటకు తగిన వాహనము లుండెడివికావు. కాలినడక పోవలసి యుండెను. ఈపైన పేర్కొన్నవి కొన్ని విష్ణుక్షేత్రములు మరికొన్ని శివక్షేత్రములు నయియున్నవి.

## ప్రయాణసౌకర్యములు

జను లొకచోట నుండి యింకొకచోటికి బోవలెనన్న పల్లకీలు అందలములు గుఱ్ఱములు ఎద్దులు దున్నపోతు.

లుపయోగింపబడెడివి.బండ్లు వ్యవసాయమున కుపయోగింపబడె డివి.గాని ప్రయాణములకై యుపయోగింపబడినట్లు కాన్పించ దు.వీనికి ముఖ్యకారణము సరియైన మార్గములు లేకపోవుటయే. అందలములు పల్లకీలు దేశమునందలి రాజవంశజులు రాజ్యాధి కారులు గొప్పధనికులు నుపయోగించెడివారు. అందలములను మోసికొని పోవుటకు బెస్తవారుండెడివారు.ఆముక్తమాల్యద యందు విష్ణుచిత్తుడు శ్రీవిల్లుపుత్తూరునుండి మధురకుబోవు టకు "ఆవతిఁబడి శ్రీభండా, రానన్నంబడము తనదు ప్రాతందలమున్, స్థానికు డొసంగి పసుపం, గా నానతిఁ బడిన నమితికాంద్రు వహింపన్" వెళ్లినట్లు రెండవయాశ్వాసమున వ్రాయబడియుండెను.

సామాన్యులు గుఱ్ఱములమీఁద నెద్దులమీఁద బోవు చుండెడివారు. మిగత వారందరు నడక మీఁదనే ప్రయాణము చేయుచుండిరి. అందువలన దూరప్రయాణములు కష్టసాధ్య ములుగ నుండెను. మరియు మనుష్యులు వెళ్లినపుడు, సామా నులను తీసికొనివెళ్లుటకు గుఱ్ఱములుగాని యెద్దులుగాని యుపయోగించవలసియుండెను. తమ వస్తువులే గాక తినుబం డారములను తీసికొని పోవలసి యుండెను. అందువలన సామానులన్నియు మూటలుకట్టి యెద్దులపైనను గుఱ్ఱముల పైనను తీసికొనిపోవుచుండిరి. త్రోవ సరిగనున్నను లేకు న్నను ఎండవేడిమి జనుల బాధించకుండునట్లు దోవ కిరుప్ర క్కలను నీడనిచ్చు చెట్లతో నింపబడియుండెను. దోవ పొడు వున నీడనిచ్చుటకు మామిడిచెట్లు పనసచెట్లు రావిచెట్లు మఱ్ఱి చెట్లు పెంచబడెననియు రేకలను గ్రామమువద్ద మూడువం

దల యిరవయి గుఱ్ఱములు నిలుచుటకు వీలుకల్గిన పెద్దవృక్షమును తాను చూచినట్లును పేయసను చరిత్రకారుడు వ్రాసి యుండెను. ఈవృక్షములేగాక దారిలో నచటచట చెరువులున్ను త్రవ్వబడియుండెను. ఈ చెరువుల వద్ద పెంచబడిన పెద్దవృక్షముల కింద బాటసారులు దిగి వంటచేసికొనిగాని దగ్గర గ్రామమున నున్న వంటపూటి యిండ్ల నుండి భోజనము తెప్పించుకొని గాని తినుచుండినట్లును తారకబ్రహ్మరాజ్యమను గ్రంథమునందలి రెండవ యాశ్వాసమున వ్రాయబడిన యీపద్యము వలన తెలియుచున్నది.

పట్టెకు నల్లన జనియెుక, యిల్లాలికి దగిన విలువ లిచ్చి నయమునన్
తల్లీ నా ప్రియురాలికి, యుల్లం బలరగ జేయుం మేగెద మనినన్
అయ్యా నిమసములోనను, నయ్యెడు వెచ్చటకు దెత్తు ననవుడు నతడున్
నెయ్యమున పట్టికిందికి, సయ్యన గొనిరమ్మటంచు జనియెన్ బ్రీలిన్.

చలివెంద్రలు, సత్రములు

దోవకు మధ్యమధ్య సత్రములు చలివేంద్రలున్ను ఏర్పాటుచేయబడి వాటిపోషణార్థమై మాన్యములున్ను ఏర్పాటుచేయబడెను. ఈచలివేంద్రలయం దారోజులలో పెద్దపెద్దకుండలలో "గుప్పలించినకప్పురంబుతోడి కురువేరు పరిమళంబులును జాజివిరుపులవలపును వట్టివేళ్లవాసనలుం గల యుదకంబుల నుంచుటవలన బాటసారు లాకలశోదకంబుల గ్రోలి నేద దేరిపోవుచుండిరి.

దొంగలు దారిదోపిడివారు

తీర్థయాత్రలుచేయువారలకు దోవలో దొంగలభయము హెచ్చుగనుండెడిది. చండాలురు, బోయవారు నీ దొంగల

గుంపులలోఁ జేరి దారిమధ్యను పోవుచున్న పాంథజనములను పెట్టెడి కష్టములు చెప్పనలవిగాకయుండెను. తారకబ్రహ్మరాజ్యమను గ్రంథమున "తనమగడు బోయవీటఁగల మగవారినెల్ల గూర్చికొని కొల్లగొళ్లకు దూరంబుపోయి వాడనియు" "తీర్థయాత్రాపరుల బ్రాహ్మణులఁ దలలు పగులందె వాయిఁగొట్టి కుతుకలుగోయ కరవాలిం గండ్రగొడ్డలి" తీసికొని దొంగలుపోయియుండిరనియు వ్రాయబడియుండెను. దారిమధ్యమున దొంగలగుంపులచే నడ్డగింపబడిన వారియొక్కయు, కొట్టబడిన వారి యొక్కయు దురవస్థలు ఆముక్తమాల్యదయందు చిత్రింపబడియుండెను.

సీ. పసలేదు నిలురోయి పాతకులా రని దేవాయుధంబులు చూపువారు
పైఁడి బాసముఁ జెట్ట బడవైచి దుడ్డు పెట్టకు పాటుచు నెయ్యొలెత్తి వ్రేచువారు
బరువుడించి కటారి పరుఁజించి నిల్చి యం దెందువచ్చెద రని యెదురువారు
వస్త్రంబు గొందు దేవరయోయియిది చన్నఁ బస్తని దయపుట్టబలుకువారు
తే. కలవి మామాక నిప్పింతుఁ దొలఁగు డొకటి
యూడుదాని జేనంటకుఁడనుచుఁ బెద్ద
తనము నభిమానమును డెంపు గనఁగఁ బలికి
నిలిపి దోఁపిచ్చువారునై తొలఁగిరపుడు

సీ. తోడువింటివాఁడనుచన్నోఁ జబోవక యెదుర్పడు వాండ్రఁ దోడిబడఁబదరి పాపి చి
వినుఁగీక వెనఁగిన బెద్దకొంపక యుత్తి బారించి చేఁగలవానిఁ జాఁచి
యాయితంపై చించి యరిగెఁడువాఁడేటునకు నీలాటిచన్న వెక్కదవులఁ టుడిని
కాదుపు చే లేకయ పుట పుటయునునైన వానికోధింప నవ్వలికిఁ బనిచి
తే. పాదలఁ దూఱిన నీఁటెచాఁపుల వెడల్చిఁ
గట్టుబట్టలు కొని ప్రాఁతబట్ట దయను
గోఁచులకు నిచ్చి గనపరాకులు నిగిడ్చి
చెప్పుటట్టలు శోధించి సిగలు విప్పి.

దొంగలు పెచ్చుపెరిగి బాటసారుల అర్థంబుల నపహరించుచుండిరి. ఇట్టికష్టములు పెట్టినను నోర్చుకొని జనులు తీర్థయాత్రలా కాలమున జేయుచుండిరి. అందువలననే కాబోలు దేశమునందు కాశీకిపోయినను కాటికిపోయిన నొకటె యనెడు సామెత వచ్చియుండెను.

సంఘము:— సంఘ జీవనము

హిందూసంఘమునం దీనాటికివలెనె కృష్ణరాయల నాటి కాలము ందును నాలుగువర్ణములవారు నుండిరి. హిందువులుగాక తురకలు, క్రైస్తవులు, యూదులు నుండిరి. గాని వారందరు వర్తకవ్యాపారములయందు నిమగ్నులై పట్టణముల యందు నివసించెడివారు. హిందూసంఘమున బ్రాహ్మణులు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులను నాలుగువర్ణముల వారుండెడివారు. వీరిలో ననేకములైన శాఖ లుండెడివి. వీరుగాక పంచములను నైదవజాతివా రుండెడివారు. ఈ పంచములు గ్రామమునకు కొద్దిదూరమున ప్రత్యేకముగ పల్లెయందుండెడివారు. ఈపంచములలో మాలలు మాదిగ లుండెడివారు.

పాశ్చాత్యదేశమునుండి వచ్చిన చరిత్రకారు లీచాతుర్వర్ణములలో నొకరగు బ్రాహ్మణులగూర్చి వింత అభిప్రాయములను వెల్లిబుచ్చియున్నారు. వీరి అభిప్రాయములు కేవలము సరియైనవి కావని చెప్పుటకు వీలులేదు. బ్రాహ్మణులు మతగురువు లనియు దేవాలయములందు మఠములయందు నుండెడివారనియు మరికొందరు రాజులవద్ద పెద్ద అధికారపదవులలో నుండెడి వారనియు, తెలివిగల వారనియు లెక్కలు వ్రాయు

మతస్థులు విద్యాబోధము విద్యాప్రచారము చేయుచుండెడి వారు. మతమునందు నివాసముగ నుండెడి బ్రాహ్మణులసంఖ్య బహుతక్కువ యనియే చెప్పనగును.

## రాజ్యాధికారులు

బ్రాహ్మణులలో హెచ్చుమంది రాజకీయోద్యోగములలోఁ జేరియుండిరి. వీరు రాజ్యనిర్వహణమునందును లెక్కలు వ్రాయుటయందును. నారితేరినవారు. ఈ బ్రాహ్మణు లీయుద్యోగవ్యవహారములయందు ప్రత్యేకముగ నియోగింపఁ బడుటవలన వీరిని నియోగులందురు.

"నియోగులై కొంద ఱయ్యెద నందురు నీతికార్యము లెల్ల నెగడుకొనుచు, వాసిగా లెక్కలు వ్రాసిన మాత్రాన శూద్రులుగారు భూసురులుగాని.

వీరంత శ్రోత్రియులుగారు. మతవిషయికములయందాసక్తిగలవారును కారు. వీరిలో చాలమంది మంత్రులుగను, సైన్యాధికారులుగను, రాజ్యాధిపతులుగనుండెడివారు. ఆనాఁడు గొప్పగ పరిగణింపఁబడినవారిలో సాళువతిమ్మరసు కొండమరసు, అయ్యపరసు, నరసింగనాయకుఁడు, చంద్రగిరిసోమరసు, దేమరసు, ముఖ్యులు. వారు చాల మర్యాదగలవారు, తెలివిగల వారు, కష్టపడిపనిచేయువారు నై యుండిరి.

## వ్యాపారస్థులు

బ్రాహ్మణులలో కొందరు వ్యాపారులుగ నుండిరని చరిత్రకారులగు పేయసునూన్యనిసులు వ్రాసియుండిరి. గాని అందులకు తగినతార్కాణములు లెందును కనుపింపవు. బ్రాహ్మణులలో కొందఱు వర్తకముచేసినను చేసియుండవచ్చునుగాని

అట్టివారు ప్రాముఖ్యమును వహించియుండక పోవచ్చును. అదియునుగాక వారిసంఖ్యయు తక్కువగ నుండియుండె ననియు మన మూహింపవచ్చును.

## తిండిపోతులు

బ్రాహ్మణులలో చాలమంది బీదవారు తిండిపోతులై యుండిరి. పప్పుభోజనమునకు పడిమైళ్లైనను వెళ్లెదురనుపామెత యిట్టివారి వలననే వచ్చియుండవచ్చును. వీరిలో చాలమంది నీచు లుండి రనుటలో నసుమానము లేదు. అట్లే న్యూనిజు చరిత్రకారుఁడును వ్రాసియుండెను. రాయలవారును వీరినిఁ గూర్చి వ్రాయుచు వీరి నీచచేష్టలు వివరించియుండిరి.

సీ. బహువర్ణ ద్విజునకల్పపుఁ బాచికం బిడి పసిఁడిక్కై తా వానిబంతి గుడిచి
కలసి వణిక్పురోధులతోడ బిన్యాహముల బియ్యయములకునై మొత్తులాడి
శని రవిగ్రహజప స్నానాదికములెల్ల దొరలవాకిండ్లకే దొడ్డ యిచ్చి
వచ్చిట్టితోల్పట్టె చుచ్చాల మెట్టుందికోసఁ దానయూరెల్లఁ గుత్తవట్టి
ఖర్చుపోటుల. దిని లేనితఱుల మైత్రినంటి పితృశేషము భుజించి యదియుం జెడల
నక్కవాడలనరకూట్ల మెక్కి మీద వీనిశేఖర మొకతులాత్రివ్యజ్యముగొని.
ఇట్లొనఁగూర్చి వైశ్యునకు నిచ్చి, చదన్నటిపుచ్చి, చౌకము
ల్వెట్టుచు వడ్డిలెక్కలు వెట్టుచు, ధారణవాసికై కొదల్
వెట్టుచు, వాడు రేఁగి మఱివెట్టుదుఁ బెట్ట నసంగ మిట్టుఁగూ
వెట్టుదు, నిట్టుపోరఁ గనివెట్టుచు నొక్కరుఁ డుండి వొడియౌన్.

ద్రవ్యాశక్తులై హీనజాతులతో భోజనముగావింతు రనియు, పూజానంతరము తమకివ్వఁబడినబియ్యము వగైరా వస్తువుల పంచుకొనుటలో భాగములకై తగవులాడుదు

రనియు, దొడ్డిసూభావనల్కై పోయి గంటల పరిమితి లేకయే కాచుకొనియుందురనియు, ద్రవ్యాశచే యే నీచపు పనికైన నొడంబడుదురనియు పై పద్యమునందలి ముఖ్యాంశమైయున్నది. బ్రాహ్మణులలో బీదవా రిట్లు చేసియుందు రనుటలో నాశ్చర్యమేమియును లేదు. దీనినిఁబట్టి జూడ నీబ్రాహ్మణులలో నిప్పటికి నీవిషయములందు మార్పేమియు లేదని మనము తెలిసికొనగలము.

ఈ పై చెప్పినభాగములలో నేభాగమునకుఁజెందినను బ్రాహ్మణులందరు నిరాడంబరులు. వారికట్టులోగాని భోజనమునందుగాని నిరాడంబరత్వమే కనుపించును. వీరందరు శాకాహారులు. భోజనమునందు పప్పులు, పెరుగు నెయ్యి పాలు బాగుగ వాడెడివారు. అప్పటికి నిప్పటికి భోజనమునందు వారిలో నేమాత్రము మార్పుగనుపింపదు. వీరందరు సామాన్యముగ నేకపత్నీవ్రతులే. అనేకభార్యాత్వము బ్రాహ్మణులకు శాస్త్రదూష్యము గాకున్నను వీరిలో నిద్దరుభార్యలను వివాహమాడిన వారిసంఖ్య తక్కువగనుండెను. ఇద్దరికన్న హెచ్చుభార్యలను జేసికొన్న వారిసంఖ్య అరుదనియే జెప్పవచ్చును.

## క్షత్రియులు

వీరందరు సామాన్యముగ రాజ్యముచేసెడివారియొక్కగాని చేసినవారియొక్కగాని వంశీయులై యుండిరి. వీరిలో సూర్యవంశజులు, చంద్రవంశజులు, నుండిరి. చోళరాజ్యవంశజులు, గజపతిరాజులు, మాదిరాజువారు మొదలైనవారు సూర్యవంశపురాజులు. సంగమ, సాళువ, తులువ, అరవీడు,

పాండ్యరాజులు చంద్రవంశపురాజులు. ఆకాలమున నగ్నికుల క్షత్రియు లున్నట్లు కనుపించదు.

## వైశ్యులు

వైశ్యులకు వ్యవసాయము పశురక్షణ వ్యాపారము వారి కనుశ్రుతముగ వచ్చుచున్న వృత్తులని చెప్పుదురుకాని వ్యవసాయమునందుగాని పశురక్షణయందుగాని వారికి హెచ్చు సంబంధ మున్నట్లు గనబడదు. వారికి వర్తకమే కులవృత్తి. ఎన్ని ప్రబంధములను జూచినను వీరికిఁ జెప్పఁబడిన వృత్తి వర్తకమే. దక్షిణాదిని సరియైన వైశ్యకులపువా రుండినట్లు కనుపించదు. తెనుఁగు, కన్నడ దేశములలోని కోమట్లు వైశ్యజాతికి చెందిన వారనుట నిర్వివాదాంశము. అయితే అరవదేశమునందలి శెట్టికోమట్లు తాముస్నూ వైశ్యకులజులమే యని కొంతకాలము వాదించుచువచ్చిరి. ఈ రెండుతెగలవారికిని నీవిషయమై వాగ్వాదమువిూఱి పెద్దతగవు సంభవించెను. అప్పుడు రాయలవారొకమధ్యవర్తి నేర్పాటుజేసి వీరివాదములలోని యంశములను చర్చించి నిర్ణయముఁ జేయించిరి. వైశ్యులవృత్తి వర్తకమే యైనను వర్తకముచేసెడువారు లింగాయతులలోను, మహమ్మదీయులలోను కూడ నుండిరి. వీరిలో లింగాయతులు మంచి వ్యాపారస్థులు.

## శూద్రులు

వీరిలో ననేకశాఖ లుండెడివి. వారిముఖ్యవృత్తి వ్యవసాయము. వీరే మనహిందూజాతికి వెన్నెముక. దేశసౌభాగ్యము వీరిపైనే ఆధారపడి యుండెడిది. వీరిలో చాలమంది సైన్యమునం దుండెడివారు. ఇట్లు సైన్యమే తమవృత్తిగ జేసికొన్న

వారు కమ్మవారు వెలమవారు నయియున్నారు. వారివృత్తి నిజముగ సైన్యాధికారమేగాని వ్యవసాయము కాదు. వీరుగాక బలిజలుకూడ సైన్యవృత్తినే అవలంబించెడువారు. ఈమూఁడు శాఖలనుండియే రాయలవా రమరనాయకుల నేర్పాటు జేసి యుండిరి.

వీరేగాక శూద్రవర్ణమున ననేకులుండెడివారు. గొల్లలు కురుబలు, చాకలివారు, మంగలివాండ్రు, దొమ్మరులు మొదలయినవా రందరు శూద్రులే. వీరిలో వీరికి వివాహములుగాని పంక్తిభోజనములుగాని లేవు. అరవదేశమున నీశూద్రులలో ఎడమచేతివారు కుడిచేతివారని రెండు కక్షలవా రుండిరి. వీరిమధ్య నెప్పుడు కక్షలు పోరాటములు హెచ్చుగ నుండెడివి. అధికారు లప్పటప్పట వీరితగవులను తీర్చుటకు మధ్యవర్తుల నేర్పాటుచేయుచుండెడివారు.

## చండాలురు - పంచములు

వీరు పంచమజాతివారు. వీరిలో మాలలు మాదిగలు నుండిరి. మాలలే పెరియాలు, వారే హోలీయాలు. మాలవారు దక్షిణహిందూస్థానమున వ్యవసాయపు కూలీలు. వీరికి నూలు వడకుట బట్టనేయుట ముఖ్యపరిశ్రమములు. వీరిని రాజవృత్తుల లోనికి రానీయనందున వీరిలో చాలమంది జనము గుమిగూడి దొంగతనము బందిపోటు మొదలయిన దుర్వృత్తులలోనికి దిగెడివారు. మాదిగలకు చెప్పులుకుట్టుటయే ముఖ్యవృత్తి. వ్యవసాయదారుల కవసరమగు పనిముట్లన్నియు వీరు చేసియిచ్చెదరు. నూలువడుకుటయు వీరివృత్తులలో నొకటి.

## సాంఘికజీవనము

సాంఘికజీవనముయొక్క యుత్తమాశయము భాగ్యభోగములుకలిగి సుఖముగ జీవించుట యని చెప్పవొప్పును. అందువలన పాశ్చాత్యజీవనమువలె నైహికజీవన మని తలప నవసరము లేదు. జనుల కాముష్మికజీవనమునందును ఎక్కువ యాసక్తియుండెను. ఆనాటి ప్రబలమైనమతము వైష్ణవమతమైనందున ఐహికాముష్మికములకు పరస్పరసంబంధము హెచ్చుగనుండి పరసౌఖ్యములతోపాటు నిహసౌఖ్యములందుకూడ జనులు హెచ్చుగ నాసక్తి కల్గి యుండెడివారు. భోగము లష్టభాగములుగ మనపూర్వశాస్త్రజ్ఞులు తెల్పియుండిరి. అవి నివాసము, వస్త్రధారణము, అలంకరణము,సుగంధద్రవ్యములు, పుష్పములు, తాంబూలము, శయనము, స్త్రీ, వీటితోపాటు స్నానము, భోజనము, పానీయములుకూడ భోగసంబంధములే యైయున్నవి.

## నివాసము

ఆనాటి నివాసయోగ్యములైన గృహములఁగూర్చి మనకు పోర్చుగీసు చరిత్రకారులు వ్రాసియుండిరి. రాతితో కట్టబడినమిద్దెలు గొప్పవారిగృహములు. అట్టియిండ్లకు నలుప్రక్కల విశాలమైనవసారాలు లోపల విశాలమైనవసారాలు నుండెడివి. ప్రతియింటికి గోపుర మొకటి యుండెడిది. ఇండ్లన్నియు స్తంభములపైన కట్టబడెడివి. గొప్పవారియిండ్లకు కేళీసౌధము, కేళీడోలిక, కేళీవనశ్రేణులు నుండెడివి. ఇంటి స్తంభములు, గోడలు, అనేకచిత్రములతో చిత్రింపఁబడెడివి. ఇంటిస్తంభములను తొలిచి చిత్రించెడువారు. గోడలమీఁద

బొమ్మలు వ్రాయఁబడెడివి. ఇంటికితలుపులుకూడ చిత్రచిత్రము
లైనబొమ్మలతో నిండియుండెడివి. పూర్వపుచరిత్రలలోని ప్రసిద్ధ
పురుషులచరిత్రలు చిత్రింపఁబడెడివి. శ్రీరామునికథలు, నల
దమయంతులకథలు, రాధామాధవవిహారములు, శివపార్వతీ
వివాహసందర్భములు, సముద్రమథనము మొదలయిన పురాణ
గాథలు గోడలమీఁద చిత్రించెడివారు. ఇట్టిచిత్రములలో
కొన్నిటి నిప్పటికిని హంపీలోనున్న చైత్యములయందు చూడ
నగును. రాజులజనానాలలో పరాయిదేశస్థులస్థితిగతులు
తెలియునట్లు వారివారినిత్యజీవితములలోని యంశములను
గోడలపై వ్రాసిరి. పడకగదులలో రతీమదనులు, రంభానలకూ
బరులు, ఊర్వశీపురూరవులు, మేనకాకౌశికులు, గోపికాముకుం
దులు, తారాశశాంకులు, మొదలయినకాముకీ కాముకులు
నడచినగతు లింటిగోడలచిత్రించియుండిరి.

రాయలవారు నివసించెడిసౌధమునుగూర్చి వర్ణించుట
సాధ్యముకాదుగాని వారిసౌధమునకు చుట్టు పెద్దయెత్తైన
గోడలున్నట్లును గోడలలోపల చక్కనిపెద్దతోట లేర్పాటు
చేయఁబడి వాటి కిరుప్రక్కల రమ్యమైనడాబాలు కట్టఁబడి
నట్లును డాబాలో రాయలవద్ద నుండెడిపెద్దయుద్యోగులు
నివసించెడివారనియు నచట గడియగడియకును, యామయామ
మునకును గంటలు మ్రోగించఁబడెడివనియు మాత్రము తెలియ
వచ్చుచున్నది. ఇట్టి డాబాలకు గోపురములుండి యొక
యింటినుండి వేఱొకయింటికిపోవుటకు ద్వారము లుండెడివి.
రాజాగారికిఁ జూడవచ్చినవారు విశ్రమించుటకై మొగసాల
లును పెద్దసావిడియు నుండెడిది. ఈసావిడితలుపు తెఱచి

లోనికిఁబోయినచో రాజుగారు సభ చేసెడి యింకొకసావిడి కట్టఁబడినది. అచ్చటనుండి లోపలకుఁబోయినచో రాయలస్త్రీలుండెడి జనానా కట్టఁబడినది. ఈగృహములుగాక చిత్రశాల, నాట్యశాల, మజ్జనశాల, భోజనశాల, అర్చనగృహము, దంతపు చావడి, జలయంత్రము, మొదలయిన యనేకశాల లుండినట్లు పుస్తకములయందు వివరింపఁబడియుండెను.

సామాన్యజనులు మట్టిమిద్దెలలోగాని పెంకుటిండ్లలోగాని నివసించెడివారు. బీదవారు తాటియాకు గుడిసెలలో నివసించెడువారు.

## 2 వస్త్రధారణము

ఆకాలమున జనులు సామాన్యముగ క్రిందధోవతి, నడుముపైనచొక్కా తలపైనటోపిని ధరించెడువారు. దీనినే శ్రీనాథకవి వ్రాయుచు,

కుల్లా యొట్టితి కోక జుట్టితి,జరీకూర్పాసమున్ దొడ్డితిన్.

అని వ్రాసియుండెను. ప్రతివారికి కాలికి చెప్పులుండెడివి. మీఁద నుత్తరీయ ముండెడిది. సామాన్యజనులు నూలువస్త్రములు వాడిన ద్రవ్యవంతులు పట్టుపీతాంబరములు, రాయలవారు విలువగల్గిన పట్టుధోవతులు బంగారపు తీగెలతో నలంకరింపఁబడిన దుస్తులును వాడెడివారు,

బ్రాహ్మణులు మాత్రము నీరుకావిరంగు ధోవతియు నుత్తరీయమును వాడుచుండిరి. వీరిలో పండితు లుత్తరీయములకుబదులు శాలువలు వాడుచుండెడి వారు, కేవల వ్యవసాయ దారులు మోలగుడ్డ తప్ప నితరము వాడెడివారు కారు.

వీరిలో గొప్పవారు యింటవడికిన నూలుతో నేసిన వస్త్రములను వాడుచుండెడి వారు. గొల్లెతెలకాపులు మొలగుడ్డయు కప్పు కొనుట కొక కంబళియు వాడుచుండిరి. సాలెవారు అగసాలెలు పట్టుసాలెవారు తెల్లనిగుడ్డుపులంగట్టి నాటికి చిల్లతైలంబుల వాసనల బూసెడువారు, బోయవాండ్రు మొలకొకకాసెకొక మాత్రముచుట్టి బిగించెడివారు. మాలవాండ్రు నీలపురంగు గొంగళిను ధరియించి నెత్తిన నొక తువ్వాలుగుడ్డను చుట్టెడివారు.

స్త్రీలు తెల్లని సన్నని పట్టువస్త్రములనుగాని నూలువస్త్రములను గాని కట్టుకొని రవికలను తొడిగెడువారు. రాజుల జనానాలయందు నూలువిగాని పట్టువిగాని పావడాలుకట్టి పైటకొక "వోణి" వేసికొని రవికె నొకదానిని బిగుతుగ తొడిగెడువారు. సామాన్యస్త్రీలు కొళ్ళవలెను రమ్యములైన పూవులతో నద్దకముచేయఁబడిన చీరెలను కట్టెడువారు.

"కట్టిరి చిరుతచౌకముల క్రొంబుట్టముల్"

ఆనాఁటిజనులకు రంగువస్త్రములు ధరించుటలో నపేక్ష యెక్కువగ నుండెడిది. బీదవారు అంచులువేయఁబడిన చీరెలు, సామాన్యులు నూలుజరీచీరెలు, గొప్పవారు, జరీపట్టుచీరెలు కట్టుచుండిరి. నాజూకుగలవారు సన్ననిబట్టలు మోటవారు ముతకబట్టలు కట్టుచుండిరి.

## అలంకారములు

ఆడుమగభేదము లేకయే జనసామాన్య మాకాలమున ననేక భూషణములను ధరించుచుండెను. మెడకుగొలుసు, చేతికి మురుగులు, కాలికి కడియములు, చెవుల కంటుపోగులు, జనులందరిచేత వాడఁబడెడివి. మగవారు నడుమును పట్టాలతో

భిగించుచుండిరి. స్త్రీలు ప్రత్యేకముగ ముక్కుపోగులు, కమ్మలు వడ్డాణము మొదలగు స్త్రీలయాభరణములు వాడుచుండెడి వారు. ఆకాలమున మగవారు ధరించెడు వస్తువులలో గండ పెండేర మొకటి. మొట్టమొదట నీపెండేరమును రాజులు ప్రసిద్ధపురుషులకు బహూకరించెడువారు. రాయలవారు అల సాని పెద్దన మహాకవీశ్వరునికి

"బిరుదైన కవిగండపెండేరమున కీవ తగుదని తాన పాదమునఁదొడిగె"

రానురాను పెండేరము ప్రతివారు నుపయోగించెడు వారు. అయితే దీని నొక్కచేతికి మోచేతికి పైన నుంచు కొనెడువారు.

## సుగంధద్రవ్యములు

సుగంధద్రవ్యములయందు జనుల కెల్లకాలములందు ప్రీతి యెక్కువ యని చెప్పనక్కరలేదు. ఆకాలమునను జనుల కా సుగంధద్రవ్యములయందు ప్రీతి మెండుగనుండెను. భాగ్యవంతులు వీటిని విరివిగ వాడుచుండెడివారు. కర్పూరము కస్తూరి, సంకుమదము, గంధమున మిళితముజేసి దేహమునకు పూసికొనుట సామాన్యముగ జరుగుచుండెడిది. అగరుసాంబ్రాణి ధూపమునకై యుపయోగింపఁబడెడివి కుంకుమ కస్తూరి స్త్రీలచే సామాన్యముగ నుపయోగింపఁబడెడివి. పన్నీరును తొలుసంచు లలో బోసి యింటినిండ చల్లెడువారు. మృగమదము జవ్వాజి మొదఁలయిన సువాసనద్రవ్యములను దేహమున కలముకొనెడు వారు. ఇంటివాకిళ్లయందు చందనమునీటితో కలయంపి చల్లెడు వారు.

## పుష్పములు

అనేకవిధములైన సువాసనగలపుష్పములను తోటలం పెంచి వాటిని తెప్పించి హారములుగఁగట్టి స్త్రీపురుషులనియు పిన్నపెద్దలనియు భేదములేక ప్రతివారు నుపయోగించు చుండిరి. కమలము, గులాబి, మల్లె, జాజి, విరజాజి, చంపకము, కేతకి, మొగలి మొదలయినపూవులచెట్లను విరివిగ పెంచు చుండెడివారు. ఈపుష్పములను స్త్రీలు పురుషులు తమతలల జుత్తునందు ముడుచుకొనెడివారు. ద్వారములకు పూలమాలలు వ్రేలాడ వేఁగువారు. పురమున నీపుష్పములు విరివిగ స్త్రీలచే విక్రయింపఁబడెడివి.

## తాంబూలము

తాంబూలమును సేవింపనివా రాకాలమున లేరనియే చెప్పవచ్చును. వక్క తమలపాకు సున్నము ప్రతివారు నుపయోగించెడువారు. డబ్బుగలవారు లవంగము, యాల కులు, జాపత్రి, జాజికాయ నుపయోగించెడివారు. ఇంటికి వచ్చినవారికెల్లరకు నీతాంబూలము నిచ్చుట సామాన్య మర్యాదయైయుండెను. తాంబూలము జీర్ణకోశమును సరియగు స్థితిలో నుంచును. అబ్దుల్‌రజాకను చరిత్రకారుఁడు దీనినిఁగూర్చి వ్రాయుచు తాంబూల మాఁకలినాపఁగలదనియు జీర్ణకోశము నభివృద్ధిఁజేయుననియు, నోటికి సువాసనకలిగించుననియు, పంటిని గట్టిపఱచుననియు వ్రాసియుండెను. తాంబూల మిచ్చుట మర్యాదసూచకము. రాజులు తాంబూలదానమిచ్చుట మిక్కిలి గౌరవచిహ్నము.

## శయనము

ఉయ్యేలలు పడక కుపయోగింపఁబడెడివి. అయితే ఈయుయ్యేలలు గొప్పవారుమాత్రమే నుపయోగించెడివారు. ఉయ్యేలలకు బంగారుగొలుసులుగాని వెండిగొలుసులుగాని యుండెడివి. జనానాలోని స్త్రీలీయుయ్యేలలో నూఁగుచు నిద్రించుచుండెడివారు. తోఁటలలో చెట్ల కుయ్యేలమంచములు వ్రేలాడగట్టబడి కాముకీకాముకలచే నుపయోగింపఁబడు చుండెడివి.

ఉయ్యేలమంచములు గాక సామాన్యమంచములుకూడ నుండెడివి. రాయలవా రుపయోగించెడిమంచము వసుచరిత్రమున భట్టుమూర్తిచే నీక్రిందిపద్యమున వర్ణింపఁబడిన మంచమునుఁబోలియుండు నని మన మూహింపవచ్చును.

"మొలకమెఱుంగుకెంపు మొనముక్కు కిరీటివచ్చరా
చిలుకతకోళ్ళతోఁ జిలికి చంద్రిక వన్నియపట్టుపట్టెతోఁ
రోలకు పసిండి వ్రాలతెఱతో నెఱతావులమేలుకట్టుతోఁ
జలువలు చిందుముత్తియపు జప్పరమంచముపై మహోన్నతిన్."

ఈమంచపుకోళ్లు వెండి, బంగారు లేక దంతముతో వారివారిశక్తినిఁబట్టి చేయించుకొనఁబడెడివి. రాయలమంచమునకు నవరత్నములుకూడ నుండినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. యుద్ధమునకుగాని మరియితరమైన పనికిగాని పరాయిగ్రామము వెళ్లుట తటస్థించినచో మంచముగ తయారుచేయుటకుతగిన యినుపముక్కలను పెట్టెలలో పెట్టి తీసికొనివెళ్లి అప్పటికప్పుడాముక్కలను బిగించి మంచము తయారుచేసెడివారు.

ఈమంచములపైన "పలుతెఱంగుల పట్టుగలగడ బిల్లలు ముప్పంబు కుంకుమపువ్వుపఱుపులు" వేయఁబడెడివి. ఇట్టిపాన్పులుగాక కాముకీకాములకు చిగురుపాన్పులు పూపాన్పులు హంసతూలికాతల్పము లుండెడివి. ఈమంచములకు దోమతెఱలు కట్టుటకు కూడ నేర్పాట్లుండెడివి. చలికాలము నందు మంచములక్రింద నిప్పుకుంపట్లు పెట్టుకొనెడివారు.

ఈపైన వివరించిన రీతిగ రాజులు వారిమంత్రులు పెద్ద అధికారులు ననుభవించెడివారు. సామాన్యు లింత విలువ గల్గిన వస్తువులుకాకున్న నీపోలికగల తక్కువవిలువగల వస్తువు లను వాడుచుండెడివారు. కేవల బీదలు శ్రీనాథకవి వ్రాసినట్లు నులకమంచపుగుక్కితో కాలముగడిపెడువారు.

## స్నానము

హిందువులకు స్నానముచేయుట ముఖ్యవిధులలో నొకటి. బ్రాహ్మణులు దినమునకు రెండుమూడుమారులు స్నానముఁజేసినను తదితరజాతివారు దినమున కొకసారియైనను దేశస్థితి ననుసరించి స్నానముఁజేసెడివారు. వీలునుబట్టి వేడి నీళ్లనుగాని చలినీళ్లనుగాని స్నానముచేయుదురు. వారమున కొకసారియైనను తలంటుకొనుట లేక యభ్యంగస్నానము జేయుదురు. రాయలవారు ప్రతిదినము భోజనమునకు పూర్వ మభ్యంగస్నానముఁ జేయుచుండినట్లు చరిత్రకారులు వ్రాసి యుండిరి. సామాన్యజనులందరు తలలంటుకొని నూనెజిడ్డు పోవుటకు పొడినలుగుపెట్టుకొని యింట వేడినీటియందు గాని చన్నీళ్లయందుగాని లేక కాలువలయందుగాని స్నానముచేసెడి వారు. ఈ అభ్యంగస్నానము సామాన్యజనులందరు నలవాటు

పడియున్నందున, వారిసౌకర్యార్థము అంగళ్లుండిన ట్లాముక్త మాల్యదలో వ్రాయబడిన సీక్రిందిపద్యభాగమువలన తెలియ నగును.

"కూర్చుంబు గొరిగించుకొని యుష్ణతోయంపు,
టంగడిఁ దలగడుగాడుతడవు.

రాజులు వారిగొప్పయధికారులు కొలనులలో జలక్రీడలు సల్పెడివారు. పురుషులు స్త్రీలు కలిసి జలక్రీడలు సల్పుదురు. ఇట్లు జరుపుటకు పూర్వము స్త్రీలు తమ

"తొడవులటుపెట్టి వలిపావడలుగట్టి శృంగములు పట్టినీరాడ"

జేరుదురు మరియు నాజలక్రీడలలో

"చిగురంజిమ్మనఁ గ్రోవిలో నొకతె రాజీవాసవం బుంచి పై"

నిగుడించెననియు

"బంగరుకొమ్ముఖ్రాని యొకశ్రాధ రయంబునసీరు"

చల్లెననియు కవులు వ్రాసియుండిరి. ఈరీతిగ జలక్రీడలు సల్పి సీటియందు దాగుడుమూతల నాడి మిక్కిలి డస్సినవారై స్త్రీ పురుషులు గృహోన్ముఖు లయ్యెడివారు.

## భోజనము

గొప్పవారికి బీదవారికి నుపయోగించెడు ఆహారపదా ర్థము బియ్యము. ఇందులో తెల్లబియ్యము గొప్పవారు నల్ల బియ్యము బీదవారు వాడుకొనెడివారు. తెల్లబియ్యములో రాజనాలుధాన్యము రాజులువాడెడివారు. తురకలు గోధుమ లుపయోగించుకొనెడివారు. రెడ్లు వ్యవసాయదారులు చోళం,

అరిగెలు, రాగి, భోజనము చేసెడువారు. కంది, పెసర, మినప, శెనగ పప్పులు జనమంతయు నుపయోగించెడివారు.

మాంసభక్షకులు గొడ్డుమాంసము, పందిమాంసము, పావురాళ్లు, కుందేళ్లు, లేళ్లు, అనేకవిధములైన పక్షులను, భక్షించెడువారు. మామిడిపిందెలతో కూడిన మత్స్యాన్నమును రాయలవారు భుజించెడివారు. బజారునందు పిచ్చుకలు యెలుకలు, పిల్లులు, తొండలు, బల్లులు, కూడ విక్రయింపఁబడుచుండెడివి. వీటినికూడ తినియుందురేమో! వెనుకటిదినము తయారుచేయఁబడిన "హయ్యంగవీనము" హెచ్చుగనుపయోగించెడువారని రాయలవారే వ్రాసియుండిరి. ఆకాలమున మిరపకాయ లచటలేనట్లు కనుపించుచున్నది. మిరియములనే యుపయోగించెడువారు. మామిడిపండ్లు, పనసలు, ద్రాక్ష, దోస, అరఁటి వగైరా పండ్ల నుపయోగించెడివారు.

## పానీయములు

సామాన్యజనులకు నీరు, మజ్జిగతో కల్పిననీరు, బెల్లముగాని చక్కెరగాని కల్పినపానకము, ముఖ్యములైనపానీయములు. చెఱకురస మింకొకసామాన్యపానీయము. కొబ్బరినీళ్లతో కలిపినచెఱకురస మెండకాలమున విక్రయించబడెడిది. కొబ్బరికాయలలోనినీరు చల్లగనుండుటకు తోటలలో నిసుకతిన్నెలక్రింద చెట్లనీడలనుంచెడివారు. ఈపానీయములన్నియు సమస్తజనులకు లభ్యమగునవి.

గొప్పవారైన స్త్రీపురుషులు హెచ్చుగ మద్యపానము చేయుచుండెడివారు. వీరుపయోగించెడిమద్యము నారికేళము నుండితయారుచేయఁబడిన పానీయము. సామాన్యజనులు పాన

కాలలకుఁబోయి పానీయము సేవించిన గొప్పవారు రహస్యముగ తెప్పించుకొని తమయింటనే వాడుచుండెడివారు. గొప్పవారు భోజనసమయమున మాంసముతో తయారుచేయబడిన మంచి యుపదంశనంబులతో మద్యపాత్రముల నుంచెడువారు. పుష్పాసవము, తాలమధు, ఐక్షవము, మధిరారస, ద్రాక్షాసవము మొదలయినవి సామాన్యముగ నుపయోగింపఁబడెడి మధుపానీయములు. ఈపానీయములు సేవించువారు రాత్రులయందు

"మండలాకృతిఁగూర్చుండి మంచి దనుచు
గ్రుక్క గ్రుక్కకు కలలూచుకొనుచు నొకరి
నొకరి కంపించి చూపుచు నుబ్బిసుబ్బి,
త్రావఁ దొడఁగిరి యుల్లాసరసముతోడ.

స్త్రీలు విచ్చలవిడిగ మధుసేవనముచేసెడివారని సమకాలికుఁడగు నొకకవి వ్రాయుచు వారిస్థితి నిట్లు వర్ణించియుండెను. కొందరుస్త్రీలు ధరపై బడువరకు త్రాగెడువారు. మరికొందరు దర్పోక్తులు బలుకుదురు. కొందరు పకపకనవ్వువారు. కొందరు చిరుబూతులాడువారు. మరికొందరు పారావతంబులవోలె సిగ్గరుగక కులుకువారు. మరికొందరు మొలకోకలూడంగ దివుచువారు. ఇట్లంతయు లోలోన జనానాలలో జరుగుచుండుటవలన లోకసామాన్యమునకు తెలియకుండెడిది.

## స్త్రీలు

ఆరోజులలో సామాన్యస్త్రీలనుగురించి మనకు హెచ్చుగ తెలియుట లేదు. గొప్పవారిజనానాలలో నుండువారియొక్కయు, కులాసాగా తిరిగెడుస్త్రీలను గురించియు మాత్రము కవులు వ్రాసియుండిరి. మొత్తముమీద స్త్రీలాకాలమున మగవారి

కాటపాత్రలుగనుండిన ట్లూహించవలసియున్నది. వీరికి వ్రాయను చదువను తెలిసియుండెడిది. చాలమంది సంగీతము నాట్యము నేర్చియుండెడివారు. నాట్యముచేయుటకు నాట్యశాలలుండెడివి. గొప్పవారిస్త్రీలందరు జనానాలలో నుండెడివారు. వారు ఇచ్ఛ వచ్చినట్లు బయట తిరిగెడువారు కారు. రజస్వలయగుటకు పూర్వమెపిల్లలకువివాహములు జరుగుచుండెడివి. పిల్లల కిష్టమైన వరుని కిచ్చివివాహముచేయు నాచారములేదు. అందువలన

"కలకాల మొక్కగతెలుగా, సలలో దారంబుమాడ్కి సతిమదిలోనక్
కొలగెడుపురుషులు గలుగుట, తొలిజన్మము నోముఫలము తోయజనేత్రా.

భార్యకు

"పతిప్రాణసదృశబంధువు, పతి దైవం బేడుగడ."

పిల్లలవివాహ మతివైభవముతో జరుపబడెడిది. సామాన్యముగ పిల్లయొక్క తల్లిదండ్రులయిండ్లలోనే వివాహములు జరుగుచుండెడివి. బ్రాహ్మణులలో పిల్లవానితండ్రులనుండి పిల్ల బంధువులకరణము లివ్వవలసియుండెడిది. బ్రాహ్మణేతరులలో పిల్లతల్లిదండ్రులు పిల్లవానిబంధువులకు తగినబహుమానములు చేయవలసియుండెను. మొత్తముమీద

"పతికి మారుమాటాడక పలుమారు నేడ్వక,యలుగక మిగుల గయ్యాళిగాక
తను దిట్టికొనక కాతాళించి గొణగక, ముచ్చిలించక పాపమునకు జొరక.

కాపురముచేయుభార్య దొరికెనేని పురుషు డదృష్ట వంతు డని యెంచవచ్చును.

"పతికొట్టిన పతితిట్టిన, బతినిర్దయుం డగుచు నెట్టిపాటుం బరచినన్,
మతినన్యథాత్వ మొందరు, పతులే దేవతలు సతులప్రాణసదృశులున్."

ఈస్థితిలో సాదువారిని కట్టుబెట్టము చేసికొనుటన వారు పతీధర్మము నాచరించుచుండెడివారు. ధర్మపత్నీత్వమును వెలిబుచ్చుటకై స్త్రీలు భర్తలతో తమప్రాణములనువదలి వారితో నిశ్చయముగ చితిపై నెక్కి సహగమనముచేసెడివారు. భర్తతో సహగమనము చేయ నిష్టపడనిభార్యలను బంధువులు మోసము చేసి చితిపై బలవంతముగ తగులబెట్టుటయు నాకాలమున జరుగుచుండెడిది.

## భోగస్త్రీలు

భోగస్త్రీలు ప్రత్యేకవర్ణముగ జీవించెడువారు. వీరి వృత్తియు నాకాలమున మర్యాదగలవృత్తిగనే యెంచబడెడిది. ఆనాడువ్రాయబడిన ప్రబంధములలో వీరినిగూర్చి మర్యాదతో వ్రాయుటయేగాక సంఘజీవనమున వీరికి హెచ్చు ప్రాముఖ్యత నిచ్చినట్లుకూడ వ్రాసియుండిరి. ఈజాతిలోనిపిల్లలకు చక్కగ చదువుచెప్పించి సంగీతమును నాట్యమును నేర్పించెడువారు. వారు సంస్కృతమునందును దేశభాషయందును విద్యనభ్యసించెడువారు. ఆపడుచుపిల్లలకు కలవాద, పరవాదిని వీణె మొదలయినగానయంత్రములతో పాడుట నేర్పించెడువారు. ఈకులములోనిపిల్లలకు చక్కదనమే ముఖ్యముకాదు. సాహిత్య సంగీతములు, చమత్కారముతో మాట్లాడుట, వచ్చినవారిని వచ్చినట్లు తమవలలో వేసికొనుట కవసరమగు విద్యలన్నియు నేర్చియుండవలెను. సాహిత్యము పనికిరానిచో సరససంగీతము చేత ప్రీతిగల్గింప నేర్చియుండవలెను. సంగీతవైఖరి సమ్మతించనిచో వీణయందు నేర్పరితనము జూపవలెను. వీణ వెగటుగ దోచినపుడు సొగటాలయాట నేర్చియుండవలెను. సొగటాలపై

వేడ్క లేనపుడు వింతమాటలు చెప్పవలయును. అందువలన నాజాతియందలి స్త్రీలు "చదువ బాడంగ"

చతురలుగా నుండవలయును. "వీణవాయింప" జాణగ నుండవలయును. జూదమాడంగ జాటగనుండవలయును. పల్కంగ మిక్కిలి ప్రౌఢగనుండవలయు. వారివారి చాతుర్యము వలన వచ్చినవారిని సంతుష్టిపఱచి తమప్రతిభను ప్రఖ్యాతము చేయవలెను.

భోగస్త్రీలపిల్లలకు రజస్వలలయినంతనే "కన్నెరికము" చేయించవలెను. కన్నెరికముగునంతవరకు వారిని వృత్తిలోనికి దించకూడదు. సామాన్యముగ నీకన్నెరికమును పెట్టుటకెవరో కలుకుబడిగల్గిన పెద్దమనిషి సిద్ధముగ నుండెడువాడు. దీనికగు ఖర్చంతయు నాతడే భరించును. ఈకన్నెరికమన్న వివాహము వంటిదే. కన్నెరికము పెట్టినంతమాత్రమున నీకన్య ఆపెద్దమనిషికి స్వాధీనురాలు కాదు. ఈవృత్తికిని పెక్కువాక్కులును బాధ్యతలు నుండెడివి.

వీరిలో కొందరు దేవతాగృహముల కంకితముజేయఁబడెడివారు. అట్టివారు ప్రతిదినము దేవునియెదుట నృత్యముఁ జేయవలెను. ఇట్లంకితము చేయఁబడినవారికి దేవదాసి మాన్యము లుండెడివి. దేవదాసీమాన్యములును వీరు తరతరముల ననుభవించవచ్చును.

రాజధానియందు నివసించెడి దేవదాసీలు ప్రతిశని వారము రాజుగారు పూజచేసెడి దేవునిగృహమున నృత్యము చేయు నాచారముకలదు. మహార్నవమి యుత్సవసమయమున

తనరాజ్యమునందున్న భోగస్త్రీలందరు రాజభవనమునకు వచ్చి దసరాయుత్సవములలో పాల్గొనవలసియుండెను.

భోగస్త్రీలలో ననేకులు మిక్కిలి ద్రవ్యవంతులు. ఈవృత్తియందు జనులకా కాలమున మంచిమర్యాద యుండె డిది. గొప్పవారు, పెద్దయుద్యోగస్థులు, నీభోగస్త్రీలకై కాంక్షిం చుచుండెడివారు. రాజులు రాజోద్యోగియులు భోగస్త్రీలయిం డ్లకు తమంతటతామే పోయెడువారు. రాజాంతఃపురమునకు బోవుట కీభోగస్త్రీలకు హక్కుగలదు. పెద్దయుద్ధములు జరుగు నపుడు రాజులవెంట భోగస్త్రీలు వెళ్లెడివారు. రాజగుడారము నందు రాజోద్యోగియులగుడారములందు నీభోగస్త్రీ లుండెడి వారు. యుద్ధసమయమున గుడారములు వేయునపుడు వేశ్యా వాటికలు తయారుచేయబడెడివి. కొందరు వేశ్యల కాయుద్ధ సమయమున రాజబొక్కసమునుండి జీతములుకూడ నిచ్చెడి యాచారము కలదు. భోగస్త్రీల సమక్షమున సైనికులు మిక్కిలి యుత్సాహముతో యుద్ధముచేసెడివారు.

ప్రతివేశ్యయింట నొకవేశ్యమాత యుండుట సాంప్ర దాయమైయున్నది. వేశ్యలు తమకై వచ్చెడివారిచే మోసగింపఁ బడకుండుటకు నీవేశ్యమాతలు కనిపెట్టియుండెడివారు. కాని వేశ్యమాతల దుర్నయము లింతింత యని చెప్పుటకు వీలులేదు. వీరిని తిట్టనివిటుఁడుగాని కవిగాని లేఁడనియే చెప్పవచ్చును.

## విద్య

ప్రభుత్వము విద్యకై హెచ్చుగ ఖర్చుపెట్టినట్లు కన బడదు. మఠములలో మఠాధిపతులు శిష్యకోటికి విద్యజెప్పిం

చెడివారు. కాని అచట చెప్పఁబడెడి విద్య ముఖ్యముగ మతవిష
యైకవిద్య. ఇదిగాక రాయలవారు బహూకరించిన యగ్రహా
రములలోని బ్రాహ్మణబాలురకగ్రహారీకులు విద్యఁ జెప్పించెడి
వారు. వారివద్ద జదువుకొనువారు హెచ్చుమంది బ్రాహ్మ
ణులే అయియుండిరి. వీరుగాక బ్రాహ్మణేతరులుకూడ జదువు
చుండెడివారేగాని వారిసంఖ్య బహుస్వల్పము. అగ్రహార
ములు దానమిచ్చునపుడే దానపత్రికలయందు విద్యగఱపుటయు
నొకవిధిగ విధించఁబడెడిది. ఈయగ్రహారీకులవద్ద విద్యనేర్చు
కొనుశిష్యకోటి కుచితముగ భోజనమును నేర్పాటుగావించి
విద్య నేర్పుచుండెడివారు.

"సరసాహారము లింటఁబెట్టి బహుశిష్యశ్రేణికిన్ జెల్వుగా,
స్త్రసహస్రస్థితిఁజెప్పఁ గద్యయుతసంధ్యల్ హవ్యకవ్యంబులన్.

వైష్ణవగురువులు బ్రాహ్మణేతరుల కనేకులకు సంస్కృత
విద్య చెప్పినట్లును వారిచే సంస్కృతకావ్యముల వ్రాయించి
నట్లును కనబడుచున్నవి.

గురువులవద్ద జదువుకొన్న శిష్యులకు వేదములు శాస్త్ర
ములు పురాణములు ఇతిహాసములు కావ్యములు నాటక
ములు నేర్పుచుండెడివారు. ఇవిగాక ఆయుర్వేదముకూడ
నేర్పెదువారు. గురువులవద్ద శిక్షనభ్యసించినవా రనేకులు
వారివారి ప్రతిభనుబట్టి రాజసన్మానమును పొందెడివారు.
మరికొందరు తమతమ గ్రామములలో నివాసముండి తమజీవ
యాత్రను గడుపుచుండెడివారు. ఇట్లు గురువులవద్ద విద్య
నభ్యసించినవారు గ్రంథకర్తలై నాటకములను వ్రాసి ప్రఖ్యాతి
వహించినవా రుండిరి.

సర్వసామాన్యముగ, తల్లిదండ్రులు తమపిల్లలకు విద్య నేర్పించి వారికి ప్రభుత్వోద్యోగములకు పనికివచ్చెడిగణిత విద్యను నేర్పెడువారు. అట్లు విద్య నేర్చినవారు ప్రభుత్వో ద్యోగములలో కరణములుగ బ్రవేశించి రాయసములుగను అవసారికలుగను మరికొందరు దుర్గాధిపతులుగ నుండెడివారు.



ఆకాలమున నాటకములు మెండుగ నుండెడివి. ఆనాటి వాఙ్మయమునం దీనాటక ప్రదర్శనములు, నర్తకీనర్తకులవిషయ ములు, పాత్రధారులచరిత్రలు విశేషముగనుండెడివి. 1514-వ సంవత్సరపు శాసనమునందు "తాయికొండనాటక" ప్రదర్శన ములో ప్రఖ్యాతిగణించిన "నత్తువనాగయ్య" యను వేష ధారివే రుదహరింపఁబడినది. ఆశాసనమునందే పోతవరగ్రామ శాపరస్థుఁడగు నత్తువతిమ్మయకుమార్తె వేషధారిగనుండి ప్రఖ్యాతివడసినట్లు వ్రాయఁబడియుండెను. ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధమునందు నాటక ప్రశంస హెచ్చుగ వ్రాయఁ బడియుండెను. మనుచరిత్రమునందును వసుచరిత్రమునందును నాటకశాలలు గుర్తింపబడియుండెను.

ఆకాలమున సంస్కృతనాటక ప్రదర్శనము లుండెడివి. కాని యీనాటకములు పండితజనమునకేగాని పామరుల కంతగ రుచించెడివి కావు. రాయలవారు వ్రాసిన జాంబవతీకళ్యాణము నాటకము పలుమారు ప్రదర్శింపఁబడుచుండెను.

దేశభాషలలో యక్షగానములు చూపఁబడెడివి. ఈ యక్ష గానములు సంగీత ప్రధానమైనవి. గాత్రపాటతోపాటు వీణె మృదంగము కూడ నుపయోగింపఁబడెడివి. ఈయక్షగానమున

"తాయికొండనాటకము" "గంగావతరణ"మను నాటకములు ప్రదర్శింపబడెడివి. ఈయక్షగానములు సామాన్యముగ భోగము వాండ్రచే నూరూర ప్రదర్శింపబడెడివి. వీరిలో పదిమంది కలిసి మేళముగ నేర్పడి యూరూరు తిరుగుచుండెడివారు. వీరిలో నటకులు, గాయకులు, నర్తకులుకూడ నుండెడివారు. ఉత్సవసమయములలోగాని జాతరలసమయములలోగాని యీనాటకములు ప్రదర్శింపఁబడెడివి. వీరినాటకశాలకు తెర ముందుండెడిది. తెరలోనుండి ప్రదర్శకులు బయటకు వచ్చి నాటకములాడెడివారు, కొండలు, నదులు, అడవులు, మృగములను ప్రదర్శించునపుడు స్వాభావసిద్ధముగను, సహజముగను నుండునట్లు ప్రదర్శించెడివారు. వేషకులు వారు ప్రదర్శించు వేషమునకు తగినవస్తులను, అలంకారములను, భూషణములను ధరించెడువారు. నగలు చెక్కతో తయారుచేసి బంగారమువలె కనుపడుటకు రంగువేసికొనెడివారు.

వాద్యముల శ్రుతితో, స్త్రీలుపాడెడుపాటలతో ప్రదర్శనము లు ప్రారంభింపబడెడివి. ఈపాట పూర్తియగునంతనె సూత్రధారుఁడు వచ్చి రానున్నకథనుగూర్చియు నాటకులనుగూర్చియు నాంది ప్రేక్షకులకు వినిపించెడివారు. అటుపిమ్మట ప్రదర్శకు లొకరివెనుక నొకరువచ్చి వారివారిపాత్రలను బహురమ్యముగ ప్రదర్శించెడివారు.

ఈమేళములలో ప్రసిద్ధిచెందినమేళములను రాయలవారు తమసభకు రప్పించి తమజనానావద్ద తమయొక్కయు తమవద్దనున్న యధికారులయొక్కయు సముఖమున ప్రదర్శింపించెదివారు. వీరి ప్రదర్శనాకౌశలము వీరితోనే నశించినట్లు

కనుపించుచున్నది. ఈ ప్రదర్శకులలో ప్రసిద్ధనటీనటకుల పేర్లు మన కానాటిసాహిత్యమువలన తెలియుచున్నవి. పెండిలినాగి బుచ్చిగాడు నత్తువనాగయ్యయు నాటి ప్రఖ్యాతనటీనటకులై యున్నట్లు మన కీ ప్రబంధములవలన తెలియుచున్నది.

పైనచెప్పిన యక్షగానప్రదర్శనములుగాక తోలుబొమ్మ లాట లానాడు ప్రబలియుండెడివి. ఈబొమ్మలాటలు రాత్రుల యందు పెద్దమైదానములందు తాత్కాలికముగ నేర్పాటుచేసిన పందిరిక్రింద నాడబడెడివి. పందిరికిముందు తెరకట్టబడియుండును. మిగిలిన మూడుపైపులు తడికలతో మూసివేయబడి యుండును. దీపపువెల్తురు నా తెరమీదకు ప్రదర్శించి వెనుక నుండి తోలుబొమ్మలనీడల నా తెరమీద కనబడునట్లుచేసి బొమ్మలనాడించి లోపలనుండి పాటలుపాడియు సంభాషణములు చేసియు జనుల సంతోషపెట్టుచుండెడివారు. సంభాషణచేసెడు వాడు ప్రసంగి. సంగీతముపాడెడువాడు సాధకుడు. ఈ ప్రదర్శ నములు తెల్లవారువరకును జరుగుచుండెడివి.

దొమ్మరులు విప్రవినోదులు జనులకు కొంతకాల క్షేపము గల్గించుచుండెడివారు. వీరు ప్రతిసంవత్సరము ప్రతి గ్రామమునకుపోయి తమతమవిద్యలను ప్రజలకు ప్రదర్శించి వారివలన వార్షికములు పొందెడివారు. దొమ్మరవాం డ్రాట లలో తాడుపై నడచుట మిక్కిలి వినోదమును ఆశ్చర్యమును కలిగించెడివి. ఇందు గొప్పచతురత చూపించెడివారు. వీరిలో ప్రసిద్ధులు రాయలవారిసమక్షమునగూడ తమచతురతను నైపుణ్యమును ప్రదర్శించి వారిచే మర్యాదలు పొందెడివారు.

సామాన్యజనులకు కోడిపందెములలో నుత్సాహము మెండుగ నుండెను. కాలికి కత్తివాల్చి కోళ్లు పోరాడుచున్నప్పుడు పైపందెములుపెట్టి జనులు చూచి సంతోషించెడివారు. ఈపందెము నగరములయందుకన్న గ్రామములందు హెచ్చుగ నుండెను.

గుఱ్ఱములపైనెక్కి రాత్రివేళల నిప్పుకణమువలె కన బడుబంతులను పెద్దకఱ్ఱలతో కొట్టి "పోలో" యనునాటను బోలియుండెడి ఆటను రాజు లాడుచుండెడువారు. ఈ ఆట తురకసైనికు లాడుచుండెడివారు. వారివద్దనుండి నేర్చుకొని కృష్ణదేవరాయలవారికాలమున వారిసైనికులు సైన్యాధికారు లీయాట నాడుచుండెడివారు.

జంతువులను వేటాడుటలో నాకాలమున రాజులకు రాజవంశమువారికి ప్రభుత్వ ఉద్యోగులలో ముఖ్యులకు మిక్కిలి యుత్సాహముండెడిది.

గొప్పవారు చదరంగము పావులతో జూదమాడుట మొదలగు ఆటలలో శ్రద్ధవహించెడువారు. రాయలవారు చదరంగ మాడుటలో ప్రసిద్ధమైపుణ్యమును గలిగియుండెను. ఆకాలమున మిక్కిలి చతురతతో నాడెడు బొడ్డుచర్లతిమ్మన్నగారితో రాయలవారీయాటనాడి ఓడిపోయెడువారు. ఈచద రంగమున "చిన్నతమ్మన్న అనే ఆయన కవీశ్వరదిగ్దంతి అనిపించుకొని కృష్ణరాయలవారియొద్దకు బోయి చదరంగమాడుతూ ఉండేవాడున్ను, ఆటగెలిస్తే వెయ్యార్లు పందెంవేసి గెలుస్తూ ఉండేవాడున్ను అప్పుడు కృష్ణదేవమహారాయలు చాలా

సంతోషించి కొప్పోలుగ్రామం సర్వాగ్రహారంగా థారా వోసి" యిచ్చెను.

## 22. రాయలవారు: సాహిత్యము

దక్షిణహిందూదేశమునందు పదునాఱవశతాబ్దము సాహిత్యమునందు మిక్కిలి ప్రఖ్యాతిఁగాంచినది. రాయలవారు రాజ్యముచేసిన కాలమున దేశభాషయందు సాహిత్యమునకు హెచ్చుగ ప్రోత్సాహముగలిగెను. రాయలవారు గొప్పకవి, గాయకుఁడు, విద్యావంతుఁడు, వేదాంతియై యుండి, తనచుట్టు గొప్పకవులను గాయకులను, విద్యావంతులను, వేదాంతులను రాబట్టెను. వారిని మర్యాదచేసి వారికై చాల ద్రవ్యమును వెచ్చించి వారితో వాదములు చర్చలు సాగించెను. విద్వత్సభల నేర్పాటుచేసి తన పాండిత్యమును ప్రదర్శించి, యితరపండితుల పాండిత్యమునకు వారిని బహూకరించెను. ఈపండితులను, గాయకులను, తాను, గ్రామాంతరములకు వెళ్లినపుడు యుద్ధములకుఁబోయినపుడు తనవెంటతీసికొని వెళ్లుచుండెను. అన్నిభాషలయందలి సాహిత్యములయందు తనకు ప్రీతియుండినను తెనుగుభాషయందు మిక్కిలి ప్రీతినిఁ జూపించెను. తెనుఁగుభాషయందు పరిషత్తు నేర్పాటుచేసి అష్టదిగ్గజముల రాబట్టి తానే పరిషత్సభకాధిపత్యము వహించియుండెను. పండితులు, కవులు, గాయకులు, తీర్థప్రజవలె రాయలవారివద్దకు వచ్చుచుండెడివారు.

### సంస్కృతము

సంస్కృతభాషయందు వ్రాసినకవులలో కృష్ణరాయలే ప్రథమకవి. వీరు సంస్కృతభాషలో "మదాలసచరిత్ర" "సత్యా

వధూప్రీణనము" "సకలకథాసారసంగ్రహము" "జ్ఞానచింతామణి" "రసమంజరి" యనుగ్రంథములను వ్రాసియున్నట్లుగా ఆముక్తమాల్యదలో చెప్పిరి. గాని యాపుస్తకము లిప్పుడు దొరకుటలేదు. వీరు వ్రాసిన "జాంబవతీకళ్యాణము" అనునాటకముయొక్క వ్రాతప్రతి యిప్పుడున్నట్లు తెలియుచున్నది.

రాయలవారి కాలమున కొండవీడు వాస్తవ్యుఁడు లోలలక్ష్మీధరుఁడను వైదికవిద్వాంసుఁడు రాయలసభలోనుండి "సరస్వతీవిలాస"మను నొకగ్రంథమును వ్రాసియుండెను. లోలలక్ష్మీధరుఁడు రాయలసభకు రాకపూర్వము గజపతిరాజువద్దనుండెను.

గజపతిరాజువద్దనుండి లక్ష్మీనారాయణ యను నింకొక సంగీతబ్రాహ్మణుఁడు వచ్చియుండెను. వీరిని రాయలవారు తమ అంతఃపురములోని స్త్రీలకు సంగీతము నేర్పింప నియమించి యుండిరి. ఈసంగీతవిద్వాంసుఁడైన లక్ష్మీనారాయణ "సంగీతసూర్యోదయ"మను గ్రంథమును వ్రాసియుండెను. రాయలవారు మధ్వగురువైన రాఘవేంద్రునిపూర్వికులలో నొకరగు కృష్ణునివద్ద సంగీతవిద్యను నేర్చుకొనిరి.

సాళువతిమ్మరసు, వారి మేనల్లుఁడునాదెండ్లగోపమంత్రియు గొప్పసంస్కృతపండితులై యుండిరి. వీరిలో మంత్రి తిమ్మరసు అగస్త్యుని బాలభారతమునకు వ్యాఖ్యానమును గోపమంత్రి ప్రబోధచంద్రోదయ మను నాటకమునకు వ్యాఖ్యానమును వ్రాసియుండిరి. గోపమంత్రి గ్రంథకర్తయేగాక ప్రసిద్ధకవులను గౌరవించుచుండెడివారు. తాను కొండవీడులో నధికారమున నుండు నపుడు మాదయ్యగారిమల్లన్నను, సుప్రసిద్ధు తెనాలి రామకృష్ణకవిని దగ్గఱకు రావించి మిక్కిలి గౌరవించెను.

మతగురువులును రాయలసభలకు వచ్చి రాయలసభలో చర్చలుగావించి కీర్తిపొందెడివారు. మతసంస్కర్తయగు వల్లభాచార్యుడు జైనమతస్థుడైన అభినవవాది విద్యానందుడు నిట్టి చర్చలలో పాల్గొని రాయలసభలోని పండితుల నోడించిరి. రాయలకాలములో చైతన్యుడు కూడ వచ్చినట్లు తెలియవచ్చుచున్నది. రాయలవారికాలమున వ్యాసతీర్థులవారు మతమును గూర్చియు తర్కశాస్త్రమునుగూర్చియు న్యాయశాస్త్రమును గూర్చియు "తర్కతాండవన్యాయామృతము" "సుధ" "మందారమంజరి" "మధ్వతాత్పర్యచంద్రిక" యను గ్రంథములను వ్రాసెను.

అరవము:—రాయలవారి పండితసన్మానము దేశమంతటను వ్యాపింపగ, నరవదేశమునుండి యనేకపండితులు, కవులు, రాయలసభలను దర్శించుచుండిరి. అట్లు వచ్చినవారిలో వెల్లాలకవి హరిదాసుడొకడు. ఈహరిదాసు శైవవైష్ణవ మతముల ప్రాముఖ్యతనుగూర్చి "ఇరుసమయవిలక్క" మను గ్రంథమును వ్రాసియుండెను. రాయలవారీహరిదాసునకు బహుమానముల నిచ్చియుండెను. కుమారసరస్వతియను నింకొక కవి రాయలసభకు వచ్చియుండెను. ఈకుమారసరస్వతి రాయలవారి కళింగదేశదండయాత్రను గూర్చియు గజపతిరాజు కుమార్తెను వివాహము చేసికొనుటనుగూర్చియు వ్రాసియుండెను. తిరువారూరు వాస్తవ్యుడగు నొకజైనమతస్థుడైన మండలపురందర్ జ్ఞానప్రకాశరనువారు "మంజారప్ప" "తత్త్వప్రకాశ"మను రెండుగ్రంథములను వ్రాసి రాయలవారి ప్రోత్సాహమును బొందిరి. మొత్తముమీద రాయలవారి యభిమానము

అరవదేశముపైన అరవవాఙ్మయముపైనను హెచ్చుగ ప్రసరించినట్లు కనుపించదు. రాజుల యాదరణములేకున్నను దేశమునందు స్థాపింపఁబడిన మఠములయాధిపత్యమును అరవవాఙ్మయమును రాయలవారికాలమున చాలనభివృద్ధికి వచ్చియుండెను.

కన్నడము:—కన్నడదేశమునను వాఙ్మయ మీకాలమున నభివృద్ధిఁజెందెను. రాయలవారివద్ద నీకాలమున ననేక కన్నడకవులుండిరి. కాని వారికవిత్వ మంతప్రసిద్ధికి వచ్చియుండ లేదు. రాయలవారికన్న వారికన్నడఅధికారులు కన్నడభాషను చాల ప్రోత్సహించిరి. కన్నడకవులలో బ్రాహ్మణులు వైష్ణవులు వీరశైవులు జైనులు నుండిరి.

రాయలయాజ్ఞానుసారము "తిమ్మణ్ణ" యను కన్నడకవి మహాభారతమును పూర్తిగావించెను. ప్రథమమున నీభారతమును కుమారవ్యాసులవారు ప్రారంభించిరి. తిమ్మణ్ణకవిత్వము వ్యాసులకవిత్వముతో పోల్చుటకు వీలులేదు. ఈపుస్తకమును కన్నడులలో ననేకులు పఠించుచుందురు.

చాటువిట్టలనాథుఁడను నింకొకకవి రాయలకాలమునందుండెను. ఈతఁడు భాగవతగ్రంథమును కన్నడభాషలో రచించెను.

మధ్వగురువగు వ్యాసతీర్థులవారు రాయలకాలపువారేయైయుండిరి. వీరు ద్వైవభక్తిపూరితములగు విష్ణుసంకీర్తనములను పద్యరూపకముగ ననేకములను వ్రాసియుండిరి. ఈపద్యములే ప్రజానీకమునకు మిక్కిలి యుపయోగకరముగ నుండు

టిరయేగాక వైష్ణవమత మీమాంసద్వారూపమున దేశమునందంతటను ప్రచారము చేయబడినది.

జైనులలో "మంగరస" యనుకవి రాయలకాలమునం దుండెడివారు. ఈకవి "జయనృప" యనుగ్రంథమును చక్కని సులభశైలిలో వ్రాసియుండెను. అనుభవవాది విద్యానంద యను నింకొకజైనకవి రాయలకు సమకాలికుఁడై యుండెను. వీరిపాండిత్యమును కవిత్వమును మిక్కిలి శ్లాఘించి రాయలవారీకవికి రత్నాభిషేకముఁ గావించిరి. ఈకవి గెరిసొప్పగ్రామవాసి. "కావ్యసార" మను అలంకారశాస్త్రమును వ్రాసియుండెను. "సాల్వ" యను నింకొకకవి భారతమును కన్నడభాషయందు రచించెను. ఈభారతము కుమారవ్యాసుని భారతమంత జనాకర్షణీయము గాకున్నను గొప్పగ్రంథములలో నొకటి యని చెప్పనగును.

వీరశైవకవులలో గుబ్బిమల్లనార్యుఁడు ప్రథమకవి యని చెప్పనగును. ఈకవివ్రాసినగ్రంథములలో "వీరశైవామృతము" "శివభక్తపురాణ"మనుగ్రంథములు ముఖ్యముగ చెప్పుకొనదగినవి. ఈగ్రంథములు తమవీరశైవమతప్రచారమునకు హెచ్చుగ నుపయోగపడెడివి. "నంజుండ" యను నింకొకకవి కంప్లిదేశపురాజగు కుమారరామునిచరిత్రమును వ్రాసియుండెను. ఈగ్రంథము చరిత్రాత్మకమైనగ్రంథము. ఈగ్రంథమునందలి చరిత్ర యిప్పటికి ముఖ్యముగ గమనింపఁదగినది. "లింగమంత్రి" "వీరభద్రరాజు" పేరుచెప్పఁదగిన యితర వీరశైవకవులు.

తెలుఁగు:— తెనుగుభాషయం దీకాలమున క్రొత్త యుగము ప్రారంభమైనదనియే చెప్పనగును. ఇంతవరకు తెనుగు భాషయందు గొప్పకవులు ప్రతిభాశాలు రుండిరిగాని వారందరు సంస్కృతగ్రంథములను భాషాంతరీకరించియుండిరి. ఈ రాయల వారికాలమున స్వతంత్రకవనము ప్రారంభింపఁబడెను. వీరిలో ముఖ్యుఁడగు అల్లసానిపెద్దన పూర్వగ్రంథములలోని కథను మాత్రము మాతృకగ గైకొని దానినే స్వకపోలకల్పనలతో పెంచి పెద్దదానినిగఁజేసి విశేషచాతుర్యమును జూపి ప్రబంధములను వ్రాయ ప్రారంభించెను. ఆకారణమువలననే యితనికి ఆంధ్రకవితాపితామహుఁడని బిరుద మీయఁబడెను. ఈ కావ్యము లెట్లు రచింపవలెనో ప్రతాపరుద్రీయ మను లక్షణ గ్రంథమున సీవిధముగ వ్రాయఁబడియుండెను.

గీ. ఇంకఁ గావ్యప్రభేదంబు లేర్పరింతు, వరుస నష్టాదశవిశిష్టవర్ణనములఁ
గలుగవలయు మహాకావ్యతిలకమునకు, నెలమి దన్నామధేయంబు లెట్టివనిన.

క. పురసింధునగర్తు ర్వసశశి సరసీవనమధురతి ప్రసంగవిరహాముల్
పరిణయ తనయోదయ నయవిరచనయాత్రాజిదౌత్యవిభువర్ణనముల్.

గీ. ఇందునొకకొన్ని కడవైన నెంచిచూడ, నదియుననవనిమహాకావ్యమనఁగఁబరఁగు
మరియుం క్షుద్రప్రబంధనిర్మాణమర్మ, లక్షణము లేర్పరించెద లలితఫణితి.

ప్రబంధమునకుఁ పై జెప్పినరీతిని స్వకపోలకల్పనలతో పదునెనిమిదివిషయములనుగూర్చి వివరించి వ్రాయుటయేగాక కొందరుకవులు సీపదునెనిమిదివిషయములలో ప్రతివిషయమునందును మరికొన్ని భాగములను జేర్చి వారివారిబుద్ధిచాతుర్యముచేతను వైశద్యముచేతను నాయా వర్ణనలలో నింకను విశేషించి గ్రంథమును జేర్చిరి. పురవర్ణనఁజేయవలసివచ్చినప్పుడు

పురములోని కోటలు, భవనములను వర్ణించుటయేగాక బ్రహ్మ క్షత్రాదివర్ణచతుష్టయమును, చతురంగబలంబులను పుష్పలావికాది స్త్రీవర్ణనాంశాదికములనుజేర్చి పెంచిచెప్ప మొదలిడిరి. ఇట్టి కవనమే పెద్దనకు తరువాతివారందరు నవలంబించి యొకరిని మించి యింకొకరు తమబుద్ధిచాతుర్యమును లోకమునకు వెల్లడించిరి. ఇట్లు చేయుచురాగా కొంతకాలమున కీవర్ణన లన్నియు శృంగారాదిరసముల విజృంభింపఁజేయుటకై హెచ్చుగ నుపయోగింపఁబడుచు వచ్చెను.

## శ్రీకృష్ణదేవరాయలు

రాయలవారు మహారాజై ప్రసిద్ధిఁజెందుటయే గాక తాను గొప్పకవీశ్వరుఁడై విద్వత్కవుల నాదరించి పండితసభల నేర్పాటుగావించి తానాసభ కధ్యక్షపదవి నలంకరించి పండితులను, కవులను, గాయకులను నుచితరీతిని సన్మానించెను. సంస్కృతమున భోజరాజువలె నీరాజు తెనుగుభాష నాదరించి పోషించి వృద్ధిఁజెందించి కవులను సన్మానించి వారిచేత పెక్కుగ్రంథములు వ్రాయించి తానును రచించి ఆంధ్రభోజుఁడని ప్రఖ్యాతిఁగాంచెను.

రాయలవారు సంస్కృతభాషయం దనేకగ్రంథములను రచియించినట్లు విష్ణుచిత్తీయ మను నామాంతరముగల ఆముక్తమాల్యదయందు వ్రాయఁబడిన నీక్రింది పద్యమువలన తెలియ వచ్చుచున్నది.

సీ. పలికి తుత్ప్రేక్షోపమలజాతి పెంపెక్క రసికులౌ నన మదాలసచరిత్ర
 భావధ్వనివ్యంగ్య సేవధిగాఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు

శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చఁగ రచించితి సూక్తినైపుణిజ్ఞానచింతామణికృతి.
మరియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతివినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ.

ఈపద్యమునందు చెప్పినట్లు వ్రాయఁబడినగ్రంథము లిప్పు డెచటను గానరావు.

రాయలవారు సంస్కృతాంధ్రభాషలు రెండింటియందు నసాధారణమైన పాండిత్యము గల్గియుండి రనుట నిస్సందేహమై యున్నది. ఈరాజకవి ఆంధ్రభాషయం దాముక్తమాల్యద యను ప్రౌఢకావ్యమును రచించెను. ఈగ్రంథరచనను గూర్చి యనేకకథలు పుట్టినవి. ఈగ్రంథమును రాయలవారు వ్రాయ లేదనియు తన ఆస్థానకవులలో పెద్దయగు పెద్దనకవిచే వ్రాయఁబడిన దనియు గ్రంథకర్తృత్వము మర్యాదపూర్వకముగ కృష్ణరాయని కారోపింపఁబడినదనియు వాదించెడువా రనేకులుండిరి. ఈకథ యెంతమాత్రము విశ్వసింపఁదగినది కాదు. ఈగ్రంథములోని శైలియు పెద్దనకృతమనుచరిత్రలోని శైలిని పరీక్షించి చూచిన యీకథ సరియైనదిగాదనియు విశ్వసింపఁదగినది కాద నియు స్పష్టపడఁగలదు. ఈకారణ మొక్కటియే లోకములోని వాదుక లబద్ధము లని నిరూపించఁగలదు. ఆముక్తమాల్యద యందును మనుచరిత్రమునందు నొకే పద్యములు కొన్నిచోట్ల కనుపించుచున్నందున నీవాదన దేశమునందు హెచ్చుగ వ్యాపించియుండు నని తోఁచుచున్నది. అట్టిపద్యములు కథా విశేషమునందుగాక ప్రథమముననే యుండియుండుటను

బట్టియు, అట్టిపద్యములు కథకు సంబంధించినవి కాకుండుట చేతను నీవాదనను సమర్థింపతగినవి కావు. అదియెట్లున్నను ఆరా శ్వాసముల ప్రౌఢకావ్యమునందు కొలదిపద్యము లుండినంత మాత్రముచేతనే గ్రంథమంతయు రాయలచే వ్రాయఁబడ లేద నియు మనుచరిత్రకర్తయగు పెద్దనచే వ్రాయఁబడినదనియు జెప్పుట మిక్కిలి సాహసముని తోచుచున్నది. రాయలవారు కొప్పకవీశ్వరుఁడని పారిజాతాపహరణగ్రంథకర్తయగు నంది తిమ్మన "కవితాప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా" యని సంబోధించియుండెను. ఈగ్రంథమునందలి కవిత్వము మిక్కిలి గంభీరముగనున్నది. రాయలవారు "కళింగదేశవిజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిని గొన్ని వాసరములుండి శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపఁబోయి హరివాస రోపవాసం బచ్చటఁగావింప నప్పుణ్యరాత్రి చతుర్థయామమున" నా దేవుఁడు స్వప్నమున శ్రీవేంకటేశ్వరుని కంకితముగ నొక గ్రంథమును చేయుమనఁగా; రాయలవారు విష్ణుచిత్తీయమను గ్రంథమును రచించినట్లు తెలియవచ్చుచున్నది. దీనినిఁబట్టిచూడ నీపుస్తకము దాదాపు 1515-వ సంవత్సరమున వ్రాయుట ప్రారంభింపఁబడి యుండవచ్చును. ఈ గ్రంథమున వ్రాయఁబడిన కొన్ని విషయములనుబట్టి 1520-వ సంవత్సరానంతరమున నీ గ్రంథము పూర్తిఁజేయబడినట్లు తోచుచున్నది. కవిత్వము మిక్కిలి ప్రౌఢమై కటువుగను, మృదుమధుర పదగుంభితమై విల సిల్లుచున్నది.

రాయలు విద్వత్సభ నేర్పాటుచేసె ననియు, దానికి అధ్యక్షపదవి నధిష్ఠించెననియుఁ జెప్పుదురు. ఈరా జెల్లప్పుడు

పండితజనగోష్ఠినుండి విద్యావినోదములు సలుపుచుండెను. ఆ విద్వత్సభయందు "అల్లసాని పెద్దన, నందితిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు, మాదయ్యగారి మల్లన, ధూర్జటికవి, పింగళి సూరన, తెనాలిరామకృష్ణకవి, రామరాజభూషణుఁడు" అను నెనమండుగురు ప్రసిద్ధకవులు అష్టదిగ్గజములుగ నుండిరనియు లోకమున ప్రబలమైన వాడుకగలదు. వీరందరిలో మొదటివారైదుగురుఁ కవులు రాయలకాలమున వారియాస్థానమునం దష్ట దిగ్గజములలో నైదుదిగ్గజములుగ నుండినట్లు గ్రంథనిదర్శనము కనుపించుచున్నవిగాని చివరి ముగ్గురు కవీశ్వరులును రాయల కాలమునందుండిరో లేదో యని సందేహింపవలసివచ్చుచున్నది.

పైని జెప్పినవారిలో అలసాని పెద్దనయు నందితిమ్మనయు తాము రచించిన మనుచరిత్ర, పారిజాతాపహరణ మను గ్రంథములను రాయలవారి కంకితముఁ జేసియుండిరి. అయ్యలరాజు రామభద్రుఁడు రాయలవారి కాలమున తరుణవయస్కుఁడై యుండెను. రాయ లీతనిని సకలకథాసారమను గ్రంథమును వ్రాసి తమకంకితముఁ జేయుమని కోరినట్లును, రామభద్రుఁడును రాయలవారి యాజ్ఞానుసారముగ నా గ్రంథమును వ్రాయుట కారంభించినట్లును గ్రంథము పూర్తిచేసి ముగించక పూర్వమే రాయలవారు మరణించినట్లును తన గ్రంథమున వ్రాసికొని యుండెను.

రాజశేఖరచరిత్రమును వ్రాసిన మాదయ్యగారిమల్లన రాయలకాలముననుండి వారిదిగ్విజయయాత్రలగూర్చియు వారి కీర్తినిగూర్చియు వర్ణించినట్లు కుమారధూర్జటి వ్రాసిన నీక్రింది పద్యములవలన తెలియుచున్నది.

గీ. సరససాహిత్యరచన విస్ఫురణ మెఱయ
సారమధురోక్తి మాదయగారి మల్ల
నార్యుఁ డలయల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కు తిమ్మన మొదలైనముఖ్యకవులు.

క. వినిపించి రపుడు వారికిఁ
గనకాంబరభూషణములు ఘనత నొసఁగియా
జనపతుఁ డప్పాజీఁ గనుం,
గొని యిట్టని పలికె నపుడు కుతుకం బలరన్.

కృష్ణరాయవిజయమును వ్రాసిన కుమారధూర్జటి పెద తాత కాళహస్తిమాహాత్మ్యమునురచించినధూర్జటికవి రాయల యాస్థానమందున్నట్లీ క్రిందిపద్యముచేత తెలియవచ్చును.

చ. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల కల్గెనో
యతులితమాధురీమహిమ? నాతను నీ పెదతాత చాలస
న్నుతిగనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభ న్వినుమీవు శక్తుమ
త్కృతబహుమానవైఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోపలన్.

తాళ్లపాక చిన్నన్నయను నింకొకకవీశ్వరుఁ డీరాయల వారియాస్థానమునందుఁడినట్లు కొండవీటిచరిత్రములో నీక్రింది వాక్యములవలనఁ దెలియుచున్నది.

"వినుకొండసీమలో మిన్నకల్లు తాళ్లపాక చిన్నయ్యగారి కగ్రహారమిచ్చెను"

ఈపైనఁజెప్పఁబడిన నైదుగురుకవులుకాక అష్టదిగ్గజ ములలోనివారని వాడుకగఁ జెప్పఁబడెడి పింగళిసూరన, రామరాజభూషణుఁడు, తెనాలిరామకృష్ణకవి, యనునీముగ్గురు కవీశ్వరులును, రాయలకాలములోనివా రని చెప్పుటకు తగిన యాధారములు గాన్పింపవు.

ఈపైన చెప్పఁబడిన కవులేగాక రాయలకు సమకాలిక లగుకవు లనేకు లుండిరి. వారిలో ముఖ్యులపేర్ల నీక్రింద నుదాహరించుచున్నాను.

1. సంకుసాల నృసింహకవి.
2. కంసాలి రుద్రయ్య.
3. కుమ్మర మొల్ల.
4. వెన్నెలకంటి సూరన్న.
5. వెల్లంకి తాతంభొట్లు.
6. కోట శివరామయ్య.
7. పిడపర్తి సోమనాథుఁడు.
8. పిడపర్తి బసవకవి.

## అల్లసాని పెద్దన

అల్లసాని పెద్దన, రాయలయాస్థానకవులలో ప్రముఖుఁడు అష్టదిగ్గజములలోనివాఁడు. ఈతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. ఈతనితండ్రి పేరు చొక్కనామాత్యుఁడు. ఈతని స్వగ్రామము బళ్లారిజిల్లాలోని దోరాల గ్రామము.

నందవరీక బ్రాహ్మణులు నియోగి బ్రాహ్మణులు గారనియు స్వచ్ఛమైన వైదికసంప్రదాయమునకు సంబంధించి శ్వేతాంబ యనుపేర నొకపరశక్తిని పూజించెడువారనియు నొకప్రతీతి కలదు. వీరిలో పదునాల్గు ముఖ్యమైనవంశీయులు కాశియందలి మణికర్ణికాఘట్టమున నివసించుచు నచటనుండి బయలుదేరి కర్నూలుజిల్లాలోని నందవరగ్రామమునకు నందుడను రాజు రాజ్యముచేయుచుండిన కాలమున వచ్చిరనియు చెప్పుదురు. ఇందలి నిజానిజము లారయవలసియున్నది.

ఈతనికి సంస్కృతాంధ్రభాషలయం దసమానపాండిత్యము గలదు. ఇతనికాలమువరకు పూర్వకవులు స్వతంత్ర కావ్యములను వ్రాసియుండ లేదు. నన్నయ తిక్కనాది పూర్వ కవులందరు సంస్కృతకవులు వ్రాసిన గ్రంథములను మాతృక

గైకొని వాటిని తెనుగుభాషలోనికి భాషాంతరీకరించి యుండిరే గాని తాము స్వంతముగ వ్రాసియుండలేదు. ఈకవి మార్కండేయపురాణమునుండి కథనుతీసికొని పెంచి తనస్వకపోలకల్పనలతో ప్రప్రథమమున మనుచరిత్రమను ప్రబంధరూపకమైన గ్రంథమును రచియించి క్రొత్తమార్గమును జూపినకవి. ఆంధ్రకవిత్వమున నిట్టిప్రబంధకవనము ప్రారంభించినందున నీతనికి ఆంధ్రకవితాపితామహుఁడను బిరుదము కల్గినది. ఈతని తరువాత కవులందరు నీవిధమైన ప్రబంధముల రచియించుచువచ్చిరి.

ఈతఁడు స్వారోచిషమనుచరిత్రమునే గాక హరికథాసార మను నింకొక గ్రంథమునుకూడ రచించియుండెను. అయితే యీపుస్తక మిప్పుడు లేదు. కొన్నికొన్ని లాక్షణికగ్రంథములలో నీహరికథాసారమునుండి పద్యము లుదాహరింపఁబడినవి.

ఈకవి స్వతంత్రుఁడై యుండెను. తనకవిత్వమునందు తురకపదముల నిచ్చవచ్చినరీతి నుపయోగించెను. ఇట్లు అన్యభాషాపదములను తెనుగుగ్రంథముల నుపయోగించిన ప్రథమ కవి యీరాయలసాని పెద్దన కవియే. కొన్నిపద్యములయందు తురకభాషావాక్యములే వాడబడియుండెను.

మ. సమరక్షోణిని కృష్ణరాయల భుజాశాతాసి చేఁబడ్డ దు
ర్దమదోర్దండపుళిందకోటి యవనవ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి శాబాసహో హరిహరంగా ఖూబు ఖోధాకితే
తుముకీ బాయిల బాయిచే మలికియుం దుర్నింటికిం బోవుచున్.

రాయలవారి పరిషత్సభకు వచ్చిన పండితులపరీక్షించి వారునిర్ణయించిన ప్రకారము కవులకు మర్యాద గావించుచుండి రనియు తెలియవచ్చుచున్నది.

రాయలవారు పెద్దన నుద్దేశించి తనపేరిట నొకకృతి రచియింపుమని కోరుచువచ్చినంతలో పెద్దన కాలయాపనముఁ జేయుచుండ నొకనాఁడు రాయలవారు పెద్దనను కృతిరచింపుమని బలవంతపెట్టెను. అప్పుడు పెద్దన యీ క్రిందిపద్యమును జెప్పెనట.

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన ముయ్యెల మంచ మొప్పుత
ప్పురయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తము
ల్దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే.

అందుపై రాయలవారు పెద్దన కోరినప్రకార మొకదివ్యభవనమును గోకటాగ్రహారము నిచ్చి

"కృతిరచింపుము మాకు శిరీషకుసుమపేశలసుధా
మయోక్తులఁ బెద్దనార్య."

యని కోరియుండెను. అందుపైన పెద్దన మనుచరిత్రమును రచియించి రాయలవారికి కృతినిచ్చెను.

ఈగ్రంథము మృదుశైలిలో సలక్షణముగను మధురముగను వ్రాయఁబడెను. ఇందు కొన్నిసందర్భములు సంస్కృతజటిలములు. మరికొన్ని తావు లచ్చ తెనుగున నున్నవి. ఈకవి కీడగువాఁ డీతఁడేగాని మరియొక్కరుఁడు లేఁడు. అందువలననే "పెద్దనవలె గృతిసెప్పిన పెద్దనవలె" ననునార్యోక్తి బుట్టినది. ఈవిషయమునే రాయలవారీ క్రిందిపద్యమునఁ జెప్పియుండిరి.

క. హితుఁడవు చతురవచోనిధి, వతులపురాణాగమేతి హాసకథార్థ
స్మృతియుతుఁ డవాంధ్రకవితా, పితామహుఁడ వెవ్వరీడు పేర్కొనఁ నీకున్.

ఈతనికవిత్వమునందలి పదవాక్యజటిలత్వమును బట్టి "యల్లసాని వానియల్లికబిగియును" అనుప్రసిద్ధివచ్చినది.

ఒకానొకసమయమున రాయలు కవిగండపెండేరమును బంగారుపళ్లెమునసుంచి సంస్కృతాంధ్రములందు సమానముగ కవిత్వముఁ జెప్పఁగలవా రీపెండేరమును ధరింపనర్హు లని పలికి నపుడు సకలకవీశ్వరుల యెదుట సభాస్థలి నిలిచి యీ క్రింది యుత్పలమాలికను పెద్దనార్యుఁడు జదువఁగ రాయలవారు మెచ్చి కవిగండపెండేరమును కవిపాదమున తామే స్వయముగఁ దొడిగిరి.

ఉ. పూఁతమెఱుంగులున్ బసరుబూపబెడంగులుఁ జూపునట్టివా
కైతలు జగ్గునిగ్గనెనఁగావలెఁ గమ్మనఁ గమ్మనన్ వలెన్
రాతిరియున్ బవల్ మఱపురానిహొయల్ చెలియారజంపు ని
ద్దాతరితీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్
బాతిగఁ బైకొనన్వలెను బైదలిగుత్తుకలోనిపల్లటీ
కాతలన న్వలెన్ సొగసుకోర్కులురావలె నాలకించినన్
చేలికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియ చిన్నిపొన్ని మే
ల్మాతల చన్నుదోయివలె మచ్చటగావలెఁ బట్టిచూచినన్
డాతొడనున్నమిన్నులమితారపు ముద్దులగుమ్మ కమ్మనా
వాతెర దొండపండువలె వాచవిగావలెఁ బంటనూదినన్
గాతలఁ దమ్మిచూలిదొరకై వసపుంజవరాలి సిబ్బెపు
న్మైతెలిబుబ్బురంపు జిగినిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బపొం
బూతలనున్న కాయ సరిపోడిమి కిన్నరమెట్లబంతి సం
గాతపుసన్నబంతి బయకారపుఁ గన్నడ గౌళపంతు కా
సాతత తానతానలపసం బిపుటాడెడుగోటిమీటుబల్ఁ
ప్రాతలనుంబలెన్ హరువు మెండుగఁగావలె నచ్చతెన్గులీ
రీతిగ సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూ
టీ తపనీయగర్భనికటీ భవదానన సర్వసాహితీ

ఛాటీకనాటకప్రకరభారతభారతసమ్మతప్రభా
శీత నగాత్మజాగిరిశశేఖర శీతమయూఖరేఖికా
పాతసుధాప్రపూర బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతకతాళయుగ్మలయసంగతి సంచుపెపంచికానృపం
గాతత తేహితత్తహితసాధిత దంధణః ఫాణః వింధమి
వ్రాతనయానుకూలపద సారిక హయాస్యహ హారికింకిణీ
నూతనఘల్లలాచరణ నూపురఝాళఝుళీసుటిందసం
ఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పలసారసంగ్రహో
ద్యూతకుమారగంధవహ హారిసుగంధవిలాససమాసక్తమై
చేతము చల్లఁజేయువతె జల్లునఁ జల్లనతె న్మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచిరప్రతిమంబుగ సారె సారెకున్.

ఈకవి కగ్రహారముగ నీయఁబడిన కోటకగ్రామమునకు తనగురువైన శఠకోపయతిపేర "శఠకోపపుర మని" పేరువెట్టి తాను వైష్ణవమతమును స్వీకరించి యాగ్రామమును శ్రీవైష్ణవుల కగ్రహారముగ నిచ్చెను.

అలసానిపెద్దన రాయలసమకాలికుఁడే యైనను వారు మరణించినపిదప కొంతకాలము జీవించియుండి షుమారు 1535వ సంవత్సరమున మరణించిన ట్లూహించవలసియున్నది. రాయలవారు మరణించినపిదప జీవించియున్న పెద్దనకవీంద్రుఁడు రాయలవారు తనకుగావించిన సపర్యలను స్మరించుచు నీక్రిందిపద్యము వ్రాసి

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి
కేలూత యొసఁగి యెక్కించు కొనియె

మనుచరిత్రం బందుకొను వేళ
పురమేఁగ పల్లకి తనకేలఁ బట్టియెత్తె
బిరుదైన కవిగండపెండేరమున
కీవె తగుదని తానె పాదమునఁ దొడిగె
గోకటగ్రామాద్యనేకాగ్రహారము
లడిగినసీమలయందు నిచ్చె.
నాంధ్రకవితాపితామహ! యల్లసాని, పెద్దనకవీంద్ర! యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

తానును వారితో మరణించక జీవించియుండి కష్టముల ననుభవించుచున్నందున విలపించియుండెను.

## నందితిమ్మన

రాయలవారి అష్టదిగ్గజములలో నందితిమ్మన యొక ప్రఖ్యాతకవిపుంగవుఁడు. ఈతఁడు కౌశికగోత్రవిఖ్యాతుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. ఆర్వేలనియోగిపవిత్రకులమునకుఁ జెందినవాఁడు. నరసింహామాత్యునకును దిమ్మాంబకును దనయుఁడు. సకలవిద్యావివేకచతురుఁడు. మలయమారుతకవికి మేనల్లుఁడు. కృష్ణరాయక్షితీశుని కరుణచేత చతురంతయానాగ్రహార సన్మానమునుపొందిన ప్రౌఢకవి, అఘోరశివగురునిశిష్యుఁడు. శైవోపాసకుఁడు. శ్రీమదుమామహేశ్వరలబ్ధసారసారస్వతాభినంది. కవిత్వప్రౌఢిమయు, విజ్ఞానసంపత్తియుఁగలకవి. పారిజాతాపహరణకావ్యకర్త. తనగ్రంథమును కృష్ణరాయక్షితీశున కంకితముఁ జేసెను. ఈకావ్యమును రాయలవారికిఁ గృతినిచ్చిన సందర్భమునుగూర్చి యొకకథను జెప్పుదురు.

రాయలవా రొకనాటిరాత్రి పండితసభనుండి శయ్యాగృహమున కర్ధరాత్రి దాఁటినపిదప వెళ్లెననియు, నిశీథసమ

యము దాఁటినందున రాయలవారు వెళ్లినప్పటికి భార్య యగు తిరుమలాంబాదేవి నిద్రించుచుండె ననియు, రాయలవా రామెకు నిద్రాభంగముఁ జేయుట కిచ్చగింపక ప్రక్కనున్న శయ్యపై శయనించెననియు, అప్రమత్తురాలై నిదురించుచున్న తిరుమలాదేవి పాదము రాయలవారి దేహమునకు దగిలె ననియు, అందులకు రాయలవారు కోపోద్రిక్తులై "భార్యా దండః పృథక్ఛయ్యా" యను నార్యోక్తిని బట్టి సింకోకభవన మునకుఁ జని యచటనే శయనించెననియు, నీసంగతి తెలిసికొని రాణియైన తిరుమలాదేవి చింతాక్రాంతురాలై యుండ, నందితిమ్మకవి యామెవద్దకువచ్చి యీసంగతిని తెలిసికొని రాయ లవారి కోపమును శాంతిపఁజేయుటకై పారిజాతాపహరణ మను కావ్యమును వ్రాసి నారదమహాముని పారిజాతకుసుమమును తెచ్చి శ్రీకృష్ణుని కిచ్చిన సందర్భమున జరిగినకథను సత్రా జితికి గల్గినకోపమును శమించుటకు శ్రీకృష్ణుఁడు ప్రయత్నించిన సందర్భమును గూర్చి నీవిధమున ముద్దులుగులుకు పలుకు లతో నీక్రిందిపద్యములను జెప్పెను.

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరమ్ముఁ దీర్ప నె
ప్పాటను బాటుగామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతిమేళి మణిపంక్తికి వన్నియవెట్టు నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కఁగన్.

మ. జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రి శిరమచ్చోవామపాదంబునన్
దొలఁగం ద్రోచె లతాంగి యట్లయగు నాథుల్నేరముల్సేయఁ జే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్నేర్తురే.

క. కోపన వనజాతిఁ గుహాసా, గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడవఁగ న
ద్దీపిత మన్మథరాజ్య. ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలుపడంగన్.

చ. ననుభవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁబూని తా
చిన యది నాకు మన్ననయె చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము తాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగదా! యికనైన నరాళకుంతలా.

వ్రాసి గ్రంథమును తొందరగాఁ బూర్తిఁజేసెననియు అంతట తనగ్రంథమును రాజుగారికి సభలో జదివి వినుపించెననియు, నీభాగముఁ జదువునపుడు రాయలవారికి తనస్వవిషయము జ్ఞప్తికివచ్చి కృష్ణునంతటి వానికే యిట్టియవస్థ తటస్థింప తన కేమిలెక్కయని తలంచి, తా నట్టి సమయమున నడచినవిధమం తయు విరసముగఁ గాన్పింప తనలో తనను నిందించుకొనుచు బుద్ధితెచ్చుకొని నారాత్రి యంతఃపురమునకుఁ జని భార్యా సమేతుఁడై సుఖంబున నుండె ననియుఁ జెప్పుదురు. ఈకథ యందలి చమత్కారమును కవియొక్క సమయస్ఫూర్తిత్వ మును మన మాస్వాదించి హర్షించవలయునే కాని కథ యొక్క నిజానిజము లారయుటకు తగినంత యాధారములు కాన్పింపవు.

ఈపారిజాతాపహరణ గ్రంథమునేగాక వాణీవిలాసమను వేఱొక గ్రంథమును త్రిస్థలీదండకమును నీకవిరచించియుండెను.

ఈతఁడు తనకవిత్వమునందలి పదలాలిత్యమునకు ప్రసి ద్ధుఁడు గావుననే తిమ్మనకవి కవనపై పుణ్యమును గూర్చి తెనాలి రామకృష్ణకవి పల్కుచు "ముక్కుతిమ్మనార్యుముద్దుపల్కు" అని వర్ణించి యుండెను. ఇంకొకకవి తిమ్మనార్యుని కవిత్వ మునుగూర్చి వ్రాయుచు

క- లోకమునంగల కవులకు, నీకవనప్రౌఢి యబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ, శీకరములచెమ్మ! నందిసింగయతిమ్మా.

యని వ్రాసి యుండిరి.

నందితిమ్మన ముక్కు పొడుపుగనున్నందున వీరికి ముక్కు తిమ్మనయను పౌరుషనామ ముండె నని కొందరందురు.

## అయ్యలరాజు రామభద్రుఁడు

ఈరామభద్రకవియు రాయలయాస్థానమున నుండి అష్టదిగ్గజములలో నొకరుగ నుండె నని వేరేగాని యీతని కాలమంతయు రాయలవారి కాలమున కనంతరమే గడపఁబడినట్లు కనుబడుచున్నది.

ఈకవి తాను రచియించిన రామాభ్యుదయము అనుగ్రంథమునకు చివరభాగమున వ్రాసికొన్న గద్యమును బట్టి తా నయ్యలరాజవంశజుఁడననియు తిప్పయమనీషి పర్వతాభిధానపౌత్రుఁడననియు అక్కయాచార్యపుత్రుఁడననియు వ్రాసికొనెను. వీరి వంశనామ మయ్యలరాజువారనుటవలన నియోగులనియే చెప్పవలసియున్నది. ఈతఁడు కడపజిల్లాలోని ఒంటిమిట్ట గ్రామవాస్తవ్యుఁడు. ముమ్మిడి వరదాచార్యులను నొక రామానుజమతసిద్ధాంత మర్మజ్ఞుని శిష్యుఁడు. వైష్ణవ మతాభిమాని. ఈతఁడు తనగ్రంథములలో నెచ్చటను తన గోత్రనామములఁ జెప్పియుండ కున్నను యీతని తరువాతి వారిలో నొకరును హంసవింశతిగ్రంథమును తెనుగున వ్రాసిన కవి "మాయయ్యల రాజవంశజుల నాదికవీంద్రులఁ బ్రస్తుతించెదన్." అని వ్రాసియున్నందున వారిగోత్రము నీరామభద్రుని

గోత్రము నొకటియే యనియు నది కౌండిన్యసగోత్ర మనియు మనము తెలిసికొనదగినది.

పైనచెప్పిన ఆశ్వాసాంతగద్యమున "శ్రీమదొంటిమిట్ట రఘువీరశతకనిర్మాణకర్తృ జగదేకఖ్యాతి ధుర్య" యని వ్రాసికొన్నందున "రఘువీరశతకము" లేక వీరరాఘవశతకమును వ్రాసియుండె ననియు మనము తెలిసికొనవలయును.

ఈకవి మిక్కిలి బీదవాఁడును సంతానవంతుఁడు నై యున్నందున నీతని "పిల్లలరామభద్రయ్య" యని పిలిచెడి వారు. ఒంటిమెట్టగ్రామమున నుండునపుడు జీవనోపాధి జరుగనందున మిత్రులసలహావలన విజయనగర రాజ్యమును జేరి యచట చలికి తానును తనపిల్లలును బాధపడుచుండిరనియు నాసమయముననే రామరాజభూషణు శిష్యులు కొంద రచటఁ జేరి తమగురువుగారి యాజ్ఞానుసారముగ నొకపద్యమును వ్రాయఁ బ్రయత్నించుచుండిరనియు నీరామభద్రుఁడు వారి దరిఁజేరి వారివలన కప్పుకొనుటకై బట్టలను సంపాదించి వారు వ్రాయవలెనని ప్రయత్నించుచున్న పద్యమును తాను వ్రాసి వారికిచ్చెననియు నాపద్యము శిష్యులు తమగురువుగారికివ్వగా వా రాపద్యమునందలి పదశయ్యావిశేషములచే తన శిష్య బాలురు వ్రాసినదికాదని గ్రహించి వారివలన నీపద్యమును రచించినది రామభద్రుఁడని తెలిసికొని వారివద్దకుఁ జని వారిని తగురీతిని మర్యాదగావించి రాయలదర్శనముఁజేయించెననియుఁ జెప్పుదురు. ఈకథయొక్క నిజానిజము లారయుటకు వీలు లేదు. రామరాజభూషణుఁడు రాయలవారికాలమున నున్న వాఁడగునా కాదా యనునంశమే వివాదాస్పదమైన యంశము.

వారు రాయలసమకాలికుఁడు కాదనియే చెప్పవలసివచ్చినపు డీకథ నిజ మని చెప్పుట కెంతమాత్రమును వీలుండదు. ఎట్లైన నేమి యీ రామభద్రకవి రాయల యాస్థానమును జేరె ననుట నిర్వివాదాంశమే యై యున్నది. ఈతఁడు రాయలవారివద్ద నున్నకాలమున రాయలవారిచే "సకలకథాసారసంగ్రహ" మను గ్రంథమును తెనుఁగున వ్రాయుటకై ప్రేరేపింపఁబడి వ్రాయ ప్రారంభించి గ్రంథము పూర్తిగాక పూర్వమే రాయలవారు మరణించినందున వారికంకితముఁ జేయఁజాలక గ్రంథముయొక్క యవతారికయందు మాత్రము తాను రాయలకాలమున వారిచే నీగ్రంథమును వ్రాయ ప్రేరేపింపబడితినని వ్రాసియుండెను.

రాయలమరణానంతరమున నీకవి బీదతనముచే బాధ పడుచు నందందుతిరిగితిరిగి చాటుపద్యములను జెప్పి తనజీవనము గడుపుకొనుచు చివరకు కృష్ణరాయలయల్లుఁడగు రామరాజుకు మేనల్లుఁడైన గొబ్బూరి నరసరాజువద్దఁజేరి తాను వ్రాసిన "రామాభ్యుదయ" గ్రంథమును నా రాజున కంకితము చేసెను.

ఈకవి వ్రాసినగ్రంథములలో ముఖ్యమైనది రామాభ్యుదయము. ఈతనిది ప్రౌఢకవిత్వమై మృదుమధురముగ నుండును. పదగుంభనమునందును, పదలాలిత్యమునందును, పెద్దప్రఖ్యాతిగాంచిన కవుల కీతఁడు వెనుకఁబడఁడు. ఈతఁడు వ్రాసిన చాటుధారపద్యములును ఇప్పుడు కనబడుట లేదు. గుత్తియప్పలరాజుపైన నీకవి చెప్పిన చాటుపద్యమునుమాత్ర మీక్రిందఁ బొందుపఱచడమైనది.

క. రాజమనోజా ! విద్యాభోజా ! దీనార్థకల్పభూజా ! రిపుసం
ఙ్ఞాజా ! వైభవవిజితబిడౌజా ! రవితేజ ! గుత్తియప్పలరాజా.




ఈతఁడు రాయలయాస్థానకవులలో నొకఁడై అష్టదిగ్గజములలో నొక్కఁడుగ నుండెను. ఈతఁడు శివభక్తుఁడును లింగధారియునై యుండెను. బొంబాయిరాష్ట్రములోని బీజపూరు జిల్లా కళ్యాణదేశపురాజగు బిజ్జలరాయనివద్ద మంత్రిగనుండిన బసవయనువా రీలింగధారిశాఖను స్థాపించియుండిరి. ఈలింగధారులు తమమెడలో లింగమును ధరించెదరు. బిజ్జలరాయఁడు రాజ్యముచేయుకాలమున బ్రాహ్మణులలో చాలమంది నీలింగధారిశాఖలోనికి చేరియుండిరి. ఈబసవయనువారు ప్రముఖుఁడై మహాజనులలో నొకరని బిజ్జలరాయని కాలమున మనగోలి యనుగ్రామమున దొరకినశాసనమునుబట్టి తెలియుచున్నది. ఇంతకుపూర్వము దాదాపు సుమారు నూరుసంవత్సరముల క్రింద జీవించియుండిన ప్రౌఢకవి మల్లననుండి వేరుచేయుట కీతని తండ్రి పేరుతోఁజేర్చి మాదయ్యగారిమల్లన యని నీతనిని పిలుచుచుండెడివారు. ఈతనివంశమునుగురించి గాని చరిత్రను గురించిగాని మనకు హెచ్చుగ వివరములు తెలియవు. ఈతఁడు రాజశేఖరచరిత్రమను పుస్తకమును రచించెను. ఈగ్రంథమును తన యౌవనారంభదశయందే రచించెనని ప్రతీతి కలదు. ఈకవి రాయలు మరణించిన పిదపకూడ కొంతకాలము జీవించియుండెను. ఈతఁడు రచించినగ్రంథమును మంత్రి తిమ్మరసుయొక్క అల్లుఁడైన నాదిండ్ల అప్పయ్య కంకితముచేసియుండెను. ఈతని కవిత్వము సరళమై లలితపదభూయిష్ఠమైనది. చక్కని లోకోక్తులతోను జాతీయపదములతో నీతనికవిత్వము నిండియుండెను. ఈతని నివాసము గుంటూరుజిల్లాలోని కొండవీడుగ్రామము.

క. చెప్పదగుఁ గవితరసముల్
  చెప్పిల నప్పప్ప! బళీ బళీ! యన శేచా
  రొప్పుడు చెప్పక యుండుటె
  యొప్పౌనుమీ! సుకవి యెంత యుచితజ్ఞుఁడొకో.

యని ప్రతిజ్ఞజేసి యట్లే కవిత్వముఁజెప్పెనని యందురు.

—●ధూర్జటికవి●—

ఈకవియు రాయల అష్టదిగ్గజములలో నొకఁడై యుండెను. ఈతఁడు పాకనాటి ఆరువేలనియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజ గోత్రికుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాళహస్తిపురనివాసి. శివభక్తుఁడు. ఈతఁడు కాళహస్తిమాహాత్మ్య మను నొకగ్రంథ రాజమును రచించెను. ఈతని కవిత్వము మృదుమధురపదలాలిత్యమై హృదయరంజకముగ నుండును. ఈతని కవిత్వమునందలి యతులితమాధురీమహిమను జూచి రాయలవారు నిండుసభలో తన యాస్థానకవులమధ్య

చ. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనీ
  యతులితమాధురీమహిమ

యనుసమస్య నిచ్చి సభ్యులను పూరింపఁ గోరినట్లును, వారిలో నొక రీసమస్యను

  హా తెలిసెన్ భువనైకమోహనో
  ద్ధత సుకుమార వారవనితా జనతా ఘన తా పహారి సం
  తతమధురాధరోదిత సుధారసధారలఁ గ్రోలుటంజుమీ.

యని పూరించినట్లును వాడుక కలదు. ఈసమస్యవలన ధూర్జటికవి కవిత్వము మిక్కిలి మధురముగ నుండెననుట నిర్వివాదాంశమై యున్నది. ఈసమస్య పూరింపఁబడినవిధమునుబట్టి ధూర్జటికవి సంతతవేశ్యాలోలుఁడనియు రసికాగ్ర

గుణ్యుఁడనియు వేశ్యాంగనల మధురమైన అధరపానము గ్రోలుచుండెడి వాఁడనియు మనము తెలిసికొన వలసియున్నది. ఇందలి నిజానిజములు మనమూహింపఁజాలము. కాని గొప్ప కవులందఱి కిట్టిదోషముల నారోపించుట మన దేశముననేగాక యితర దేశములయందును వాడుకయైనట్లు గనబడుచున్నది. ఈకవి నిక్కువముగ వేశ్యాలోలుఁడైనను గాకున్నను ఇతని కవిత్వమునందు హెచ్చుమాధుర్య మున్నదనుట నిస్సందేహమైన విషయము. ఈకవి మనుమఁడగు కుమారధూర్జటి కృష్ణరాయ విజయమును వ్రాసి రాయలచరిత్రలోని కొన్ని ముఖ్యాంశములను చిరస్థాయిగ నుండునట్లు చేసెను.

### తాళ్లపాక చిన్నన్న

ఈకవియు రాయల కాలమున నున్నకవులలో నొకఁడై యుండెను. ఈతఁ డాస్థానకవులలో నొకఁడౌనో కాదో యను నంశమునుగూర్చి చెప్పుటకు తగిన యాధారములు లేవు. ఈకవి అష్టమహిషీకళ్యాణమను ద్విపద కావ్యమును రచించెను. ఈతనికవిత్వములోని కొన్ని తునకలు లక్షణగ్రంథములయిన అప్పకవీయమునందును రంగరాట్ఛందమునందు నుదాహరింపఁబడెను. ఈతనిని గూర్చిగాని యీతఁడు రచించిన యితరపుస్తకములనుగూర్చిగాని వివరములు తెలియవు. కొండవీటిచరిత్రములోని రాయలదానములఁగూర్చి వ్రాయఁబడిన క్రింద వాక్యముల వలన నీచిన్నన్న రాయలవారి కాలములోనివాఁడని ధ్రువపడుచున్నది.

"వినుకొండసీమలో మిన్నకల్లు తాళ్లపాక చిన్నయ్య గారికి అగ్రహార మిచ్చెను".

"అద్దంకి సీమలో వలపర్ల అను గ్రామమును తాళ్లపాక చిన్నయ్యగారి కిచ్చెను"

## సంకుసాల నృసింహకవి

ఈకవి ప్రౌఢకవి. ఈకవియును రాయలకాలములోని వాఁడై యున్నాఁడు. కాని ఆస్థానకవులలో నుండెనా యను సందేహము కలుగుచున్నది. ఈకవియొక్క వంశచరిత్రముగాని తండ్రితాతలపేర్లు గాని తెలియుటలేదు. తాను వ్రాసిన "కవికర్ణరసాయన"మను మహాకావ్యమున నాశ్వాసప్రారంభమునఁగాని ఆశ్వాసాంతగద్యమునఁగాని స్వప్రజ్ఞాప్రకటనమునుగాని వంశవర్ణనముగాని చేసికొనక ఆశ్వాసప్రారంభమున

క. గురుపరభట్టపరాశర చరణసరోరుహసమాసమునసన్నాసనుడౌ,
నరసింహనామధేయుఁడ, పరిమితసత్కృతిరసానుభవహేతువునన్.

అనియు, ఆశ్వాసాంతగద్యమున

"శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసిజ
సేవకోపసేవననరసింహనామధేయప్రణీతంబు"

అనియు వ్రాసికొని యుండెను. ఇట్లు తనప్రజ్ఞావిశేషములఁగూర్చిగాని వంశానుక్రమణమునుగూర్చిగాని వ్రాసికొనని ప్రౌఢకవు లరుదు. అంతమాత్రమున నీతఁడు ప్రజ్ఞావిశేషము లేనివాఁడనిగాని ప్రతిభాశాలిగాఁడనిగాని యూహించుటకు వీలు లేదు.

ఈతఁడు వైష్ణవులైన భట్టపరాశరాచార్యుల శిష్యుఁడై వైష్ణవమతాభిమానియై యుండెను. ఈకవి యేకులమునకు జెందినవాఁడని జెప్పుటకు తగిన యాధారములు గనుపింపవు. లోకమునందు మాత్ర మాతఁడు నియోగిస్మార్తబ్రాహ్మణుఁడను ప్రతీతి గలదు.

ఈతఁడు కవికర్ణరసాయన మను నామాంతరముఁగల మాంధాతృచరిత్రమును రచించెను. కవికర్ణరసాయనమను గ్రంథము ప్రౌఢకావ్యములలో మేటి యని చెప్పఁదగిన కావ్యము. అలసానిపెద్దన వ్రాసిన మనుచరిత్రగ్రంథమునకు వెనుకబడునదిగాదు. ఈగ్రంథమును వ్రాసి నరసింహరాయల కంకితము చేయవలయునని అలసానిపెద్దనతో సలహాపడినట్లును పెద్దన యీగ్రంథము నామాలాగ్రముగఁ జదివి రాజువద్ద తనకుఁగలసన్మానము, కలుకబడి, యీగ్రంథమునుఁ జూచిన వెనుక తగ్గునని యసూయాపరవశుఁడై నరసింహకవికి రాజ దర్శనము గావింపక నాటంకములు కలుగఁజేసెననియు నరసింహ కవి విసువుజెంది తనగ్రంథమునందలి పద్యభాగముల విడివిడిగ విక్రయించెననియు కొన్నిపద్యములను రాజుగారికుమార్తె కొనెననియు, కొంతకాలమునకు నరసింహకవి యీకావిర హితుఁడై రాజధానివదలి శ్రీరంగపురక్షేత్రమునకు జని యచటి రంగనాయకస్వామి కంకితముఁజేసెననియుఁ జెప్పుదురు. ఇందలి నిజానిజములను మనము కనుగొనుట కష్టసాధ్యమై యున్నది. అంతటి పండితుఁడును ప్రసిద్ధకవియునైన పెద్దన కసూయజనించునా యనెడిప్రశ్న కుత్తరమిచ్చుట సులభ సాధ్యముకాదు. వచ్చినవచ్చియుండవచ్చును. మానవస్వభా వముఁను గుర్తెరుంగుట కెవరికి శక్యము? ఇది యెట్లున్నను నర సింహకవిమాత్రము విసువుచెంది తనపుస్తకమును దేవుని కంకి తము చేసియుండెనుట కాధారములు లేకపోలేదు. తనగ్రంథ ముఁన ప్రప్రథమమున రాజదూషణఁగావించి "ప్రభుదురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు"నని వ్రాసి నరకృతిఁజేయరాదనియు

దేవుని కంకితముచేయవలెననియు నీక్రిందిపద్యమును వ్రాసియుండెను.

గీ. నరగుణాంకితమయ్యెనే సరసకృతియ దూష్యమగుశునకోద్వృత్తదుగ్ధమట్ల
హరిగుణాంకితమయ్యెనే సరసకృతియుఁ హారమాత్రంబుగలిహృదయంగమంబు

తనయభిప్రాయానుసారంబుగ తన కవికర్ణరసాయనమును గ్రంథమును "ప్రభుదురాత్మున" కంకితముఁగావింపక "భద్రగుణనిధి" యగు శ్రీరంగవిభుని కంకితము చేసెను. దీనినిఁబట్టి చూడ నీకవి తనగ్రంథమును ప్రథమమున రాయల కంకితము చేయ నెంచెననియు తరువాత నేకారణముననో విసువుజెంది యట్లుచేయక రాజుపేరు తెలియనీయక రాజులనందరిని కలిపి దూషించి, చివరకు "జ్ఞానప్రౌఢమహాజనాధికవచస్సంస్తూయమానుండు లక్ష్మీనాథుండు" తన "అల్పవాక్యరచన" కు స్వీకర్త కాకుండునా యనుసంశయమును పోగొట్టుకొని శ్రీరంగనాయకుని కృతికర్తగా నిశ్చయించుకొనెను. ఈకవి స్వప్రజ్ఞాప్రకటనము నీక్రిందివిధముగ జేసికొనియుండెను.

గీ. యతివిటుఁడు కాకపోవునే యస్మదీయ, కావ్యశృంగారవర్ణనాకర్ణమున
విటుఁడు యతికాకపోవునే వెసమదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణమున.

ఇట్లు వ్రాయుట అతిశయోక్తిగావచ్చునుగాని స్వాతిశయమనుట కెంతమాత్రమును వీలులేదు. ఇట్లే ప్రతికవియుం తననుగూర్చి వ్రాసికొనుట సాంప్రదాయానుసారమే యయి యున్నది. ఈకవి కవిత్వమునందు మహాకావ్యమున కవసరమగు అష్టాదశవర్ణనలేగాక ననేకవిశేషవర్ణనాంశములు తనబుద్ధివైశద్యముచేతను లోకానుభవముచేతను జేర్చియుండెను. ఈకవి తనకావ్యమున వ్రాసికొన్నట్లీగ్రంథమున "అపూర్వరచనాచాతుర్యంబు" మెఱయుచున్నది.

పైన వ్రాయఁబడిన కవులందరును రాయలయాస్థానము నందున్న ప్రఖ్యాతకవులు. కొందర ష్టదిగ్గజములలోని వారై అష్టదిగ్గజములోనివారని లోకమునందు వాడుకగఁజెప్పఁబడిన మిగిలిన ముప్పురుకవులు నగుపింగళిసూరనార్యుఁడు, తెనాలి రామకృష్ణకవి రామరాజభూషణుఁడు నిజముగ రాయలవారి కాలమునందున్నవారుగాని అష్టదిగ్గజములలోనివారుగాని కారు. వా రాకాలమునందున్నవారని చెప్పుటకు తగిననిదర్శనములుగాని ఆధారములుగాని బొత్తుగఁ గాన్పింపవు. అంతే గాక వీరుముప్పురును రాయలవారు మరణించినపిదప షుమారు ముప్పది నలువది సంవత్సరములతరువాతివారని చెప్పుటకు వారువ్రాసినగ్రంథములే రుజువుచేయుచున్నవి.

## పింగళిసూరన

పింగళిసూరన కృష్ణాజిల్లాలోని పింగళి యను నొక గ్రామముననుండి దక్షిణదేశమునకుఁబోయి కందనూరుమండలములోని ఆకువీడు నంద్యాలసంస్థానములలో నున్నట్లు కన్పట్టుచున్నది. ఈతఁడు కళాపూర్ణోదయము, రాఘవపాండవీయము, ప్రభావతీప్రద్యుమ్నమను మూఁడుగ్రంథములను వ్రాసినగ్రంథకర్త. ఇందు కళాపూర్ణోదయము నంద్యాలసంస్థానాధిపతియైన కృష్ణరాజున కంకితముచేయఁబడెను. ఈకృష్ణరాజు సదాశివరాయల సమకాలికుఁడై యుండెను. దీనినిబట్టి పింగళిసూరనకవి 1560-వ సంవత్సరము ప్రాంతమున నుండెనని నిర్ణయింపఁబడినది. కాన నీతఁడు రాయలకాలపువాఁడు గాఁడని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఇట్లే యితర నిదర్శనములునుగలవు. ఈసూరన తాను ప్రథమమున రచించిన రాఘవపాండవీయము

నందుఁగాని కళాపూర్ణోదయమునందుఁగాని తనవంశచరిత్రను గూర్చి చెప్పుకొనియుండక చివరకువ్రాసిన ప్రభావతీప్రద్యుమ్నమునందు చెప్పుకొనియుండెను. ఈ ప్రభావతీప్రద్యుమ్నమను గ్రంథమును తనతండ్రియైన అమరన్న కంకితముచేసెను. తనతండ్రియందు తనకుఁగల ప్రేమాతిశయమువలనను, తాను గయకుఁ జని తనతండ్రికి శ్రాద్ధమువిడపనందున తనఋణమును తీర్చుకొనలేకపోవుటవలన తనతండ్రి పేరు చిరస్థాయిగనుండునట్లు జేయుటకును తా నా గ్రంథము సంకితముచేసినట్లు తానే వ్రాసియుండెను. తెనుగున ద్వ్యర్థికావ్యములు వ్రాయుటకు ప్రారంభించిన ప్రథమకవి పింగళిసూరనయే. ఈతఁడు ద్వ్యర్థికావ్యములెట్లుండవలెనో తనరాఘవపాండవీయమున సూచించియుండెను. మరియు నీరాఘవపాండవీయము నిద్దరికంకితము చేసియుండెను. ప్రథమమున విరూపాక్షేశ్వరుని కంకితముచేసి తరువాత అకువీటి పెదవెంకట్రాయని కంకితము చేసెను.

## తెనాలిరామకృష్ణకవి

తెనాలిరామకృష్ణకవి గుంటూరు జిల్లా తెనాలి గ్రామకాపురస్థుఁడు. ఈతఁడప్పయ్యదీక్షితులవారికిని తిరుమల తాతాచార్యులవారికిని సమకాలికుఁడు. వీరందరును విజయనగర రాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట వెంకటపతిరాజు చంద్రగిరి పట్టణమును రాజధానిగ నేర్పరచుకొని రాజ్యముచేయునప్పుడుండినవారగుటచే రాయలవారి కాలమునసుండినవారు కారని స్పష్టపడుచున్నది. ఈకవి పాండురంగమాహాత్మ్యమను గ్రంథమును వ్రాసియుండెను. ఈతనికవిత్వము మిక్కిలి మధురముగనుండును. ఈతఁడు వికటకవి.

### రామరాజభూషణుఁడు

రామరాజభూషణుఁడు వసుచరిత్ర మను శృంగారరస ప్రబంధమును రచియించిన గొప్పకవి. ఈతఁడు బట్టుపల్లె యను గ్రామవాసి. ఈబట్టుపల్లె బళ్లారిజిల్లాలోనిదని కొందరును కడప జిల్లాలోనిదని మరికొందరును జెప్పుదురు. ఈకవి తన ప్రబంధమును రాయనియల్లుఁడగు రామరాజున కంకితముచేసి యున్నందున రాయనికాలమున లేఁడని యూహించఁబడుచున్నది. అట్లుగాక వారికాలమున నుండియున్నను అష్టదిగ్గజములలోని వారుగ నుండ వీలులేదు. రాయలవారియాస్థానకవి యని చెప్పుపుక్కిటిపురాణము లనేకము లున్నవి కాని వాటికి తగిన యాధారము లేవియు గనుపింపవు.

ఈకవిపేరు భట్టుమూర్తి యనియు రామరాజభూషణుఁడనునది పౌరుషనామ మనియు నందురు. రామరాజుకాలమున కవిభూషణుఁడుగ నున్నందున రామరాజభూషణుఁడని పిలువఁబడినట్లు జెప్పుదురు. మరికొందరు వ్యాఖ్యాతలు మూర్తికవి వేరనియు రామరాజభూషణుఁడు వేరనియు మూర్తికవి నరసభూపాలీయమను గ్రంథమును రచించెననియు రామరాజభూషణుఁడు వసుచరిత్రము హరిశ్చంద్రనలోపాఖ్యానమను ద్వ్యర్థికావ్యమును వ్రాసియుండెననియుఁ జెప్పుదురు. పైఁజెప్పిన గ్రంథములలోని ఆశ్వాసాంతగద్యములనుబట్టియు నీయిర్వురుకవులును వేరువేరువారనియే చెప్పవలెను.

రామరాజభూషణుఁడు వ్రాసినగ్రంథములలో మొదటిది వసుచరిత్రము. ఈగ్రంథముతో సరిరాదగిన శ్లేషకావ్యము మరొకటి లేదని జెప్పుట సాహసముకాజాలదు. ఈగ్రంథము

నందలి పదములకూర్పు, శబ్దార్థాలంకారములు, రసభావములు మిక్కిలి యోగ్యములై సుందరములై మనస్సున కాహ్లాదకరములునై యున్నవి. వీరు వ్రాసిన హరిశ్చంద్రనలోపాఖ్యానము శ్లేషకావ్యము. పింగళిసూరనకవిచే వ్రాయఁబడిన రాఘవపాండవీయమునకు గలప్రశస్తి యీగ్రంథమునకు లేదు.

## 23. కృష్ణదేవరాయలకాలపునాఁటి యితర కవులు

### కంసాలి భద్రయ్య

ఈకవి యు రాయనియాస్థానమునందుండిన యష్టదిగ్గజములలో నొకరని ప్రతీతికలదు. ఈతఁడు కంసాలికులము వాఁడు. ఈకవి సగసజనమనోరంజనమను కావ్యమును రచియించెనని చెప్పుదురు. కాని గ్రంథముమాత్ర మిపుడు లేదు. బ్రౌనుదొర యీ క్రిందిపద్యము భద్రయ్య వ్రాసిన సరసజనమనోరంజనములోనిదని తనఛందస్సునం దుదాహరించియుండెను.

ఉ. ఎన్నడు నేరిచెక్ బెళుకు లీచెలికన్నులు కారుకమ్ముల
న్నన్నకురుల్ పిఱుందు ఒటువై పటువై ఖరి నైకొనెంగ దే
మొన్న గదమ్మ పిన్న మెంచ మొల్కలు నేఁడిదె ముద్దులాడిలేఁ
జన్నులు గొప్పలై పయిటసందున దాగుడుమూఁతలాడెడున్.

ఈపద్యములోని "మొల్క" యనుపదము నాక్షేపించిరనియు అందుకు "వెలగకు" "వెల్గ" యంచు సరికొండ నృసింహాకవివాడగా మొలకకు మొల్కయంచు భద్రయపల్కు దోసమా యని కొందరుకవులు సమర్థించిరనియుఁ జెప్పుదురు. "మొల్క"యని వాడినకవి రుద్రయ్య యని అప్పకవీయములో వ్రాయఁబడియున్నది.

### కుమ్మర మొల్ల

కావ్యములను వ్రాసిన స్త్రీలలో నెల్ల నీమెయే ప్రాచీను
రాలు. ఈమె రామాయణమును తెనుగున రచియించెను. ఈపె
తనవంశమును గూర్చి యెచటను జెప్పుకొనకుండుటచే నీమెవంశ
మును గూర్చి జెప్పుట కవకాశములు లేవు. పేరునుబట్టి యీమె
కుమ్మరకులస్థురాలని తెలియనగును. "గోపవరపు శ్రీకంఠమల్లే
శ్వరునివరము చేత" తాను "గవిత్వము జెప్పంగ నేర్చినాను"
అని వ్రాసికొన్నందున గోపవర కాపురస్థురాలని తెలియనగును.
ఈగోపవరము నెల్లూరిజిల్లాలోనిదై యున్నది. ఈమె తన
కావ్యమునందు కవిస్తుతిలో శ్రీనాథుని పేర్కొనుటవలనను
అల్లసాని పెద్దన్న పేరు చెప్పకుండుటవలనను పదునేనవశతాబ్దాం
తమునకు తరువాత పదునారవశతాబ్దము మొదటిపాదమున
నుండియుండవచ్చునని తోచుచున్నది. రాయని కాలమున
నున్నట్లు కొన్ని కథలు కలవు. ఈమెకవిత్వము మృదువుగను
మధురముగను రసవంతముగను నుండును.

### వెన్నెలగంటి సూరన

ఈకవియు రాయని కాలమున నున్నవాఁడనియే చెప్ప
నగును. ఈతఁడు హరితసగోత్రుఁడు. ఆంధ్రభాషయందు
కావ్యరచనాభినయన విశారదుఁ బ్రబంధకర్త వెన్నెలకంటి సూర
నార్యునిమనుమఁడు. అమరమంత్రి సత్పుత్రుఁడు. నియోగి
బ్రాహ్మణుఁడు. విష్ణుపురాణగ్రంథకర్త. ఈగ్రంథమును పంట
కాపుకులజుఁడు కొండవీటిరెడ్డి వంశజుఁడునైన రాఘవరెడ్డి కంకి
తము చేయఁబడినది. ఈరాఘవరెడ్డి చిన్నసంస్థానమునకు రాజుగ
నుండెను. ఈకవి కవిత్వము మధురరసభూయిష్ఠమైనది. ఈయిం

టిపేరుఁగల వారిలోఁ బెక్కండ్రు కవు లున్నట్లు వాడుక. "కవిత పుట్టిల్లు వెన్నెలకంటియిల్లు" యని పద్యములు పుట్టెను.

## వెల్లంకి తాతంభట్టు

తాను ఎల్లన గర్భజనితుఁడ ననియు అబ్బయమణి సూనుఁడ ననియు కౌలవతగోత్రుఁడ ననియు సన్నుతసాహిత్య చక్రవర్తి ననియు తారచించిన "కవిచింతామణి" యనులక్షణ గ్రంథమున వ్రాసికొనెను. ఈకవి రాయల రాజ్యారంభకాలమున నుండియుండెను. ఈతడు వైదికబ్రాహ్మణుఁడు. ఈతని కవిత్వము సరళసరసమైనదనియే జెప్పవచ్చును.

## కోట శివరామయ్య

ఈతఁడు రాయనికాలమున నున్న ధూర్జటికవియొక్క శిష్యుఁడు. ఈతఁడు నాల్గవజాతికిఁ జెందినవాఁడు. కౌశిక గోత్రుఁడు. బాపనయ్య కుమారుఁడు. కాళహస్తి గ్రామ నివాసుఁడు. ఈతఁడు "సానందోపాఖ్యాన" మను గ్రంథమును రచియించెను. కవిత్వము మధురమైనదిగనే యుండును.

## పిడపర్తి సోమనాథుఁడు

ఈతఁడు శైవబ్రాహ్మణుఁడు, బసవాచార్యునిపుత్రుఁడు. "బసవపురాణము"ను తెనుగున నేడాశ్వాసములుగల గ్రంథముగ రచించెను. ఈకవియు పదునారవశతాబ్దారంభమున కృష్ణదేవ రాయని కాలమున నుండెను. ఈబసవపురాణమునందు బసవేశ్వ రునిమహిమ లనేకములు చెప్పఁబడియున్నవి. ఇతఁడు ప్రభు లింగలీల అను ద్విపదగ్రంథమును రచియించెను.

## పిడపర్తి బసవకవి

ఈకవి సోమనాథుని తమ్ముని కుమారుఁడు. సోమనాథుని కాలముననే యున్నవాఁడుకన్నడములో చాముగసు రచించిన

ప్రభులింగలీల యను కృతి నీతఁడు పద్యకావ్యమును వ్రాసెను. బసవేశ్వరునిగురువైన యల్లమప్రభుఁడను జంగమదేవరయొక్క కథ చెప్పబడినది. శైలినిర్మాణము మధురముగనే యుండును.

## 24. రాయలు-రాష్ట్రభాష

రాయల పూర్వీకు లెల్లరు కర్ణాటకులు. ఈతఁడును కర్ణాటుఁడే రాయ లాంధ్రుఁడని గట్టిగ నిరూపించి చెప్పుటకు వీలులేదు. తాను కన్నడరాయఁడనని తానే ఆముక్తమాల్యదయందు వ్రాసికొనియున్నాఁడు. రాయలకు స్వప్నమున ఆంధ్రవిష్ణువు గాన్పించి తనను కృతినీయు మని కోరినపుడు "నేను దెలుంగురాయఁడన్ కన్నడరాయా" యని సంబోధించెను. కాన నీభాషా తారతమ్యతను గట్టిగ వెలిబుచ్చుటలో కర్ణాటకుఁడనియే తెలిసికొనవలసివచ్చుచున్నది. అట్లయ్యును తెనుగుభాషనే ఆముక్తమాల్యదను వ్రాయుమని ఆంధ్ర విష్ణువు కోరియుండెను. రాయలు నందు కంగీకరించుచు తాను కర్ణాటకుఁడయ్యును తెనుగుభాషనే గ్రంథము వ్రాయుటకు గల కారణములను తరువాత పద్యమున నిరూపించియుండెను.

ఆ. తెలుఁగ దేల యన్న? దేశంబు దెలుఁగేను, తెలుగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుగులెస్స.

తాను తెనుగుభాషలో నాముక్తమాల్యదను రచించుటకుఁగల నాల్గు కారణములు చెప్పి వాటినన్నిటి నీపై పద్యమునం దిమిడ్చియున్నాఁడు. "తెలుగ దేలయన్న దేశంబు తెలుగేను" ఇది మొదటి కారణము. తెలుగుదేశమున నింకొకభాషలో వ్రాయుట సరికాదు. "ఏను దెలుఁగువల్లభుండ" ఇది రెండవకారణము. నేను కర్ణాటకుఁడనయ్యు తెనుగుదేశమునకు విభుఁడను. నేను

రాజ్యముచేయు దేశము తెనుగు దేశము. "తెలుఁ గొకండ యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి" ఇది మూఁడవ కారణము. రాజులందఱుచేరినపుడు సంభాషణమంతయు నీభాషయందే జరిగెడిది. రాజులందరు కూడినపుడు నొకరితో నింకొకరు మాట్లాడుభాష తెనుగుభాష యనియే నీపద్యమునందు స్పష్టీకరించి వ్రాయఁబడియున్నది. "దేశభాషలందు దెలుగులెస్స" యిది నాల్గవకారణము. అందువలన రాయలవారు ఆముక్తమాల్యద యను గ్రంథమును తెనుగుభాషయందే వ్రాయుట కంగీకరించి తెనుగుభాషయందు తనకుఁగల గౌరవమును, పాండిత్యమును తెనుగుభాషయొక్క ఔన్నత్యమును వెల్లడిచేసెను.

ఈపై పద్యమునందలి మూఁడవకారణముగఁ జెప్పఁబడిన యభిప్రాయము మిక్కిలి ముఖ్యమైన యభిప్రాయము. దీనినిబట్టియే యాకాలమున రాజసభలలో మాట్లాడుభాష యేదియైనది నిర్ధారణఁజేయుటకు సహాకారియైయున్నది.

"తెలుఁగొకండ, యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి" నలుగురురాజులుకలసి కొలువునందుండగా నచట మాట్లాడుభాష తెనుగుభాషయై యున్నది. అనఁగా రాజుల సభలో వ్యవహారసంబంధములను మాట్లాడు భాష తెనుగు భాష యనియే గ్రహించవలసియున్నది. అదియే రాష్ట్రభాష. దీనినిఁబట్టిచూడ నాకాలమున రాష్ట్రభాష తెనుగుభాషయై యుండె ననుటకు సందియము లేదు.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951